శ్రీ

# ఛందోదర్పణము

అనంతామాత్యుఁడు

తత్త్వదర్శినీ వ్యాఖ్య :

శ్రీభాష్యం వేంకటనరసింహభాష్యకారాచార్యులు

ఆంధ్రప్రదేశప్రభుత్వ సమాదరణమునఁ
బ్రకాశితము

ప్రథమముద్రణము
కీలక - జ్యేష్ఠము

మూల్యము
రు 10 లు

ముద్రణము :
శ్రీపతి ప్రెస్
కాకినాడ
1968.

ప్రాప్తిస్థానము :
శ్రీ వేం. న. భాష్యకారాచార్యులు
ప్రధానాంధ్రోపన్యాసకుడు
ప్రభుత్వ మహారాజ సంస్కృతకళాశాల
విజయనగరం-2

శ్రీ

# కృతజ్ఞత



శ్రీ శ్రీనివాసుని కరుణాకటాక్షముచే ఛందోదర్పణమునకు వ్యాఖ్యవ్రాయవలెనని సంకల్పించి యయిదాఱు సంవత్సరముల క్రిందటనే రూపు కల్పించితిని. దీని కింతవఱకు వ్యాఖ్యానము లేక పోవుటచే నర్థము చేసికొనుటలోఁ గొంత క్లేశమగుచున్నదని నాకొకప్పుడు ఛాత్రులు నేఁడు సహోపాధ్యాయులు నగు కొందరు చిరంజీవులు నన్ను నీ రచనమునకుఁ బ్రేరేపించిరి. వారికి నా యాశీస్సులు.

సుప్రసిద్ధులును ఛందశ్శాస్త్రమున విశేషపరిశ్రమ చేసినవారును నగు శ్రీ గిడుగు సీతాపతిగారు, శ్రీ నిడుదవోలు వెంకట్రావుగారు, శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు ఈ ఛందోదర్పణమునకు విపులముగఁ బీఠికల నిదివఱలో సంతరించిరి. శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు, శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు మున్నగువారు ఛందశ్శాస్త్రమున ననేకవిషయముల వివరించిరి. వారిచట నవశ్యస్మరణీయులు.

ఈ గ్రంథమును రచించి యయిదాఱు సంవత్సరములయినను నాంధ్రపాఠకలోకమున కందించుభాగ్యము లేక యవకాశమునకై యెదురు చూచుచుండ ముద్రణమునకు వలయు సాహాయ్యము నుదారముగా నొసంగిన యాంధ్రప్రదేశప్రభుత్వమునకు సర్వదా కృతజ్ఞుఁడను. ఈవిషయమున నుదారహృదయముతో సాయపడిన విద్యాశాఖ "డైరక్టరు" శ్రీ బుల్లెయ్యగారికి హార్దమగు వినతులు.

ఛందోదర్పణము పలుసార్లు ముద్రితమయినను స్ఖాలిత్యము లధికముగ మిగిలియుండుటచే సమన్వయించుటలోఁ గ్లేశము లేకపో

లేదు. కాని వానిని సరిచేయుటలో విజయనగర ప్రభువుల కోటలోని వ్రాఁతప్రతియు, విజయనగర సంస్కృత కళాశాలలోని గ్రంథాలయము నందలి వ్రాఁతప్రతియు నాధారము లయినవి. కొన్నిస్థలముల నా యూహచేఁ గొన్ని మార్పులు చేయవలసివచ్చినది. "గుణదోషౌ బుధోగృహ్ణన్" అను న్యాయమున సహృదయులు గుణములనే గ్రహింతురు గాక !

ఈ గ్రంథరచనమున, ముద్రణమున నాకు నుత్సాహమును గల్పించుచు ముందుకు నడిపించిన మిత్రులు, డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారికిని, శ్రీ మాన్యాప్రగడ శేషశాయిగారికిని హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథమును కాకినాడలో ముద్రించుటకు శ్రద్ధవహించిన మాసోదరుఁడు చి॥ శ్రీభాష్యం అప్పలాచార్యులకు సమస్త మంగళములను శ్రీనివాసుఁ డొసంగుఁగాత !

అన్నిటికన్న మిన్నగా నా మన్నన లందుకొనఁదగినవారు శ్రీపతిముద్రణాలయాధిపతులు శ్రీ తోకల బుచ్చిరాజుగారు. సహజముగ సాహిత్యవేత్తలగుటచే దోషములు రానీయక సహృదయులగుటచే నామార్పులకుఁ జేర్పులకు విసుఁగొందక సకాలమునఁ జక్కఁగా ముద్రింపించిన శ్రీబుచ్చిరాజుగారికిని, వారి పరివారమునకును నా కృతజ్ఞతల నందించుచున్నాను. అందఱ కివే నావందనములు.

కీలక జ్యేష్ఠము. 10-6-68. } శ్రీభాష్యం వేంకటనరసింహభాష్యకారాచార్యులు

శ్రీః

# ఛందోదర్పణము

## భూమిక



### అనంతామాత్యుఁడు

శ్రీమదనంతామాత్యుఁ డార్వేలనియోగిబ్రాహ్మణుఁడు, కౌండిన్యగోత్రుఁడు. తెలుఁగుకవులలో నుత్తమశ్రేణిలోఁ బరిగణింపఁబడినవాఁడు. ఇతఁడు కవియేకాక యాలంకారికుఁడును ఛందోవ్యాకరణాదిలక్షణవేత్తయును.

ఇతనిగోత్రము భోజరాజీయమున స్పష్టముగాఁ జెప్పఁబడెను. "ఆ కౌండిన్యమునీంద్రుగోత్రమున దుగ్ధాంభోధిసంజాతుఁడై ...... నందనార్యుఁడు ప్రసిద్ధుం డయ్యె" ౧ ఆ. ౧౪ ప. "బయ్యదండాధినాథుకూర్మిపుత్రుఁడు కౌండిన్యకులపవిత్రుఁ డంగసంభవనిభుఁ డైన గంగవిభుఁడు" ౧ ఆ. ౨౮ ప. అను నీతనివంశవర్ణనపద్యములలో స్పష్టముగా గోత్రము చెప్పఁబడెను. కౌండిన్యముని తనకు మూలపురుషుఁ డగుటచేఁగాఁబోలు ఛందోదర్పణమునఁ గౌండిన్యునిచరిత్రమునకు సంబంధించినగాథ యొక్కటి గూర్చెను. చూ. 3 ఆ. ౨౭ ప.

"ఈ యార్వురు నొక్కొక్కఁడు వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదు రనికాదే యాఱువేలపేరిడి రీయన్వయమునకు నేష్య మెఱిఁగినపెద్దల్" భోజ. ౧ ఆ. ౪౮ ప. అనుపద్యముంబట్టి యార్వేల

నియోగు లగుట స్పష్టము. నియోగులు కావుననే 'సత్యమంత్రియున్' ౧ ఆ. ౧౭ ప. "మంత్రికోటిలో సత్యనమంత్రియొప్పె." ౧ ఆ. ౧౨ ప. "బయ్యనమంత్రి యల్పుఁడే" ౧ ఆ. ౨౪ ప. "బయ్యాచమూపతి" ౧ ఆ. ౨౫ ప. "ముమ్మవిభుఁడు" ౧ ఆ. ౩౪ ప. "బయ్యాదండాధినాథు" ౧ ఆ. ౨౮ ప. అని మంత్రి దండనాథ ప్రభ్వాదిశబ్దములు ఇతనివంశీయుల కుపయోగింపఁబడెను.

వీరివంశమునఁ బూర్వుఁ డగు త్రిపురాంతకుఁడు గొప్పతపోనిష్ఠుఁ డనియు వంశ్యులకందఱకును నరకమును బునర్జన్మమును లేకుండ వరముఁ బడసినట్లును నిశ్చలధ్యానైకనిష్ఠాగరిష్ఠుఁడై షడక్షర సములు పునశ్చరణచేసి "మావంశజులయింటిమార్జాలమునకైన నరకంబు లేకుండ వరము పడసి......బ్రహ్మపదము పొందె" ౧ ఆ. ౨౧ పద్యముంబట్టి దెలియుచున్నది.

ఈతనిముత్తాత బయ్యనమంత్రిని భారతకవి యగు తిక్కనామాత్యుఁడు మెచ్చుకొని భవ్యభారతి యని యాతనిం బొగడెనఁట. చూ. భోజ. ౧ ఆ. ౨౪ ప. ఈతనితాత ముమ్మవిభుఁడును ప్రహ్లాదవిభీషణాదులవలెఁ బరమభాగవతుఁ డనియు నతఁడు వైష్ణవమతమునందు దదేకనిష్ఠతో నుండెడివాఁడనియు భోజ. ౧ ఆ. ౩౪ ప. నం జెప్పెను. ఇతనితండ్రి యగుతిక్కనయు విష్ణుకీర్తనమును విమలవర్తనమును గలవాఁడనియు శ్రీకాకుళాంధ్రనాయకునిసేవ చేయుచుండువాఁడనియు భోజ. ౧ ఆ. ౪౧ ప. వలనం దెలియుచున్నది. ఇతనిపినతండ్రి కుమారుఁడగు సింగనయు హరిపదాబ్జరతుఁడఁట. ఇతనితమ్ముఁడు చిట్టనయు సత్కవియఁట. వీ రార్వురుసోదరు లనియు నితఁ డందు రెండవవాఁడనియుఁ దెలియుచున్నది. ఇట్టిపావనతపశ్శాలులును సత్కవులు నగువారివంశమునం బుట్టినయనంతామాత్యుఁడును నట్టివాఁ డగుటలో నాశ్చర్యము లేదు.

# నివాసము

అనంతామాత్యునితండ్రి పెరుమగూరిపురమున విద్వజ్జనానంద మయిన జీవనస్థితిచేతఁ జెన్నొందెనఁట. ఆ పెరుమగూరు కృష్ణవేణీ మలాపహారిణీ భీమరథీ నదీత్రయాంతర్వేదియం దున్నదఁట. చూ. "విలసితం బగు కృష్ణవేణి మలాపహారిణి భీమరథినా ధరిత్రియందుఁ, దనరు నదీత్రయాంతర్వేది యగుపావనక్షేత్రమున శోభనములకెల్ల, ధర నివాసంబగు పెరుమగూరిపురంబునందువిద్వజ్జనానందమైన, జీవన స్థితిచేతఁజెన్నొంది వంశకర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది, నెమ్మి ప్రత్యక్షపరమపదమ్మనంగ, నొప్పు శ్రీకాకుళంబున కోడయఁడైన, యాంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ, బెక్కుభంగుల ముమ్మడితిక్క-విభుఁడు" భోజ. ౧ ఆ. ౪౦ ప. ఈనదీత్రయాంతర్భాగమును గుఱించి విభిన్నాభిప్రాయములు గలవు. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు తమ యాంధ్రవిజ్ఞానసర్వస్వమున ననంతామాత్యునిగుఱించి వ్రాయుచు నీక్రిందియభిప్రాయమును సూచించిరి.

"ఈ నదీత్రయాంతర్భాగ మాంధ్రదేశమున లేదు. కృష్ణా నది సుప్రసిద్ధమే. భీమరథి పండరీపురముమీఁదుగాఁ బ్రవహించుచు నేఁటియాంధ్ర దేశపశ్చిమభాగమున రాయచూరుసమీపమునఁ గృష్ణా నదిలోఁ గలియుచున్నది. అంతకుపశ్చిమముగనే యా రెండునదుల మధ్యభాగమున పెరుమగూరు ఉండియుండును. రాయచూరుకుపశ్చి మముగా నేఁడు మలప్రభ యని వాడుకలోనున్న మలాపహారిణీనది కృష్ణలోఁ గలియుచున్నదఁట. కనుక రాయచూరుకుఁ బశ్చిమముగా నున్నభూభాగమే యీనదీత్రయాంతర్వేది యగును" అని కొ॥ ల॥ యాశయము.

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 1947 డిసెంబరు భారతి

తిలో ననంతామాత్యుని స్వగ్రామముగూర్చి యీక్రిందియభిప్రాయమును ప్రకటించిరి.

"మలాపహానది పోలవరముశాసనమునందును రెడ్లశాసనమునందును మలఘ్ని యని పేర్కొనఁబడెను. అనవేమారెడ్డిజుజ్జివరశాసనమునందు మలాపహ యని పేర్కొనఁబడెను. పోలవరము, జుజ్జవరము, కోడూరు అనునవి యీనదీతీరగ్రామములు. ఇవి గుడివాడ తాలూకాలో నున్నవి. అనవేమారెడ్డి వేయించిన ఉప్పుగల్లుశాసనమునఁ జెప్పఁబడిన ఉప్పుగల్లు నేఁడు ఈడుప్పుగల్లనఁబడునదే. దీనికి దక్షిణసరిహద్దు భీమరథియే. పూర్వచాళుక్యులశాసనములలోనున్న పెరువంగూరు పెరుమగూరు కావచ్చును. నేఁడది గుడివాడతాలూకాలోనున్న పెరుమకూరు కావచ్చును." అని మ|| రా|||| శర్మగారి యాశయము. వీరియభిప్రాయప్రకారము కృష్ణాజిల్లా గుడివాడతాలూకాలోనే యనంతునితండ్రి నివాస మగును.

ఈ రెండువాదములలో నేదితథ్యమో చారిత్రకులు నిశ్చయింపవలసియున్నది. రాయచూరుప్రాంతమున తిక్కనామాత్యుఁడు కొంతకాల ముండి క్రమముగా శ్రీకాకుళాంధ్రనాయకస్వామిని సేవించుట కీప్రాంతమునకు వచ్చియుండె ననుటకు "ప్రభుత్వ మొందె" యను భూతకాలక్రియయు, ఆంధ్రవల్లభహరిసేవ నలరుచుండు" ననుతద్ధర్మక్రియయు సూచకము లగుచున్నవనియు నూహింపవచ్చును. పాండురంగక్షేత్రమునఁ బ్రవహించునదిని భీమరథి యని తెనాలిరామకృష్ణుఁడును వ్యవహరించియున్నాఁడు.

మల్లంపల్లివారు చెప్పినట్లు భీమర, మలాపహాకృష్ణానదులు నేఁటిగుడివాడప్రాంతమున నుండుటచే న[illegible]మాత్యుఁడు కృష్ణాజిల్లావాఁ డనుటయు సయుక్తికమే. ఈప్రా[illegible]వాఁ డగుటచేతనే ఇంతసులభముగ శ్రీకాకుళాంధ్రనాయకసేవల న[illegible]మందుట యుపపన్న

మగుచున్నది. వీరిగురువులగు నల్లానిచక్రవర్తి యనఁబడువారును గుంటూరుజిల్లాలో సంచరించినట్లును కారెంపూడిలోని గోవిందచక్రవర్తిశాసనము తెలియఁబడుచున్నదఁట. గోవిందచక్రవర్తి కగ్రజులయిన తిరువేంగళచక్రవర్తికి విజయనగరరాజ్యసామంతుఁడయిన ఎఱకంపరాజు పార్థివ సం॥రమున చియ్యావర మనుగ్రామము నిచ్చినట్లు చియ్యావరములో ఒకశాసనమున నున్నదఁట ౧౩౧౮శక సం॥రము నరసారావుపేటతాలూకా రొంపిచర్లశాసనములోను గోవిందచక్రవర్తి తండ్రి "నల్లాండిచక్రవర్తి" పేర్కొనఁబడెనఁట. గుంటూరుజిల్లా కృష్ణాజిల్లాలలో నున్నపుడే గోవిందచక్రవర్తిని అనంతుఁ డాశ్రయించి యుండును. వీరినిబట్టియు ననంతుఁడు కృష్ణాజిల్లావాఁ డని యూహించుచున్నారు. అనంతామాత్యుఁడు కృష్ణాజిల్లావాఁ డనుటయే సమంజస మన్నట్లు తోఁచుచున్నది.

## ఇతని యాచార్యభక్తి

అనంతుఁడు విశిష్టాద్వైతమతస్థుఁడు. తిరుమలనల్లాన్ అని సుప్రసిద్ధు లగు నొకయాచార్యపురుషుల పుత్రులలో నైదవవారగు గోవిందచక్రవర్తు లనంబడు శ్రీవైష్ణవాచార్యులు ఈతని కాచార్యులై నట్లు తెలియుచున్నది. "భూనభోహరిదంతపూరిత ... ... శ్రుతిచతుష్టయముతో నెనయునట్టియగ్రజులతోడఁ బుట్టిన యస్మదీయగురుని దిరుమలనల్లానువరతనూజుఁ దలఁతు గోవిందచక్రవర్తులఁ బ్రియమున" భోజ. ౧ ఆ. ౧౧ ప. "శ్రీమద్గోవిందగురుప్రభులదయఁ బ్రవీణుం డగుచున్" ఛందో. ౧ ఆ. ౭ ప. అనువానివలన పై విషయము తెలియఁబడుచున్నది. అట్లే ఛందోదర్పణాంతముననను "చక్రవర్తి గురుశేఖర పుణ్యకటాక్షలబ్ధసుజ్ఞానుఁడ" ననియుఁ జెప్పికొనియెను.

ఇతనికి ఆచార్యభక్తి చాల యధికము. కావుననే గురుస్మరణము పలుసారులు గావించెను. భోజరాజీయమున గురుసోదరులను,

వారిజనకునింగూడఁ జేర్కొనియెను. (చూ. ౧ ఆ. ౧౧ ప.) ఉదా హరణార్థముగ గురులఘువులం జూపునపుడు ఛందోదర్పణమున "గోవిందప్రభుఁ డనిన" అని స్మరించెను. ఆచార్యులకును శ్రీహరి కిని భేదము లేదనుసిద్ధాంతమును మది నిడుకొనియే తనకుఁ గలలోఁ గాన్పించిన యహోబిలనారసింహునిమూర్తియందే తనగురుఁ డభేద ముగఁ గాన్పించి "ఆమూర్తికి నీమూర్తికి నేమివిభేదం బనంగ నింపగు రూపశ్రీమహిమఁ దనరి మద్గురుఁ డామూర్తిన కదిసియుండి యాదర మెసఁగన్" భోజ. ౧ ఆ. ౬౨ ప. అహోబిలనాథునికి గ్రంథ మును సమర్పింపుమని యాజ్ఞాపించెనఁట. ఈతనిగురుభక్తి యెంత టిదియో యీసందర్భమే సూచించును. తనకును భగవానునికిని ఆచార్యుఁడు సంధాయకుఁ డనుసంప్రదాయమును ఎంతచక్కఁగనో యిటఁ గన్పఱచెను. ఆవాక్యము లన్నియు గురునివియగుటచే నంత మున "అని యుపదేశించె" నని సభక్తికముగఁ బల్కెను. ఈతఁడు గురుభక్తితోఁ బాటు విష్ణుభక్తియు మిక్కుటముగఁ గలవాఁడు. కావు ననే తనగ్రంథములనుమూఁడింటిని విష్ణునికే యంకిత మొనర్చెను. అంతియకాక ఛందోదర్పణ రసాభరణములందుఁ బ్రతిపద్యమునను విష్ణునామములం గూర్చుటయు విష్ణునిఁ దనివితీఱ వర్ణించుటయుఁ గానవచ్చుచుండును.

ఏను వైష్ణవధ్యానసమాహితాత్ముఁడ ననియుఁ దనతాత యగుముమ్మడన్నంగూర్చి "ఇతరమతములందు హృదయంబు జొను పక, యొగిఁ దదేకనిష్ఠయుల్లసిల్లఁ,బరమభాగవతభాసితుండై యొప్పెఁ, బ్రోలమాంబసుతుఁడు ముమ్మవిభుఁడు" భోజ. ౧ ఆ. ౩౮ ప. అనియు వర్ణించుట యీతనివిష్ణుభక్తిని వ్యక్తపఱచును. వైష్ణవులకు శ్రీరంగము ముఖ్యపవిత్రక్షేత్రము. అట్టిక్షేత్రము నీతఁడు 22 పద్యములతో వర్ణించెను. (౧ ఆ. ౧౫౦-౧౭౨ ప.) "అఖిలతీర్థఫలము నంతవంతం

బగుఁ గాని రంగధామగామిష్ఠమైన, యతని కొదవు నపునరావృత్తి సౌఖ్యంబు, దీనిఁ బోల వితరతీర్థతతులు" అని శ్రీరంగమును సర్వో త్కృష్ట మని వర్ణించెను. అట్లే ప్రయాగమును కాశికంటె గొప్ప దనియెను. పలుతావుల విష్ణుని గొప్పతనమును వర్ణించెను. (చూ. ౬ ఆ, ౧౭౭ - ౧౮౧. ౪ ఆ. ౨౦౦ - ౨౦౬ ప.)

## అనంతునిపూర్వులు - అనంతామాత్యుఁడు

అనంతామాత్యుఁడును ఇతనిపూర్వులునుగూడఁ బరిశుద్ధచరి త్రులును శుభయుతులును ఉద్యోగప్రాభవోపేతులు నన్నట్లు తోఁచు చున్నది. ఇతనివంశవర్ణనమున సూర్యగతియుంబోలె ననుదినాభ్యు దయోపశోభితంబు ననియెను. అట్లే శతానందసుందర మనియు శుద్ధ జీవనసమృద్ధ మనియుఁ గమలావాసభాసుర మనియు సమవృత్తాధికార యుక్తం బనియును వర్ణించెను. తన్నుగూర్చి చెప్పుకొనునప్పుడు శ్రీయువతీకారుణ్యరసాయత్త కటాక్షవీక్షణాపాదిత సుశ్రేయస్కుఁడ (భోజ. ౧ ఆ. ౫౭ ప.) నని స్పష్టముగా లక్ష్మీకటాక్షము గలవాఁడ నని చెప్పుకొనియెను. ధనాపేక్ష లేనివాఁడగుటచేతనే తనగ్రంథములను నరాంకితములు గావింపక నరసింహుని కర్పించెను. ఇట్లితఁడు లక్ష్మీ సరస్వతీకటాక్షవిషయభూతుఁ డయ్యును గర్వింపక సుకవిజనవిధే యుఁడ నని వినయమును సూచించెను. రామరాజభూషణుఁడు నిట్లే లక్ష్మీకటాక్షము కలవాఁడయ్యును తనగ్రంథములనుమాత్రము నరాం కితముల నొనర్చెను.

అనంతామాత్యునితాత యగు ముమ్మడన్న గొప్పవిష్ణు భక్తుఁడు, "పితృబుద్ధివదలక పేర్చి యచ్యుతుసేవ యనిశంబు చేయు ప్రహ్లాదుఁ డనఁగ, నగ్రజన్మునితోడ విగ్రహింపక శౌరిశరణు జొచ్చిన విభీషణుఁడనంగ, ప్రభుత యెన్నఁడుఁ గోలుపడక సద్భక్తి నుపేంద్రుఁ బూజించుబలీంద్రుఁ డనఁగ, వైవాహికక్రియావైభవం బుడుగక బిస

రుహోత్తుని గొల్చుభీష్ముఁ డనఁగ, నితరమతములందు హృదయంబు జొనుపక యొగిఁ దదేకనిష్ఠ యుల్లసిల్లఁ, బరమభాగవతవిభాసితుండై యొప్పెఁ బ్రోలమాంబసుతుఁడు ముమ్మడివిభుఁడు" భో. ౧ ఆ. ౩౮ ప. అనుపద్య మాతనివైష్ణవత్వమును జాటుచున్నది. ఇతని తండ్రి యగు తిక్కవిభుఁడును "విష్ణుకీర్తనమును విమలవర్తనమును విహితవర్తనముగా వెలయువాఁడు" భోజ. ౧ ఆ. ౩౭ ప. అని వర్ణింపఁబడినవిష్ణుభక్తిశాలి. ఇట్లు మూఁడుతరములనుండి విష్ణుభక్తు లని స్పష్టపడుచున్నయనంతునివంశమున ననంతునినాఁడే వీరు వైష్ణవు లయియుందురని శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాయుట సరికాదు. ఈతని తండ్రి శ్రీకాకుళాంధ్రనాయకసేవల నలరుచుండఁగా వైష్ణవుఁ డగుటలో సందియము లేదు. ఇతనిపినతండ్రి యగుసింగనమంత్రికుమారుఁ డగుసింగమంత్రియు హరిపదాబ్జరతుఁడఁట. ఇతనిపినతండ్రిపేరు సింగన. పినతండ్రికుమాళ్ళలో ముగ్గురకు సింగన యనుపేళ్లు గలవు. పినతల్లి యాబళాంబ. ఇవియన్నియు వీరికిఁగల యహోబిలనాథభక్తిని తత్క్షేత్రసంబంధమును బ్రకటించుచున్నవి. ఇతఁడు అహోబిలనారసింహునికి భోజరాజీయమును సమర్పించుటయుఁ దనకాలక మేకదా! ఇతనిపినతండ్రిపుత్రులలోఁ దిరువేంగడనాథుఁ డనుపేరు వేంకటేశ్వరభక్తిచే నేర్పడియుండును. దీనింబట్టి యనంతామాత్యునితండ్రికాలముననే యహోబిలక్షేత్రసంబంధము వీరికిఁ గల దనియు నూహింపనగును.

## కాలము

ఇతఁడు క్రీస్తుశకము ౧౪వ శతాబ్దికి చెందినవాఁడు. ఇతని కాలమువిషయమున సంశయము లేదు. ఆతఁడే స్పష్టముగా రసాభరణమున "జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్వాలేందులై యొప్పన, నూత్నానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీభౌమయు

క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస శ్రీ నిండసీ ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్" అని చెప్పెను. దీనిం బట్టి ౧౩౫౪ శాలివాహనశకమున ఆనందనామసం॥ర మాఘబహుళ ఏకాదశీ మంగళవారమున అమృతఘటికలలో రసాభరణమును గోపాలదేవుని కంకితము గావించె నని తెలియుచున్నది. ఇది క్రీస్తు శకమున 1435 సం॥రము జాన్యువరి 26 తేదీ యగును.

పలనాడులో కారెంపూడిలో పల్నాటివీరుల దేవాలయమునఁ గలశిలాశాసనమున నీతనిగురువగు గోవిందచక్రవర్తి మతవివాదములను దీర్చుటలో మధ్యవర్తిగా నున్నట్లును వానిని బహిష్కరించినట్లు వ్రాయఁబడినట్లు శ్రీ ని॥ వెంకటరావుగారు వ్రాసియున్నారు. ఆ శాసనము 1396 క్రీ. శకములోనిదఁట. దానింబట్టియు ననంతునికాలము 15 శతాబ్ది యనియే రూహ మగుచున్నది.

గోవిందచక్రవర్తులకాలము వేఱొకవిధముగను తెలియుచున్నది. గోవిందచక్రవర్తియు, వారితండ్రియగు తిరుమలనల్లాన్ అనువారునుగూడ 1268 క్రీ. శ. నుండి 1369 వఱకును జీవించియుండి శతాధికగ్రంథకర్త లయి సుప్రసిద్ధు లయినవేదాంత దేశికులయొద్ద వేదాంతగ్రంథములు నభ్యసించిన శిష్యులు. అట్టిమహాపండితుల నాశ్రయించిన గోవిందచక్రవర్తియు మహాపండితులే యయియుందురు. కనుకనే యనంతామాత్యుఁడు వారి నాశ్రయించుటయేకాక వారి యం దత్యధికభక్తిపరవశుఁ డగుటయుఁ దటస్థించెను. దేశికులయుత్తరవయస్సులో గోవిందచక్రవర్తివారియొద్ద వేదాంతగ్రంథముల నభ్యసించియుండును. 1350 ప్రాంతమున దేశికుల నాశ్రయించి వేదాంతము నభ్యసించిన గోవిందచక్రవర్తి 20 సంవత్సరములకు పూర్వము జన్మించి రనియనుకొన్నను వారి యుత్తరవయస్సున ననంతామాత్యుఁడు వారి నాశ్రయించి రనుకొన్నను ననంతామాత్యుఁడు 1370-

75 సం॥రములలో జన్మించియుండును. 60-65 సం॥ల వయస్సునం దుదిరచన యగు రసాభరణమును 1435 లో రచించియుండు ననుట యుక్తముగాం దోంచుచున్నది. అంతకుమున్నే భోజరాజీయచ్ఛందో దర్పణములు రచితము లగుట నిశ్చయము. 1396 ప్రాంతముననే తెనుంగుదేశమున గోవిందచక్రవర్తి సంచరించుచున్నప్పుడే యనంతుండాతని నాశ్రయించె ననుటయుం బొసంగుచున్నది.

అనంతునిముత్తాత యగుఁబయ్యన తిక్కనకాలమున నుండి యాతనిచే మెప్పు పొందినవాఁడుగదా ! ఇతనిముత్తాతకును నితనికిని 80 - 100 వత్సరములు అంతర ముండుటయు నుచితమే.

అన్నికారణములును నేకకంఠము లయి యనంతునికాలమును నిర్ణయించుచున్నవి.

ఈసందర్భమున "జానొందఁ శకవర్షముల్" అను రసాభరణ పద్యమునుగూర్చి కొంత వ్రాయవలసియున్నది. ఇందు లేఖకదోషము వలనం గొద్దితప్పులు పడినట్లు తోంచుచున్నది. "జ్వాలేందు" అను చోట "జ్వాలీందు" అని యుండవలయునని తోంచుచున్నది. జ్వాల లనంగా మూండనునర్థ మప్రసిద్ధము. జ్వాలి యనంగా నగ్ని యని యర్థ మగును. అగ్నులు దక్షిణాగ్నిగార్హపత్యాహవనీయము లని మూండగుటచే నిది మూండుసంఖ్యను సరళముగా బోధించును. అట్లే "యుక్తానామామృతవేళ" అనుచోటను జిన్నతప్పు పడెనాయని సందేహము కలుగుచున్నది, భౌమవారయుక్త మగునది యనునామ ముగల యమృతవేళలో నని యర్థము. అపుడు "భౌమవారయుక్తా నామ" అనుపదము వేళాపదమునకు విశేషణము కావలయును. వేళ "భౌమవారయుక్తా" అను పేరుగలది యనుట సరసముగా లేదు. భౌమవారయుక్తాఅనునది నామధేయముకాదు. వేళకు భౌమవారయు క్తాపదము విశేషణ మగుట యుచితము కాని నామధేయ మనుట

సరిపడదు. అంతియకాక "యనంతార్యం" డనుచోటి "తా" అను నక్షరము యతిస్థానము. అప్పు డఖండయతి కావలసివచ్చును. అనంతుఁ డెచ్చటను సరళతలేనియిట్టితీరున, కవితంగూర్చినవాఁడు కాఁడు. అనంతార్యశబ్దములో నిత్యసమాసయతి యని యెట్లో సరిపెట్టుకొనినను నర్థము సరళముగా నుండదు. "యుక్తానూనామృతవేళ" అని కవిప్రోక్తపాఠము కాఁగా నిట్టితప్పు వ్రాఁతలోవచ్చి యుండు నని తోఁచుచున్నది. ప్రాసస్థలములందే అనూనశబ్దము ననంతుఁడు తఱచుగా వాడుటయు రసాభరణమునసే కానవచ్చును. "గద్గదభాషిత్వానూనత" రసా ౨ ఆ. "అమ శ్రానూనమతి నిక్షుచాపము" రసా. ౨ ఆ. "పుష్పితానూనరసాలసాలముల" రసా. ౩ ఆ. ఇట్లే ఇందును "అనూనామృతవేళ" అని ప్రయోగించియుండును. భోజరాజయమునను, "నానార్థిజనచాతకానూనధనవృష్టి." ౧ ఆ. ౧౧ ప. "దివ్యవిమానయానమున ననూనమహిమ." ౬ ఆ౮ ప. అనిప్రాసస్థలములందెకలదు. అపుడు భౌమవారముతోఁగూడిన గొప్పదియగు నమృతఘటికలసమయమున ననియర్థము వచ్చును. ఆదినమున సుమారు ౧౦ గడియలవేళకు అమృతఘటికలువచ్చును. "అమృతఘటికా శ్శుభకర్మణ్యమృతవద్ధార్హిహ్యాః" అని చెప్పఁబడియుండుటచే నది యనూనశబ్దవిశేషిత మగుట కర్హమయియుండును. అది యట్టిమంచిసమయ మగుటచేతనే యట్టివేళ రసాభరణమును గోపాలుని కనంతుఁ డర్పించెనేమో. ఆదినమున జ్యేష్ఠానక్షత్రము ౩౬ గడియ లున్నది. వర్జ్యాదుర్ముహూర్తములు గడచినపిమ్మట నమృతసమయమున నర్పించియుండును. ఆమాసమున శుక్లైకాదశి భీష్మైకాదశి యగుటచే పుణ్యాదినము. ఆనాటికి గ్రంథము పూర్తి కాలేదేమో, పూర్తి యయియున్నచో నానాఁడే సమర్పించియుండునేమో. శుక్లైకాదశియు మంగళవారమే యయ్యెను. కాని యానాఁటి మృగశీర్షనక్షత్ర మాతనికి మంచితార

కాలేదేమో. కారణ మేదయినను బహుళైకాదశినాఁడు సమర్పిం చెను. ఈపాఠమున నర్థము పొందికగానుండుటయే కాక యతియు సరళ ముగా కుదురును. అనంతునికి జ్యోతిషవిద్యాపరిజ్ఞానముకూడ నుండి యుండును. లేనిచో జ్యోతిషికులవలె తిథివారనక్షత్రసంవత్సరములను జెప్పియుండఁడు. ఏమయినను ఇది తెలుఁగుభాషకు మహోపకారము.

## నా మ ధే య ము

ఇతనిపే రనంతుఁడా యనంతయయ్యా యనంతామాత్యుఁడా యని విచారింపవలసియున్నది. భోజరాజీయాశ్వాసాంతగద్యములందు "అనంతయ నామధేయ" యని యున్నది. వావిళ్ళవారు మూఁడవ సారిముద్రించిన ఛందోదర్పణమునందును అశ్వాసాంతములం దట్లే యున్నది. కాని భోజరాజీయపీఠికాపద్యములం దట్లు కానరాదు. "ఏను వైష్ణవధ్యానసమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ" నని యకారము లేకయే యనంతపదము కానవచ్చుచున్నది. ఆశ్వాసాంత గద్యమునకు మూల మనఁదగిన యొక్క భోజరాజీయపద్యమున "శ్రీయువతీ......కవినికిరవిధేయుఁడ ననంతనామధేయుఁడ జగతిన్" అని యకారరహితముగనే యున్నది. ఈపద్యమునను సరించియే యాశ్వాసాంతపద్యములును నడిచినవి. ఛందోదర్పణమునందును "ఛందోరీతిగ విమలచ్ఛందుం డనంతుం డొగిం బ్రశంసించి" ౧ ఆ. ౪ ప. అని అనంతుఁడనియే చెప్పెను. "శ్రీనిధిచక్రవర్తి... సుజ్ఞానుఁ డనంతధీమణి" అని గ్రంథాంతమునను ననంతశబ్దమే కలదు. రంగ రాట్ఛందమునను సులక్షణసారాప్పకవీయములందును "ననంతచ్ఛం దము" "అనంతుని ఛందము" ఇత్యాదిగా న్యుదాహరింపఁబడెనే కాని "యనంతయ" యని న్యుదాహరింపఁబడ లేదు. కాన యాశ్వాసాంత గద్యమున విధేయ, నామధేయ యని యకారాంతములు కానవచ్చు

టంజేసి యనుప్రాసమున నింకొొకయకార ముండిన బాగుండు నని తలంచికాఁబోలు ననంతయ యని యకారముం జేర్చిరి. కాని యంత్యప్రాసము దీనివలన సరిపడదు. విధేయ నామధేయ యనుచోట్ల "ధేయ" అను రెండక్షరముల కంత్యప్రాసము గలదు. దీన నట్లులేదు కదా! అదియు దీర్ఘపూర్వకముగ నుండిననే యంత్యప్రాసమున కనుగుణము. "అనంతయ" యనుచోట యకారము హ్రస్వపూర్వకమే గాని దీర్ఘపూర్వకము కాలేదు. కావున ననంతశబ్దమే కాని యనంతయశబ్దము కవిప్రయుక్త మయియుండదు. భోజరాజీయాశ్వాసాంత గద్యములలో నాల్గవయాశ్వాసమునంతమున "ననంతనామధేయ" యనియే యున్నది. ఛందోదర్పణమునను ద్వితీయాశ్వాసాంతమున నట్లే యున్నది. దిద్దినవా రీచోట్ల నెద్దుట మఱచియుందురు. రసాభరణాశ్వాసాంతగద్యముల ననంతనామధేయ యనియే యున్నది. ఛందోదర్పణమునను నాకు దొరకినవ్రాఁతప్రతియం "దనంతనామధేయ" యనియే యున్నది. కావున నీతనినామ మనంతుఁ డనియే చెప్పనొప్పును. కాని నియోగికవులనామాంతమున నమాత్యపదము చేర్చి వాడుట గౌరవముగా నున్నది. అట్లే యీతనిని ననంతామాత్యుఁ డని వ్యవహరించిరి. కావుననే "అనంతునిఛంద మను నామాంతరము గల" అని పూర్వముద్రితచ్ఛందోదర్పణప్రథమపత్రమున ముద్రిత మయియున్నది.

## గ్రంథములు

ఇతఁడు భోజరాజీయము ఛందోదర్పణము రసాభరణము నని మూఁడుగ్రంథములను రచించెను. ఇవికాక మఱి వేనినేని రచించెనేమో తెలియరాదు.

భోజరాజీయము నీతిబోధకము లగుకథలతో నిండినగ్రంథము. కథలు చమత్కారములుగా నుండును. భోజునియుత్పత్తియు నాతని

చరితమును నిందుఁ జెప్పఁబడియున్నవి. ముఖ్యముగా నితిహాసము లే యిం దధికములు. ఈ గ్రంథమును భోజచరిత్ర మనియు నీతఁడు వ్యవహరించెను. "భోజచరిత్ర చెప్పి లక్ష్మీనరసింహుఁ గూర్చిన" ఛం. ౪ ఆ. ౧౩౨ ప. "ఈ భోజరాజచరితము భూభువనమునందు నిఖిల పుణ్యాస్పదమై శోభిల్లు" భోజ. ౭ ఆ. ౨౫౨ ప. ఇట్లే భోజరాజీయ మనియు వ్యవహరించెను. "ఇకావ్యంబు సర్వజనాకర్ణనీయంబై భోజ రాజీయం బను పేరం బరగు" భోజ. ౧ ఆ. ౮౭ ప.

"సూత్రకథ భోజరాజచరిత్ర మనెడునట్టిధర్మరీతులు నీతుల్, చిత్రకథలై తలిర్పఁగ" (భోజ. ౧ ఆ. ౮౬ ప.) అని యిందుఁ జెప్పి నట్లే భోజచరిత్రము సూత్రప్రాయముగా గ్రహించి ధర్మములను నీతులను ఉపదేశించెను.

ఈ గ్రంథ మేడాశ్వాసములతో రెండువేలకుపైఁగా గద్యపద్యములుగల విపులగ్రంథము. ఇందు విశిష్టాద్వైతసంప్రదాయానుసారు లయినఘట్టము లెన్నియో గలవు. అనంతునిసంప్రదాయజ్ఞత యిందు పలుతావుల వ్యక్తమగుచున్నది.

ఇతనిగ్రంథములలో ఛందోదర్పణము రెండవ దని పలువురు చెప్పుదురు. భోజరాజీయము నిందు "భోజచరిత్ర చెప్పి లక్ష్మీనరసింహుఁ గూర్చినప్రసిద్ధుఁ" డని పేర్కొనుటచే నిది భోజరాజీయమునకుఁ బిమ్మట రచిత మనుటలో వివాదము లేదు.

మూఁడవది రసాభరణ మని పెద్దలయాశయము. దీనఁ బీఠికా భాగము లభింపలేదు. దొరకినభాగము రసములవివరణముతో నారంభింపఁబడియున్నది. అందువలనఁ బూర్వరచితగ్రంథము లెవ్వియో వానిని బీఠికాభాగమున వివరించెనో లేదో తెలియదు. ఇది మిగిలిన రెండుగ్రంథములందును బేర్కొనఁబడకపోవుటచే మూఁడవగ్రంథ మనుటయే యుచితముగా నున్నది. దీనిరచనాకాలమును గనంతుఁ

దుత్తరవయస్సులో నుండుటచే నంతకుమున్నే యీ రెండుగ్రంథము లను రచించె ననుటయే సమంజసము.

ఇది యలంకారశాస్త్రగ్రంథము. ఇందు నాల్గు ఆశ్వాసములు వివిధవిషయములను నిరూపించెను. ఇంతకుముందు విన్నకోటపెద్దన కావ్యాలంకారచూడామణి యనునలంకారచ్ఛందోవిషయక గ్రంథ మును రచింపఁగా ననంతామాత్యుఁ డలంకారమున నొక గ్రంథమును ఛందస్సున నొక గ్రంథమును వ్రాసెను. రసాభరణము కావ్యప్రకాశ సాహిత్యదర్పణముల నాధారముగాఁ జేసికొనిన గ్రంథ మని కొంద ఱును ప్రతాపరుద్రీయము నాధారముగాఁ గొన్నగ్రంథ మని మఱి కొందఱును జెప్పుచున్నారు. నాట్యశాస్త్రములోని విషయములు కొన్ని గలవు. అనేకగ్రంథములనుండి విషయములు గ్రహింపఁ బడుటచే నొక గ్రంథమున కనువాదముగాని యేకగ్రంథాధారక మనిగాని చెప్పరాదు. పలుగ్రంథములనుండి పలువిషయముల గ్రహించి స్వతంత్రముగా నీగ్రంథము ననంతుఁడు రచిం చెను. ఇందు రసములును విభావానుభావసాత్త్వికసంచారిభావము లును ముఖ్యముగా నిరూపితములు. తుదిప్రకరణమున నాలంబనవిభా వము లగు నాయికానాయకులను నిరూపించెను. ఇందు భక్తివత్సల రసములు వేఱుకావనువిషయమును జక్కఁగా సూచించెను. రసాధి దేవతలవిషయమున నాట్యశాస్త్రము ననుసరించి సాహిత్యదర్పణము ననుసరింపక యద్భుతరసము బ్రహ్మదేవతాక మని చెప్పెను. నాయి కలలో ముగ్ధా మధ్యా ప్రౌఢాభేదములేకాక "లోల" యని మఱి యొకభేదమును జూపెను. చాతుర్వర్ణ్యగృహిణీగుణములు మన్మథ మాహాత్మ్యము మున్నగుకొన్నివిషయములు ప్రతాపరుద్రీయకావ్య ప్రకాశాదులయందు లేనివి యీతఁడు నిరూపించెను.

ఇందలిశైలి చాల మధురము. ప్రతాపరుద్రీయమునందుఁ బ్రతాపరుద్రునివలె నిందుఁ బ్రతిపద్యమునను ధ్రువపురీగోపాలుఁడే వర్ణ్యపదార్థము. తుదిరచన యగుటచే గాఁబోలు నిది చాల ప్రసాద గుణభాసురముగా నున్నది. లక్షణగ్రంథములను మనోహరముగాఁ గావ్యశైలిలో రచించుట యనంతునికే చెల్లినది.

ఇది ధ్రువపురీగోపాలుని కంకితము. ఆ ధ్రువపురి యేదో సరిగాఁ దెలియలేదు. గుంటూరుజిల్లాలోని ధూళిపూడి యని కొందఱును, కృష్ణామండలములోని దరువూరని శ్రీ ని. వెంకటరావుగారును జెప్పుచున్నారు. ఈ గ్రంథరచనాకాలమును గ్రంథాంతమున స్పష్టము గావించెను. ఈ గ్రంథమునకుఁ బీఠికాభాగము దొరకకపోవుట దుర దృష్టము. అం దేమేమివిషయముల నుగ్గడించెనో! పూర్వరచిత గ్రంథములును ధ్రువపురీగోపాలుని విశేషములును మున్నగునవి యందుఁ జెప్పెనేమో!

అనంతునికిఁ దిక్కనయందు గౌరవ మధికము. తనముత్తాత యగుబయ్యనయం దాతఁడు గౌరవము చూపి బిరుదము నిచ్చుట యందుల కొకకారణముకూడ నేమో. "తిక్కకవినాయకుఁడ"ని రెండు చోట్లను నాతనికి కవినాయకవిశేషణముం గూర్చెను. "క్షితిఁ గ్రతు కర్తృతామహిమ చేకొని పంచమవేదమైన భారతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు, న్నతచరితుండు తిక్కకవినాయ కుఁడు" అని యాతనిం బొగడెను. తిక్కనపోలికలు కవితయం దనం తునికిఁ గొన్ని కలవు. తిక్కనకు స్వప్నమునఁ దండ్రియు దేవుఁడును గాన్పించి భారతరచన కాజ్ఞాపించిరి. అనంతుని కాచార్యుఁడును నర సింహస్వామియుఁ గలలోఁ గాన్పించి గ్రంథరచనమున కాజ్ఞాపించిరి. తిక్కనవలె నితఁడును నితిహాసశైలి నాదరించి యితిహాసములను భోజరాజీయమునం గూర్చెను. "బుధారాధనవిధేయ తిక్కననాము

ధేయప్రణీతం బయిన" అను తిక్కనయామాత్యోపాంతగద్యము ననుస రించియే "సుజనవిధేయ అనంతనామధేయప్రణీతం బయిన" యని యనంతుఁడును గద్యమును రచించెను. విధేయ నామధేయ పదము లుభయత్ర సమానములు గదా! తిక్కనవలె నీతఁడును గందపద్యముల నధికముగాఁ గూర్చెను. తిక్కన గద్యమును వచన మని వ్యవహరింపఁగా దానిని సమర్థించుచు "గద్య మది దాఁ దెనుఁగుకృతుల వచన మనఁగ దీపించుఁ గదా" అని వ్రాసెను. తిక్కన యీతనికి సమీపకాలమువాఁడగుటచే నాతని వైభవము సర్వత్ర వ్యాప్త మయి యీతని నాకర్షించియుండును. ఈతనిపద్యములు కొన్ని తిక్కన పద్యములను బోలియున్న వని కొందఱుదాహరించిరి.

కాని యనంతుఁడు (తిక్కనకంటె) హరిభక్తియు గురుభక్తియు నధికముగాఁ గలవాఁడు. హరియే పరతత్త్వ మని నమ్మినవాఁడు. భగవత్కటాక్షమునకు మనపాండిత్యములు కారణము కావనియు వానిదయయే సాధన మనియు నమ్మినవాఁడగుటచే నావిషయమును భోజరాజీయచ్ఛందోదర్పణముల రెండింటను వ్రాసెను.

సదయుఁ డహోబిలేశుఁడు ప్రసన్నగుణాఢ్యుఁ డనాథనాథుఁడై
చదువులకుం గరంగఁడు నిజంబగుభక్తిరసోక్తిఁ బోలె మున్
జదివినభార్గవాదులకు సన్నిధి చేసెనె దైత్యజాతుఁ డ
య్యదన సమస్తమందుఁ గలఁ డంటకు దృష్టము చూపినట్లుగన్.

భోజ. ౧ ఆ. ౭౨ ప.

చదువులును గిదువులును జదువ ధన మొదవు నని
మదిఁ దలఁపవలదు మును చదివిరె ధరిత్రిన్
సదమలినహృదయుఁ డనఁ బొదలుదితిసుతసుతుఁడు
మొదలఁ బలికినఫలుకుఁ జదువఁగఁ ముకుందుం

డద నెఱింగి కదిసెంగద చదివిన భృగుపుత్రుడుకు
చదువుతుది నొకపనికి నొదవెనె యటంచున్.

ఛందో. ౨ ఆ. ౧33 ప.

ఇతని గ్రంథములందంతటను భగవద్భక్తి ప్రతిబింబించుచునే యుండును. తరువోజ, అక్కరలు మున్నగుపద్యములలో నెంతయో చమత్కారముగా సూర్యేంద్రచంద్రగణములసంఖ్యను జెప్పినపుడు సూర్యేంద్రచంద్రులు భగవానుని సేవించుచున్నట్లు అర్థాంతరముం గూర్చెను. చూడుండు :

రవియు నింద్రులు మువ్వురు రా జొకండును గలిసి
రవిసుధాకరలోచను రాజితాననసరోజు
రవికులేశుఁ గొలుతు రని ప్రస్తుతింతురు ధరిత్రి
నవిరళం బగు మధురాక్కరాఖ్యచే సత్కవులు.

ఛందో. 3 ఆ. ౪౨ ప.

ఇట్లే యక్కరలు విషమసీసము మున్నగుచోట్ల నెంతయో రమ్యముగాఁ జమత్కరించి తనహరిభక్తిని నిరూపించుకొనెను.

అనంతునికవిత సరళమృదుపదగుంఫితము. శైలి రమణీయము. మచ్చునకైనను నీతనికవితయందుఁ గాఠిన్యము గానరాదు. షష్ఠ్యంతాశ్వాసాంతపద్యములందయినను గఠినత గోచరింపక సరళత కాన వచ్చుచునేయుండును. ధార యనర్గళ మయి ప్రసాదగుణభాసురముగా నుండును. ఇతనికి యతిప్రాసములు అప్రయత్నసిద్ధములు. పదమధ్యమునసే తఱచుగా యతి పడుటచేతనే యీవిషయ మూహింప వచ్చును.

కొలఁదిపడదు పండిలివే
డ్కలతో నిట నుంటిఘేఁ దడవుగాఁ బట్టుఁ

వెలికి వెలియఁ బోద మనుచుఁ
దొలఁగఁగఁ గొనిపోయె దంపతులఁ బెడ్రతోవన్.

భోజ. ౫ ఆ. ౩ర ప.

అనేకపద్యముల నిట్లే పదమధ్యయతి కానవచ్చుచుండును.

ఇదియుఁ దిక్కనసాదృశ్యమే యనవచ్చును. ఇతనిగ్రంథములు కవులకును లాక్షణికులకును బ్రమాణభూతములు. కందములతర్వాత సీసములును నితనికిఁ బ్రియములే. అవియుఁ దఱచుగాఁ గానవచ్చుచుండును. కనుకనే కాఁబోలును ఛందోదర్పణమున సీసములభేదముల నధికముగా నిరూపించెను. ఇతఁడు చెప్పినన్నిభేదము లప్పకవికూడ చెప్పలేదు. సీసముమీఁద నుండెడి మక్కువచేతనే కాఁబోలు "సీసంబు పసిఁడి యగు ధరిత్రిఁ బద్మనాభ" అని యొకచోట నుడివెను. సీసములను వచనములవలె కథాగమనమునకుమాత్రమే పూర్వ ముపయోగించెడివారు. క్రమముగా వానిం జక్కఁగా వర్ణనముల కుపయోగించి తర్వాతికవులు సీసమును బసిఁడి గావించిరి. అట్టివారిలో ననంతుఁడు ముఖ్యుఁడు.

## లక్షణవిరుద్ధములు

"లేవకమున్న నీ పతని దేవి వధింపుము భార్య చచ్చినం
జేవయడంగు ......"                    భోజ. ౫ ఆ. ౧౫ ప.

ఇందు దలలకు యతి కానిపించుచున్నది. లడలకు అభేదము కలదుగదా! దడలకు నభేదప్రాసము భాస్కరరామాయణాదులందుఁ గలదు. అప్పకవి నిరసించినను భాస్కరుఁ డనంతునికిని బూజ్యుఁడే గదా. కనుక లదడలకు యతి ననంతుఁడు సమ్మతించె ననవచ్చును. ఇట్టియతి అభేదయతివిశేషమే యని భావింపవలయునేమో. కాని యీయొక్కప్రయోగముచే లదలయతి యనంతసమ్మత మని నిశ్చయింపలేము. దేవి అనుచోట పాఠభేద మేదేని గలదేమో!

సేయుదు ననుటకు "సేతు" ననియు వేయుదు రనుటకు "వేతురు" అనియు నీతనిప్రయోగములు గలవు. "ఎంతహీనత వచ్చునో యేమిసేతు" భోజ. ౪ ఆ. ౨౩౨ ప. "వేతువు" రసా. ౧ పుట. చేతురు కోతు రిత్యాదు లసాధువు లని బాలవ్యాకరణము. క్రియ. ౧౦౮ సూ. వృత్తి. కాని కవిత్రయేతరకవు లిట్టిప్రయోగము లను జేసిరి.

"నిశ్చయించలేక మోము వంచినడచు" భోజ. ౫ ఆ. ౨౪౪ ప. ఇందు నిశ్చయింపలేక అని పత్వము రావలయును. అయినను "ఊహించ నోకనాల్గుగడియలసంచారము వలయు" కళా. ౩ ఆ. ౪౮ ప. మున్నగుప్రయోగములు గలవు.

"కంసాలిజాతివాఁడు చాలఁ గీడు" భోజ. ౫ ఆ. ౩౨౨ ప. ఇందు కంసాలి అని స్థిరపరకబిందు వసాధు వని కొంద ఱందురు. కాని క్వాచిత్కముగా నట్టిదియు సమ్మతమే. "వచ్చెం ధాత్రీపతి" బాల, సంధి. ౧౮ సూ. "లతాంతములకుం మొనసి" "కృష్ణుఁ డుదయించినం ధరిత్రి" ఛందో. ౧ ఆ. ౫౧ ప. మున్నగుచోట్ల నున్నట్లె యిచ్చటను నట్టిబిందు వున్నదని భావింపనగును. లేదా, వజ్ఝల సీ|| రా|| శాస్త్రిగారు చెప్పినట్లు "గమసాలిజాతివాఁడు చాలఁ గీడు" అని సాధుపాఠముగాఁ దలంపవచ్చును. ఇట్లు అసాధువు లని తలంపఁ బడుప్రయోగములు కొన్ని యున్నను మహాకవిప్రయోగారూఢము లగుటచే నట్టివి గ్రాహ్యములే యనియు భావింపఁదగును.

ఛందోదర్పణ మీతనిగ్రంథములలో రెండవయది. తెనుఁగున మొదట నవతరించిన విపులమగు ఛందోగ్రంథ మిదియే. దీనికిఁ బూర్వము కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులు ఉద్భవించినవి. వానియం దింతవిపులముగా ఛందోవిషయములు వివరింపఁబడ లేదు. కావ్యాలంకారచూడామణిని జూచి యంతకంటెవిపులముగా

ఛందోలంకారవిషయములను బోధింపవలయు ననుతలంపున ననంతుఁడు ఛందోదర్పణ రసాభరణములను ప్రత్యేకగ్రంథములుగా రచించి యుండును.

ఈఛందోదర్పణము నాల్గాశ్వాసముల గ్రంథము. సుమారు 475 గద్యపద్యము లిందుఁ గలవు. మొదటియాశ్వాసమున గణములు, ప్రాసములు, యతులు; 2వ యాశ్వాసమున షడ్వింశతిచ్ఛందములు, వృత్తములు; 3వ యాశ్వాసమున జాత్యుపజాతిప్రస్తారాది ప్రత్యయములు; 4వ యాశ్వాసమున దోష, సంధి, సమాస, వర్ణవివేచనాదికమును వివరింపఁబడెను.

గ్రంథారంభమున నిష్టదేవతాస్తుతియు గురుస్తుతియుం గావించెను. భోజరాజీయము ప్రథమప్రబంధ మగుటచే నందు విపులముగా దేవతాస్తుతియు వంశవర్ణనమున్నగునవి కావించెను. వానిని బునరుక్తములు చేయనేలయనియేమో యిందు స్వీయవంశాదివర్ణనముఁ గావింపలేదు. దేవస్తుతితోఁబాటు గురుస్తుతిమాత్రము గావించెను. గురుస్మృతి నీగ్రంథమున నాదియందేగాక తుదినిగూడఁ గావించెను. భోజరాజీయమునందువలె నుత్తమపురుషతోఁ గాక నన్నయవలెఁ బ్రథమపురుషముతో ఛందోదర్పణమున ననంతుఁడు "గోవిందగురుప్రభులదయం బ్రవీణుం డగుచుఁ గవితచందము చెప్పె" నని వ్రాసెను. ఇది యీతనివినయమును సూచించుచున్నది. నేనుచెప్పితి ననుట యహంకారసూచక మని యొకయభిప్రాయము గలదు.

వావిళ్ళవారు మూఁడవసారి ముద్రించినగ్రంథమునందలిపాఠములననుసరించియే చాలవఱకీపుస్తకమునందలిపాఠము లున్నను గొన్నిచోట్ల నాకు లభించిన వ్రాఁతప్రతిలోనిపాఠములను సుమారు రెండువందలపాఠములను ఉచితము లగువానిని గ్రహించితిని. అట్టి పాఠభేదములను వానియౌచిత్యమును వేఱుగా భూమికాంతమున వివరించితిని. అటఁ జూడఁగోరుదును.

# ప్రథమాశ్వాసము

## గద్యపద్యములు - జాత్యుపజాతులు

పరగఁ గవిత గద్య పద్యంబు లనఁ బాద
కల్పనంబు వలదు గద్యమునకు
పాదనియతి నొప్పు పద్యంబు లవియు వృ
త్తములు జాతు లనఁగ నమరుఁ గృష్ణ! ౧ ఆ. ౬ ప.

అని యీతఁడు పద్యములలో వృత్త జాతివిభాగములఁ జెప్పెను. ఇట్టివిభాగము "వృత్తం జాతిశ్చేతి ద్వివిధం పద్యమ్" అని చింతామణియు "పద్యాలియు నిరుతెఱఁగై చను నోలిని వృత్తములు జాతులొనరుం గృతులన్" అని కవిజనాశ్రయమును జెప్పినవి. తెలుఁగు కవు లందఱు నీమార్గమునే యనుసరించిరి. సంస్కృతవృత్తరత్నాకరాదులం దిట్టివిభాగము కానరాదు. కాని ఛందోమంజరియందు "పద్యం చతుష్పదీ తచ్చ వృత్తం జాతిరితి ద్విధా వృత్త మక్షరసంఖ్యాతం జాతిర్మాత్రాకృతాభవేత్" ౧ స్తబకము. ౪ శ్లో. అని చెప్పఁబడి యున్నది. పింగళిచ్ఛందోవ్యాఖ్యానాదులందు నిట్లే కలదు. కావున నీవిభాగము తెనుఁగుననేకాక సంస్కృతమునను గలదని తోఁచుచున్నది. కాని సంస్కృతమున మాత్రాగణఘటితపద్యములనుగూడ వృత్తము లని వ్యవహరింతురు. "ఆర్యావృత్తము" అని వ్యవహారము గలదు. "లక్షణం సర్వవృత్తానాం మాత్రావృత్తానుపూర్వకమ్" (వృత్తరత్నాకరము) అని కలదు.

నిసర్గేతరగణబద్ధము లగుపద్యములును మరల జాతులు, ఉపజాతులు నని ద్వివిధములు. కవిజనాశ్రయమున "గీతులుమొదలగునవి యుపజాతులు భూతలవినూత్నజాతయశస్కా" అని యీవిభాగము సూచితము. అనంతుఁ డెక్కడను నివి "యుపజాతు" లని

చెప్పకున్నను "పాదము లుత్పాదింపవలయు నుపజాత్యాదులఁ దక్క- నంబుధిశయనా!" ౧ ఆ. ౩౦ ప. అని యుపజాతుల నంగీకరించెను. తృతీయాశ్వాసాంతగద్యమున "జాతిలక్షణలక్షితంబు లగుకందము లును మాత్రాలక్షణలక్షితంబు లగుగీతులును......రగడలును" అని చెప్పెనేగాని యుపజాతిపదమును వ్యవహరింపలేదు. అయినను ప్రాస రహితపద్యము లుపజాతు లని యనంతునియభిప్రాయ మనుటకు ౧ ఆ. ౩౦ పద్యమే ప్రమాణము. ఇతనిననుసరించియే యప్పకవ్యాదులు జాత్యుపజాతివిభాగమును గ్రహించిరి. ఈనియమముంబట్టి విషమసీస విషమగీతు లుపజాతు లనఁదగవు.

ఈపద్యమునఁ బ్రథమపాదము "పరగుఁ గవిత గద్య పద్యంబు లన" ననియు "గద్యపద్యంబు" ననియు ద్వివిధపాఠములతోఁ గాన వచ్చుచున్నది. "కవిత గద్యము పద్యము నని ద్వివిధము" అని వ్యస్తముగనుండిన విధేయాంశము చక్కఁగానుండును. ఈపక్షమున గద్యశబ్దము చర్చిత్రాదిగణపఠితము కావలయును; గద్య యని స్త్రీసమ వ్యవహారము విరళము. నపుంసకసమముగా గద్య మని వ్యవహారము తఱచుగాఁ గానవచ్చును. నిఘంటువులును పలురీతుల నున్నవి. గద్య యని స్త్రీసమరూపము పండితవ్యవహారమునందును గొన్నినిఘంటువు లందును గానవచ్చుచున్నది. స్త్రీసమరూపము ప్రయోగారూఢము కానిచో "గద్యపద్యంబు లన" నను పాఠము గ్రాహ్యము.

## గురులఘువులు

వీనిలక్షణము ననంతుఁడు చాల నేర్పుతోఁ జెప్పెను. చాఁపి పలుకునవియు నూఁదిపలుకునవియు గురువులఁట. నిలిపి యనఁగాఁ ద్రెంపిపలుకునవి లఘువులఁట. ఇట్లుచెప్పుటచే లక్షణమున కవ్యాప్త్య తివ్యాప్త్యాదిదోషములు లేక చక్కఁగాఁ గుదిరెను. ఇట్లీతఁడు చెప్పుట చేతనే "అ ఆ ఇ ఈ లనఁగా ఉ ఊ ఋ నాఁగ" ౪ ఆ. ౧౧౯ ప.

మున్నగునవి నిర్దోషము లయ్యెను. పాణినీయలక్షణము తెనుఁగునకు సరిపడుటలేదు. "సంయోగేగురు" అనుసూత్రముచే సంయుక్త పూర్వము గురువగుటచే ననుస్వారవిసర్గములు శబ్దప్రత్యాహారపఠిత ములుకూడ నయి హల్లులు నగుటచే వానికి పరహల్లులతో సంయోగ ముండునుకావునఁ దత్పూర్వవర్ణములకు (సంయమి. దుఃఖము.) గురుత్వ మెట్లో లభింపఁజేసినను కేవలహల్పరకవర్ణమునకు (కావుతఁ) గురుత్వ మాపద్ధతిని సిద్ధింపదుకావున నాలక్షణ మిటఁ గుదురదు. తెనుఁగునఁ గొన్ని సంయుక్తవర్ణపూర్వవర్ణములు గురువులు కాకుండు టయుఁ గలదు. అదియు నీలక్షణమున కవిశుద్ధము.

"గురువు లోలి ద్విమాత్రల్" అనియు గురులక్షణమును రూపాంతరముచే వివరించెను. కాని యిట నొక్కసందేహము కల్గును. ఇతఁడు తెనుఁగునఁ బ్లుతమును బ్రయోగించెను. "అమరవందిత గోప కృష్ణా యనంగ" ౧ ఆ. ౮౭ ప. అను సీతనిపద్యమున నది కాన వచ్చునుగదా ! అపుడు ప్లుతము ద్విమాత్రకము కాక త్రిమాత్రక మగుటచే గురుసంజ్ఞం బొందదు. అట్లే యేకమాత్రకము కానందున లఘువును కాదు. ఇది యెట్లు ? అని సందేహము. అయినను శతే పంచాశన్న్యాయమునఁ ద్రిమాత్రక మగుప్లుతమున ద్విమాత్రలు నుం డుంగావున గురు వగునని యొకసమాధానము. అందుచేతనే కాఁబోలు నప్పకవ్యాదులు ప్లుతము నంగీకరించియు దానిని గురువుగానే భావిం చిరి. కాని వ్యవహారమునఁ బ్లుత మున్నను గావ్యములందుఁ బ్లుతస్వర మప్రయుక్త మనియుఁ గనుకనే సంస్కృతచ్ఛందోగ్రంథములందుఁ బ్లుతమును వేఱుగా నిర్దేశించి గురు వగునని చెప్పియుండలేదనియుఁ గొందఱియాశయము.

అనంతామాత్యుఁడును "గృష్ణా !" ఇత్యాదులందుఁ బ్లుతము గలదని చెప్పలేదు. పద్యమధ్యమునం ద్రిమాత్రోచ్చారణ మితనికిని

సమ్మత మగునని చెప్పఁజాలము. ఇతరులు ప్లుతయతి యని వ్యవహరించినయతిభేదము నీతఁడు కాకుస్వరయతి యని వ్యవహరించెనే కాని ప్లుతశబ్దముతో వ్యవహరింపలేదు. కాకు వనఁగా శోకభీత్యాదిజనిత ధ్వనివికారము. అది ప్లుతము కావలయుననునిర్బంధ మేల ? అమరుఁడు "కాకుః స్త్రియాం వికారో౽య శ్శోకభీత్యాదిభిర్ధ్వనేః" అనియే చెప్పెను. దూరాహ్వానాదులందుఁ బ్లుత మగునని పాణిని వచించెను. అనంతుఁడు శోకభీత్యాదిజనితకాకుధ్వని గలచోట్లఁ గాకుస్వర యతి యని యతిభేదముం జెప్పెను. ఆ కాకువునయినను బ్రశ్నసంబోధనప్రభృతులందే చూపెను. దూరాహ్వానమునం జూపలేదు. ఇతఁడు చూపినయుదాహరణములందు దీర్ఘమే కాని ప్లుతము కాదని మనకు స్పష్టముగాఁ దెలియునట్లు "కాకుస్వరయతి యగు నితఁడే... బ్రశ్నాకలితదీర్ఘ మగు" ౧ ఆ ౯౫ ప. "దీర్ఘాంతసంబుద్ధివచనయతుల కమరు కాకుస్వరంబు" ౧ ఆ. ౯౭ ప. అని స్పష్టముగా దీర్ఘమనియే చెప్పెను. ఈతావుల నీయతిని కాకుస్వర మనియే స్పష్టముగా ముమ్మాఱు వ్యవహరించెను. చూడుఁడు :

"కాకుస్వరయతి యగు" ౧ ఆ. ౯౫ ప.

"కాకుస్వరోక్తి రెంటఁ జెల్లు" ౧ ఆ. ౯౬ ప.

"అమరు కాకుస్వరంబు" ౧ ఆ. ౯౭ ప.

అనంతుఁ డిట్లు నిస్సందేహముగా దీనిని కాకుస్వరయతి యని వ్యవహరించియుండఁగాఁ దర్వాతివారు ఇది ప్లుతస్వర మని భ్రమించి ప్లుతవిధానమును సూచించి యీయతికి ప్లుతయతి యని నామకరణముం గావించిరి. ఇది సరికాదు.

కావ్యాలంకారచూడామణియందును ఇది ప్లుత మనలేదు. "అంత్యవర్ణము నిడుపయి తర్కభేదదయార్థ మయిన నచ్చు హల్లుల వళులు" ౭ ఉల్లా, ౫౯ ప. అని తర్కదయార్థకదీర్ఘ మనియే వ్యవ

హరించెను. ఈపద్యమునకుమీఁదఁ బ్లుతాక్షరవళినిరూపణ మని యున్నది. కవికృతము కాదు. ఎవరో దూర్చినది. ఇది యప్పకవీ యముంబట్టి దూర్చినది. ఉదాహరణములందును దూరాహ్వాన స్వరము చూపఁబడ లేదు. అట్టిదియయిన నోఁ బ్లుత మని యన్నను గొంతయుచితముగా నుండును.

అప్పకవిమాత్రము "భీతిశోకతర్క-గీతిదూరాహ్వానములందు జరుగుఁ బ్లుతము" అని చెప్పెను. భీతిశోకాదులయందుఁ బ్లుతము నెవ్వరు విధించిరో! అప్పకవి దూరాహ్వానప్లుతమునకు "అకటా యేమని దూరుదాన నిను నాథా! వేగుజామయ్యె" అనుదాని నుదాహరించెను. ఇది దూరాహ్వాన మెట్లగునో! ఒకగదిలోనే యున్నశాలీనునితో సుగాత్రి యనుచున్నమాట. ఇదియును రహస్య స్థలమున భార్యాభర్తలసంభాషణము. ఇట్టిచోట నీతని కిది దూరా హ్వానప్లుత మెట్లయ్యెనో. లక్షణసారసంగ్రహమునఁ బ్లుతయతి వేఱు గను గాకుస్వరయతి వేఱుగను జెప్పఁబడెను. అవిరెండును గలిపి యప్పకవి యొక్క-భేదముగాఁ బరిగణించెను. అనంతుఁడు ప్లుతయతిని గాక కాకుస్వరయతినిమాత్రమే చెప్పియుంటఁ దర్వాతివారు ప్లుత యతి యని యొకభేదముగాఁ జెప్పిరి. కావున "కృష్ణా" అనుచోటఁ బ్లుతము కాదు. దీర్ఘమే. అందుచే గురులక్షణము అవ్యాప్తిదోష దూషితము కాదు.

ప్రథమాశ్వాసము ౧౫,౨౦,౨౬,౨౭,౨౮ సంఖ్యగల పద్యములు నాకు లభించిన వ్రాఁతప్రతియందు లేవు. అందుచే నాపద్యములపాఠ ములకు పరిచేయుట కాధారము లేకపోయెను.

## ప్రా స ము లు

ఇతఁడు ప్రాసములను ౧౨ విధములుగా విభజించెను. వానిని సమప్రాసములు నసమప్రాసము లని రెండువిభాగములు చేయవచ్చును.

అందు ౧, ౭ ప్రాసములు సమప్రాసములు. ఆవిషయము సమనామ ప్రాసము, సమలఘుప్రాసము ననుపానినామములయందలి సమశబ్దమే సూచించుచున్నది. మిగిలిన ౨,౩,౪,౫,౬,౯,౧౦ ప్రాసములలోఁ బ్రాసాక్షరము లేకరీతి నుండవుకావున నవి యసమప్రాసము లగును. ౮, ౧౨ ప్రాసములు సహజముగా భిన్నవర్ణము లయ్యును సంధికార్య విశేషములచే సమత్వముం బొందినవి. అందుచే నివి కృత్రిమసమ ప్రాసములు. ౧౧ వదియు సమప్రాసమే కాని యిది సందేహనిరా సార్థము కూర్పఁబడినది. అనఁగాఁ బాళ్ళు పాళులు అని ద్వైవిధ్యము గల శబ్దము లనేకరూపములుగనే ప్రాసములందు గ్రహింపవలయు ననియు, రేఫమునకును ఋకారమునకును ఉచ్చారణసామీప్యముం బట్టి భ్రాంతిజెంది ఋకారయుతహల్లునకు రేఫయుతహల్లుతోఁ బ్రాసము వేయరాదనియును బోధించుటయే యీప్రాసభేదమునకుఁ బ్రయోజనము. అనఁగాఁ బ్రాసములు సమప్రాసములు కృత్రిమసమ ప్రాసములు అసమప్రాసములు నని ముత్త్రివిధము లగుచున్నను కృత్రిమ సమప్రాసములుగూడ సమప్రాసభేదములే కావునఁ బ్రాసములు ద్వివి ధము లని పరిగణింపనగును.

ప్రాసస్థలములం దన్నింట నొక్కవిధముగాఁ బ్రాసాక్షర ముండినంగదా సమప్రాస మగును. అర్ధబిందువు, పూర్ణబిందువు, సం యుక్తము అనునవి యున్నచో సమప్రాస మనెను. కాని ఏకహల్లు ప్రాసముగా నంతట నున్నదికూడ నిందుఁ జేర్పఁదగును. అట్టిది సుప్ర సిద్ధమగు సమప్రాస మగుటచేఁగాఁబోలు దానిని వేఱుగాఁ జెప్ప లేదు. అట్టిదాని కా సమప్రాసోదాహరణపద్యముననే (౧ ఆ. ౩౮ప.) నాల్గవపాద ముదాహరణము. (వీడు నాఁగఁ బ్రాస మీఁదు వచ్చు.)

సంయుతప్రాసమును సమప్రాసమే. ఋకారయుక్త రేఫయుక్త పదములవివేచనమునఁ గొంత భ్రాంతి కలుగుట కవకాశము గలదు,

కావుననే తెనుఁగున ఋకారము లేదని చెప్పెను. సంస్కృతపదము లందును నట్టిభ్రాంతి కలుగుచుండును. ఇంతయేల, ఏవి యికార ములో నిర్ణయించి తెల్పుట కారంభించినలక్షణసారసంగ్రహకర్తయే యిట్టిప్రమాదమునకు లోనయ్యెను.

క. క్షితి ధృతి నిధిని నిలిపితివి...

............... 

కృతిని......సితిఘృణికి గిరిగృహ. 3 ఆ. ౧౨౫.

ఇం దికారాంత రేఫసంయుక్తములుగాఁ బెద్దనార్యుఁడు తలం చిన ధృతి, కృతి, గృహ శబ్దములు రేఫసంయుక్తములు కానట్టి ఋకారయుతహల్లులే కదా! ఇట్టి ప్రమాదములు కలుగకుండుటకే "తెలుఁగునందు లేదు లలిఁ గ్రిందిసుడి గ్రుచ్చి గ్రుమ్మె నాఁగ రేఫ కొమ్ము గాని" అని చెప్పెను.

అనంతుఁడు లక్షణములను లక్ష్యములనుగూడ తానే రచిం చెను. ఇతరులపద్యముల నుదాహరింపలేదు. కొన్నిచోట్ల లక్షణము లను వేఱుగాఁ జెప్పక లక్ష్యములమూలముననే విశదపఱచెను. వృత్తా దులలక్షణములలో 3 వృత్తములందప్ప నంతటను లక్షణముం జెప్పెను. యతిప్రాసప్రకరణమునఁ గొన్నిలక్షణపద్యములు లుప్తము లయ్యెనా యని సంశయము కలుగుచున్నది.

ఉదాహరణమునకై పద్యమును బూర్ణముగా నుదాహరించెనే కాని పద్యైకదేశమును జూపలేదు. చిత్రకవి పెద్దనాదు లేకదేశము నుం జూపిరి. అప్పకవియు ననంతునివలెఁ బూర్ణపద్యములనే రచిం చెను.

## ప్రాసమైత్రీప్రాసము

"బిందుపూర్వమై తమలోనఁ బొందు గనును" అని ప్రాస మైత్రిస్వరూపముం జెప్పి "శంభు నెమ్మి" అనువాన్ప్రాస ముదాహ

రించెను. లక్షణానుసారముగాఁ జూచినచో "నెమ్మి" అనునది "నెంమి" అని యీతఁడు తలంచినట్లు తోఁచును. ఇక్కాలమున నది తప్పుగనే తలంతురు. అనుస్వారమకారముల కభేద మగుటచే లక్షణ మట్లు వ్రాసె నని యొకసమాధానము. లేదా ఆనాఁడు స్థిరపరకబిందువు నిషిద్ధముకాక "నెంమి" యని వ్రాసెడివారనియుఁ దలంపనగును. "ప్రాసబంధమగుఁ గృష్ణుఁ డుదయించినం ధరిత్రి" యనుచోట ధకారము బిందుపూర్వకముగా నుదాహరించెఁగదా! కంసాలియనియుఁ బ్రయోగించె నని యనవచ్చును. "కమ్మని ... కుం మొనసి" అని యున్నదికదా! ఇట్టిదే "నెంమి"యు నని యనంతునిభావనయేమో! చిత్రకవి పెద్దనయు "బిందుపూర్వంబుగాఁ బొందినబమలు జగంబులోఁ గృతులను గ్రమ్ము ననఁగ" ల. సా. సం. ౧ ఆ. ౬౫ ప. అని బిందుపూర్వకబమలనియే చెప్పెను. అప్పకవిమాత్రము దీనిని మార్చి "గట్టిబిందువుమీఁది బకారమునకు జమిలిమా ప్రాసమైత్రినా జరుగుచుండు" అనిచెప్పి "శంబరారాతి చేతివాలమ్ము లనఁగ" అని యుదాహరించెను. కాని అనంతుని యీక్రిందిపద్యమును జూడఁగా బిందుపూర్వకమకారము కాక ద్విరుక్తమకారమే యిట గ్రాహ్య మన్నట్లు కానిపించుచున్నది.

> ఇమ్ములఁ గాశికాపురికి నేఁగెడునప్పుడు నంకునుండి య
> య్యంబికపంపునన్ హిమవదద్రిసమీపము కేఁగునప్పుడున్
> గ్రమ్మఱి వచ్చునప్పుడును గన్నవిశేషము లింతితోడ మో
> దమ్మునఁ జెప్పె విప్రుఁ డది దానును జెప్పె నిహాప్రసంగముల్.
>
> భోజ. ౭ ఆ. ౨౩౧.

ఇందు "ఇమ్ముల" అనునది "ఇంబుల" అని "మోదమ్మున" అనునది "మోదంబున" అనియు దిద్దినను "గ్రమ్మఱి" అనునది బిందుపూర్వకమకారయుక్తముగా మార్చుటకు సాహసింపలేము. అట్లు

యినచో ద్విరుక్తమకారస్థలము లన్నియు బిందుపూర్వకమకారము లుగా లిఖించుట సముచితమే యనవలసివచ్చును. ఇట నసంతుని హృదయము మర్గ్రిహముగనే యున్నది. అనంతునిలక్షణపద్యము నప్పకవి చూచియు బిందుపూర్వకబకారమునకు జమిలిమకారమునే ప్రాసయోగ్య మనియే చెప్పెను. అనంతునియభిప్రాయమును ఖండింప నయినను లేదు. క్షకారమును వర్ణసమామ్నాయమునం జేర్చుట తప్పని యనంతు నాక్షేపించినయప్పకవి యిచ్చట నేల యాక్షేపింప లేదు? అప్పకవి కభిమతమగుతీరుననే యీలక్షణపద్యము కానవచ్చె నేమో! "పూర్వబిందుమల్ తమలోనఁ బొందు బమలు" అని సరి యగుపాఠమా యని సంశయము కలుగుచున్నది. అపుడు పూర్వమున బిందుమకారములుగల 'బమ'లు అనునర్థము వచ్చును. అది యప్ప కవి కవిరుద్ధము. అనంతునిభోజరాజీయపద్యమునుబట్టి యట్టిప్రాసమే సముచితముగాఁ దోఁచుచున్నది. ప్రాజ్ఞులు పరిశీలింతురుగాత.

## త్రికారప్రాసము

సంఖ్యావాచకత్రిశబ్దముతో రేఫరహితతకారమునకుఁ బ్రాసము వేయవచ్చునని యీతనియాశయము. అందుకు యుక్తిగా నీతఁడు రవర్ణము (సంప్రసారణమయి) ఋకారముగా మాఱుటను జూపెను. దీనింబట్టి సంప్రసారణముగా మాఱఁదగినరేఫమునకే సంయుతాసం యుతప్రాసము చెల్లు నని తాత్పర్యము. లక్షణసారసంగ్రహమునను "త్రిశబ్దమునకే యీప్రాసము చెప్పఁబడెను. అప్పకవి యట్లుచెప్పక రేఫసంయుతాసంయుతముల కని సామాన్యముగనే యీప్రాసముం ·. కాని యీతనియుదాహరణములలో హరివంశ దేవీవిజయ ·లలోఁ ద్రిశబ్దమే కలదు. పద్మపురాణపద్య మనంతుని కర్వా . ఇంక నాదిపర్వపద్యముమాత్రము త్రిశబ్దఘటితము కాదు. క్షత్రియ, చారిత్ర, మాంధాతృపదములు గలవు. (చూ. 42

పేజీ) అందు మాంధాతృశబ్దమున రేఫము గలదనవచ్చును. ఋవర్ణమున రేఫ మున్నదని వైయాకరణు లంగీకరించిరి. అందుచే నిది సంయుతప్రాసమేకాని సంయుతాసంయుతప్రాసము కాఁజాలదు. ఇట మాంధాత్ర అని రేఫఘటనము చేయరాదు. అది వ్యాకరణవిరుద్ధము. తెనుఁగునను ఋకారము నచ్చుగను రేఫరూపహల్లుగనుగూడ భావించుట యాచారము. కనుకనే ఋవర్ణము రేఫముతోఁ బ్రాసమైత్రియు యతిమైత్రియుఁ బొందుచున్నది. (చూ. ఋప్రాసము. రివడి.) "ఋౠ వర్ణంబులు రలతుల్యంబులు" అని బాలవ్యాకరణము. పైసందర్భమునుబట్టి ఋవర్ణము రేఫతుల్యముకావున రేఫ సంయుతప్రాసము కాఁగా "క్షత్రియవంశ్యులై" యనుపద్యమున సంయుతాసంయుతప్రాసమే కాదు. అనంతునికిఁ బూర్వమున నున్నస్థితినిబట్టి యీప్రాసము త్రిశబ్దమునకే చెందుచున్నది. ఇంక శ్రీదోరస్వామిశర్మగారు చూపిన భోజరాజీయమునందలి

ఆ కర్కటిగర్భమున న
నేకంబులు పుట్టెఁ బిల్ల లీనుచు మృతయై
పోక యిది యేమికతమున
నో క్రమ్మఱ బ్రతికియుండె నొగి కర్కటియున్.

౬ ఆ. ౨౭౩ ప.

అనుపద్యము విరోధించుచున్నది. ఇది యీతనిలక్షణమునకు విరుద్ధమే. కాని దీని కేదేనిపాఠాంతర ముండునేమో క్రమ్మఱ నను మాట యర్థానుగుణముగను లేదు. క్రమ్మఱ అనఁగా మరల నని యర్థముగదా! మరల బ్రతుకుట యేమి? ఒకసారి చావలేదే యీ కర్కటి. ఒకసారి చచ్చి మరల బ్రతికినంగదా క్రమ్మఱబ్రతుకుట యగును. కావున నిది సరియగుపాఠము కాదు. "క్రమత" అని యుండఁ 'క్రమ్మఱ' అని వ్రాఁతతప్పయియుండును. ఇట్టియుదాహరణ

మీాతనిగ్రంథముల మఱిమెచ్చుటను లభింపలేముకదా! కాక యిది సరియగుయినపాఠమే యన్నను కంఠతః చెప్పినత్రిశబ్దమును కాదనఁ జాలము. కకారసంయుక్తాసంయుతప్రాసము ప్రామాదిక మని చెప్ప వలసియుండును. (చూ. ౭౫ పద్యవ్యాఖ్య.)

## ప్రాదిప్రాసము

ఇదియుఁ బ్రాణశబ్దమువంటి చోటాదేశణకారమునకు నకార ముతోఁ బ్రాసముంగూర్చిననగును. అప్పకవియు నట్లేచెప్పెను. అదియ యుచితము. ఇట్టిది ప్రాణశబ్దమునకేకాక తదితరములగు ణత్వము వచ్చుస్థలములందంతటఁ జెప్పవచ్చును. ఉదాహరణములు ప్రాణశబ్ద మునకే ప్రచురముగాఁ గానవచ్చుచున్నను లక్షణపద్యమునఁ బ్రాణ శబ్దమునమాత్రమే యిట్టిప్రాసము వర్తించునని చెప్పలేదు. ఉదా హరణ మట్టిది యిచ్చెను. భోజరాజీయమున నకారప్రాసపద్యములు వందలకొలఁదిగా నున్నవి. ఒక్కచోటనయినను ణణలకుఁ బ్రాసముఁ గూర్పలేదు. అందుచే ననంతునికి సామాన్యనణప్రాసము సమ్మతము కాదు. (చూ. ౭౮ పద్యవ్యాఖ్య.)

## అర్ధబిందుప్రాసము (౧ ఆ. ౫౭ ప.)

"వీఁపు, మోపు" అనుపదములలో వీఁపులో నరసున్న లేదనియు మోపులో నది గలదనియు నప్పకవికూడ వీఁపులో నర సున్న యున్నదనుకొనుట పొరపాటే యనియు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసిరి. నాల్గవపాదములోని పదములలో మొదటిపదమునఁ గాక రెండవపదమున నరసున్న యున్నది కనుక నీపాఠమునను రెండవపదమగు మోపులోనే యరసున్న యున్నదని వారనుచున్నారు. కాని యందు (౫౭ ప.) రెండవపద మగు కాఁటిలో టివర్ణముకూడ సార్ధబిందుకము కాదు, అది

యాపవిభక్తికటివర్ణము. దానికిఁబూర్వ మరసున్న యుండుట సంప్రదాయము కాదు. అందు "మాట" యనుపదము పొరపాటున పడియుండును. అది మాఁటు లయియుండును. అపుడు 3, 4 పాదముల రెండింటను మొదటిపదములే సార్ధబిందుకము లగును. అంతియకాక "మాట" యనునది క్రొత్తగా సార్ధబిందుక మనియుఁ దలంపనక్కఱలేదు. వీరిపాఠముననుసరించియేకాఁబోలును వావిళ్ళవారి మూఁడవ ముద్రణమునంగూడ "తాఁబేటి" లో టివర్ణమునకుఁ బూర్వ మరసున్న కానవచ్చుచున్నది.

ఇట్లే యీపద్యమునందలి "ఏటి" లోఁగూడ నరసున్న ముద్రితము. దానింబట్టియేకాఁబోలును రావూరివారు పరిష్కరించినముద్రణమునను "ఏటి" లో నరసున్న యన్నితావులం గానవచ్చుచున్నది. అంతియకాక బ్రాఁతిలో నరసున్న మానిరి. ఈసందర్భముంబట్టి "ఏటికింక నొండుమాట లనఁగ" ౧ ఆ. 33 ప. అనునది యుదాహరణము కాదనియు మూఁడవపాదముమాత్రమే యాపద్యమున నుదాహరణమనియు నాల్గవపాదము మూఁడవపాదమున కనుబంధముగా నేర్పడిన ప్రయోజనవాక్యముమాత్రమే యనియుఁ దెలియనగును.

అనంతుఁడు "సార్ధబిందువులై తేలినట్టిపటల, కరయఁ బ్రాసంబు నిర్బంధమైనఁ జెల్లుఁ, బీఁపు మూఁపులు మఱి తలమోపు లయ్యె, మాఁటు లేటికి మేటితాఁబేటి కనఁగ" ౧ ఆ. ౩౭ ప. అని పటలకు మాత్రమే యీప్రాసముం జెప్పెను. ముద్దరాజురామన, కూచిమంచితిమ్మకవియు పటలకేకాక యితరవర్ణములకును నీప్రాసము చెల్లుననియు దీర్ఘములమీఁదనే కాక హ్రస్వములమీఁదను జెల్లుననియుఁ జెప్పిరి. అప్పకవి దీర్ఘములమీఁదనే యీప్రాసము చెల్లునని చెప్పెను. ఈ విషయమును జెప్పి శ్రీ రావూరి దొరసామిశర్మగారు "ఈప్రాస పటలకేకాక పరుషసరళములకెల్లఁ జెల్లునని యితరలక్ష్యలక్షణముల

వలన నిర్ధారిత మగుచున్న" దని వ్రాసిరి. కాని యనంతుని గ్రంథములను బరిశీలించిన నెచ్చటను పకేతరముల క్రీప్రాసము కానరాదు. భారతమునను నన్నయ యిట్టి ప్రాసమును బ్రయోగింపలేదని శ్రీ వ. చి. సీతారామస్వామిశాస్త్రిగారి యాశయము. ఎవరిమత మెట్లున్నను ననంతునిమతమున పకేతరముల క్రీప్రాస ముండరాదు. ఆతని గ్రంథములను నట్టి ప్రాసము లేదనియే చెప్పవచ్చును. కాని యీసందర్భమునఁ గొన్నిపదములలో నర్ధబిందువు గలదా లేదా యనువిషయమున ననంతునియభిప్రాయమును దెలిసికొనవలసియున్నది. "తోఁకొను" అనుపదమున కకార మర్ధబిందుపూర్వకమని యనంతుని యాశయముగాఁ గన్పట్టుచున్నది. శబ్దరత్నాకరమునం దీపదము నిర్బిందుకము.

తోఁకొనిపోయె నంత నొకతొయ్యలి యయ్యెలనాగ నప్డు పే
రాఁకలిగొన్నబెబ్బులి రయంబునఁ గృష్ణమృగార్భకంబుపై
వీఁక మొలర్పఁ బెల్లడరి వ్రేయుగతిన్ మరుఁ డుగ్రుఁడై ననుం
దాఁకిన మూర్ఛ నొందితిని దద్దయు నీవల నిప్డు తేరితిన్.
భోజ. 3 ఆ. ౨౨౬ ప.

తేఁకువ యలరఁగ నీగతిఁ
దోఁకొనిచని చదల రత్నతోరణదీప్తుల్
ప్రాఁకెడు ఘనగృహము లనన్
మూఁకల విడియించె రాజముఖ్యం డంతన్.
భోజ. ర ఆ. ౮ర ప.

ఆఁకొని వచ్చినవిప్రులఁ
దాటింపక యశన మిడుము తత్పరమతి న
స్తాఁకలి సేయుకు కుడువం
దోఁకొని రా పర్వమగుతిథుల మనవారిన్.
భోజ. ౬ ఆ. ౧౬౧ ప.

తోఁకొనులో నరసున్న లేదన్నచో నీపద్యము లర్ధబిందుప్రాస మున కుదాహరణములు కావలసివచ్చును. అనంతుఁడు పఱేతరముల కట్టిప్రాసమును జెప్పలేదు. కావున "తోఁకొను"లో "తోఁతెంచు" లోవలెనె యరసున్న యున్నదని తలంపవలయును.

ఇట్లే "ప్రాతి" లో నరసున్న లేదని యనంతుఁడు తలఁచినట్లు తోఁచుచున్నది; కాని శబ్దరత్నాకరాదులందు ప్రాతిలో నరసున్న కాన్పించుచున్నది.

నూతుఁల దరులను లోతగు
పాతటికసవులను నెట్టి పచ్చిక యున్నన్
ప్రాతిపడి మేయఁబోకుము
మూతి యిడకు ముగ్రసత్వములు గలనీటన్.

భోజ. ౬ ఆ. ౩౫ ప.

ఈ తెఱఁగునఁ బెక్కేఁడులు
ప్రాతిగ భోగించి తనిసి పదపడి వృషభం
బాతను వొకమృగపతికి న
నాతంకప్రీతి నొసఁగె నాహారముగన్.

భోజ. ౬ ఆ. ౩౨ ప.

ఇట్లు ప్రాతిలో నరసున్న యనంతునిమతమున లేదనునపుడు ఛందోదర్పణమునఁ బూర్వముద్రణమున నరసున్న లేకయుండుట పరిష్కర్తలయభిప్రాయ మెట్లున్నను సరియగునదియే యనవచ్చును. శబ్దరత్నాకరాదుల ననుసరించి యిపు డీఛందోదర్పణమున ప్రాతిలో నరసున్న ముద్రితము.

ఔపవిభక్తికటివర్ణము సార్ధబిందుకము కాదని వైయాకరణ సిద్ధాంతము. పటల కర్ధబిందుప్రాసము ననంతుఁడు విధించుటచేఁ బ్రాసస్థలాధిక్షయోగములనుబట్టి యది సార్ధబిందుకమో నిర్బిందు

కమో నిశ్చయింపలేము. ఏమన, ప్రాసము లన్నియు సబిందుకము లయినచో నది యర్ధబిందుసమప్రాసమును గొన్ని నిర్బిందువులును గొన్ని సార్ధబిందువులు నని నిశ్చయించినచో నర్ధబిందుప్రాసమును నగును గావున "పట" ల ప్రాసములనుబట్టి సార్ధబిందుకత్వ నిర్బిందుకత్వములు నిశ్చయింపఁజాలము. కాని యనంతుననుసరించు సర్వలక్షణసారసంగ్రహకర్తమాత్రము ఔపవిభక్తికటివర్ణము సార్ధబిందుకము కాదనియే యభిప్రాయపడెను.

"దాఁటెఁ గేసరిసుతుఁ డేటిగుంపులతేనిఁ
జాఁపుగా లంఘించి యేపు మీఱ.

స. ల. సం. ౧ ఆ. ౬౫ ప.

అని యర్ధబిందుప్రాసమున కాతఁ డుదాహరించిన "యేటి"లో నరసున్న లేదుకదా! కావున ననంతునిమతముననుసంప్రదాయ విరుద్ధముగా తాఁబేటిమున్నగుచోట్ల ఔపవిభక్తికటివర్ణము బిందుపూర్వక మనరాదు. ఔపవిభక్తికటివర్ణమే సార్ధబిందుక మన్నచోఁ జింతామణి బాలవ్యాకరణాదులు టింటులను రెండిటిని విధింపక యొక్క-సార్ధబిందుటివర్ణమును విధించినఁ జాలునుగదా!

"తగుప్రహస్వంబులు" ఛందో. ౪ ఆ. ౧౨౩ ప. అనుచోట మాత్రము నాల్గవపాదమున "నెసఁగు"లో నరసున్న యున్నది. ఇతరపాదములం దరసున్న లేదు. ఇటఁ బ్రాసాక్షరము పటలలోనిది కాదు. కావున నిది యనంతునిమతమునకు విరుద్ధముగాఁ గానవచ్చుచున్నది. కాని యీ "యెసగు" అనునది వ్రాఁతప్రతిలో సార్ధబిందుకముగా లేదు. ఇది తప్పుపాఠమని తలంపవలయును. ఇట "ఎసగన్" అనునది శుద్ధపాఠము కానోపును, "ఎస+కన్" అనుపదములసమ్మేళనమే యీపదము అని భావింపఁదగును. అప్పుడింద దరసున్న యుండదు, అనంతునిగ్రంథములలో మఱియెచ్చటను నియమవిరో

ధము లేనందున నీస్థలముసను నియమభంగ మని తలంపరాదు. పద్య మునఁ బూర్వపాఠమునే చూపితిని కాని "ఎసగఁగ" అనునదియే సరి యగుపాఠ మని తలంపనగును.

## యతులు

తెనుఁగున దీనిని వడి యందురు. యత్యాదిపదములు దీనికి సమానార్థకములు కాకున్నను పర్యాయములుగాఁ దెనుఁగున వాడుటఁ జేసి యతిపర్యాయపదములను లాక్షణికులు ప్రత్యేకముగాఁ జెప్ప వలసివచ్చెను. వళి యనుమాట కొంతవఱకు దీని కనుగుణమే. వళి యనఁగా ముడుత, లేదా, పరుస. ప్రథమాక్షరమిత్రాక్షరముల యావృత్తియే మన తెనుఁగుయతి. సంస్కృతమున యతి యనఁగా నిట్టిదికాదు. కనుకనే వళిశబ్ద మీయర్థమునందు సంస్కృతచ్ఛంద శ్శాస్త్రములం దుపయోగింపఁబడలేదు. తెనుఁగుఛందములందే యీ పదము వాడఁబడెను. లడ లభిన్నము లగుటచేతఁగాఁబోలును వళియు వడియు నొక్కటియయ్యెను. వళిశబ్దము తెనుఁగుయతి కనుగుణ మగుటచేతనే తెనుఁగుకవులు దానిని వాడిరి. "వళి రాద్య మనంత రాక్షరం ప్రాసః" "ఆద్యో వళిః" అని చింతామణి. కాని యీ వళి పదము యతిపర్యాయముగాఁ దెనుఁగున వ్యవహరించుట యెప్పటి నుండియారంభ మయినది? చింతామణి నన్నయకృతమని యంగీకరిం చినపు డిది ప్రాచీనమగుటకు సంశయము లేదు. కవిజనాశ్రయమునఁ గాని యనంతుని ఛందఃమునఁ గాని వళిపదము సంస్కృతపదముతో సమస్తమై కాని ప్రాసస్థమున ళకార ముండిగాని యెచ్చటను బ్రయో గింపఁబడలేదు. వడిపదముమాత్రము ప్రాసస్థలమున నుండుటచే నున్న దని దృఢముగాఁ జెప్పవచ్చును. "పదిరెంబుగ వళులు వెలయు విధుళ వినయునా!" ౨ ఆ. ౨౪ ప. అనుచోట "వడులు" అనియు నుండ వచ్చును. మాంప్రిఫీలుగాని వళిపదప్రయోగము కానరాలేదు. కవిజ

నాశ్రయమునమాత్రము "వళి" యని ప్రయోగింపఁబడియుండ వడి యని మార్పఁబడినట్లు తోఁచుచున్నది. వళి యనుచోట వడి యని మార్చుట సుకరము. యతిగణాదిభ్రంశము సాధారణముగాఁ గలుగదు. కాని సంస్కృతపదముతో సమాసము చేయుపట్టున మాత్రము కుదురదు. అనంతుఁడు సంస్కృతపదముతో "యతివిరా" మాదిసంస్కృతపదములనే సమసింపఁజేసెను. కవిజనాశ్రయమున నట్లు కాక నేఁటిముద్రితగ్రంథములందు స్వరవళ్ళు, సరసవళ్ళు. వర్గవళ్ళు అని కానవచ్చుచున్నది. ఇట్టిపదములు వైరిపదము లగును. "తుద వేఱుచేసి మఱి చక్కఁదనపుఁ జెనుఁగున సమర్చి కల వంబుజముల్ పదియు ననక కల వంబుజపది యని కృతిఁ జెప్ప వైరిపద మనఁ బరగుఁ" కవి. దోషా. అని తానే దుష్టమని నిందించినపదము నుప యోగించునా! ప్రాణగొడ్డమువంటి శిష్టగృహీతము లని చెప్పవల యును. అట్లు సరిచేసికొనుటకయినను నీతఁ డీపదముల నిట్లే ప్రయో గించెననుటకుఁ దగినయాధారము లేదు. పద్యములలో నిట్టిపదములు ప్రయోగింపఁబడలేదు. పద్యములలో నున్నచో నందు గణయతిప్రా సాద్యవిరుద్ధముగా నున్నదానినే గ్రహింతుము కావున నిట్లే యున్న దని కొన్నిచోట్లఁ జెప్పుటకు వీలగును. "స్వరవళ్ళు వర్గవళ్ళు" అని శీర్షికలయందో వచనములయందోమాత్రమే 3, 4 తావులం గాన వచ్చుచున్నవి. అచ్చట స్వరవళులు, వర్గవళులు, సరసవళులు అని యుండిన నీపదములు సాధువు లగును. ఛందోదర్పణమునమాత్ర మట్టివైరిపదప్రయోగము కానరాదు. 'పోలికవడి' మున్నగు నవిరుద్ధ స్థలములందే వడిపదము ప్రయోగింపఁబడెను. ఈసందర్భముంబట్టి చూడఁగా స్వరవళి సరసవళి మున్నగురీతిని కవిజనాశ్రయమున వళిపద ముపయోగింపఁబడియుండ నది "వడి" గా మార్పఁబడెనని తోఁచు చున్నది. అట్లయినచో నిస్సంశయముగా వళిపదప్రయోగము ప్రాచీ

నమే యగును. ఆపదము తెనుఁగున కనుగుణమును నగును. అదియే సహజ మగుటచేతను యత్యాదిపదములు తెనుఁగువళి కనుగుణార్థములు కాకుండుటచేతను యతిపర్యాయపదములను బ్రత్యేకముగా "విరతులు విశ్రాంతులు" అని చెప్పవలసివచ్చెను. యత్యాదినామములు తెనుఁగువళికి వర్తించుచున్నను సంస్కృతమునందలి యతికిని దెనుఁగునఁగల యతికిని భేదము గలదనియు నొక్కటియే యని భ్రాంతిచెందకుండుటకై యనంతుఁడు "ఎన్నిట యతి రావలె నని... మమరుఁ" ౧ ఆ. ౧౨౯ ప. అని వివరించెను.

## యతుల స్థానములు

యతిస్థానములం జెప్పుట రెండువిధములుగా నున్నది. పాదమున నెన్నవయక్షరము యతిమిత్రముకావలయునో దానిపూర్వాక్షర సంఖ్యం జెప్పుట యొకవిధము. ఉత్పలమాలకు యతి తొమ్మిదింట ననియెను. అనఁగా 10వ యక్షరము పాదాది మిత్రవర్ణముగాఁ గూర్పవలయును. సంస్కృతమున వృత్తరత్నాకరాదులం దిట్టిపద్ధతియే కానవచ్చును. ఈపద్ధతి సంస్కృతయతికి తగియున్నది. ఆచెప్పినస్థానమునఁ బదవిచ్ఛేదము కావున సరిపడును. అనంతుఁ డీమార్గమునే యవలంబించెను. కవిజనాశ్రయము నట్టిపద్ధతినే యున్నది. కా. చూడామణిలోఁ గొన్నితావుల నీనియమము తప్పుచున్నది. కొంద ఱెన్నవ యక్షరము మిత్రవర్ణముగా నుండవలయునో యాసంఖ్యనేచెప్పుదురు. అదియే తెనుఁగునకు సరళముగా సరిపడును. లక్షణసారసంగ్రహమును ననంతునిమార్గముననే నడిచెను. అప్పకవిమాత్రము రెండవపద్ధతినే యవలంబించెను.

యతిస్థానములను సూచించుటకై కొన్నిసంకేతముల నీతఁడు సూచించెను. చూ. ౧ ఆ. ౧౨౮ ప. ఆ సంకేతములలోఁ గొన్ని సందిగ్ధములు గలవు. "దిక్" అనఁగా ౧౦, ౮ కూడ గ్రాహ్యములు

కావచ్చును. ఉదధి యనఁగా ర, ఠ కూడ గ్రాహ్యములు కాఁదగును. కాని యట్టిసందేహములు లేకుండుటకై యాతఁ డొక్క సంఖ్యనే గ్రహించును. దిక్కనఁగా నంతటను బదియే. ఉదధి యన నంతట నాలుగే. ఇట్లు చక్రనియమములం బాటించెను.

## యతులసంఖ్య

ముఖ్యముగా యతు లయిదువిధము లని యనంతునివచనము. వానిలో నవాంతరభేదములను రెండుపద్యములతో వివరించెను. మఱి కొంతవివరణము గావించియుండ నాపద్యము లుప్తమయియుండును. స్వర, వర్గ, సరస, సంయుక్త, ప్రత్యేకయతు లనఁబడు నైదువిధము లలో స్వర, వర్గ, సంయుక్తయతులు ౮౦వ పద్యమునను, ౮౧వ పద్యమునఁ బ్రత్యేకయతులును వివరింపఁబడెను. సరసయతు లేకైకము లగుటచే వివరింపనక్కఱలేదు. కాని ప్రత్యేకయతులను వివరించు రెండుపద్యములలో నొకటి లుప్తము కాఁగా రెండవపద్యము మాత్రమే (౮౧ ప.) శేషించె నని తలంపనగును.

ఈ యవాంతరయతిభేదములసంఖ్య యెంత యని యనంతుఁడు చెప్పెనో తెలియదు. అప్పకవిమాత్రము "అనంతామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువదినా" ల్గని చెప్పెను. దానింబట్టియే ౨౪ భేదములుగా నిందలియతులకు నామములును వచ్చెను. ప్రాసములను ద్వాదశవిధము లని పద్యమున నిర్దేశించినట్లు యతు లిరువదినాల్గని నిర్దేశించినట్లు కానరాదు. అట్టిపద్యముకూడ లుప్త మయ్యెనేమో!

## గూఢస్వరయతి

లుప్తవిసర్గక మగు పదమున నోకారము వచ్చునప్పుడు పరపదాదిస్వరమునకే యతి చెల్లునని యనంతుఁడు చెప్పెను. కాని "దాసోహమ్మ" మనునట్టిచోట్ల విసర్గము లోపించుట యనునదియే లేదు.

కొన్నిచోట్ల విసర్గతో యోగ్యతగల సకార మోకారముగాఁ బ్రక్రియా వశమున మాఱినది. సంస్కృతవ్యాకరణమున నిట్టిదానిని లోప మనరు. ఆవర్ణము రూపాంతరముగనైనను కానరాక నశించినపుడే లోప మందురు. అయినను ననంతుఁడు సకారము విసర్గరూపమున కానరాకుండుటనే యిట లోపముగా వ్యవహరించెను.

మఱియు నిట విసర్గ మనఁగా సకారము గ్రాహ్యాము. సకారము రేఫముగా మాఱి విసర్గ మగుచుండునుగదా! దాసస్, అన్యస్, యశస్ అనుచోట్లఁ బదాంతముననున్నసకారమే ప్రక్రియావశమున నోకారముగా మాఱెనుగదా!

"దాసోహమ్, యశోబ్ధి అనునవి సరియగునుదాహరణములే యయినను అన్యోన్యశబ్దమున విసర్గము లేనందున లుప్తవిసర్గకస్వరవళి యన్నచో నిది యుదాహార్యము కాదనియు నప్పకవి దీని నుదాహరించుట సరికాదనియు" శ్రీదొరస్వామిశర్మగారు "ఛందోరీతుల"లో వ్రాసిరి. కాని యశోబ్ధిలో నెట్లు సకారము ఓకారముగా మాఱెనో యన్యోన్యశబ్దమునను నట్లే సకారమే యోకార మయ్యెను. అన్యశబ్దమునకు సుడాగమము చేరుటచే సకార ముండును. అదియే యశస్, తమస్ అనువానిలోని సకారమువలెనే ఓకార మయ్యెను. అన్యశబ్దమున సకారము లేదనుకొనుట సరికాదు. అనంతుఁడును, అప్పకవియు ముత్త్రివిధములగు సకారములకును మూఁడుశబ్దముల నుదాహరించి యెట్టిదయినను ఈయతి కుదాహార్య మగునని సూచించిరి. సకార భేదములకు 1-86 పద్యవ్యాఖ్య చూచునది.

## ౠకారవిరతి

ౠకారము ఋవర్ణముతో యతి చెందదని యనంతుఁడు చెప్పలేదు. ఋౠలకుఁ గలసావర్ణ్యమునుబట్టి ఋకారమువలె నిదియు ఇప లతో యతి చెందుననుభ్రాంతినిమాత్రమే ౧ ఆ. ౯౦ పద్యమునం

గాఁగాఁబ్రెను. ౠకారమునకు ఋకారమైత్రితోఁబాటు లి, ళి వర్ణము లతోఁ గూడ మైత్రి కలుగును. అందుకు కారణము యణాదేశముచే ౡకారము లకార మగుటయే. ఋవర్ణము రివర్ణముతో మైత్రి చెందు చున్నదికదా! కాని ఋవర్ణము ప్రత్యేకముగను హల్లుతోఁగూడియుఁ గూడ నుండి రివర్ణమైత్రిం జెందును. ౠవర్ణము ప్రత్యేకముగా నుండక హల్లుతోఁగూడియేయుండును గావున నట్టిదియే యిందు నాల్గవపాద మున నుదాహృత మయ్యెను. ఇది "కృతఖేచరకులలలామ రిపుజన భీమా" వంటిది. "ఋత్విజుం డని విచారించి" వంటిది ౠకారమున నుదాహరణము లభింపదు. ౠకారము ఋకారముతో మైత్రిచెందు టలో సంశయము లేదు. కాని యది ఋకారమిత్రములగు ఇ, ఏలతో యతిచెందుట కుదురదని యిందుఁ జెప్పఁబడెను. అందులకుఁగారణము ౠకార మొంటరిగా నుండకపోవుటయే. ఇఁక హల్లులకుఁ గావలసిన యజ్మైత్రిలో ఋ ౠ వర్ణసావర్ణ్యమునుబట్టి ౠకారయుతహల్లు ఋవర్ణమిత్రములతోఁ గూడినహల్లులతో మైత్రిం జెందుననుటలో సంశయ మక్కఱలేదు. కనుకనే "ఋత్వమునకు నెత్వ మెనయుచోట" ౧ ఆ. ౧౦౪ ప. అని ఋకారమున కెకారము హల్లులస్వరమైత్రిలో మిత్రవర్ణమనియుఁ జెప్పెను. ఇట ఋత్వ మనఁగా ౠత్వము నగును. నిషేధింపనిచోటనంతటను ఋౠలకు మైత్రి తప్పదు. ౧ ఆ. ౯౦వ పద్యమున ఋకారము ప్రత్యేకముగానుండి (ఋషి, ఋణము.) ఇఏ లతో మిత్ర మగునట్లు ౠకారము ప్రత్యేకముగానుండి ఇఏలతోయతి చెందదనిమాత్రమే చెప్పెను. హల్లులతోఁ గూడియేయుండునని యుదాహరణమును ౪వ పాదమునం జూపెను. దీనింబట్టి "కృతవీర్యు ధనమెల్లఁ గ్నప్తి సేసి. భార. ఆది. 7-133 మున్నగుసమీక్షలో శ్రీరావుగారువారు చూపినప్రయోగములు సామాన్యవర్గయతిలోఁ జేరుటకు సంశయమే లేదు. ఇవి సుప్రసిద్ధముగా నచ్ మైత్రిగల వర్గయతి

స్థలములే యని యప్పకవ్యాదులు తెలిసికొనియేయుందురు. ఋ౯ౠ వర్ణములకుఁగల సావర్ణ్యప్రయుక్తాభేదమునుబట్టియే యప్పకవి ౡకార మును వేఱుగా యతులసందర్భమున స్పృశింపలేదు.

## పోలికవడి

మకారమునకు పు ఫు బుభులు యతిచెందినఁ బోలికవడి యని ౧ ఆ. ౧౦౧ ప. నం జెప్పినను "సరోరుహా, ములు నాహ్నాత్స రసియందుఁ బొదలు ననంగ౯" అను నుదాహరణమునుబట్టి పు ఫు బుభులతోఁబాటు పొ ఫొ బొ భోలతోడను మకారము యతిచెందు నని తెలియఁబడుచున్నది. మకార మనఁగా విభక్తిమకారమే కావ లయుననునియమము లేదు. ఇతరమకారమునకును నీయతి వర్తించు నని "తోఁ, బుట్టినయట్టికాంతిగల ముద్దుమొగంబు లెలర్ప నందె లు౯." భోజ. 3 ఆ. ౧౬౭ ప. "మును తత్సతి నిల్పి చనినభూజము కడకు౯" భోజ. ౫ ఆ. ౬౧ ప. అనుప్రయోగములనుబట్టి తెలియు చున్నది. అప్పకవి ము విభక్తియతి వేఱుగను మకారయతి వేఱుగను జెప్పెను. ము విభక్తియందు పొఫొబొభోలకు యతి నుదాహరించెం గాని మకారయతిని పుఫుబుభులకే యుదాహరించెను. ఆ యతులను రెండుగా విభజించుట కట్టిభేదమే కారణము. మువర్ణమునకేకాక మొ అనుదానికిని నీయతి వర్తించునని చెప్పి "మ్రొక్కులు గైకొను సమస్తభువనాధీశా" యనుదానిని గొంద ఱుదాహరించిరి.

## నిత్యసమాసయతి

అనంతుఁ డీపేరు క్రొత్తగా పెట్టి యాదేశవళి యని విన్నకోట పెద్దన చెప్పినదానినే పెంచెను. ఆతఁడు సంధివశమున ద్వీపశబ్దమున ఈకారమును నాకశబ్దమున నాకారాదేశమును వచ్చుటంబట్టి యచ్చు నకును హల్లునకును యతి వేయవచ్చునని చెప్పెను. అట్లే యన్యోన్య శబ్దమునుగూర్చి నిరూపించిరి. అనంతుఁడు దానికి అనంతరసా

యన నారాయణ సమాసశబ్దముల నుదాహరించెను. ఇవినాలుగును సంజ్ఞావాచకము లగుటచే నిత్యసమాసములే యగును. "అవిగ్రహః అస్వపదవిగ్రహోవా నిత్యసమాసః" అను వైయాకరణోక్తి ననుసరించి నిత్యసమాసలక్షణముంగూడఁ జెప్పెను. ఇట్లే నిత్యసమాసములన్నియు నుభయయతు లగునని యనంతునియాశయము. ఈసందర్భమున నాకద్వీపానోన్యశబ్దములే కాక నిత్యసమాసము లన్నియు నిట్లు చెల్లునని వివరించెను. అనంతుఁడు దీని కిచ్చినయుదాహరణము :

నాస్తి యనక మహి ననంతసంపదలు నా
రాయణుం డొసంగు రమ్య మగు ర
సాయనంబు బుధుల కతఁ డన్న నిత్యస
మాసయతులు రెంట నంటియుండు.

అనునది. ఇందు నాల్గుపాదములందును నాల్గునిత్యసమాసములును నాల్గు తదితరపదములును యతిస్థానములం గూర్చెను. అందు మొదటిపాదమున అనంతశబ్దములో నచ్చునకు రెండవపాదమున నారాయణపదమునందలి హల్లును గ్రహించుటకును 3, 4 పాదములందు రసాయనసమాసశబ్దములలో నచ్చు గ్రహించుటకును నుదాహరణములు. నాస్తి అనుపదద్వయమున నుత్తరపదాదినున్న అకారమునే గ్రహింపవలయును. అది సమాసము కాదుగదా! ఇందు "నాస్తి" అనునదికూడ నిత్యసమాస యత్యుదాహరణమే యని భావించి యప్పకవి "ద్వీపాంతరీపనాస్తి పదార్థానేకాన్యోన్య జనార్దననాకాదులు నిత్యసమసనము లండ్రు బుధుల్" అని నాస్తిపదమును నిత్యసమాసములలోఁ జేర్చెను. అనంతుఁడుమాత్రము "నాస్తి" యనుదానిని నిత్యసమాసముగా నుదాహరింపలేదు. ఆ పద మీతఁడు చెప్పిననిత్యసమాసలక్షణలక్షితము కాదుగదా! అంతియు కాక యతిస్థానములరెండింటను నిత్యసమాసపదములను గూర్చెనచో

నాయుదాహరణ మచ్చునకో హల్లునకో తెలియక సందిగ్ధ మగును గదా! అంతియకాక నఞర్థకనశబ్దమునకు అస్తి యను తిఙంతప్రతిరూప కావ్యయమునకు సమాస మని యెట్లో సమర్థింతమన్నను నది నిత్య సమాసము కాదుగదా ! దేనికేని సంజ్ఞయును గాదుకదా ! కావున నిట నాస్తి యనుచోట నుత్తరపదాదినున్న యచ్చునకే "స్వరములు కాదుల నొందిన నరుదుగ స్వరయతులఁ దగును" ౧ ఆ. ౯౧ ప. అనునియమమునననుసరించి యతి వేయఁబడెను. ఇది పదద్వయస్థలము లలో నంతట సామాన్యముగా నున్నరీతియే. ఇందలియచ్చునకే యనంతపదములోనియచ్చుతో మైత్రి యిచ్చుట నుద్దిష్టము. ఇందు "నాస్తి" పదముకూడ నుభయయతిస్థలమే యయినచో నియత మగునుదాహరణ మగుటకు వీలు కాదనియైనను గమనింపక యప్ప కవి నాస్తి యనుదాని ననంతుఁ డుభయయతికే యుదాహరించె ననుకొని తానుగూడ "నాస్తి"ని నిత్యసమాసముగా నుదాహరించెను. ఇది ప్రమాదమనియే తెలియనగును. లక్షణసారసంగ్రహకర్త యనం తునిపద్యమును జూచియుఁ దాను భ్రాంతిచెందక నాస్తిని నిత్యసమా సములలోఁ జేర్పలేదు.

"అన్యోన్య" పదమును నిత్యసమాసములలోఁ జేర్పక యీ పదమునంగూడ (నిత్యసమాసము కాకున్నను) నుభయయతి చెల్లునని మాత్రమే కావ్యాలంకారచూడామణియందుఁ జెప్పఁబడియుండఁగా నప్పకవి దానినిగూడ నిత్యసమాసములలోఁ జేర్చుటయుఁ బ్రమా దమే. ఇది ద్విరుక్తమగు నన్యశబ్దమే కాని సమాసము కాదు. అన్య శబ్దమున కన్యశబ్దము పరమగునపు డోత్వము నిపతింపఁబడెనని శ్రీదార స్వామిశర్మగా రనిరి. కాని యట్లుకాదు. అన్యశబ్దము పరమగునపుడు 'మొదటియన్యశబ్దమునకు' సుడాగమము వచ్చి యా సకారమునకు రుత్వము, ఉత్వము, గుణము, పూర్వరూపమును వచ్చుటచే

"నన్యోన్య" యని యయ్యెను. చూ. శ్రీ వేదుల రామశాస్త్రిగారి వివరణము.

అప్పకవి "సంధానధ్యానము నాస్తి శోకబాహుతా నాస్త్యుష్ణతా" యను నాముక్తమాల్యదాపద్యమున యతి కుదుర్చుట కిట్టి వక్రమార్గమును జూపియుండును.

## అభేదయతి

"ప్రకటపకారవకారద్వికమునకుం జనునభేదవిరతి" ౧ ఆ. ౧౨౩ ప. అని పకారవకారములకుమాత్రమే యభేదయతి యని యిట భాసించుచున్నను నాపద్యముననే ద్వితీయపాదమున వ భ లకు యతిని గూర్చుటచే వకారమునకు పఫబభలు నాల్గింటితోడను యతి చెల్లుననియు నీలక్షణపద్య ముసలక్షణ మనియుఁ దెలియనగును. లళలకును లడలకును నభేదయతి దీననే యూహ్యము. "కాకుస్వరయతి యగు నితఁడే కదలక జలధిఁ బన్నాళించె ననఁగ" ననుపద్యమున ళడలకు యతి ప్రయుక్తమేకదా! లళలకుఁ బ్రాసమైత్రి కంఠోక్తమే యయినను యతిమైత్రి నిది సూచించును. దడలకును యతిప్రాసమైత్రి యీతనిభోజరాజీయమునఁ గానవచ్చుచున్నను నట్టిచోట్ల రూపాంతరములను గొందఱు చూపుటచే నది వివాదాస్పదమయ్యెను. లకారముతో ళకార మభిన్నమగుటచేతనే యీతఁ డద్దానిని వర్ణములలో నొక్కటిగాఁ బరిగణింపఁడయ్యెను.

సంయుక్తయతిస్థలమున బహుయతినియమము అనంతుని మంగళమంగళమహాశ్రీవృత్త, జయభద్రరగడోదాహరణపద్యము లందుఁ జెడినదని శ్రీరావూరువారు సమీక్షలో చెప్పిరి. కాని వ్రాఁతప్రతిలోని సరియగుపాఠమున నట్టినియమభంగము లేదు. వారికి దొరకినపాఠము సరియయినది కాదు! ఇంచలి పూరెండిటి యుదాహరణములు సరియయినవి చూడనగును. వీనిలో నట్టిదోషములు లేవు.

# అనావశ్యకప్రాసములు

సమలఘుప్రాసమునకు "వ్రిదిచె నసురఁ గృష్ణుఁడు దిక్కు-లద్రువ నదఁగ" అనునది యుదాహరణము. దీనిని నియమార్థము చెప్పెను. అనఁగా రేఫసంయోగమునకుఁ బూర్వాక్షరము లఘువై ప్రాసపూర్వాక్షరముగా నున్నచోఁ బ్రాసస్థానముల నన్నింట నట్టి రేఫమే యుండవలయును. "వ్రిదిచె నసురఁ గృష్ణుఁడు దిక్కు- లద్రు లదర" అనియుండరాదని భావము. ఇది యిట్టినియమార్థకమే కాని ప్రత్యేకప్రాసభేద మన నావశ్యకత లేదు. ఇదియు సమప్రాసముననే చేరిపోవునుగదా!

త్రికారప్రాసమును నుభయప్రాసమును నించుక భేదము గలవి. త్రికారప్రాసము కేవలత్రిశబ్దమునకు సంబంధించినదే యగుచుండ నుభయప్రాసము రేఫలకారసంయుతడకారమునకు సంబంధించినది.

బిందుప్రాసమును సందేహనివృత్తికే యేర్పఱిచెను. ఇట నెట్లును బ్రాసాక్షరములు సమానాకారములే. స్థిరము పరమగునపుడును గ్వాచిత్కముగా ద్రుతము బిందు వగుననియు నట్టిచోట్ల బిందుపూర్వకసహజస్థిరమునకుఁ బ్రాసము వేయవచ్చుననియుమాత్రమే యిటఁ దెలియఁదగును.

దీనిని సంధిగతప్రాసమునఁ జేర్పకుండుటకుఁ గారణము గలదు. సంధిలోఁ బరపదాదివర్ణము సరళాదేశాదులవలన మార్పుచెందినపుడే సంధిగతప్రాసము నీతఁడు వివక్షించెను. పూర్వపదాంతమున నున్న ద్రుతము బిందురూపమును గాని సంశ్లేషముం గాని చెంది ప్రాసస్థానమున నున్నచో నది యొకప్రాసవిశేష మనుట యీతనికి వివక్షితము కాదు. అట్టిదానిని సంధిగతప్రాసముగా నెవ్వరును జెప్పలేదు. ద్రుతము బిందువయినపుడుకూడ స్థిరము పరమగునపుడుమాత్రమే

యుడి యసాధారణ మగుటచే దానిని బిందుప్రాస మని చెప్పవలసి వచ్చెను.

సంయుతప్రాసమున రెండవభాగమగు "ఆ క్రూరనక్రభయమున వాక్రువ్వదె గజము భక్తవత్సలు ననఁగన్" అనుదానికిని సమలఘుప్రాసమునకును నించుకభేదము గలదు. ఇందుఁ బ్రాసపూర్వాక్షరములు గురువులు. కాని వీనిగురుత్వము దీర్ఘమూలకము. "విద్రిచె నసురఁ గృష్ణుఁడు దిక్కు లదుర్వ ననఁగ" ననుచోటఁ బ్రాసపూర్వాక్షరములు లఘువులు. ఇది సంయుతప్రాసము. సమలఘుసంయుతప్రాసములు రెండును సందేహనివృత్తికి వివరింపఁబడెను గాని ప్రత్యేకప్రాసభేదములుగాఁ బరిగణింపనవసరములేదు. సమానప్రాసాక్షరములు కలవికాన సమప్రాసభేదములే యగును.

## అనావశ్యకయతులు

గూఢస్వరయతి, స్వరయతిభేదమే కాని వేఱుగాఁ బరిగణింపవలసినది కాదు. "ప్రాది నిత్యసమాసశబ్దములు గాక పెరపదంబుల పై నచ్చు బెరసినప్పు డన్నియును స్వరయతు లగు" ౧ ఆ. ౯౨ ప. అను పద్యమునుబట్టి సంధిస్థలమునఁ బరపదాదిస్వరము గ్రహించి స్వరయతులే గ్రాహ్యములుకదా ! దాసోహమ్, అన్యోన్య, యశోర్థి అను మూఁడుచోట్లను బరపదాదినకారమే కలదు కావునఁ దన్మాత్రములగు నచ్చులే పాదాదిం గూర్పఁబడినవి. ఇది సందేహనిరాసార్థమే చెప్పఁబడెను. కనుకనే ఏకారపూర్వరూపస్థలమునను అకారమే యతికి గ్రాహ్యమని వేఱుగాఁ జెప్పనక్కఱలేకపోయెను.

రేఫయుతయతిమాత్రము సంయుక్తయతిభేదమే యగును. అయినను దెలుఁగుమాటలలో రేఫసంయోగమే కాని వట్రువసుడి యుండదని చెప్పుటకే యీయతిభేదము నిక్షిప్తమయ్యెను.

అనుస్వారయతి యావశ్యకమే. పాండవ, కందర్పాదిపదములు సంస్కృతములు కావునఁ బరసవర్ణముచే వానిలో ణనలే యుండుటచే సంయుక్తయతిలో నవి చేరునని తలంచినను పంపు, అందము మున్నగు నాచ్ఛికపదములకొఱ కీయతి యావశ్యకమే యగుచున్నది.

ఎక్కటియతినిగూడ యతిభేదముగాఁ బరిగణింపనక్కఱలేదు. ఏయేవర్ణములకుఁ బరస్పరయతిమైత్రి చెప్పఁబడెనో వానికిఁదప్ప మిగిలినవర్ణముల కితరమిత్రవర్ణములు లేనందునఁ దమకుఁదామే యెట్లును యతి చెందును. అది శాసింపనక్కఱలేదు. (అప్పకవి యట్టి దానిని "ప్రాణియతి" యని యొకభేదముగాఁ బరిగణించెను.) కకారము కకారముతోడను అకార మకారముతోడను మైత్రిచెందినట్లే రవర్ణము రవర్ణముతో మైత్రిం జెందును. అయినను నావర్ణములకు సాక్షాత్తుగా నితరమిత్రవర్ణములు లేవని సూచించుటకుమాత్రమే యీ యతిభేద ముపయోగించును.

"ల ర మ ఱ వ" అనునక్షరములకు సాక్షాత్తుగా మిత్రవర్ణము లితరములు లేనందున వీని నెక్కటివడిలో ననంతుఁడు చేర్చెను. లకారమునకు ళకార మభిన్నమేయగుటచే వానికి వేఱుగాఁ బరిగణనమే యనంతునిమతమున లేదు. అక్షరములలో ళకారము ననంతుఁడు చేర్పలేదుగదా! అందుచే లకారము ళకారముతో యతి చెందుట భిన్నవర్ణముతో కాదు అభిన్నవర్ణముతోడనే. కావున లకారమునకు భిన్నవర్ణముతో యతిమైత్రి లేదని భావము. అట్లే వకారమునకును పకారముతో నభేదభావముననే యతి వర్తించెనుగదా! అభిన్నమునకు యతిచెందుటచే వర్ణాంతరముతో యతిచెందుట కాదు కనుక ఎక్కటియతిలో దీనిం జేర్చెను. మకారమునకు సాక్షాత్తుగ మిత్రవర్ణములు లేవు. బిందుపూర్వకము లయినపుడుమాత్రము పకారాదులు మిత్రములు. రఱల కెట్లును వేనితోడను మైత్రి లేదనుట

ప్రసిద్ధమే. కావున నీయయిదక్షరములను ననంతుఁ డొక్కటియతిలోఁ జేర్చెను.

భిన్నవిరతియు ననావశ్యకమే. ధరించు ధరియించు, భుజించు భుజియించు మున్నగుచోట్ల నించుకక్కలోని యికారము భిన్నముగాఁ గానఁబడినప్పుడు ఇకారమునకు యతివేయుటయు, అట్లు కానరాని నాఁడు రేఫజకారాదిహల్లులను గ్రహించి యతివేయుటయు విధింప నక్కఱలేదు. అవి యెట్లును బ్రాప్తించియున్నవియే. విధించినను నొకనూతనయతిభేదముగాఁ జెప్పనక్కఱలేదు. ఇట్టిచోట్ల ఇకారము భిన్నముగాఁ గానరానియపుడుమాత్రము ఆ యికారమును గ్రహించి స్వరయతి పాటింపరాదనునియమమును దెల్పుటకే యీయతివిధాన ముపయోగించును.

ఇట్లే చేతిది చేతియది, నాది నాయది మున్నగుచోట్ల అకారము ప్రత్యేకముగాఁ గానవచ్చునపు డాయకారమునకును కానరాని యపుడు తకారాదిహల్లులకును యతి గ్రాహ్యమని బోధించుటకు మాత్రమే యీయతివిధాన ముపయోగించును. అకారము భిన్న ముగాఁ గానరానియపుడు దానిని గ్రహించి యతి వేయరాదని గ్రాహ్యము.

## ద్వితీయాశ్వాసము

అనంతుఁడు "గద్య మది దాఁ దెనుగుకృతుల వచన మనఁగ [illegible] గడఁక" ౨ ఆ. ౨ ప. అని గద్యమును దెనుఁగున వచన మని వ్యవహరింతు రని చక్కనిమాట వ్రాసెను. వచనపదమున కట్టి యర్థము సంస్కృతమున లేదు. అది వాక్పర్యాయముగా "భాషితం వచనం వచః" అని చెప్పఁబడియున్నది. కాని యెట్లో తెనుఁగున [illegible] వ్యవహారము వచ్చెను. [illegible]

కేవలవచన మగుటచే నట్లు గద్య మనునర్థమున వ్యవహరింపఁబడి యుండును. ఇట్టివాడుక యెప్పటినుండియేర్పడెనో కాని తిక్కన నాఁటికే యిది రూఢ మయ్యెను. కనుకనే యాతనియుత్తరరామాయణమును నిర్వచనోత్తరరామాయణ మని లోకులు వ్యవహరించిరి. అంతియకాక "వచనము లేకయు వర్ణన, రచియింపఁగఁ గొంత వచ్చుఁ బ్రౌఢులకుఁ గథా, ప్రచయము పద్యము లన పొం, దుచితంబుగఁ జెప్పు టార్య లొప్పిద మనరే" ఉ. రా. ౧ ఆ. ౧౬ ప. అని తిక్కన స్పష్టముగా గద్యమును వచన మని వ్యవహరించెను.

సమవృత్తములసంఖ్యను "ఋతుకరాద్రి... ...చంద్రులు" ౨ ఆ. ౭ ప. అని సంజ్ఞలతో వివరించియు "ఒగిఁ బదమూఁడు కోటులు" ఇత్యాదిపద్యముతోఁ దెనుఁగుసంఖ్యావాచకపదములతో స్పష్టతకై వివరించెను. ఈపద్యము కవిజనాశ్రయమునను గానవచ్చుచున్నది. (అందు 2వ పాదమున యతి చెడినది.) క. జ. ము ప్రతివిషయమును సంగ్రహముగాఁ జెప్పును. ప్రత్యేకముగా ఛందములందలి వృత్తసంఖ్యలను వచనమునం జెప్పెనేకాని పద్యములలోఁ జెప్పలేదు. అనంతుఁ డట్లుకాక యన్నిఛందములందలివృత్తములసంఖ్యలను బద్యములతో వివరించి సర్వవృత్తసంఖ్యను స్పష్టతకై యంకెలతోఁ జెప్పియుండఁగా దీని నెవ్వరో కవిజనాశ్రయమునఁ జొనిపియుందురు. అందిట్టిప్రక్షిప్తము లనేకములు గలవుకదా! ఈపద్యము ఛందోదర్పణమున సప్తప్రత్యయములయంతమునఁగూడ నున్నది. అనంతుని ఛందమునందుఁ బ్రక్షిప్తములు చేరలేదు. కవిజనాశ్రయమున నట్టివి కలవని సర్వసమ్మతముకదా! ఇదియు నట్టిదే. అనంతునిపద్యములలోనివి మఱియొకటిరెండుగూడఁ గవిజనాశ్రయమున దూఱినవి. శ్రీ గి. సీతాపతిగారు విమర్శించి యనంతునివే యని నిశ్చయించిరి.

# వృత్తములు

ఇవి సమములు అర్ధసమములు విషమములు నని ముత్త్రివిధములు. సమవృత్తము లనఁగా నాల్గుపాదములు నొక్కరీతిగా నుండునవి. అర్ధసమము లనఁగా బేసిపాదము లొకతీరునను సరిపాదము లొకతీరునను నుండునవి. ఇట నర్ధ మనఁగాఁ బద్యపూర్వార్థము నుత్తరార్థము నని గ్రాహ్యము. కనుకనే కందపద్యలక్షణమున "అర్ధముల హరీ" యని పూర్వోత్తరశబ్దములు లేని కేవలార్థశబ్దముతోడనే లక్షణము ప్రోక్తము. అచట నర్థశబ్దమునకు పద్యమున సగభాగ మన్నచో సర్వవిరుద్ధ మగునుగదా! పద్యపూర్వోత్తరార్థములలో నొక యర్ధము నకేగదా యాలక్షణము. పూర్వార్థ మెట్లుండునో యుత్తరార్థము నట్లేయుండవలయునని భావము. అర్ధ మనఁగాఁ బద్యమున సగముభాగ మని తలంపరాదు. అట్లయినచో నేరెండుపాదములును సగ మగును. అప్పుడు ౧, ౨ పాదము లొకతీరునను 3, ౪ పాదములు మఱియొక తీరునను నున్నను నవియు నర్ధసమవృత్తములనియే చెప్పవలసివచ్చును. అది సంప్రదాయము కాదు. కావునఁ బూర్వార్థమువలె నుత్తరార్ధమును రెండేసివృత్తములతో నుండవలయు నని భావము. సంస్కృతాంధ్రచ్ఛందోలక్షణకర్త లందఱు నేకరీతిగా నిట్లే చెప్పిరి. చూడుఁడు:

"ప్రథమాంఘ్రిసమోయస్య తృతీయశ్చరణోభవేత్, ద్వితీయస్తుర్యవద్వృత్తం తదర్ధసమముచ్యతే" వృ. ర. "భవత్యర్ధసమం పునః, ఆదిస్తృతీయవద్యస్య పాదస్తుర్యో ద్వితీయవత్" ఛందోమంజరి.

"ధర నొకటియు మూఁడును నగు
చరణంబులు మఱి ద్వితీయ చాతుర్థికవి
స్ఫురితాంఘ్రులుఁ దమలోనను
సరియగు నర్ధసమవృత్తచయమునఁ గృష్ణా!"

"ఛందో ౨ ఆ. ౧౧౭ ప

ఒకటి రెండు పాదము లొకవృత్తమునను 3, ౪ పాదములు వేఱొకవృత్తమునను నుండుపద్యము లర్ధసమములు కావు; విషమవృత్తములే యగును. ఇట్లుండ శ్రీదొరస్వామిశర్మగారు అంగజాస్త్ర మనువృత్తమును స్వస్థానార్ధసమవృత్తము కావలసియుండఁగా విషమవృత్త మెట్లగు నని యాక్షేపించుట సరికాదు.

అనంతునియర్ధసమవృత్తలక్షణముం జూచిన సందేహము నివృత్త మగును. చూ. ౨ ఆ. ౧౧౭ ప.

అర్ధసమవృత్తములును స్వస్థానార్ధసమములు పరస్థానార్ధసమములు నని ద్వివిధములు.

విషమవృత్తములు పలువిధములుగా నుండవచ్చును. పూర్వోక్తములగు సమార్ధసమవృత్తములకంటె భిన్నము లగువృత్తములన్నియు విషమములే యగునుగదా. అవి యీ క్రిందివిధముగా నాల్గు తీరుల విభజింపవచ్చును.

(i) ఒకపాద మొకతీరునను మూఁడుపాదము లొకతీరునను నున్నవి. 123, 124, 125, 126 ప.

(ii) ౧, ౨ పాదము లొకతీరునను 3, ౪ పాదము లొకతీరునను నుండునవి. 122 ప.

(iii) నాల్గుపాదములును మూఁడువృత్తములలో నుండునవి.

(iv) నాల్గుపాదములును నాల్గువృత్తములలో నుండునవి. 127 ప.

ఇవి మరల స్వస్థానవిషమములు పరస్థానవిషమములు నని ద్వివిధములు. ఒక్కఛందమునం బుట్టిన భిన్నవృత్తము లయినచో స్వస్థానవిషమము లనియు భిన్నఛందములం బుట్టిన విషమవృత్తము లయినఁ బరస్థానవిషమవృత్తములనియుఁ జెప్పఁబడును. అందు ii లో

బరస్థానము లు దాహరింపఁబడ లేదు. iii లో నేయొక్కటియు నుదాహరింపఁబడ లేదు. పూర్వముద్రితమున సర్వపరస్థానవిషమవృత్త మన్న పేరుతో నిట్టిది యుదాహృత మయ్యెను. (చూ. ౨ ఆ. ౧౨౭ ప. వీణారచనము) ఆ ముద్రణమున నా పద్యమున 3, ౪ పాదములు ఏకచ్ఛందోజాతములు.

"చాణూరహరా తజనభసల్ ప్రకటయతిక్
వేణుధర భనభస విశ్రుత మగుచుక్."

అని పూర్వముద్రణము.

అపు డిది సర్వపరస్థానము కాదు. సామాన్యపరస్థానవిషమవృత్తమే యగును. లేదా యిందలిసర్వశబ్దమును విషమశబ్దమునకుఁ బూర్వమునఁ గూర్చి పరస్థానసర్వవిషమవృత్త మనవచ్చును. సర్వవిషమ మనఁగా నన్నిపాదములును భిన్నవృత్తములు గలదని భావము. ఇందు నాల్గుపాదములును నాల్గువృత్తములే కాని ఛందములు మాత్రము మూఁడే. కాని యుద్దేశానుసారముగా (౧౧౯ ప.) నిది సర్వపరస్థాన మగుట యుచితము. వ్రాఁతప్రతియందు నట్లే యున్నది. అనఁగా నాల్గవపాదము ౧౬వ ఛందమున నున్నది. అప్పకవీయము నను నీవీణారచన మట్లే యున్నది. కనుకనే యాపాఠ మీముద్రణమునం గ్రహించితిని.

iv ఈభేదమున కిందలి ౧౨౭వ పద్య ముదాహరణము. ఇదియు సర్వస్వస్థానగతము సర్వపరస్థానగతము నని రెండువిధములుగా నుండవచ్చును. కాని యిందు సర్వపరస్థానవిషమవృత్తము మాత్రమే యుదాహరింపఁబడెను.

ఇట్లు విషమవృత్తములు పలురీతుల నుండవచ్చును. ఇట్లుండుటకు యోగ్యత యున్నను గొన్నిరకములనుమాత్రమే యీతఁ డుదాహరించెను కాని యాతనిలక్షణమునఁ బరస్థానవిషమవృత్తములకు

సూచించునపుడు ఒకపాద మొకవిధముగను 3 పాదము లొకవిధము గను నున్నచో నట్టి దగునని చెప్పెను. ఇందు ఒకపద్యమున మూఁడు ఛందములుగల వృత్తము సంగ్రహింపఁబడదు. అట్టిది (ఈముద్రణము నందలిపాఠము నుబట్టి) యుదాహరింపఁబడలేదు కనుక దానిని సంగ్రహింపకున్నను నంగజాస్త్రమువంటివియు (పూర్వార్ధమొకఛందమునను నుత్తరార్థ మొకఛందమునను నుండునవి) పరస్థానవిషమము లగుట కీలక్షణము సంగ్రాహ్యకము కాదు. అందువలన నిందలి యీలక్షణ సీసము (౨ ఆ. ౧౧౯ ప.) దిక్ప్రదర్శక మని తలంపవలయును. స్వస్థాన పరస్థానసాధారణముగాఁ జెప్పినవిషమవృత్తలక్షణముమాత్రము "విష మవృత్తంబులు వెలయు పాదంబుల గణములు వేర్వేఱుగా నొనర్ప" నని యున్నది.

ఈవిషమవృత్తము లలక్షణము సంస్కృతమునను నిట్లేయున్నది. "యస్యపాదచతుష్కేఽపి లక్ష్మభిన్నం పరస్పరం, తదాహు ర్విషమం వృత్తం ఛందశ్శాస్త్రవిశారదాః" వృత్త. ౫ ఆ. ౧౮. "భిన్నచిహ్న చతుష్పాదం విషమం పరికీర్తితమ్" ప్రా. పిం. సూ. ఈలక్షణమున కనుగుణముగనే వృత్తరత్నాకరాదులం దుదాహరణములు నీయఁ బడెను. అనఁగాఁ బరస్పరభిన్నచతుష్పదములే యుదాహృతములు. వానిలక్షణము లచ్చట సరిపడినవి. తెనుఁగున నటులఁగాక వివిధవిష మము లుదాహరింపఁబడినవి. ఇవిమాత్రము తెనుఁగున వ్యవహారమున నుండుటచేఁ జూపఁబడియుండును. మిగిలినవిధము లుండుటకు వీలు న్నను వాడుకలోఁ గానరానందునఁ జూపలేదు.

పరస్థానవృత్తములలో నల్పాక్షరచ్ఛందము పూర్వపాదము లందును నధికాక్షరచ్ఛంద మనంతరపాదములందును నుండుట యనం తనినియమముగాఁ దోఁచుచున్నది. ఈతనియుదాహరణము లన్నియు నట్లే యున్నవి, వృత్తరత్నాకరాదులందును నట్లే యున్నవి. అనం

తునిలక్షణమునఁగూడ నీసూచన యున్నది. "అట పరస్థానార్ధసమము నాఁగ నెలమిఁ దరువాతిఛందంబు గలయఁ గృష్ణ!"

౨ ఆ. ౧౧౮ ప.

ఒకపాద మొకఛందమునను మూఁడుపాదములు ఒకఛందమునను నున్నవిషమవృత్తములందుఁ బ్రథమపాదముకంటెఁ దరువాతిపాదమున నధికాక్షరచ్ఛంద ముండవలయును. సర్వవిషమాదులందును నట్లే యుండవలయును.

విషమవృత్తములలోఁ బలురకము లుండుట కవకాశ మున్నను నితఁడు నాలుగురకములనుమాత్రమే యుదాహరించెను.

## ఉద్ధరమాలావృత్తములు

౨౬ కంటె నెక్కువయక్షరములు పాదమునం గలవృత్తము లుద్ధరమాలావృత్తము లనఁబడును. లయగ్రాహిమున్నగునవి యట్టివే. వానిమీఁద ఈవృత్తము ఇన్నిమాత్రలుగలది యని వ్రాయఁబడి యున్నది. అది యనావశ్యకము. ఇవి కేవలమాత్రాపరిమితములు గావు, అక్షరగణనిబద్ధములే. కనుకనే యిన్నియక్షరములుగలది యని కూడ మీఁద వ్రాయఁబడెను. ఇవియును సమవృత్తభేదములే. సమవృత్తములమాత్రాసంఖ్యను సూచింపనట్లే వీనికిని మాత్రాసంఖ్యను జెప్పనక్కఱలేదు. లయగ్రాహిమున్నగువానియందు మాత్రాపరిమితినిగూడఁ జూపుట స్వరూపమాత్రకథనమే కాని లక్షణము కాదు. అనఁగా నేదోయొకవిధముగా నన్నిమాత్ర లుండినం జాలదు. ఆగణములతీరుననే మాత్రాపరిమితి యుండవలెను. ఈమాత్రాపరిమితి లయగ్రాహి, లయవిభాతి, లయహారుల మూఁడింటమాత్రమే చూపఁబడెను. ఇవిమూఁడును వర్ణసంఖ్యాభేద మున్నను సమానమాత్రాకము లని చెప్పుటకుమాత్రమే మాత్రాసంఖ్య చెప్పఁబడియెను. అందుచేతనే త్రిభంగి యనువృత్తమునకు మాత్రాపరిమితి పూర్వముద్రణ

మునఁ జూపఁబడలేదు. అదియే యుచితముగాఁ దోఁచెడి. అం దధ స్సూచికలోఁ ద్రిభంగికిని అక్షరమాత్రాసంఖ్యం దెల్పనగు నని సూచింపఁబడెఁ గాని యది యనావశ్యకము.

## త్రి భం గి

ఇది సంస్కృతమునను గలదు. కాని దానికిని దీనికిని గణ భేదము గలదు. అందు పాదమునకు 8 సగణము లుండును. అందును ద్రిభంగి యను పేరునకుఁ దగినట్లు ప్రతిపాదమునను మూఁడు పదాంత ప్రాసము లుండును. రెండేసిపాదములకుఁ బాదాంత్యప్రాస ముండుట యచట నధికము. పాదమధ్యమునను్న ప్రాసమునకును అనఁగా నాది ప్రాసమునకును, బాదాంత్యప్రాసమునకును సంబంధము లేదు. అనఁగా నేకాక్షరములు కావు. సంస్కృతమునఁ ద్రిభంగి యిట్లున్నది. చూడుఁడు :

> గిరిరాజసువాసిని శైలనివాసిని శంభువిలాసిని దేహి వరమ్
> భవసాగరతారిణి దుర్గతిహారిణి మంగళకారిణి మయి సుచిరమ్.
>
> వాణీభూషణము.

కవిజనాశ్రయమున సాహిత్యపరిషన్ముద్రితమునఁదప్ప మిగిలిన తెనుఁగులక్షణములం దనఁగా వావిళ్ళవారి కవిజనాశ్రయమునను కావ్యాలంకారచూడామణిలక్షణసారసంగ్రహాప్పకవీయచ్ఛందోదర్ప ణములందంతటను నొక్కరీతినే త్రిభంగీలక్షణము కానవచ్చుచున్నది. అనఁగా 6 నగణములమీఁద ససభమసగ లుండునని చెప్పఁబడెను. ఛందోదర్పణమున నొకముద్రణమున 6 నగణములమీఁద ససనమసగ లుండునని యున్నది.

దీన యతి యుండదనియుఁ బ్రాసయతి యుండుననియుఁ గొందఱు చెప్పిరి. ఇం దామాట లేకున్నను నుదాహరణపద్య మట్లే యున్నది.

టీన మాత్రాసంఖ్య చూపుట యనావశ్యక మని వెనుక వ్రాసితిని.

## ద ం డ క ము లు

ఇవి బహువిధములు. అవిచ్ఛిన్నముగా దండసదృశ మగుటచే దీనిని దండక మందురు. ఇది 999 యక్షరములవఱకు నుండవచ్చు నఁట. వీనిభేదము లనేకము లున్నను ననంతామాత్యుఁ డొక్కభేద మునే చూపెను. సనహగణములతో నారంభించి తగణములతో గుర్వవసానముగా నడచినదండకమునుమాత్రమే యుదాహరించెను. కా. చూ. యందు నిట్లే చెప్పినను వృత్త్యనుప్రాసరీత్యలంకారశోభితము కావలయునని యున్నది. అప్పకవియు నట్టినియమముం జెప్పలేదు. దండకాదిని సనహాలు గాని తగణము గాని యుండవలయునని యనంతుఁడును పెద్దనయుఁ జెప్పఁగా నప్పకవి సనహతగణములలో నేదేని ముందుగాఁ బెట్టవచ్చునని చెప్పెను. లక్షణసారసంగ్రహమునఁ జాలదండకములను జూపెను.

ఇందు రెండవయాశ్వాసమున ౩౪, ౩౫, ౩౭, ౪౩, ౪౮, ౫౬, ౬౧, ౬౩, ౮౭, ౧౦౮, ౧౧౧ పద్యములలోఁ బాదాంతము లందు విసంధి కానవచ్చుచున్నది. ఇవి సామాన్యముగా ద్రుతద్విత్వ స్థలము లని సరిపెట్టుకొనుచుందురు. వ్యాఖ్యానమునఁ గొన్నిస్థలముల నట్లే భావింపవలసినదని సూచించితిని. అనఁగా "సూనుఁ+అనంత" మున్నగుచోట్ల "సూనున్ననంత" మున్నగుతీరున ద్రుతద్విత్వముతోఁ బఠింపవలయు ననుట. ఆంధ్రశబ్దచింతామణియందు "లుక్ సంశ్లేషౌ నాచి ద్రుతస్య" అని సంశ్లేషము నిషేధింపఁబడినను భారతమున "అన్నిష్టసఖి" "ఎన్నఁడున్నేని" మున్నగు ద్రుతద్విత్వములు కానవచ్చుటచేతను "నోఽపి ద్విత్వం క్వచి ద్దృష్టం పరప్రాణేవ సంగతేః" అని యథర్వణుఁడు వచించుటచేతను కాఁచిత్కముగా ద్రుతద్విత్వము

గ్రాహ్యమే యని యాంధ్రవైయాకరణుల యభిప్రాయము గలదు. "అనంతుఁడును నింక ననేకు లగులాక్షణికులును నీసంధిని దుస్సంధి యనుట యపరిశీలనమూలక" మని శ్రీ వ. సీ. శాస్త్రిగారు చెప్పిరి. (చూ. సం. స. ౩౧౫ పుట) సంశ్లేష మనఁగాఁ బూర్వాచ్చు నత్తి యుండుట యని మీఁదిసూత్రమున కర్థ మన్నను నిట విసంధి కుదు రదుకదా !

కాని యనంతామాత్యుఁడు "అతఁడు నతఁడు ననుచో నతఁడు న్నతఁడు నని యూఁదిపలికిన నతతము దుస్సంధియండ్రు" ఛ. ౧ ఆ. ౨౦ ప. అని యీసంధిని నిందించియుఁ దానే యాగ్రంథముననే పలు సార్లు అట్టిదుస్సంధిని ప్రయోగించునా ! ఇట్లు ప్రయోగించుటలో ననంతునియభిప్రాయ మేమయియుండునో యూహింపవలసియున్నది. ఇట్టిచోట్లఁ బాదాంతవాక్యాంతము లయినచో విసంధిదోషము కాదని సంప్రదాయము కలదుగదా ! "సర్వతీర్థాభిగమనంబు సర్వవేద సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు, ఎఱుఁగు మెల్లధర్మముల కెందుఁ బెద్దయండ్రు" భార. ఆది. ౪ ఆ. ౯౬ ప. ఇత్యాదుల నట్లే కదా సంధ్యభావము నిర్దోష మయ్యెను. ఇట్లే మీఁదిపద్యములం దును విసంధిదోషము కాదని యనంతునియాశయముగా నూహింప నగును. కాని మీఁదిపద్యములలోఁ బాదాంతమున వాక్యాంత మయ్యెనా యని ప్రశ్నింపవచ్చును. వాక్యాంత మనఁగా సమాపక క్రియాఘటిత వాక్యాంతమే కాక యవాంతర వాక్యాంతమునను బాదాంత మయినచో సంధ్యభావము దోషము కాదని యనంతుని యాశయముగా గ్రహింపవలయును. అనఁగా నసమాపకక్రియాఘటిత వాక్యాంతమునను బాదాంతమున విసంధిదోషము కాదని భావము. ఇందు ద్రుతద్విత్వములుగా భావింపవలసినస్థలము లన్నియుఁ బాదాది గతములే. ఇతనికి ద్రుతద్విత్వమే సమ్మత మన్నచోఁ బాదమధ్య

మున నెచ్చటనేని యట్టిది చూపవలయును. ఇతని గ్రంథములం దట్టివి యెచ్చటను గానరావు. కనుఁ బాదాంతమున సమాపకాసమాపకాన్య తరక్రియాఘటితవాక్యాంత మయినచో సంధ్యభావము దుష్టము కాకుండుటచే ననంతునిమతమునకు ఈప్రయోగములు విరుద్ధములు కావు.

మీఁదచూపినస్థలములలో ౩౮, ౬౨, ౧౦౮ పద్యములలో "వాపాదాన్తేత్వసౌ" అనురీతిని బాదాంతమునందలివర్ణము గురు వగుచున్నది. పాదాంతనకార మనంతరపాదాద్యచ్చుతోఁ గలిసియుచ్చరించినను సంయుక్తపరకము కాకపోయినను బాదాంత మగుటచేఁ బాదాంతాచ్చు గురువే యగుచున్నది. ఎట్లన "తిరంబుగా నద్రియతి న్నుతింప, నిరానుప్రాణేశు నుపేంద్రవజ్ర" అనిపలికినను "ప" కారముమీఁది అకారము గురువే యగును. ఇట్లే వనమయూర పద్మనాభవృత్తములందును బాదాంతలఘువు గురు వగుచున్నది. కావున నిట్టిచోట్ల ద్రుతద్విత్వశంకయే లేదు. ఇట్టి పాదాంతగురుత్వ ముపేంద్రవజ్రాదు లగు కొన్నివృత్తములందే సంభవించును. ఇది సార్వత్రికము కాదు. మిగిలినస్థలములలో నవాంతరవాక్యాంతము కాని పూర్ణవాక్యాంతము కాని యగుటచే సంధి చేయకుండుట దోషము కాకుండుటచే ద్రుతద్విత్వము చేయనక్కఱలేదు అని యనంతునియాశయముగా గ్రహింపవలయును.

## జాత్యుపజాతులు

కందాదులు జాతులు, సీసాదు లుపజాతులు ననంబడును. అప్పకవి నవవిధగీతములును సీసస్తకము నుపజాతు లని చెప్పెను. కాని యందు నవవిధగీతములలో గీత్యుద్గీత్యుపగీత్యార్యాగీతు లనం బడు నాల్గును నార్యావిశేషములే యగుటచే ... దములవలె జాతులే కావలయును. విషమగీతు లనంబడు సెత్తుగీతి ఏవడగీతి మేళవగీతులు

మూఁడును గూడఁ బ్రాసయుతములు కావున నుపజాతులలోఁ జేరఁ దగవు. వీనియందుఁ బ్రాసయతి యుండదు. ఉపజాతులందుఁ బ్రాస యతి యుండుననియు నప్పకవియే చెప్పెను. "ప్రాసములు నిల్ప నవ్వళ్లకై యొక్కచోన్" అప్ప. ౪ ఆ. ౨౬౨ ప. వీనియం దాది ప్రాసము నుండును. ఆదిప్రాస మున్నచోఁ బాదాదివర్ణ మన్నిపాదం బుల నొక్క రీతిగా గురువుగాని లఘువుగాని కావలయునుగదా ! అట్టి నియమ ముపజాతులం దుండదనియు నప్పకవి చెప్పెను. (చూ. అప్ప. ౪ ఆ. ౨౬౧, ౨౬౨ ప.) కావున నవవిధగీతములలో నాట వెలఁది తేటగీతులు రెండుమాత్రమే యుపజాతు లనందగును.

అప్పకవీయమున నార్యావిశేషము లగు గీత్యాదిచతుష్టయ మును దెనుఁగునకు సంబంధించిన గీతిపంచకములోఁ గలిపి పరిగణిం చుటయు నుచితముగా లేదు. ల. సా. సం. మునఁ దెలుఁగుగీతుల నయి దింటినే యొకగణముగాఁ జెప్పెనుగాని గీతిచతుష్టయమును వీనిలోఁ జేర్పలేదు. అదియే సమంజసము.

ఆర్యలయొక్కయు గీతులయొక్కయు లక్షణపద్యములను లక్ష్య పద్యములుగాఁగూడ నుండుట యుచితమని శ్రీ గి. సీతాపతిగారు సవ రించిరి. అందుఁ గొన్నిసవరణలు సరిపడనందున నేను మఱియొకరీతిని సవరించితిని. అవి యాపద్యవ్యాఖ్యానములఁ జూడనగును. కా. చూ. యందు "తెనుఁగునఁ జెప్పరం ద్రడు చతురులు కృతులన్" ౮ ఉ. అని చెప్పుటచే నార్యాదులు తెనుఁగున నుండవని భావించి యనంతుని యార్యలను కందములుగా దిద్దియుందురు. చిత్రకవిపెద్దనాదు లార్య లను రచించిరి. ఇది యనంతునియనుసరణమే.

వృత్తరత్నాకరముంబట్టి కందమునే యార్యాగీతి యనుటలో నున్నచిక్కులను 3 ఆ, 3 ప. వ్యాఖ్యానమునఁ జూడఁదగును. ఆర్యా గీతియే కంద మగునని కొందఱు చెప్పిరి. అది కొంత సరళము

ఆర్యాగీతియందు సరిపాదములయంతమున సగణమును నుండవచ్చు నన్నచో దోష మేమియును లేదు. అప్పుడు కందము లన్నియు నార్యాగీతులు కావచ్చును. పింగళచ్ఛందమున నార్యాగీతిలక్షణము సరిగా నున్నది. ఉదాహరణమున సరిపాదములయంతమున సగణగగములు రెండును గూర్పంబడెను. వృత్తరత్నాకరచ్ఛందోమంజర్యాదులంబట్టి యంతమున సగణ ముంకుట కవకాశము లేదుగాని పింగళచ్ఛందము స్పష్టముగా నెనిమిదిచతుర్మాత్రగణములు గలది యార్యాగీతి యని చెప్పెం గావున ననంతామాత్యుండును నట్లే చెప్పెను. వృత్తరత్నాకరాదులు పింగళచ్ఛందము ననుసరించియే చెప్పెదలంచి నను తాము చెప్పినలక్షణమునంగల దోషములను శంకించియుండరు. పింగళచ్ఛందమునుబట్టి కంద మార్యాగీతి యనుటలో నెట్టిచిక్కులును లేవని తెలియునది.

"కంద మరయ నార్యాగీతి..." 3 ఆ. 3 ప. అనుపద్యమును జూపి ఇం దనంతుం డార్య కాఅవస్థానమున నల ముండవలయు నన్నట్లు అర్థము చేసికొని జగణముకూడ నుండవచ్చునుగదా,! యనంతుం డిట్లుచెప్పుట సరికాదని వ్రాసి శ్రీదొరసామిశర్మగారు ఈయనంతుని వ్రాంతపొరపాటే యప్పకవిని తప్పుత్రోవకుం ద్రోసిన దని వారిఛందోరీతులలో వ్రాసియున్నారు.

కాని యనంతుం డిం దేమియుం దప్పు వ్రాయలేదు. కందము నకును ఆర్యకును మిగిలినదంతయు సమానమేయగుటచేం గందము కడగణంబు నపరషష్ఠంబు గురులఘులైన నార్య యగునని సరియగు లక్షణమును బూర్వార్థమునం జెప్పెను. దానింబట్టి కందమునకు వలెనే పూర్వార్థమున నార్యకు నాఅవగణము నల జగణములలో నొక్కటి యుంశవచ్చును. ఇందలియుత్తరార్థమున నార్యాపద్యయతి విషయమును వివరించుచున్నాండు. అంతియకాని యూఅవయెడ నల

ముండవలయునని చెప్పలేదు. ఆర్యకు ౫, ౬, ౭ స్థానములందు నలము లున్నచో యతిస్థానమున విశేషము గలదు. అదియెట్టిదో దీనియుత్తరార్ధమున వివరించెను. ఈపద్యమునర్థమును నావ్యాఖ్యానమునఁ జూడఁదగును. "నలఘులు ఆఱింటన్ గిరిశరస్థలులఁ ఉన్నన్" అని యన్వయము క్రమముగనే యున్నది. కావున ననంతుఁడు తప్పుచెప్ప లేదని తలంపవలెను.

"షష్ఠే ద్వితీయలాత్పరకే న్లే ముఖలాచ్చ స యతిపదనియమః
చరమేర్ధే పంచమకే తస్మాదిహ భవతిషష్ఠోలః"

అను వృత్తరత్నాకరశ్లోకమున నీయతిస్థానములు వివరింపఁబడినవి.

## గీతులు

ఇవి సమములు విషమములు నని ద్వివిధములు. ఈవిభాగము నకు నియామకము చెప్పఁబడలేదు. గీతులక్రమముమాత్రము సయుక్తికముగనే యున్నది. జాతులు, ఉపజాతులు ననెడిక్రమమునుసరించి కాఁబోలును ముందుగాఁ బ్రాసయుతగీతులును బిమ్మట నవి లేని గీతులును గ్రమముగాఁ జెప్పెను. సమగీతులలో రెండును పంచగణక ములే. అందుచే వానిపౌర్వాపర్యమున వినిగమకము లేదు.

పవడగీతికిని నాటవెలఁదికిని యతి గణభేదము లేదు.

పవడగీతియం దాదిప్రాస మధికము. మేలనగీతికి విషమసీసము కంటెఁ బాదాంతమున నొకగురువు తక్కువ. గీతులందును సీసము లందును నాదిప్రాసము లేనివి సమములు. అవి గలవి విషమము లనియు వ్యవహారము.

## సీసములు

సీసములు కథను నడిపించుటకు అధికముగాఁ బూర్వమున వాడఁబడి క్రమముగాఁ బ్రబంధయుగమున వర్ణనముల కుపయోగింపఁ

బడుచుండెను. సీసములు నాటకములందు విష్కంభాదులవలె సీరస భాగములుగనే యుండెడివి. క్రమముగాఁ గవులు సీసములకుఁ బ్రాధాన్యము నిచ్చిరి. అట్టిప్రాధాన్య మనంతాదులకాలముననే యారంభమై శ్రీనాథునిచే శోభిల్లెను. అనంతునికి సీసములందు మక్కువ యధికము. భోజరాజీయమునఁ జాలసీసములు గలవు. సీసభేదములను లాక్షణికు లందఱిలో నధికముల జేసినవాఁ డనంతుఁడే. ఆధునికుఁ డగు నప్పకవికూడ నన్ని భేదముల జూపలేదు. ఇతని సీసములు చాల రమణీయములుగా నుండును. ఇతఁడు సీసమును పసిఁడిగా మార్చినవాఁడే యనఁదగును.

కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులయం దాఱువిధములును అప్పకవీయమున నేడువిధములును సీసములు చెప్పఁబడినవి. అనంతుఁడు పదివిధముల జెప్పెను. చిత్రకవిపెద్దనయు ననంతుని ననుసరించెను. అప్పకవి తనపూర్వుఁడు పదివిధము లనిచెప్పి యుండ యతిప్రాసలలో నధిక భేదము జెప్పినవాఁడయ్యు నెందుచేతనో సీసభేదములను తగ్గించెను. కాని యీతఁ డీయేడువిధములు నన్నయ్య తనభారతమునఁ బ్రయోగించెనని చెప్పెను.

అనంతుఁడు మున్నుగా నొకసీసపద్యమునఁ దాఁ జెప్పఁబోవు సీసభేదములను నిర్దేశించెను. కాని యీతఁడు చూపినసీసములు నిర్దేశక్రమము ననుసరించి లేవు. సీసపద్యమున గణానుసారముగ వీలయిన క్రమమున నిర్దేశించియుండును. ఈసీసనిర్దేశపద్యము కవిజనాశ్రయమునను గానవచ్చుచున్నది. కాని యందు సీసభేదము లన్నియు నిర్దేశానుసారముగా నుదాహరింపఁబడనందున నీపద్యము అందలిది కాఁజాలదు. అనంతునిసీసభేదము లన్నియు నందు నిర్దేశింపఁబడుటచే నాపద్య మనంతునిదే యని నిశ్చయము.

సీసములు ముందుగా సమములు విషమములు నని రెండు విధములు. అందు సమములు తొమ్మిదివిధములు; విషమ మొక్క విధము. సమములలో యతిప్రాసములు యథేచ్ఛముగా సంకీర్ణము లయిన సామాన్యసీసము మొదటిది. తర్వాత నాదిప్రాసమునుబట్టి యేర్పడినసీసములు నాల్గు. తర్వాత వడినిబట్టి యేర్పడినసీసములు రెండు. ఇతఁడు ప్రాసములతర్వాత యతులం జెప్పెంగాన నిందును నాక్రమమే యవలంబించెను. ప్రాససంబంధులును యతిసంబంధులును పూర్తియయినపిమ్మటఁ బ్రాసయతిసంబంధిసీసముం గూర్చెను. సర్వ లఘుసీసవిషమసీసములు సీససామాన్యలక్షణమునకే గుఱి యగునవి కావు. అందుచే నవి తుదను జేర్పఁబడెను. ఇట్లు సీసభేదములక్రమము సయుక్తికముగా నున్నది.

ఈసీసములలో గీతమును రెండుపాదములుగా (అనఁగాఁ బూర్వార్ధ మొకపాదముగను నుత్తరార్ధ మొకపాదముగను) భావించి కొన్నినియమములం బాటింతురు. వడిసీసమునఁ బాదమున నాల్గు యతిస్థానములందు నొక్కయక్షరమే యతికి గ్రహింపఁబడును. అపుడు గీతమునను రెండేసిపాదములం దొకయతి గ్రహింపఁబడును. ప్రాస సీసమునను నట్లే. అనంతుఁడు చెప్పినసీసములు అసంభవములు కావు; రమణీయములును. అయినను నప్పకవి యేలనో యన్నింటిని గ్రహింప లేదు.

విషమసీసమున వృత్తములందువలె నాదిప్రాసమును యతియు నుండును. దీనియంతమున నాటవెలఁదియే యుండవలయును. తుద నొకగీత ముండవలయునని కొందఱు చెప్పినను నాగీతమున కాట వెలఁది యనుగీతభేదమే యర్థముకాని యన్యము కాదు. ప్రాచీన లక్షణగ్రంథములందన్నిట నుత్సాహాంతమున నాటవెలఁదియే యుదా హరింపఁబడెను. కాని నన్నయతిక్కనాదు లనేకు లుత్సాహాంతమున

నిట్టిగీతమును జేర్పలేదు. వందలకొలఁది నుత్సాహములు గీతిరహిత ములుగాఁ బ్రయుక్తములు. వారు ప్రయోగించినవానిని ఉత్సాహ నామకసమవృత్త మనుటకును వీలుకాదు. అవి మాత్రాలక్షణఘటి తములుగనే యున్నవి. కాని యక్షరగణబద్ధములుగా లేవు. ఇది విషమసీసేతరమగు నుత్సాహనామకజాతిభేద మని యంగీకరింపవల యును. కనకనే కా. చూ. యందు స్పష్టముగా నుత్సాహవృత్త మని యొకదానిం జెప్పెను. (అది వృత్తమనుట విచార్యము) అప్ప కవియు నుత్సాహ మనునొకదానిని జాతులమధ్యం గూర్చెను. దానిని జాతి యనవలసియుండ "నుత్సాహవృత్త మనఁగఁ గృతులఁ జాగుచుండు సత్కవి......" అప్ప. ౪ ఆ. ౨౭౨ ప. అని కా. చూ. యందువలెనే వృత్తమనియే వ్యవహరించెను. అట్టివే యీానన్న యాదుల యుత్సాహములు. జాతిలక్షణఘటిత మయినను దీనిని వృత్త మనుటచే జాతులంగూడ వృత్త మనుట యరుదుగానున్నదని తెలియఁబడుచున్నది. అందుచేతనే కాఁబోలు నార్యలను ఒక్కొక యపు డార్యావృత్తము లనియుఁ గొందఱు వ్యవహరింతురు. దీనికిని విషమసీసమునకును నంతమున నాటవెలఁది లేకుండుటయు నుండు టయుమాత్రమే భేదము. ఉత్సాహ మనుదాని నంగీకరించినపిమ్మట విషమసీసమువలనఁ బ్రయోజనము లేదు. అయినను బూర్వులనియ మమునుబట్టి విషమసీసము కాక యుత్సాహనామకజాతి నొకదాని నంగీకరింపవలసివచ్చినది. అనంతుఁడు కేవలోత్సాహమునకే లక్షణ ముం జెప్పి దానివెనుక నాటవెలఁదిని జేర్చినచో విషమసీస మగునని చెప్పెను.

అవకలి యనఁగాఁ బ్రాసయతి యనియు నక్కలి యనఁగా నర్ధ భాగ మనియు నీసందర్భమునుబట్టి తెలిసికొననగును.

1. సమసీసము :— ప్రతి ప్రాసములు యథేష్టముగ సంకీర్ణము లయ్యె

యుండుండును. 9 విధములును సమసీసములే యయినను నిది కేవలసమసీస మగుటచే నీవ్యవహారము వచ్చెను. ఇది సామాన్యసమసీస మని తాత్పర్యము.

2. ప్రాససీసము :— ఆఱుపాదములకు నాదిప్రాస ముండును. పాదమంతట నొక్కజాతియతి యుండును. గీతము రెండుపాదములుగా నూహ్యము. సమప్రాససీస మన్నను నిదియే. 9 సీసములకును సమశబ్దము చేర్పవచ్చునుగదా ! ప్రాసయతి వేయరాదు.

3. వృత్తప్రాససీసము :— నాల్గుపాదములకుమాత్రమే ప్రాససీసలక్షణము లుండును. గీతమున నట్టినియమ ముండరాదు.

4. సర్వతఃప్రాససీసము:—పాదపూర్వోత్తరఖండములందును గీతపాదములు నాల్గింటను 24 స్థానములందును నొకేయక్షరమును ప్రాసముఁ గూర్పవలయును. యతి వేఱుగా నక్కఱలేదు.

5. అక్కిలిప్రాససీసము :— పాదపూర్వోత్తరఖండముల యాదిభాగమునమాత్రమే ప్రాస ముండును. ఖండద్వయమునందును ద్వితీయభాగమున యతియే యుండును. కనుకనే గీతపద్యమునను పాదాదిని ప్రాస ముండి యంతమున యతియే యుండును. అనఁగా 12 స్థానములఁ బ్రాస ముండును. అక్కిలి యనఁగా నర్ధభాగము. 24 స్థానములలో 12 చోట్ల నొక్కయక్షరము ప్రాస ముండునుగావున నక్కిలిప్రాస మయ్యెను.

6. వడిసీసము :— ఇందు పాదమంతట నొక్కయక్షరమునకుఁ జెందిన యతియే యుండును. గీతమం దర్ధమర్ధములకు యతి.

7. అక్కిలివడిసీసము :— పాదపూర్వఖండములం దొకయక్షరము యతియు నుత్తరఖండములందు వేఱొకయతియు నుండును. గీతమున నేపాదమునకాపాదమునసే యతి. అర్ధఖండములకు వేర్వేఱుయతులు కనుక నక్కిలివడిసీస మయ్యెను.

8. అవకలిప్రాససీసము :— అవకలిప్రాస మనఁగాఁ బ్రాసయతి యని యర్థము. పాదఖండములందు వేర్వేఱు ప్రాసయతు లుండును. గీతపాదములందును వేర్వేఱు ప్రాసయతులే యుండును.

9. విషమసీసము :— ఒక్కొకపాదమున నేఁడుసూర్యగణములును నొక గురువు నుండును. పద్యాంతమున నాటవెలఁది యుండును. ఇందు వృత్తమునకువలె యతియు నాదిప్రాసము నుండును.

10. సర్వలఘుసీసము:—సీసగీతములందంతట గురువు లుండక లఘువులే యుండును. అయి దేసిలఘువులగణములు ఆఱును 3 లఘువుల గణములు రెండును బాదమున కుండును. దీనియందు సామాన్యసీసలక్షణము పట్టదు.

## త రు వో జ

ఇందు "ముగురుజిష్ణులు......యొగినుండ గిరియతి" అని వావిళ్ళవారి ద్వితీయముద్రణపాఠము. అందు "గిరి" అనుదానికి దశ నామము లుండుటచేఁ బది యని యర్థ మని శ్రీ ని. వెంకటరావు గారు చెప్పిరి. కాని గిరిశబ్దమున కాయర్థ మప్రసిద్ధము. ఛందస్సు లందుఁ గాని జ్యౌతిషమునఁ గాని గిరిశబ్దమును బదిసంఖ్య కుపయో గింపరు. అనంతుఁడును మఱియెచ్చటను అట్టియర్థమునఁ బ్రయోగింప లేదు. సరికదా "ఏఁడు" అనునర్థమునసే యుపయోగించెను. చూ.

'విభవ మొప్పు గిరివిశ్రమంబులన్" ౨ ఆ. ౫౨ ప.

"యతి బాగా గిరిసంఖ్యన్" ౨ ఆ. ౫౬ ప.

అనంతుఁడు సంఖ్యాసంకేతములను జెప్పునపుడును అట్లే చెప్పెను. "శరరుచి గిరి గజ రుద్రాదిసంజ్ఞ" ౧ ఆ. ౧౨౭ ప. ఇచట రుచిగజములమధ్యనున్న గిరిశబ్దమునకు 7 అని సేకదా యర్థము. అంతియు కాక పది యని యర్థము చెప్పినను ఇందు యతిస్థానము సరి

పడదు. ఇందు యతిస్థానము పది కాదుగదా. కావున శ్రీ వడ్లమూడివారు చూపినదన్న "కరయతి" అనుపాఠమే యుచిత మని గ్రహించితిని.

## అక్కరలు

ఇవి యయిదువిధములును వరుసగా గణసంఖ్యనుబట్టి యమర్చబడినవి. అనఁగా ౭, ౬, ౫, ౪, ౩ గణములుగలవి వరుసగా నున్నవి. వీనిలో నెక్కువగణములుగలది కావున మహాక్కర యయ్యెను. అన్నింటిలోఁ దక్కువగణములుగలది యల్పాక్కర. పాదమధ్యమున కనఁగా నాలుగణములలో మూఁడుగణములకు యతి కావున మధ్యాక్కర యనవచ్చును. కాని నన్నయమాత్రము అయిదవగణమునాదిని యతి వేసెను. గణమధ్యమున యతిగలది కావున నంతరాక్కర యయ్యెను. మిగిలినయక్కరల నన్నింట గణాదినేకదా యతి యుండును. అల్పాక్షరములు కాని యధికాక్షరములు కాని కాక యుచిత సంఖ్యగల యక్షరములతో మధురముగా నుండుటచే మధురాక్కర యయ్యెను అని వీనినామములకు యుక్తి యున్నదేమో యని తోఁచుచున్నది.

కన్నడమున నున్నయక్కరలకును వీనికిని గొంతసాదృశ్యమున్నదని శ్రీ గి. సీతాపతిగారు నిరూపించియున్నారు. మధ్యాక్కర కనంతుఁడేకాక తెనుఁగులాక్షణికు లందఱును జతుర్థగణాదినే యతిని శాసించిరి. ప్రాచీనకవుల ప్రయోగములు నట్లే యున్నవి. నన్నయమాత్ర మయిదవగణము మొదట యతి వేసెను. తత్పూర్వశాసనములందు నట్లే యున్నదఁట. కాలక్రమమున రమ్యతకై కవులు యతిస్థానమును మార్చియుందురు.

ఇవి కేవలదేశీయచ్ఛందమునకు సంబంధించిన పద్యములు. మధ్యాక్కరందప్ప మిగిలినయక్కరలందు చంద్రగణము లుండుట

విశేషము. వీనియందును షట్పదయందునుఁ దప్ప మఱి యేపద్యమునను జంద్రగణములు కానరావు.

అక్కర యను నీ తెనుఁగుపదమునకు మహామధ్యమధురాది శుద్ధసంస్కృతపదములతో సమాస మగుట వ్యాకరణవిరుద్ధము. కన్నడమున వీని పేర్లు పూర్తిగాఁ గన్నడపదములే యగుటచే నిట్టివిరోధము లేదు. ప్రాణగొడ్డమువంటి యనింద్యగ్రామ్యములుగా భావింపవలయునేమో ! కా. చూ. యం దక్కరల నన్నింటిని నక్షరశబ్దముతో డనే వ్యవహరించెను. అంతియకాక "మహాక్షరము" ఇత్యాదిగా నపుంసకసమముగనే వ్యవహృతము. ఇందలివ్యవహారమే యుచితము. కన్నడసంప్రదాయమునుబట్టి యక్కరశబ్దము ప్రవేశించి సంస్కృత శబ్దములతోఁ గలిసిపోయియుండును.

## అయిదువిధములగు నక్కరల సంగ్రహసూచన

1. మహాక్కర :- ౧ సూ+౫ ఇం+౧ చం=౭ గణములు. అయిదవగణము మొదట యతి. ఇందు రెండు నాల్గుగణములు సూర్యగణములయిన నుండవచ్చును.
2. మధ్యాక్కర :- ౨ ఇం+౧ సూ+౨ ఇం+౧ సూ=౬. చతుర్థగణాది యతి. నన్నయమాత్రము పంచమగణాదియతిని గూర్చెను.
3. మధురాక్కర :- ౧ సూ+3 ఇం+౧ చం=౫. చతుర్థగణాది యతి.
4. అంతరాక్కర :- ౧ సూ+౨ ఇంద్ర+౧ చం=౪. (ఏకోనత్రిగణాక్షర యతి.)
5. అల్పాక్కర :- ౨ ఇం+౧ చం=3. మూఁడవగణము మొదట యతి.

## 71

## విశాళ మను చౌపద

పూర్వముద్రణమున నిది సరిగా లేదు. మూఁడవపాదమున గణములును సరిపడలేదు. అందుచే "తర్కింపఁగను విశాళము నందు" అని పూర్వముద్రితమున నున్నదానిని "తర్కము గొనఁగ విశాళము నొందు" అని సరిచేసితిని. ఇట వావిళ్ళవారి ప్రథమముద్రణపాఠమున "విశాళమునందు" అని యున్నదఁట. అదియే బాగుగానున్నట్లు తోఁచుచున్నది. "విశాళమునందు" అనఁగా "విశాళమునందు" అనియె యర్థ మనియు అందు నకు "అందు" కొందునకు "కొందు" విందునకు "విందు" అనియు రూపాంతరము లుండును గావున నిది యట్టిరూపాంతరమే యనియు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు చెప్పిరి. కాని యవియన్నియుఁ గృతకములే. 'విశాళమునందు' అని యుండఁగా నప్పకవి దడప్రాసమును నిందించుటచేత నది సరికాదని యెవరో "విశాళమునందు" అని దిద్దియుందురు. 'విశాళమునందు' అనుటకంటె "విశాళము నొందు" అనుట కొంత నయమని యట్లు సరిచేసితిని. వావిళ్ళవారిప్రథమముద్రణపాఠమగు "విశాళమునందు" అనునది యనంతునికి సమ్మతమగు పాఠమేయగును. దడప్రాస మనంతునికి సమ్మతమేయగుటచే నిం దంత్యప్రాసము దడలకుఁ గూర్చియుండును. భోజరాజీయమునందును దడప్రాసము గలదు.

... ... ... ఎప్పుడున్

విందును మున్ను నాకు నిదె నేఁడు నిదర్శన మయ్యె నన్ను నీ

తండు గృతార్థుఁ జేయఁడె ముదంబున మత్పురి కేఁగుదెంచినన్.

౭ ఆ. ౯౬ ప.

ఇందు 'విందును' అని ముద్రాపకులు చేసినసవరణ యని తలంపనగును.

విందుము బొంకెడుపురుషుని

బందాలుం దనఁగ నీవు క్షతకులుఁడవై.

భోజ. ౭ ఆ. ౧౬౨ ప.

ఇందును 'విందును' అని ముద్రాపకులు గావించినమార్పె కాని యన్యము కాదు.

"కడుకొని వేడిబాష్పములు గ్రమ్మఁ బయింబడి పర్వ భీతిమై
నడరుచు విన్ననైనహృదయంబునఁ బొల్పగుహారయష్టి ప
య్యెద దడియంగఁ గానఁబడి యుచితనిర్మలరత్నభూషలన్."

భాస్కరరామాయణము.

ఇందలి దడప్రాసమును మార్పఁజాలక యప్పకవి యప్రశస్తప్రాస మని నిరసించినను "నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథు" అని భాస్కరునియెడలఁ బూజ్యభావము గలయనంతుఁడు దడప్రాసమును నిరసింపఁడుగదా! కవిసార్వభౌముఁడును వీథినాటకమున "కందుకకేళి సల్పెడుప్రకారమునం బురుషాయితక్రియా, తాండవకేళి" యని దడప్రాసమును వేసెను. అనంతుఁడు అభేదప్రాసమును జెప్పియున్నను నం దభిన్నాక్షరముల నన్నింటిని జూపక దిక్ప్రదర్శనముగా వబలనుమాత్రమే సూచించుటచే దడల కభేదప్రాసము నుదాహరింపలేదు. ప్రాసమునం దేకాక యతియందును దడల మైత్రి యనంతున కిష్ట మన్నసూచనలు గలవు.

## ర గ డ లు

ఇవి తొమ్మిదివిధములు. అందు హయప్రచారపాదమును రెట్టించినఁ దురగవల్గన మగును. దానిని రెట్టించిన విజయమంగళ మగును. ఇవి సూర్యగణములతో ననఁగాఁ ద్రిమాత్రగణములతో నిర్మితములు. ఇవిమూఁడును నశ్వవిశేషనామములతో నొప్పుచున్నవి. ఇఁక ద్విరదగతి రెట్టించిన జయభద్ర మగును. ఇవి పంచమాత్రగణబద్ధములు. ఇవి రెండు గజవిశేషనామములతో నున్నవి. మధురగతిని రెట్టించిన హరిగతి యగును. ఇవి చతుర్మాత్రగణనిర్మితములు. ఇందు హరిగతి సింహనామకము కావచ్చును. మధుర

శబ్దార్థమేమో. హరిణగతిని రెట్టించిన వృషభగతి యగును. ఇవి సప్త మాత్రగణబద్ధములు. ఇవి యేకజాతీయజంతునామములు కావు. మధురగతితప్ప మిగిలినరగడ లన్నియు మృగవిశేషనామములతో నున్నవి. ఈపద్యములు తాళలయప్రధానములు కావునఁ దత్తన్మృగ గమనతుల్యగమనకము లయియుండును. అక్షరలు గణసంఖ్యనుబట్టి యేడుగణములనుండి క్రమముగా మూఁడుగణములయక్షరలవఱకును నవరోహణక్రమమునఁ గూర్పఁబడినవికదా. అట్లే యీరగడలును మాత్రాపరిమితిలో నారోహణక్రమమున నున్నవి. కాని త్రిమాత్ర గణబద్ధములయనంతరమునఁ జతుర్మాత్రగణబద్ధము లుండక పంచ మాత్రగణబద్ధము లున్నవి. అనఁగా ద్విరదగతి జయభద్రములకంటెఁ బూర్వము మధురగతి హరిగతు లుండినచోఁ గ్రమము సరిగా నుండును. త్రిచతుష్పంచసప్తమాత్రకగణబద్ధములు వరుసగా నుండును. గణములసంఖ్యలో నాల్గురకములును నాల్గేసిగణములు గలవియే. అవి యెన్మిదేసిగణములు గలవియై మఱి నాల్గును ౧౬ గణములుకలది యొక్కటియు నయియున్నవి. వావిళ్ళవారి తృతీయ ముద్రణమున హరిణగతి ద్విరదగతికిఁదర్వాత నున్నది. అది యట్లుం డుట సరికాదు. హరిణగతి ద్విరదగతికిఁ బూర్వమున నుండఁదగు నని యీముద్రణమున నట్లు సరిచేసితిని. ఇతరచ్ఛందోగ్రంథములందును నట్టిక్రమమే కలదు.

ఈరగడలకు రెండేసిపాదముల కాద్యంతప్రాసము లుండును. కావున నివియు ద్విపదకపద్యవిశేషములే యనఁదగును. ఇవియుఁ జతుష్పాదములే యనుటలో దృఢమగుయుక్తి కానరాదు. వీనినామ ధేయములు చతుష్పాజ్జంతునామధేయము లగుటచే నివి చతుష్పాత్తు లనుట యుక్తియుక్తము కాదుగదా!

ఇవి యెన్నిపాదములు గలవియో యనంతుఁడు వివరింపలేదు. ఎవ్వరును వివరించినట్లు తోఁచదు. అనంతుఁ డన్నిపద్యములను బూర్ణ

పద్యములతోడనే యుదాహరించుచున్నాఁడు. అట్లే యీరగడలను నాల్గేసిపాదములతో నుదాహరించుటచే నివియును జతుష్పదములే యనుటకు ద్విరదగతి యాఱుపాదములతో నుండుట విరోధించుచున్నది. ఒక్కపూర్ణపద్యములక్షణము చెప్పుటకు సరిపడనియప్పుడు మఱియొకపూర్ణపద్యమునే చెప్పును గాని పద్యార్ధభాగమును జెప్పి యుండఁడు. కనుకనే ద్విపదను నాల్గుపాదములతో నుదాహరించెను. ఆరీతింబట్టి ద్విరదగతిని మూఁడురగడలుగా నాఱుపాదములతోఁ జెప్పె ననవలయును. మిగిలినవి రెండేసిరగడ లనవలయును. హరిణగతిమాత్రము నాల్గురగడ లగును. దీనికి నాల్గేసిపాదముల కొక్కొక యక్షరము ప్రాసముగా నుండుటచేఁగాఁబోలు నిది నాల్గుపాదములు గలది యని సూచించునట్లు వావిళ్ళవారి మూఁడవముద్రణమున నచ్చుపడినది. అట్లు కాదు. అవి యెన్మిదిపాదములు. సంయుక్తయతికి ఉదాహరణముగాఁ జూపఁబడిన జయభద్రరగడలు రెండును (౧ ఆ. ౧౧౧, ౧౧౨ ప.) రెండేసిపాదములతోడనే యున్నవి. ఇతఁ డర్ధపద్యముల నుదాహరింపఁడుగదా! కావున రగడలు ద్విపదకములే యని చెప్పవచ్చును.

ఈ రగడలు కవిజనాశ్రయమున లేవు. కావ్యాలంకార చూడామణియందు రగడనామము కలదు గాని వానికిని వీనికిని సంబంధము లేదు. వీనిని విపులముగా వివరించినప్రసిద్ధులలో ననంతామాత్యుఁడే ప్రసిద్ధుఁడు.

హరిణగతిరగడ యుదాహరణమున ౪, ౫, ౬ పాదములు పూర్వముద్రణమున దోషయుక్తములుగా నున్నవి. ఆవిషయమును శ్రీ గౌరస్వామిశర్మగారు సూచించి పాఠాంతరము గలదేమో పరిశీలింపఁదగియున్న దని చెప్పిరి. నాకు దొరకినవ్రాఁతప్రతియందును సరియగుపాఠము లేదు. అందుచే యతిప్రాసాదులు సరిపడునట్లు దిద్ది యొకపాఠము నూహించి స్థాపితిని.

"భానుయుతనలభసగగంబుల
లోన నిరుదోలుననగంబుల
నిరవుగా నిరుమాఱు లఘువుల
నెల్లవారును నొగి గణింపఁగ"

అని పూర్వముద్రణము.

ఈపాఠమున 'ననగంబులు' అనునది కుదురదు. ఇందు నగ ముండదు. అందుచే 'గ' స్థానమున 'ల' ఉంచితిని. తరువాతిపాద మున యతి చెడుటచేతను నిరుమాఱులఘువు లనఁగా నర్థము కుదుర నందునను "నిరవుగాఁగను నేడులఘువుల" నని చూపితిని. తరువాతి పాదమున యతిప్రాసములును నంత్యప్రాసమునుగూడ లేనందునఁ జాల మార్పు గావింపవలసివచ్చెను. "గురువు మీఁదఁగ నొప్పునెల వుల" నని దిద్దితిని. అనంతామాత్యనిర్మితపాఠము లభించువఱకు నిట్లు పఠించిన యతిప్రాసాదిదోషములు లేకయుండు నని తలంచితిని. సహృదయులు మన్నింతురుగాత.

## ప్రస్తారాది ప్రత్యయములు

ప్రస్తారము ననేక లేకరీతిగనే చెప్పిరి. దానిని మఱియొక రీతింగూడఁ జూపవచ్చును. అనఁగా గురువులకుబదులుగా లఘువు లతో నారంభించియుఁ జూపవచ్చును.

| | | |
|---|---|---|
| ఉదా : | I I I | కాని దీనివలన వృత్తములక్రమము మాఱిపోవును. |
| | U I I | దానింబట్టి నష్టలబ్ధి యుద్దిష్టము॥అనువానిలోఁగొలఁది |
| | I U I | మార్పు గావింపవలయును. వీనిలక్షణములలో గురువు |
| | U U I | లనుచోట్ల లఘువు లనియు లఘువు లనుచోట్ల గురువు |
| | I I U | లనియు మార్పవలయును. వృత్తసంఖ్యాధ్వప్రక్రియ |
| | U I U | లలో మార్పేమియును లేదు. సప్తమప్రత్యయము |
| | I U U | నందును మార్పులేదు. |
| | U U U | |

నష్టలబ్ధి

సరు లర్ధించినచోటుల
నరయఁగ గురువులను వేసులం దొక టిడి చె
చ్చెర నర్ధించినచోట ల
ఘురేఖ నిడ నష్టలబ్ధి కుంజరవరదా.

ఉద్దిష్టము :

ఒక్కటి మొదలుగ నినుమ
డ్కైక్కినచో గురుయుతంబు లిన్నియుఁ బ్రోగై
యొక్కటి కలియఁగఁ దోఁచును
గ్రక్కున నుద్దిష్ట మిక్షుకార్ముకజనకా.

అని మార్పవలయును.

అప్పకవిమాత్రము ప్రస్తారమును మఱియొకరీతిం జెప్పెను. అది నేను 3 ఆ. ౬౦ పద్యవ్యాఖ్యానమునఁ జూపినప్రస్తారమునందలి రెండవపద్ధతియే. ఈ రెండుపద్ధతులు కాక పైనిచూపినతీరున లఘ్వాది ప్రస్తార మొకటి. అదియు నీరెండవమార్గమునఁ జూపవచ్చును. ఇట్లు ప్రస్తారమున నాల్గుమార్గములు సుగమములు.

## వృత్తసంఖ్య

పద్యపాదాక్షరములపై వరుసగా నొక్కటిమొదలు ద్విగుణాంకములు వేసి తుదిసంఖ్యను ద్విగుణితము చేయఁగా నాఛందమున నెన్నివృత్తములు పుట్టెనో తెలియునని యనంతుఁడు చెప్పెను. విన్న కోటపెద్దన పాదాక్షరములపై వరుసగా రెండుమొదలు ద్విగుణాంకములు వేయఁగాఁ దుదినిగలసంఖ్య వృత్తసంఖ్యఁ జెప్పునని చెప్పెను. ఇందును పెద్దభేదము లేదు. అంతమున ద్విగుణము చేయుటకుబదులుగా మొదటనే ద్విగుణ మగుట యింతెపలి భేదము.

వృత్తసంఖ్య తెలిసికొనుటకు మఱిరెండుమార్గములు గలవు.

ఉద్దిష్టమునందలి యంకములనన్నింటిని గూడి యింకొక్కటి కలిపి నను వృత్తసంఖ్య వచ్చును. ఉదా : ౪వ ఛందము నుద్దిష్టమున ౧,౨, ౪,౮ అని పాదాక్షరములపై వేసినయంకెలను నాల్గింటిని గూడిన ౧౫ అగును. ఇంకొక్కటి కలిపిన ౧౬ అగును. ఇదియే వృత్తసంఖ్య యని భావము. లగక్రియయందలి సర్వవృత్తములకూడికయు వృత్త సంఖ్య యగును.

## లగక్రియ

ఏదేనొకఛందమునఁ బుట్టినవృత్తములలో నెన్నెసిగురులఘు వులు గలవి యెన్నెన్నివృత్తములు పుట్టెనో తెలిసికొనుమార్గము లగక్రియ యనఁబడును. దీనికి శ్రీ. గి. సీతాపతిగారు చక్రమును జూపిరి.

| | |
|---|---|
| ౧+౧ | అయిదవఛందమునఁ గలయంకెలు |
| ౧+౨+౧ | క్రమముగా సర్వగురు, ఏకలఘు, ద్వి |
| ౧+3+3+౧ | లఘు, త్రిలఘు. చతుర్లఘు, పంచలఘు |
| ౧+౪+౬+౪+౧ | వృత్తములసంఖ్యను దెలియఁజేయును. |
| ౧+౫+౧౦+౧౦+౫+౧ | ఇట్లే యీచక్రము తత్పూర్వచ్ఛందము |

లందలి లగక్రియలను సూచించును. వారు చూపిన యీచక్రమును మేరుచక్ర మందురు. ఇది యప్పకవి చెప్పినచక్రపద్ధతి. చూ. అప్ప. ౪ ఆ. ౧౫౦ ప.

అనంతుని లగక్రియాని ర్మాణపద్ధతి దీనికి భిన్నముగా నున్నది.

ఒక్కటి గలిసిన ఛందపు
టక్కరములదొంతి యిడి యుపాంతములతుదఁ
జక్కఁగ నొకొక్కటిలోఁ
గ్రక్కన నొడఁగూర్ప నగు లగక్రియ కృష్ణా.

ఛం. ౩ ఆ. ౭౬ ప.

కావ్యాలంకారచూడామణియందును ఇట్టియర్థము గలపద్యమే గలదు.

ఎక్కువ యొకఁడుగ వృత్తపు
టక్కరములదొంతి పేర్చి యటమీఁదటికై
యొక్కొక్కఁడు విడిచి యెన్నిన
లెక్కలు గురు లఘు విమిశ్రలిఖితగణంబుల్.

కా. చూ. ౮ ఆ.

కవిజనాశ్రయమును నిట్లే చెప్పెను.

తరతరమ దొంతివృత్తా
క్షరమ్ము లేకాదికంబుగా నిల్పి యధో
క్షరము లుపర్యక్షరములు
పరువడి గూడుచు నుపాంతపర్యంతముగాన్.
కలయ నుపాంతాధోక్షర
ము లుపాంతములందు నిల్పి మునుకూడిన నొ
క్కలగ్రక్రియ.................... కవిజనాశ్రయము.

వీనినన్నింట ఛందస్సంఖ్య కొకటి యధికముగాఁ జేర్చి ముందుగా వ్రాసి యుపాంతమువఱకును మీఁదియంకెలను గూడి క్రింది యంకెలను నిర్మింపఁగా లగక్రియ యేర్పడు నని చెప్పఁబడినది. అంకెలు సమానములే యయినను నప్పకవిచెప్పిన మేరుచక్రమున నిట్టి క్రమము కాదు. ఆతనినిర్మాణమే భిన్నము. ఆతఁడు చూపిన చక్రము ననంతుఁడు చూపిన లగక్రియ కుదాహరణముగా నిచ్చుట సరికాదు. కావున ననంతునిపద్యార్థమునకుఁ దగినలగక్రియాచక్రము నావ్యాఖ్యానమునఁ జూడఁదగును. అట్టిచక్రమును పలురీతుల వ్రాయవచ్చు ననియు నచటఁ జూపితిని. వృత్తరత్నాకరమునను ననంతునిటువనే చక్రనిర్మాణము కథితము.

వర్ణాన్ వృత్తభవాన్ సైకానౌత్తరాధర్యతః స్థితాన్
ఏకాదిక్రమశశ్చైతా నుపర్యుపరినిక్షిపేత్
ఉపాంత్యతో నివర్తేత త్యజన్నైకైకమూర్ధ్వతః
ఉపర్యాద్యాద్గురోరేవ మేకద్వ్యాదిలగక్రియా.

వృత్త. ౬ అ. ౬, ౨.

కావున సరళహృదయులు తెలియఁగోరుదురు.

## సగణలగక్రియ

లగక్రియవలన నేర్పడినవృత్తము లాఛందమున నెన్నవ వృత్తము లగునో తెలియఁజేయురీతి సగణలగక్రియ యనఁబడును. ఇదియు నప్పకవివివరించినరీతినే గిడుగువారు తమ యుపోద్ఘాతమునం జూపిరి. అది యనంతుఁడుచెప్పినపద్ధతి కాదు. ఇతనితీరు 3 ఆ. ౨౨, ౨3, ౨౪ పద్యములవ్యాఖ్యానమున వివరించితిని. చూడఁదగును. గిడుగువారు వ్రాసినచక్రము నేను వ్రాసినచక్రముకంటె యధికభేదము గలది కాదు కాని దానియందంకెలను నింపుపద్ధతి మిక్కిలి విభిన్నము.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | | | | | | |
| 2 | 3 | 5 | 9 | 17 | | | | | |
| 4 | 7 | 13 | 25 | 6 | 11 | 21 | 10 | 19 | 18 |
| 8 | 15 | 29 | 14 | 27 | 26 | 12 | 23 | 22 | 20 |
| 16 | 31 | 30 | 28 | 24 | | | | | |
| 32 | | | | | | | | | |

ఇది గిడుగువారుచూపినచక్రము. ఇందు నిలువుగానున్న 6 గడులలోను 1 మొదలు ద్విగుణాంకములను వేసిరి. తరువాత అడ్డుగా ప్రతిసంఖ్యను ద్విగుణముచేసి యొందొకటి తగ్గించి వచ్చినసంఖ్య వేయుచు నింపిరి. అట్లునింపునపుడు వృత్తసంఖ్యాధికసంఖ్యను విడువవలయును.

ఇది వారుచూపిన పద్ధతిసంగ్రహము.

ఈచక్రమును నేను నిడుపుగా వేసితిని. అందలియంకలేఖన క్రమముమాత్రము చాల భిన్నమయినది. అనంతునిపద్యములయర్థము నేను చూపినపద్ధతికే సరిపడును. అది సహృదయులు పరిశీలింతురుగాక. నేను వ్రాసినతీ రాపద్యములం జూడఁదగును గావున నిట మరల వ్రాయలేదు.

## సప్తమ ప్రత్యయము

ఒకఛందమునందలి వృత్తములసంఖ్యను దెలిసికొనుమార్గము "వృత్తసంఖ్య" యని నిరూపితము. ఆ ఛందమునందలివృత్తసంఖ్యయే కాక తత్పూర్వచ్ఛందముల నన్నింటం బుట్టినవృత్తములసంఖ్యతోఁ గలిపిన వృత్తములసంఖ్యను దెలియఁజేయుపద్ధతి నీతఁడు సప్తమ ప్రత్యయ మనుపేరునఁ జెప్పెను. అదియును సుకరమే. మున్ను చెప్పిన వృత్తసంఖ్యను రెట్టించి యందు రెండుసంఖ్యను దీసివేయఁగా మిగిలిన సంఖ్య తత్పూర్వసర్వవృత్తసంఖ్య యగును. దానిని ౨౨వ పద్య వ్యాఖ్యానమున వివరించితిని. అప్పకవి యాతనిం జూచి దీనిని తానును వివరించెను. కాని యిది వృత్తసంఖ్యాప్రభేదమే యను భావమున వృత్తసంఖ్యాప్రత్యయమువనే వివరించెను.

# చతుర్థాశ్వాసము

ఛందశ్శాస్త్రమును బ్రతిపాదించుచున్న యీగ్రంథమున దోషాదికమును నిరూపించునీయాశ్వాస మెట్లుసంగతమగును ? ఛందోలంకారవ్యాకరణవిషయములను మూఁడింటిని జెప్పెడి కా. చూ. మణ్యాదులందు దోషాదినిరూపణము సంగతమయినను ఇం దసంగతమేయగు ననుశంక కల్గుచున్నది. అయినను దాను బ్రధానముగాఁ జెప్పఁదలంచిన ఛందశ్శాస్త్రమును నిరూపించి దీనివలెనే కవిత్వమున కుపయోగించు మఱికొన్ని ముఖ్యవిషయములు బ్రసంగవశమున నిందుఁ జెప్పుచున్నాఁడు. శాస్త్రారంభమునను గవిత్వోపయోగమునకే ఛందస్సు ముఖ్యమగుటచే దానిం జెప్పుచున్నానని కావ్యప్రసంగము కావించెను. చూ. "విద్యలలోపల నుత్తమ, విద్య కవిత్వంబు మఱి కవిత్వము ఛందో, వేద్యము గావునఁ జెప్పెను, హృద్యంబుగఁ గవిత చంద మేర్పడఁ గృష్ణా!" ౧ ఆ. ౫ ప.

అట్లే యీయాశ్వాసారంభమునను "జగమున దోషవివర్జిత, ముగఁ జెప్పఁగవలయుఁ గావ్యములు సత్కవులు, ట్లగుటకై దశదోషమ్ములు, తగఁ జెప్పెదఁ బూర్వకవిమతంబుగఁ గృష్ణా!" యని కావ్యప్రసంగముఁ గావించి కావ్యోపయోగియగుట నీయాశ్వాసము నారంభించినట్లు చెప్పెను. కావ్యోపయోగి శాస్త్రారంభప్రయత్నము ననే రసాభరణమును వ్రాయవలసివచ్చియుండును. ప్రతిప్రకరణారంభమునను నీతఁడు ముందుగా సంగతిని నిరూపించియే ప్రకృతము నారంభించును.

గ్రంథారంభమున సంగతిం జెప్పి ప్రకరణాంతర మారబ్ధమగుటచే నీయాశ్వాసారంభమున సంగతిని జెప్పినట్లే సంధిసమాసారంభము నందును సంగతిం జెప్పెను. (చూ. ౪ ఆ. ౩౭ ప.) గ్రంథాంతమున శబ్దసిద్ధిలో నిట్టి సంధిసమాసరూపంబు లిట్లు కొంత పలుకఁబడియె.

మఱియు నుచితరీతి నెఱుఁగంగవలయు ర, హాస్యలక్షణంబు లాంధ్ర కవులు" ర ఆ. ౧౨౨ ప. అని కవిత్వప్రసంగముతోడనే యుపసంహరించెను. ఈసంగతిప్రదర్శనపద్ధతి చూడఁగా నీతనిశాస్త్రీయమర్యాదానుసరణశ్రద్ధ ప్రకట మగుచున్నది.

పదగతములు వాక్యగతములు అర్థగతములు నని దోషములు త్రివిధములుగా సంస్కృతాలంకారికులు విభజించిరి. ప్రతాపరుద్రీయమున నవి ౫౯ అని చెప్పఁబడెను. కావ్యప్రకాశాదులం దవి యత్యంతవిపులముగా నిరూపితములు. వానిలోఁ గొన్ని ముఖ్యములగుదోషములుమాత్ర మిందు నిరూపించెను. అవి యపశబ్ద చ్ఛందోభంగయతిభంగవిసంధి పునరుక్త్యపక్రమ సంశయ వ్యర్థాపార్థవిరుద్ధములు. అం దపశబ్ద మనునది యేడువిధములుగాఁ జూపఁబడెను. కాని యివి కేవల పదదోషములు కాక కొన్ని పదదోషములును గొన్ని వాక్యదోషములు నగును. అపక్రమ చ్ఛందోభంగ యతిభంగ విసంధి పునరుక్తములు వాక్యగతములు. ఇందు ఛందోభంగమును వాక్యదోషముగనే పరిగణించిరి. పాదమునకంతకును సంబంధించిన దగుటచే వాక్యదోష మని భావించియుందురు. పునరుక్తము శబ్దగతము నర్థగతము కూడనగును. సంశయవ్యర్థాపార్థవిరుద్ధము లర్థదోషములు. కవిజనాశ్రయమునను నీపదదోషములే చెప్పఁబడినవి. కా. చూ. యందు మాత్రము ప్రతాపరుద్రీయాదిసంస్కృతగ్రంథములందువలెనే పదవాక్యార్థదోషములు 49 గా వివరింపఁబడెను. కాని కొన్నిదోషములు పదవాక్యములరెండింటను గొన్నిదోషములు శబ్దార్థములరెండింటను గొన్ని పదరచనాదులయందునుగూడ నుండును. అంతియకాక కొన్ని దోషము లొకప్పుడు దోషములే కావు. అట్టివాని ననిత్యదోషము లందురు. ఈవిభాగములను స్పృశింపక ముఖ్యములగు ౧౦ దోషము లనుమాత్రము కవిజనాశ్రయమునవలె నవంతుఁ గ్రింద నిరూపించెను

# కుసంధి

"దీనియొడయం డిది యిట్లొదవె ననక దీనోడయం డి దిట్లొదవె ననఁ గుసంధు లినశశినయనా" ౨ ఆ. ౧౯ ప.

దీనియొడయం డనక దీనోడయం డని సంధిచేసినచోఁ గుసంధి యనుట యుచితమేకాని "ఇది+ఇట్లు=ఇదిట్లు" అనియుండుట మాత్రము కుసంధి యనుట తగదు. ఇదిశబ్దము తదాదులలోనిది. తదాదులకు "తద్వృత్తాదిజస్య" అను చింతామణిసూత్రముచే వికల్పముగా సంధి రావచ్చును. బాలవ్యాకరణమును "ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు" (సంధి ౫ సూ.) అనుసూత్రముచే నేమ్యాదులకు సంధి వైకల్పికమనియే చెప్పెను. ఇది యను పదము ఏమ్యాదులలో నందుఁ జేర్పఁబడెను. ఇదిశబ్దమున కిట్లు సంధి వచ్చుట ప్రామాణికమేయయినను ననంతుఁడు "ఇ దిట్లు" అనుట దోషముగా నేలభావించెనో తెలియవలసియున్నది.

కవిజనాశ్రయమునను నిట్లే చెప్పఁబడెను. "పరగ నికారో పరిత, త్స్వరమ యికారంబుతోడ సదృశముగ నె, వ్వరియి ల్లిది యిట్లన కె, వ్వరి ల్లి దిట్లనఁ గుసంధివర్గం బయ్యెన్." దోషాధికారము.

ఇట్లు రెండుగ్రంథములందును నొక్కరీతిగా దీనిని దోష మనుటచే నిది యవిచారమూలక మనుటకు వలనుపడదు. ఇదిశబ్దమును కిమాదులలోఁ జేర్పక తదాదులలోఁ జేర్చుటయు చింతామణ్యుదాహరణములలోఁ గానవచ్చుచున్నది. కిమాదులలో దీనిం జేర్చినచోఁ దఱచుగా సంధి వచ్చుటయుఁ గొన్నిచోట్ల రాకుండుటయుఁ గావలయును. ఇదిశబ్దమును తదాదులలోఁ జేర్చుటయే సరి కాదనవలసియుండ శ్రీదొరస్వామిశర్మగారు కిమాదులలోఁ జేర్చి ప్రాయస్సంధివిషయముగాఁ జేయుట సరికాదు. ఇదిశబ్దమునకు వైక

ల్పికసంధియే నన్నయ గావించినట్లులు కానరాకయుండఁగాఁ బ్రాయస్సంధి యిదిశబ్దమునకుఁ జెప్పుట యెట్లుసరిపడును.

ఇదిశబ్దమున కికారము పరమగునపుడు సంధివచ్చినరూపము నన్నయ ప్రయోగింపలేదు. అనేకస్థలములందు దాతఁ డిదిశబ్దమును బ్రయోగించుటయు దాని కచ్చు పరమగునపుడు సంధి చేయకుండుటయు నన్నయభారతమునఁ గానవచ్చుచున్నది. అట్టిస్థితిలో నికారము పరమగునపుడు సంధిచేయకుండె నని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

"ఎనిమిది యగుపర్వం బిది యన" భార. ఆది. ౧ ఆ. ౫౦ ప.

"ఇదియింతయు నేమి" ,, ,, ౧౧౮ ప.

"ఇది యిప్పుడుఁ బూని కావ" భార. అర. 3 ఆ. ౨౩౪ ప.

"ఇది యుచితంబు గాదనక" సభా ౨ ఆ. ౨౧౯ ప.

"అచ్చెరు విది యెట్టులు" భార. ఆది. ౧ ఆ. ౧౫౬ ప.

"అత్యుదార మిది యైనను" అర. ౧ ఆ. ౨౫౭ ప.

నన్నయభారతమున నింతియకాక యిదిశబ్దము సుమారు 190 పర్యాయములు ప్రయోగింపఁబడెను. వానిలో నచ్చులు పరముగా నున్నస్థలములు సుమారు 75 గలవు. ఇందెచ్చటను సంధి చేయఁబడలేదు. ఇదిశబ్దమున కేవిధమగునచ్చు పరమగునపుడును సంధి కానరాలేదు కాని నిర్దేశార్థక మగు "ఎ" అనునవ్యయము పరమగునపుడుమాత్ర మొక్కచో సంధి కానవచ్చుచున్నది.

"ఇదె దేహం బిదె యర్థం బిదె నాపరిజనసమూహ మిన్నిటిలో నెయ్యది మీకిష్టము" ఆది. ౫ ఆ. ౨౪౨ ప.

ఇందు "ఇది+ఎ" అని ఛేదము. నిర్దేశార్థకమైన ఏకారము సాధారణముగా నెట్టియచ్చునకుఁ బరముగానున్నను అనుగా సంధి కావచ్చుచున్నది. ఇదిశబ్దమునకు నేకారము పరమయినను సంధి కానగా

లేదు. ఇకారము పరముగానున్నప్పు డెచ్చటను సంధి కానరానందు
ననే "ఇదిట్లు" అనునది దోష మని యనంతుఁడు చెప్పవలసివచ్చెను.

ఇట్లు భారతప్రయోగము లుండఁగాఁ దదాదులలో నిదిశబ్దమును జేర్చుట గతానుగతికమే కాని చింతామణిహృదయము కాదు. ఏదియెట్లయినను నిదిశబ్దమున కికారము పరమగునపుడు మాత్రము సంధి చేయుట దుష్టమే యగునని యీసందర్భము తెలుపుచున్నది.

"ఇది యెట్లోదవె ననక......ఇ దెట్లోదవె నన" అని పూర్వముద్రణమున నెట్లుశబ్దము చూపఁబడెను. కాని కవిజనాశ్రయమున నీదోషముం జెప్పుపద్యము "ఇట్లు" శబ్దముతోడనే యుండుటచేతను వ్రాఁతప్రతిలోఁగూడ నిట్లుశబ్దమే కానవచ్చుటచేతను నట్టిపాఠమే గ్రహింపఁబడెను.

దోషములలోనెల్ల విసంధిక ముత్కటదోష మనియుఁ దన్నివారణార్థము సంధిసమాసవిజ్ఞాన మావశ్యకము కావున వానిని నిరూపింతు ననియు ననంతుఁడు చెప్పెను. సంధినిరూపణసందర్భమునఁగొన్నిచోట్ల నచ్చులను విసంధిగాఁ జూపుట జరిగెను; చెచ్చెర ఇఉబులు మూఁటికి (౪ ఆ. ౪౩ ప.) నని చూపుట స్పష్టార్థమే. సంధి చేసి "చెచ్చెర నియుబులుఁ" అనియుఁ బఠింపవచ్చును. ఛందోభంగాదు లుండవు. "తగునే అన మననయనం బగు" నిత్యాదులలో విసంధి దోషము లేదని "సంధిఁ దెలిపెడిచో సూత్రసమ్మతముగఁ దొలుతఁ బలికిచూపెదు వర్ణముల విసంధి నాటుకొనదు." (౪ ఆ. ౩౮ ప.) అని చెప్పెను. "ధర అఇబులు" ఇత్యాదుల "ధర నయిబులు" అనియుఁ బఠింపవచ్చును. "తనరఁగ అఆఇఈ లనఁగా ఉఊలు నాఁగ" అను పద్యమునను "ఎఏ లనంగ నోఓ లనఁగఁ" అనుచోటనుమాత్రము హ్రస్వాచ్చుల నాఁదికలికి గురువులుగా నొసఁగవలెను. కానియో

ఛందోభంగ మగును. ఇం దట్టివిశేషోచ్చారణమును ప్రత్యేకముగాఁ జూపుచు ననఁగా, నాఁగ, అన, అనఁగ అని యనుకరణములతోఁ జూపుటచే దోషముకాదు. తెనుఁగునకుఁ జెందని సంస్కృతవిభక్త్యంత పదములను (దాసోహమ్మని) ధ్వన్యనుకరణశబ్దములను (ఝుంఝుమ్మని) జూపినట్లే వీనినింగూడ ననుకరణములతోఁ జూపుటచే దోషము కాదు. "తగుహ్రస్వంబులు దీర్ఘము లగు నయియుఋౄను వెండి హ్రస్వాభావం బగు నేమైయోయూలు నెపఁగు" (౪ ఆ. ౧౨౪) అని యనుకరణముచేయనిచోట సంధిచేయుటకుఁ దగినట్లే కూర్పఁబడెను. కావున నట శంకయే లేదు. విసంధి నుత్కటదోషముగాఁ దలంచిన యనంతుఁడు తా నట్టిదోషమును గావింపఁడుగదా !

## సంధులు

సంధు లాఱువిధము లనియు నందుఁ బ్రకృతిభావము తెనుఁగునకుఁ జేరదనియు స్వాదిసంధి విసర్గసంధిలోనే చేరిపోవుననియుఁ జెప్పి శేషించిన తుక్ స్వర వ్యంజన విసర్గసంధులలో ముఖ్యభాగములను వివరించెను. అష్టాధ్యాయిలో స్వరసంధికంటెను ముందుగానే తుక్సంధి చెప్పఁబడుటచే నితఁడును దానినే ముందు చెప్పెను. పిమ్మట స్వరసంధిని వివరించుట యష్టాధ్యాయీక్రమానుసరణమే. ఇవి రెండును నాఱవయధ్యాయమున మొదటిపాదమునందలి విషయములు. ఆపిమ్మట నాల్గవయధ్యాయములోని వ్యంజనసంధిని వివరించెను. కాని స్వర వ్యంజన సంధులమధ్యభాగమున మూఁడవయధ్యాయముననే విసర్గసంధి యున్నను దానికంటె ముందుగా వ్యంజనసంధిం జెప్పెను. ఇట స్వరములయనంతరము వానివలె స్వతంత్రములగు వ్యంజనములసంధిని వివరించుట బాగుగానుండునని సూత్రక్రమము ననుసరింపక వ్యంజనసంధ్యనంతర మనాశ్రయము లగువిసర్గముల సంధిని వివరించెను.

స్వరాదిసంధులయంతర్విభాగమునంగూడఁ గొన్నిమార్పులను ఔచిత్యానుసారముగాఁ గావించెను. యణాదేశ యాంతాదేశ వాంతాదేశ గుణ వృద్ధి సంధులయనంతరము సవర్ణదీర్ఘసంధి పాణినిసూత్రములలో నుండఁగా నన్నింటికంటెముందు దానిం జెప్పెను. ఇక్కులకు నేచ్చులకును బూర్వమే యక్కులసంధి చెప్పుట యుచిత మని దానిని ముందుకుఁ దెచ్చెను.

అష్టాధ్యాయీక్రమమున నీతఁ డిట్లు కొలఁదిమార్పు కావించెను. చక్కనియుపాధ్యాయునివలె సులభమార్గములలో వ్యంజన విసర్గసంధుల నీతఁడు విశదపఱచెను. కచటతపహల్లులు పంచవర్గద్వివర్ణ సకారములయెడ మారవఁట. పంచవర్గతృతీయచతుర్థవర్ణయరలవలయెడఁ దృతీయాక్షరము లగునఁట. ఎంతసులభముగా విశదపఱచెనో చూడుఁడు. పాణినిసూత్రములలో నెచ్చటను నిట్టివిభాగము తెలుపలేదే. విసర్గసంధియందును నిట్లే పాణినీయమువలన నిష్కృష్ట మగు నర్థమును జక్కఁగా సంగ్రహించెను.

"ఆ" యనునవ్యయము గొన్నియర్థములందు జకారము నిద్వర్ణముగాఁ జేర్చి "ఆజ్" అని సంస్కృతవ్యాకరణమున నుచ్చరింపఁబడెను. (చూ. నిపాతఏకాజనాఙ్, ఆఙ్మర్యాదాభివిధ్యోః") అట్టి "ఆఙ్" అనుదానికి ఈషదర్థమునను క్రియాయోగమునను మర్యాదయందును నభివిధియందును సామాన్యసంధికార్యములు వచ్చును. ఙిత్తు కాని "ఆ" కారమునకుఁ బ్రగృహ్యసంజ్ఞ వచ్చుటచేఁ బ్రకృతిభావము వచ్చును. ఈవిషయమును జక్కఁగ వివరించి ప్రకృతిభావము వచ్చెడి ఙిత్తు కానియవ్యయమునకుఁ దెనుఁగునఁ బ్రవేశము లేదని చెప్పెను.

ఆఙ్ అనుదానిలోని ఙకారము "ఉపదేశేజనునాసిక ఇత్" అను సూత్రముచే నిత్సంజ్ఞం బొంది "తస్యలోపః" అనుసూత్రముచే

లోపించి 'ఆ' యని మిగులును. దీనిజకారము సంహితలో లోపించు నని సమీక్షలో శ్రీరావూరు దొరస్వామిశర్మగారు వ్రాయుట సరి కాదు. ఇది యంతట లోపించును. ఇది సంహితాకార్యము కాదు.

తత్ +లీల యనుచోట తల్లీల, తద్లీల యనియు, ఉత్+ స్థితము అనుచోట ఉత్థితము. ఉత్ స్థితము అనియు రెండేసిరూపము లుండునని యనంతుఁడు చెప్పెనని (చూ. ర ఆ. ౬ర ప.) పూర్వ ముద్రణముంబట్టి తెలియఁబడును.

ఇందుఁ దల్లీల యనునది యపాణినీయమని పూర్వముద్రణ మున సూచితము. కాని వెన్వెంటనేయున్న "ఉత్ స్థితంబు" అను నదియు నపాణినీయమే యయినను దాని నేలనో సూచింపలేదు. "ఉదఃస్థాస్తంభ్వోఃపూర్వస్య" అనుసూత్రముచే సకారమునకుఁ బూర్వ సవర్ణము నిత్యమగుటచే నిట 'స' కారము థకారముగా నిత్యముగా మాఱును. అపుడు "ఝరోఝరిసవర్ణే" యని యొకథకారము వికల్ప ముగా లోపించును. అప్పుడు 'ఉత్థితంబు' 'ఉత్ థితంబు' అని రెండు రూపములగును.

అంతియకాని ఉత్ స్థితంబు అని యుండదు. ఈరెండుకార్యము లును వరుసగానున్నసూత్రములకార్యములు. ఇవిరెండును వైకల్పిక ములే యని యనంతుఁడు తలంచెనేమో! అట్లాతఁడు భావించుటకు "వాపదాంతస్య" యను పూర్వసూత్రమున వాపద ముండుటయే కారణము కానోపును. అట్లైవ్వారేని వ్యాఖ్యాతలు వాపదమున కీ రెండుసూత్రములలోనికి ననువృత్తి చెప్పిరేమో! ఇప్పుడు ప్రచార ములోనున్న సిద్ధాంతకౌముది యానాఁటి కింకను నవతరింపలేదు. ఆనాఁటికి సూత్రక్రమవ్యాఖ్యానములే వ్యాప్తిలో నున్నవి. కాని యీపద్యమునను "ఉత్ థితం బుత్థితం బన నుండుఁగాన" అనుపాఠము సరియైనపాఠముయుండును. తోర్గ్లి: అనుసూత్రములోనికి వాపద ముసు

వృత్తమయినను "ఉదఃస్థా......పూర్వస్య" అనుదానిలోనికి వాపద మను వృత్త మయ్యెననుట కుదురదు. అట్లయినచోఁ దదనంతర సూత్రమగు "ఝయోహోఽన్యతరస్యామ్" అను సూత్రమున అన్యతర స్యాగ్రహణము వ్యర్థము కావలసివచ్చును. మీఁదిసూత్రములోని కనువృత్తమగు వాపదము దానిలోనికిని ననువృత్త మగునుగదా! కనుక "సకార మడగును నడఁగకుండు" ననఁగా సకారస్థానికథకారము లోపించుటయు లోపింపకుండుటయు నని యర్థము చేయవలసియున్నది. ఇట మహాభాష్యము ననుసరించి లోపాభావపక్షమున చర్త్వమువచ్చి "ఉత్థితము" అని ద్విత కారరూపముకూడ నుండవచ్చును.

## సమాసముల క్రమము

సమాసములలోసూత్ర మష్టాధ్యాయీక్రమ మనుసరింపఁబడ లేదు. అందలిక్రమమును దలక్రిందుచేసి ద్వంద్వబహువ్రీహితత్పు రుషావ్యయీభావములను వరుసగాఁ జెప్పెను. 2వ అధ్యాయము 1,2 పాదములలో సమాసములను పాణిని శాసించెను. ఆతనిక్రమము నను సరించినచో నవ్యయీభావము ముందుగాఁ జెప్పవలయునుగదా! అది తెనుఁగున సంస్కృతముననున్నంతయధికముగా వాడుకలో లేదు. అధిహరి, అనువిష్ణు, శాకప్రతి, అక్షపరి మున్నగువానిం బోలిన యనే కావ్యయములు దెనుఁగునఁ గానరావు. సమాసములలో సుప్రసిద్ధము లగువానినే యీతఁ డుదాహరించెను. అలుక్కునకు ఖేచరవనేచరశబ్ద ములును నవ్యయీభావమున నిర్మక్షికశబ్దమును నుదాహరించుట యట్టిదేకదా!

ఇతనిసమాసముల క్రమమును ముందుగా "లలితద్వంద్వబహు వ్రీహులు" అనుపద్యమున నిర్దేశించెను. అందలిక్రమముననే వానిని వివరించినట్లు తోఁచుచున్నది. ద్వంద్వబహువ్రీహితత్పురుషములు వరుసగనే నిరూపితములు. తరువాత ద్విగుకర్మధారయనిరూపణమును నుద్దేశక్రమానుసారియే. కాని తత్పురుషద్విగుసమాసములకు మధ్య

భాగమున నిర్దేశింపఁబడిన యలుక్కు కర్మధారయాంతమున నుండుటయు నుత్తరపదోపమానసమాసమను పేరఁ గర్మధారయసమాసవిశేషమును గర్మధారయములం జెప్పక యవ్యయీభావానంతరమునం జెప్పుటయు నిర్దేశక్రమానుసారి కాదు. ఈతఁడు చూపిన ఖేచరవనేచరశబ్దము లలుక్తత్పురుషవిశేషములే కదా! వీనిని దత్పురుషానంతరమున నిర్దేశక్రమానుసారముగాఁ జూపుటయే యుచితము. కర్మధారయవిశేషమగు నుత్తరపదోపమానసమాసము కర్మధారయములలోఁ జెప్పక యవ్యయీభావానంతరమునఁ జెప్పుట మఱియు ననుచితము. ఇట్టిక్రమవిపర్యయము లేఖకదోషమువలనఁ గలిగియుండును. ౪ ఆ. ౧౦౧వ పద్యము ౯౬వ పద్యానంతరమునను, ౧౦౪వ పద్యము దాని మీఁదివచనముతోఁ గూడ ౧౦౦ వ పద్యముతర్వాతను నుండవలసి యున్నది. ఈగ్రంథమున లేఖకప్రమాదము లనేకములు సంభవించిన ట్లిందఱును నంగీకరింపకతప్పదు. అట్టిప్రమాదములోనివే యివియు నని తలంపనగును. గ్రంథకర్త నిర్దేశక్రమానుసారముగనే నిరూపించి యున్నట్లు మిగిలినసమాసములనుబట్టి స్పష్ట మగుచున్నది.

ద్వంద్వసమాసమున నల్పాచ్చులుగలపదమునకుఁ బూర్వనిపాతము నియతము కాదని చెప్పి "అనుగ్రహానిగ్రహములు" "అపుణ్యాపుణ్యములు" అనుసమాసముల నీతఁ డుదాహరించెను. సంస్కృతమునను నీనియమ మనిత్య మని "లక్షణహేత్వోః క్రియాయాః" అనుపాణినిసూత్రమున లక్షణశబ్దపూర్వనిర్దేశమువలన నిశ్చయించిరి. కనుకనే యనంతుఁడు "కోకిలశుకవాణి" భోజ. 3 ఆ. ౨.౨3 ప. "అపూపాజ్యపూర్వకమై" భోజ. 3 ఆ. ౧౧౧ ప. అని ప్రయోగించెను. "లఘ్వక్షరం పూర్వం" అనునియమమును ననిత్యమే. కావుననే "దుష్కృతసుకృతములు" భోజ. 3 ఆ. ౯౬ ప. అనియుం బ్రయోగించెను.

"అలసంస్కృతమునకుఁబోలెన్" (ఛందో. ౪ ఆ. ౯౧ ప.) ఇందు నాల్గవపాదమున "పుణ్యపాపములునాఁ జనుటన్" అనుపూర్వముద్రిత పాఠ ముదాహరణయోగ్యము కానందున "నపుణ్యపుణ్యములునాఁ జనుటన్" అనుద్రాఁతప్రతిలోని సరియగుపాఠమును గ్రహించితిని. పుణ్యపాపములను పుణ్యాపుణ్యశబ్దములతో వ్యవహరించుట యనంతు నికి పరిపాటియే, "పుణ్యాపుణ్యవిధులు" భోజ. 3 ఆ ౭౧ ప. అని ప్రయోగించెను. ఇట్లే "కర్మాకర్మైకయుక్తిగనిమొనపనికిన్" ఇత్యా దులును గలవు.

సమాసములయనంతరముగూడ వ్యాకరణమునకు సంబంధించిన విషయములే యీయాశ్వాసమునం జెప్పఁబడెను. తెనుఁగున సంస్కృత సమపదములు ప్రవేశించుంగావున సంస్కృతవ్యాకరణాంశములు తెలుఁగువారికిని నావశ్యక మగుటచే సంగ్రహముగాఁ గొన్ని యిట వివరింపఁబడెను. ఛందోవ్యాకరణభాగము లీగ్రంథమునం జెప్పి యలం కారశాస్త్రవిషయమును రసాభరణ మను వేఱొకగ్రంథమున వివరిం చెను.

సంస్కృతమున నేఁబదియక్షరము లని చెప్పి వానిలో లకార ముచేతనే తదభిన్న మగుళకారము గతార్థమనికాఁబోలును ళకార మును వర్ణసమామ్నాయమున గణింపక ఱకారము ననంతుఁడు గణిం చెను. ళళలకును డడలకు నభేద మంగీకరించుటచేతనే "ళడ"ల కనం తుఁడు—

"కాకుస్వరయతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగ."

అని ళడల కభేదమునుబట్టి వచ్చిన కాకుస్వరయతిలో హల్లును గ్రహించి యతి వేయుట కుదాహరించెను. "అగ్నిమీడే పురోహితమ్" ఇత్యాదులందును డకారమునే కొందఱుచ్చరించుటచేతను.ళళ.ళడల

యభేదముచేతనే గతార్థ మగుననియుఁ దలంచి ళకారమును వర్ణములలో నీతఁడు పరిగణింపలేదు. ళకారాంతశబ్దములను అమరసింహాదులు లకారాంతములలోనే పఠించిరి. పాణినీయవర్ణసమామ్నాయమున ళకారము పఠింపకపోవుటయేకాక లకారాంతధాతువులలోనే గళదళాదిధాతువులను బఠించిరి. ఆగమశాస్త్రజ్ఞులును ళకారమును బఠింపక పోవుటచేతను ననంతుఁడు ళకారమును వర్ణములలోఁ బఠింపక విడిచెను.

క్షకారముమాత్రము పాణినీయవర్ణసమామ్నాయమునఁ బ్రత్యేకముగాఁ బఠింపఁబడకపోయినను నమరసింహాదులు క్షకారాంతశబ్దములను క్షకారాంతములలోనే పఠించినను ధాతుపాఠమునను బ్రత్యేక పరిగణనము లేక షాంతములలోనే పరిగణిత మయినను "అదిక్షాంతాః స్మృతావర్ణాః" అని యాగమజ్ఞులవ్యవహార ముండుటచేతను క్షకారమునకు కషయోగమునకంటె భిన్నోచ్చారణ ముండుటచేతను (అక్ష, పక్షాదులయుచ్చారణమును రిక్షా, సెక్షను మున్నగునానియుచ్చారణమును భిన్నముగా శ్రూయమాణ మగుచున్నది) క్షకారములోని కకారమునకు సరళాదేశాదులు రాకుండుటచేతను త్రికదీర్ఘములు క్షకారపరత్వమున అసంయుక్తవర్ణపరత్వమునందువలె హ్రస్వములుగాఁ గొన్నిచోట్ల మాఱుచుండుటచేతను (అక్షత్రకులసితప్రకాశుక హరి. నలో.) వర్ణాంతరముగా ననంతునిచే గ్రహింపఁబడెను. ఇతనిననుసరించి తాతంభట్టు, కవిచింతామణిలో "వ్యంజనములు హల్లు లనఁ గకారాదిగా క్షాంతమయిన వర్ణచయంబు" అని చెప్పెను. చమత్కారచంద్రికయందును "అకారాదిక్షకారాంతవర్ణాః స్యుర్మాతృకాహ్వయాః" అని చెప్పెను. (చూ. అప్ప. ౨ ఆ. ౭౮౧ ప.)

ఇట్లుభయపక్షములకును నుపపత్తు లుండుటచేతను

రెండుమతము లేర్పడెను. "మహాఋషీణాం మతయశ్చభిన్నాః" అన్నట్లు రెండుపక్షములు తుల్యయుక్తికము లయినప్పుడే మతభేదములు వర్తించును. ఏకపక్షము బలహీన మయినచో నది యెట్లును నిలువదు. దీనింబట్టి

కాకు పా జడ్డనై క్షకార మగుట
దలఁప కేఁబదిలిపులలో దానిఁ గలిపి
తొలుత భిన్నాక్షరంబైన దొడ్డళాను
విడిచిపెట్టె ననంతుండు వెట్టి గాఁడె.

అప్ప. ౨ ఆ. ౬౯ ప.

అని యప్పకవి యనంతుని నపహాసించుట యుక్తముగాఁ దోపదు.

వావిళ్ళవారి తృతీయముద్రణమునందలిపాఠములలోఁ గొన్ని యిందు మార్పులు గావింపఁబడినవి. నేను విజయనగరమహారాజుల కోటలోని యొకఛందోదర్పణలిఖితగ్రంథము ననుసరించి చాలపాఠములను సవరించితిని. ఆగ్రంథమునను గొన్నిదోషము లున్నను బూర్వముద్రితగ్రంథములందలి ప్రమాదస్థలములందు ఈవ్రాతప్రతిలో సరియగుపాఠము లుండుటచే నాకు చాల నుపయోగించెను. ఇంచుమించు రెండువందలపాఠములు సరిచేయఁబడినవి. అవియన్నియు నెట్టి కారణముచేమార్పఁబడినవో వివరింతును. ముందుగా నట్టిపాఠద్వయమును జూపుచున్నాను.

## ప్ర థ మా శ్వా స ము

| క్రమసంఖ్య- | పూర్వపాఠము- | పద్యసంఖ్య- | సరిచేయఁబడినపాఠము. |
|---|---|---|---|
| * 1. | భజనసమ్యుతరల్ల | ౨ | భజనసమ్యుతరగ్ల |
| * 2. | గద్యపద్యంబు లన | ౬ | గద్య, పద్యంబు నన |
| * 3. | నొదవు ద్విమాత్రన్ | ౭ | బొలి ద్విమాత్రల్ |
| * 4. | ముగఁ జుట్టిన వేల | ౯ | ముగ జుట్టు వేల |

| | | | | |
|---|---|---|---|---|
| | 5. తగదు | ౨౬ | తగదు | (1) |
| | 6. ములు గాకుండిన | ,, | ములుఁ గాకుండిన | |
| | 7. లాదవును...వాందు | ౨౭ | పాదవును......వాందు | |
| | 8. భాసురముఁగ | ౨౯ | భాసుర మగు | |
| * | 9. రాది చెల్లు | ౩౨ | రాదిఁ జెల్లు | |
| | 10. ఏఁటి కింక | ౩౩ | ఏటి కింక | |
| * | 11. నేఁడు | ,, | నొందు | |
| * | 12. ఋత్రిలాను | ౩౪ | ఋత్రి మఱి | |
| | 13. సంజ్ఞికముల్ | ,, | సంజ్ఞకముల్ | |
| | 14. దీర్ఘమునున్ | ౩౬ | ప్రాసములై | (1) |
| | 15. సాదృశ్యంబులు | ౩౭ | సాదృశ్యంబుల | (1) |
| | 16. వీడుఁ నాఁగ | ౩౮ | వీఁడు నాఁగ | |
| | 17. తాఁబేఁటి | ౪౨ | తాఁబేటి | |
| | 18. బడును సం | ౪౩ | బడు నసం | |
| * | 19. నీకుఁ బ్రాతె | ౪౮ | నీకు బ్రాఁతె | |
| | 20. బ్రాతె | ౪౭ | బ్రాఁతె | |
| * | 21. ధ్రువ | ౪౯ | ధ్రువ | |
| | 22. నిన్ బిలిచె | ౬౩ | నిం బిలిచె | |
| * | 23. పదాఽర్వానై | ౬౭ | పదార్వానై | (1) |
| | 24. తాత్మజుఁడు | ౬౮ | తాత్మజుఁడె | |
| * | 25. అమరఁ గదుదుష్కరము | ౭౦ | అమరఁగ దుష్కరమును | |
| * | 26. వధూరణవిజయయనఁ దగి చతు | ౭౮ | వధూరణవరవిజయయనఁ జతు | |
| | 27. ప్రవణ | ౭౭ | ప్రసర | |
| * | 28. భిన్నశ్రిమును | ౯౧ | భిన్నవిశ్రిమను | |

| | | | |
|---|---|---|---|
| * 29. | దీర్ఘము హ్రస్వము | ౮౩ | హ్రస్వము దీర్ఘము |
| * 30. | నుండి | ౮౬ | నుండు |
| * 31. | విరమము | ౮౮ | (శీర్షిక) రీవిరమము |
| * 32. | మదాప్తి | ౯౪ | మవాప్త |
| * 33. | స్వాంతము | ,, | స్వంతము |
| * 34. | మున్ను నన్ను నీవా | ౯౬ | నన్ను నీతగవా |
| 35. | యవియు | ౯౮ | యదియు |
| 36. | నవియు | ,, | నదియు |
| 37. | నణలు | ౧౦౭ | ణనలు (1) |
| 38. | ద్వీరదగతి | ౧౧౧ | (శీర్షిక) జయభద్ర |
| 39. | యొకధంబగు | ౧౧౨ | (శీర్షిక) యొక |
| * 40. | ఱంపము | ,, | రంపము |
| 41. | రాయు | ,, | వ్రాయు |
| * 42. | (జొంగను) | ౧౧౮ | దొలంగక |
| * 43. | ళరమఱ | ,, | లరమఱ |
| * 44. | సింహమూర్తి | ౧౧౯ | సింహమూర్త |
| * 45. | నిత్యము | ౧౨౨ | నిత్వము |
| 46. | అట ఇకా | ౧౨౩ | అటు లికా |
| 47. | యుతమై | ౧౨౪ | యుతమా |
| * 48. | నెసంబున | ౧౨౬ | నెపంబున |
| * 49. | విధేయ అనంతయ | ౧౩౦ | విధేయానంత |

## ద్వితీయాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| 50. | యఖండ | | అఖండ |
| 51. | యనవరత | | అనవరత |
| 52. | శ్రీఅనంత | | శ్ర్యనంత |

| | | |
|---|---|---|
| 53. ఇరువదారు | ౫ | ఇరువదాఱు |
| * 54. స్త్రీరూపా | ౧౨ | స్త్రీరూపా |
| 55. దేవే | ౧౮ | (దేవే |
| * 56. రుగ్మవతీ | ౨౬ | రుక్మవతీ |
| * 57. బారుణ్ | ౨౭ | బారన్ |
| * 58. నొందుణ్ | ,, | నొందన్ |
| * 59. ప్రణవ మను | ౨౮ | పణవ మను |
| * 60. ప్రణవం బుర్వీన్ | ,, | పణవం బుర్వీన్ |
| * 61. చిన్న | ౩౦ | చిన్ని |
| * 62. రంగ మను | ౩౧ | రంగ యను |
| * 63. తోదక మను | ౩౨ | దోదక మను |
| * 64. (దోదక | ,, | దోదక |
| * 65. జానొప్ప | ౩౫ | దానొప్ప |
| * 66. సేయ నొగిన్ | ౩౮ | సేయునెడన్ |
| * 67. మభనచు | ౫౧ | మభసమ |
| * 68. వదంబను | ౫౨ | వదయను |
| * 69. సంజ్ఞణ్ | ౫౬ | సంఖ్యన్ |
| * 70. గంబున్, ఓజం | ,, | గంబి, యోజ్యాజం |
| * 71. ణిసమా | ౫౯ | ణీసమా |
| * 72. సజగాసు | ౬౧ | సజగాను |
| * 73. లగము | ౬౪ | వములు |
| * 74. లను వతిసేవ్యంబై | ౬౭ | ల నెనసి శ్రావ్యంబై |
| * 75. వనంబాధణ్ | ,, | వసంబాధణ్ |
| 76. రాకొక్త్రనాఙగ | ౭౧ | యూయుజాఙగ |
| * 77. లందగుణ్ | | లంఘ్రుపులం |

| | | | |
|---|---|---|---|
| * 78. | పద్మక | ౭౭ | పద్మ |
| * 79. | తంబున | ,, | తంబుగ |
| * 80. | దంబులై | ౮౫ | దంబులఁ |
| * 81. | యని | ౮౬ | యను |
| * 82. | భరను | ౮౮ | భరణ |
| * 83. | విక్రీడిత మను | ౮౯ | విక్రీడిత యను |
| * 84. | ద్రిదివ | ౯౨ | త్రిదివ |
| 85. | దరో | ౯౪ | వరో |
| * 86. | పతఁ | ౯౫ | పతిఁ |
| * 87. | చంపక మను | ౯౬ | చంపకమాల యను |
| * 88. | యెవ్వఁడునా భావింపంగా భాసురభంగిన్ | ౧౦౨ | యెవ్వఁడగుఁ భావింపంగా నయ్యెడవల్లఁ |
| * 89. | గురున్వి | ౧౦౩ | గురుల్వి |
| * 89. | (ఎ) నొందఁ బ్రభాసుర | ,, | నొండెఁ బ్రభాకర |
| 90. | పతానోజ్వల | ౧౦౪ | సతానోజ్వల |
| * 91. | ఎన్వారి | ౧౦౮ | ఎవ్వాని |
| * 92. | విస్రమమై | ౧౧౨ | విశ్రమమై |
| 93. | సమనయన | ౧౧౪ | మయనయన |
| * 94. | రుచు లింపుగను | ౧౧౫ | రుచి నింపఁగను |
| * 95. | సవృత్త | ,, | సువృత్త |
| * 96. | సంజ్ఞికంబు | ౧౧౯ | సంజ్ఞకంబు |
| * 97. | భనభస | ౧౨౭ | భనజనగ |
| * 98. | నిలదే | ౧౩౧ | నిలనే |
| * 99. | బొందిరి కడుం దొరసి పొందగు ముప్పుతటి | ౧౩౧ | నొందినటు లొందిరి గడుం దడసి యొప్పు తటి |

| | | | |
|---|---|---|---|
| * 100. | చోట్లని | ,, | చోట్లను |
| * 101. | విధేయులనంతయు | ౧౩౬ | విధేయానంత |

## తృతీయాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| * 102. | సంస్కృతాదుల | ౩ | సంస్కృతార్యాదుల |
| * 103. | ప్రకటసమపాద | ౭ | ప్రకటాసమపద |
| * 104. | నవలఁ | ,, | సరులఁ |
| * 105. | వరుసను ద్వితీయ మంత్యము | ౮ | వరుసన్ ద్వితీయతుర్య |
| * 106. | రెండరయఁగ | ,, | రెండరలన్ |
| * 107. | లార్యన్ | ౧౦ | లార్యల్ |
| 108. | సగమున | ౧౨ | సగమును |
| 109. | పొదువగు | ౧౩ | పొదుపగు |
| * 110. | యుండె | ౧౮ | యొండె |
| * 111. | మేళగతి | ౧౯ | మేళములు |
| * 112. | త్రియుత | ౨౧ | త్రితయ |
| * 113. | నాటును | ౨౨ | నాటిటి |
| 114. | నాల్గడుగున | ౨౪ | నాఅడుగుల |
| 115. | ప్రేముడింపు | ౨౬ | ఁ బ్రేముడించు |
| 116. | డితఁడు ఆశ్రి | ౨౮ | డీతఁ డాశ్రి |
| 117. | డితఁడు అశ్రాం | ,, | డీతఁ డశ్రాం |
| 118. | డితఁడు అనుచు | ,, | డీతఁ డనుచు |
| 119. | సుతనయున | ౨౯ | సుతానయున |
| * 120. | నరమృగేంద్రుల | ౩౦ | నరమృగేంద్రుని |
| 121. | పరభృతాతసి | ,, | పరిభృతాతసీ |
| * 122. | ప్రముఖుఁ | ౩౨ | ప్రౌఢుఁ |
| 123. | ములు మూర్తె | ౩౭ | ముల మూర్తె |

| | | | |
|---|---|---|---|
| 124. కరకమల | ౩౮ | గరకమల | |
| 125. కురులు తెల్ల | ,, | కురులుఁ దెల్ల | |
| 126. కన్నులు | ,, | కన్నులుఁ | |
| 127. నుండఁ గరియతి | ౩౯ | నుండఁ గరయతి | |
| * 128. సూర్యుండు పూ | ౪౧ | సూర్యుఁడుఁ బూ | |
| * 129. ననంతు | ,, | ని నంచు | |
| * 130. నిప్పగిదిరై<br>త్రిపద | ౪౭ | జరగ నిప్పగి<br>దినోఁ ద్రిపద | |
| * 131. దైత్యధీరు | ౪౯ | దైత్యవీరు | |
| 132. తర్కింపఁగను<br>వితాళము నందు | ౫౧ | తర్కము గొనఁగ<br>వితాళము నొందు | |
| * 133. విధులు | ౫౩ | విదులు | |
| * 134. నతఁడు | ౫౭ | నడుమ | |
| 135. ననగంబుల | ౬౦ | ననలంబుల | |
| 136. నిరుమాఱు<br>లఘువుల నెల్ల<br>వారును నొగి<br>గణింపఁగ | ,, | నిరవుగాఁ గను<br>నేడులఘువుల,<br>నురువు మీఱఁగ<br>నొప్పునెలవుల | |
| 137. భగణములు | ౬౧ | భసనలలు | (1) |
| 138. నామాభి | ౬౪ | నామాను | |
| 139. ధ్వము లన | ౬౫ | ధ్వము నన | |
| 140. వలప ల్లోలి | ౬౬ | వలప ట్లోలి | |
| 141. గణలగ | ౭౧ | లగ | |
| 142. పరప్రతులు | ,, | మఱుప్రతులు | |
| 143. ప్రతు౦ | ౭౩ | ప్రతులు | |
| 144. [illegible] | ౭[illegible] | [illegible] | |

| | | | |
|---|---|---|---|
| 145. | లగ్రక్రియాచక్రకము<br>అర్ధప్రక్రియ | ౨౬ | అర్ధప్రక్రియ |
| * 146. | విధేయయనంత | ౨౯ | విధేయానంత |
| * 147. | యుం ద్విపదయు | ,, | యుం ద్రిపదయు<br>ద్విపదయు |
| 148. | నక్కరయు | ,, | నక్కరలు |
| 149. | ఉదా | ,, | నుదా |

## చతుర్థాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| 150. | లఘువు గాం | ౪ | లఘువుం దా |
| 151. | విస్సంధికము | ౬ | విసంధికము |
| 152. | కాంతిచంద్రుండ | ౮ | కీర్తిచంద్రుండ |
| 153. | గీర్తి నమృత | ౯ | గాంతి నమృత |
| 154. | ఇటు | ౧౦ | నిటు |
| 155. | ఇమ్మిమ్మ | ,, | నిమ్మిమ్మ |
| 156. | పుణ్యశోభ | ,, | బాల్యశోభ |
| 157. | యింక | ౧౪ | లింక |
| 158. | బ్రాతియే | ,, | బ్రాఁతియే |
| 159. | గవని | ౧౫ | గవనె (1) |
| 160. | సంజ్ఞికంబు | ౧౬ | సంజ్ఞకంబు |
| 161. | కాకుదోషంబు | ౧౮ | నిడుఃలకాకుదోషంబు |
| * 162. | ఇది యెట్లాదవె | ౧౯ | ఇ దెట్లాదవె |
| * 163. | ఇ డెట్లాదవె | ౧౯ | ఇ దెట్లాదవె |
| 164. | కోమటీంద్రడు | ౨౩ | కోమటీంద్రు (1) |
| 165. | వయుడాచలు | ౨౬ | నయుఁడన్ జలు |
| * 166. | విరుద్ధములును | ౩౦ | విరోధములును |

| | | | |
|---|---|---|---|
| | 167. ఎక్కుడి | ౩౨ | ఎక్కటి |
| * | 168. సంధు లందు | ౪౫ | సంధు లిందు |
| | 169. శక్రుఁడు ద్వ్యా వధీశుఁ డన | ౪౬ | శక్రుండు ద్వ్యవధీ శుఁ డన (1) |
| * | 170. గ్లావుదీర్ణయనంగ | ౪౭ | గ్లావుదీర్ణతయనఁగ |
| * | 171. పాదవిన | ౪౮ | పాదివిన |
| | 172. శిఖరిసంఖ్య | ౫౦ | శిఖిభసంఖ్య |
| * | 173. నాద్యంతము | ౫౧ | నాద్యత్వము |
| * | 174. వల్పాతు | ౫౨ | నల్పాతు |
| * | 175. కలియమిన | ౫౬ | ఁగలియమిన |
| | 176. లగునా | ౫౭ | ఁగూడున |
| | 177. హాలంతము | ౬౦ | ననంతము |
| | 178. దీపింప | ౬౩ | దీపించు |
| * | 179. ప్రస్ఘార మనఁగ | ,, | ప్రస్ఘారము లన |
| * | 180. లలిని దద్వ్యంజనంబు | ౬౪ | లలిత తవ్యంజనంబు |
| | 181. బుత్స్థితంబన | ,, | ఉత్థ్థితంబన |
| | 182. బునఁ | ౬౫ | బును |
| | 183. మను చోటన్ | ,, | మన నోలిన |
| | 184. అపరయుగ | ౬౭ | యపరయుగ |
| | 185. యరలవ తృతీ | ,, | యరలవఁ దృతీ |
| | 186. నిర్వకార | ౬౯ | నిర్వికార |
| | 187. యశస్థితి | ౭౧ | యశస్తతి |
| | 188. మిథశ్ఛాలంబు | ,, | మిథశ్ఛలంబు |
| * | 189. గారకంబుపట్ల | ౭౪ | గారకంబునట్ల |
| * | 190. సంధిలు నర్చి | ౭౬ | సంధిలి యర్చి |
| * | 191. యరలవహాతలు | ౭౭ | యరలవహాలు |

| | | | |
|---|---|---|---|
| * 192. | వాఁమపదవిసర్గాంత | ,, | వామపదసవిసర్గాంత |
| * 193. | దీర్గ | ౭౯ | దీర్ఘ |
| * 194. | తుదరా నత్వము | ౮౧ | తుదరాఁ దత్త్వము |
| * 195. | తలమగు | ౮౨ | దళమగు |
| * 196. | రెయొనరింబఁ | ౮౨ | రెయొనరింప |
| * 197. | ప్రపాద్యయము | ౮౪ | ప్రపాద్వయము |
| 198. | కమతాదు | ౮౮ | కమతాద్రు |
| * 199. | నాఁగను బుణ్యా పాపములు | ౯౧ | నాఁగ నపుణ్యా పుణ్యములు |
| * 200. | డు పరిస్థిత | ౯౪ | డు పటస్థిత |
| 201. | మహాత్మ్మనకు | ౧౦౦ | మహాత్మునకు |
| 202. | నభియోగము | ,, | నాయోగము |
| * 203. | పదోవమా | ౧౦౩ | పదోపమా |
| 204. | దీనఁ బట్టుండి యందుండి | ౧౦౭ | వీనిఁ బట్టి యతనినుండి |
| * 205. | ఋఋూలన | ౧౦౯ | ఋఐలన |
| * 206. | పబములు | ౧౧౦ | పభములు |
| 207. | ఫణితిన్ | ౧౧౪ | ఫణితుల్ |
| 208. | బూజించి | ౧౧౯ | బూజించే |
| * 209. | లెచటన్ | ౧౨౪ | లిచటన్ |
| * 210. | శకురాఖ్యలు | ౧౩౦ | శకుఆఖ్యలు |
| * 211. | షశ్వర్గంబులు | ౧౩౧ | షడ్వర్గంబగు |
| * 212. | లసస్మణి | ౧౩౨ | లసన్మతి |
| * 213. | బొంపిరివోని | ౧౩౩ | బొంపిరివోయి |
| * 214. | విధేయమయవంతయు | ౧౩౭ | విధేయానంత |

వీనిలో * గుర్తుగలవి వ్రాఁతప్రతిలోని పాఠములు.

(1) గుర్తుకల 9 మాత్రము వావిళ్ళవారి తృతీయముద్రణమున నధస్సూచితములు.

1. ఇందు 'ల్గ' అనుపాఠమున లఘువుతర్వాత గురువు చూపఁబడెను. అంతకంటె గురువు ముందుఁగను నంతమున లఘువును నుండుట యుచిత మని యీపాఠము గృహీతము. "మ్యరస్తజభ్నగై ర్లాంతైరేభి ర్దశభి రక్షరైః సమస్తం వాఙ్మయం వ్యాప్తం త్రైలోక్య మివ విష్ణునా" ఛం.మం. అని లఘువే యంతమున నున్నది. ఈ శ్లోకార్థమే యనంతునిచే నించుక యీపద్యమున ననుసృతము.

4. "జొట్ట్రవేలు" అని జకారాదిగా నిఘంటువులలోఁ గానవచ్చుటం జేసి దానికిఁ బూర్వమున నరసున్న యుండరాదు.

7. యతిభ్రంశములేని (వాఁత్రపతి) పాఠమగుటచే నిది గృహీతము.

10. ఏటిలో నరసున్న ప్రామాణికము కాదు.

12. 'బ్రుతి' అనుపదము లువర్ణపరత్వమున ఉకారాంతము కావలసి యుండును. అందుచే నీపాఠము గృహీతము.

13. "సంజ్ఞికము" లని ఇకారము తప్పు. అందుచే సరిచేయఁబడెను.

17. 'తాఁబేటి' అనుచోట నౌపవిభక్తికటివర్ణము బిందుపూర్వ మగుట సరికాదు.

18. లకారరేఫలతోఁ గూడినడకారము వానితో నసంయుతమగు దానితోఁ బ్రాసము చెందు ననునర్థమున 'అసంయుత' అను పాఠమే సరిపడును.

19. "ప్రాఁతి" అనుపదము పకారాది కాదు. అందుచే నర్ధబిందు పూర్వకము కారాదు. 'ప్రా' అనుదానితర్వాత నరసున్నను నిఘంటువులు చూపుచున్నవి.

21. 'ధ్రువ' శబ్దములో వట్టువసుడి యప్రామాణికము

22. లక్షణానుసారముగా నకారము బిందువగుట యుచితము

23. అలఘురేఫము లుప్తాచ్కమగుచో లఘురేఫ మగును. చూ. ప్రౌ. వ్యా. ముక్తా. ౨. సూ.

24. ద్విత్వమునకుఁ బూర్వాక్షరము తెనుఁగున భిన్నపదసంబంధి యయినచో సామాన్యముగా నూఁదఁబడదు. సహజముగా నది గుర్వక్షర మయినచో నూఁదినను దోషము లేదు. అందుచే దానిని దీర్ఘముగా మార్చవలసివచ్చెను. అన్యథాప్రయోగములు ప్రామాణికములు కానందున నుపేక్షితములు.

25. ఇందు 'కడు' అనునది నిరర్థకము. ప్రొత్తపాఠమున సముచ్చయము సార్థకము.

27. ప్రవరపదము సరిపడును. ప్రపణశబ్దార్థ మిట ననన్వితము.

32. మదాప్తి యుదాహరణము కాదు. 'మవాప్త' అనుదానిలో 'అవ' అనునుపసర్గ ముదాహరణ మగును.

33. సు అనునది స్వాంతములో స్పష్టము. స్వాంతములో 'ఆ' కూడఁ జేర్చవలసియుండును. ఒక్కొకయుపసర్గమే అన్నింట నుదాహృతము.

34. ద్వితీయపాదాదినిగూడ కాకుస్వర ముండవలయును. అందుచే నీవాఁత ప్రతిపాఠము గృహీతము.

38. ఈ రగడ ద్విరదగతి కాదు. జయభద్రమే. ప్రాసమును బరిశీలించిన నీనాల్గుపంక్తులును రెండేపాదము లని తెలియును. ఇందెన్మిదేసిగణములు పాదమ్మున నున్నవి. ద్విరదగతికి నాల్గుగణములే యుండును. ఇవి నాల్గుపాదములయినచోఁ బ్రాసములేకుండుటయే కాక బహుయతిస్థలోదాహరణ మగుటకును వలనుపడదు. రావూరివారిసమీక్షయందును ద్విరదగతియనియే చూపఁబడినది. అది ప్రమాదము–

40. ప్రాఁత ప్రతియందు లఘురేఫము కావవచ్చుచున్నది– ఆంధ్రవాచ

స్వాత్యమున లఘురేఫముతోఁగూడ నీశబ్దము చూపఁబడెను. అందుచే నదియే గృహీతము. ఇట "రంపెలను" అనుపాఠము అనంతునిచేఁ బ్రయుక్తమయియుండునని తోఁచుచున్నది. అది యిచట సర్వథా అనుకూలము. రంపె అనునది మాదిగలు తోలు చీల్చుట కుపయోగించు నఖసదృశాకారముగల సాధనము. ఇచట నరసింహునినఖములును హిరణ్యకశిపునిచీల్చుట కుపయోగించినవి. ఆకారసాదృశ్యము నఖములకు రంపెలతోనున్నట్లు రంపముతో లేదు. నఖములు బహువచనము. రంప మేకవచనము. ఉపమానోపమేయముల వచనభేదదోషమును 'రంపెలను' అనుపాఠమున నుండదు. తఱచుగా శకటరేఫముతోఁ గానవచ్చు రంప మనుపదమును లఘురేఫముతోఁ జూపనక్కఱయు లేదు. రంపెపదము లఘురేఫయుతముకూడను. రంపెలు సుపరిచితములు కాక రంపములు సర్వపరిచితము లగుటచే లేఖకు లట్లు పాఠమును మార్చియుందురు.

41. రాయుధాతువున కొరయుట యర్థము. ఇట లేఖనార్థక మగుటచే వ్రాయు గృహీతము.

43. ళకారమే వర్ణసమామ్నాయగతము. దానినే యెక్కటివడికి గ్రహించెను. ద్వితీయపాదము ఎక్కటివడికి అనఁగా లకారద్వయమున కుదాహరణము. లళ లభిన్నములు కనుక వానికిని యతి వేయవచ్చునని చెప్పి నాల్గవపాదము లళల కుదాహరణముగాఁ జూపెను.

44. రాజసింహము, ఆర్తరక్షకుఁడు ననుట సరళము. రాజసింహమూర్తి యనఁగా మూర్తిశబ్దము సరళాన్వితము కాదు.

45. నిత్యము— దీని కర్థము సరిపడదు. ఇత్వము- చక్కఁగా సరిపడును.

49. పవమానమున సంధికార్యము నిత్యము కావున విసంధి తొలఁగింపఁ

బడెను. 'నంతయు' సరికాదనియు "ననంత" యనియే యుండ వలయుననియు నిశ్చితము. చూ. భూమిక.

50. స్వస్తి యనునది మొదలు 'నమః' అనుపదమువఱకునుగల సంస్కృత వాక్యమున యడాగమము వ్యాకరణవిరుద్ధము కావునఁ దొలఁగింపఁ బడెను.

51. ఇదియు మీఁదిదోషమువంటిదే కావున దిద్దఁబడెను.

52. సంస్కృతసమాసమున సంహిత నిత్యము కావున యణాదేశము చేయఁబడెను.

56. రుక్మవతీశబ్దము సంస్కృతచ్ఛందములందుఁ బ్రయుక్త మగుటచే నదియే గృహీతము. రుక్మవతీశబ్దము సార్థకము. రుగ్మవతి యని కా. చూ. మణ్యాదులందుఁ బ్రయుక్తము. ఆపదము సంజ్ఞామాత్ర మగును.

57. 58. సమాపకక్రియాఘటితచతుర్థపాదస్థవాక్యమున కంగ మగుటకుఁ దగినట్లు 'అరన్, ఒందఱ్' అనునసమాపకక్రియలే సరిపడును.

62. మణిరంగ యని పద్యమునఁ బేర్కొనుటచేఁ దదనుసారముగా "మణిరంగ" యని దిద్దఁబడెను. ఇట్లే మఱికొన్నిట లక్షణానుసారముగా మార్పఁబడెను.

65. పూర్వపాఠమున యతిభ్రంశము. కావున వ్రాఁతప్రతియందలి "తానొప్ప" అనునిర్దోషపాఠము గృహీతము.

66. 'మభసమ' అని పద్యమునందును గ్రిందవ్రాసిన గణసూచనము నందునుగూడఁ గలదు. కాని అది తప్పు. మభసమ అనునది సరి యగుపాఠము.

70. పూర్వపాఠమున విసంధి గలదు; వ్రాఁతప్రతిలోనిపాఠము నిర్దోష మగుటచే గృహీతము.

71. పూర్వపాఠమున 'గా' అనఁగా రెండుగురువు లని యర్థము

వచ్చును. అది తప్పు. సజగ+అనుసంగతిఁ=సజగానుసంగతిఁ అనునది సరియగునది.

74. పూర్వపాఠము యతిభ్రష్టము. సరియగు వ్రాఁతప్రతిపాఠము గృహీతము.

76. నమయోక్తిన్ అనుపాఠమున రెండుయగణము లను నర్థము సరళము గారాదు. నిస్సందేహపాఠము స్వీకృతము. ఇతఁడెచ్చటను సందిగ్ధముగా గణములను నిర్దేశింపఁడు. నమయయగణములతోఁ గూడిన అని యర్థము.

79. "నకలితంబు నభజాజ" అనుపాఠమున రెండునగణము లను భ్రాంతి కవకాశము గలదు. విశేషణవిశేష్యములు సమానవచనములుగా నుండకపోవుట యొకయనౌచిత్యము. పూర్వముద్రణమువను నట్టిభ్రాంతికరముగనే నకారము భకారమునకు దగ్గరగా నున్నది.

80. పాదంబులన్ అనునది యర్థానుగుణము.

88. పూర్వపాఠమున నెవ్వఁడను యచ్ఛబ్దమునకు తచ్ఛబ్దము లేదు. ఈపాఠమున ౧౧వ యింట యతి యని చక్కఁగాఁ గుదురును. ఇది వ్రాఁతప్రతిలోని పాఠము.

89. (ఎ) పద్యవ్యాఖ్య చూడఁదగును.

90. పకారము తప్పు. సకారము ఒప్పు.

91. వాఁడు అనుశబ్దము ననుసరించి 'ఎవ్వాని' నని యేకవచనాంతముచితము.

93. శశితపనులతో నయనములు సమములు కావు. చంద్రసూర్యాత్మకములే. కావున మయ యని దిద్దఁబడెను.

94. పూర్వపాఠమున యతిభ్రంశము. ఈపాఠము నిర్దోషము.

99. పూర్వపాఠమున నర్థము సరళముగా కుదురదు. ఈపాఠమున నర్థము చక్కఁగఁ గుదురుచున్నది.

100. చోట్లని- ఇదెట్లును కుదురదు. చోట్లను అనునది సరిగ నున్నది.

103. బేసిపాదములయంతమునఁ బదము విచ్ఛిన్నము కాక సమపాదారంభమునఁ జొరఁబడియుండును. కనుక "ప్రకటాసమ" అనునదియే యుచితము. ఈయార్యాపద్యములను ప్రత్యేకదృష్టితోఁ బరిశీలించిన శ్రీ. గి. సీతాపతిగారును దీనిని సరిచేయలేదు. ఇట్లే అవల అనుదానికంటె సగుల ననునది శ్రీఘుస్ఫూర్తికరము.

105. } ప్రాఁతపాఠమున నర్థము కుదురదు. పద్యవ్యాఖ్యానము చూచు
106. } నది.

114. నాల్గడుగున- ఇది సరిపడదు. ఇం దాఱడుగులను ప్రాస ముంకును. కావున నట్లు సరిచేయఁబడెను.

116. } ఇందుఁ బాదాంతమున వాక్యాంత మగుటచే విసంధిదోషము
117. } కాదని పూర్వపాఠమున భావింపవలసియున్నది. ఈపాఠమున
118. } శంకయేలేదు.

119. సుతాశబ్దము స్త్రీలింగము కావున దీర్ఘాంతముగా నుండవలెను. హ్రస్వము వ్యాకరణదుష్టము.

120. ఏకవచనాంతముగా విష్ణువాచకము లన్నిపాఠములందును నుండ నిందు బహువచనాంత ముచితము కాదు. అర్థమును సరిపడదు.

121. పరభృతతుల్యకాంతి పద్మనాభునికి చెప్పుట యప్రసిద్ధము. కవిసమయవిరుద్ధము. అతసీశబ్ద మీాకారాంతమే ప్రసిద్ధము. కనుక క్రొత్తపాఠము రమ్యము.

122. బాణబాహుఖండనమున నితఁడు ప్రముఖుఁడును మఱికొంద అప్రముఖులును లేరు. బాహుఖండనమునఁ బ్రాధతగలవాఁ డీతఁ డనుటయే సరళము.

123. ఇంద్రదగణములకుబదులు సరచులఘుగణము లుండుననునర్థము

సరళముగా 'మాౘె' అనుపాఠమున లభించుచుండఁగా నర్థము కుదురని "మూఁడై" యనుపాఠ మేల?

130. వ్రాఁతప్రతిలోని గణభంగములేని సరియగుపాఠము గృహీతము.

132. పూర్వపాఠమున గణభంగము. అదియు సూచితము కాలేదు. 'వితాళమునండు' అనునది వితాళమునందు అనుదాని రూపాంతర మనుటకంటె 'నొండు' అనుట బాగుగాఁ దోఁచెను. భూమిక చూచునది.

134. పూర్వపాఠమున సఖండయతి యనవలయును. ఈపాఠమున యతి ప్రసిద్ధము. "నడుమ" అనునది అర్థమునకును రమ్యతాపాదకము. ఇంద్రునిపూజను శ్రీకృష్ణుఁడు నడుమఁ దా గ్రహించె నఁట.

135. 136. ఇందుఁ బూర్వపాఠమునందలి దోషములు పరిష్కర్తలు సూచించియేయున్నారు. అందుచే సరియగు ప్రామాణిక పాఠము లభించునంతవఱకును నూతనపాఠమును గల్పించితిని. ఇది యనంతునిపాఠము కాదు. సరియగు ననంతరచితపాఠము లభించుటకు విమర్శకులు యత్నింతురుగాత.

138. అభిరూపపదముకంటె ననురూపపద మనురూపముగా నున్నది. అనఁగా విభక్త్యధిదేవతానామమునకుఁ దగినఫలముల నిచ్చునని యర్థము.

139. 'అర్థములు' అను బహువచనము ప్రస్తారము నష్టము ఇత్యాద్యేకవచనక్రమమునకు విరుద్ధము. కావున నేకవచనాంతపాఠము గృహీతము.

140. వలపల్లోలి యనుమాట సరికాదు. ఇది తప్పుగాఁ జొరఁబడెను 'వలపట్లు' అనునది కుడిపట్టున అనునర్థముగల సాధుపాఠము.

142. పర అను సంస్కృతపదము ప్రతి యను తెనుఁగుమాటతో సమసించుట దోషము. సాధుపాఠము గృహీతము.

144. నాల్గిటన్, పదాఱిటన్ అను పూర్వోత్తరపదానుగుణముగా నెనిమిదిటన్ అని దిద్దఁబడెను.

147. } త్రిపదయుఁ బూర్వోక్తము కావున నాపద ముండుటయు
148. } నుచితమే. అక్కర యొక్కటికాదు కనుక నక్కర లని బహువచనాంతపాఠము గృహీతము.

150. గురు వుండునెడ లఘువుం బ్రయోగించుట అని గాని గురువును లఘువుగాఁ బ్రయోగించుట అనిగాని యుండవలయును. అందుకు భిన్నముగా గురు వొందెడునెడ లఘువుగా అనుట సరిపడదు. అప్పుడు లఘువుగా దేనిని ప్రయోగించుట దోష మగును ? ఆ పదమధ్యాహార్యము కావలయును. ఈ క్రొత్తపాఠము సరళము.

152. } ఈపాఠములు సంభవత్ప్రయోగములు. పూర్వపాఠములు
153. } అసంబద్ధములు. ఆ పద్యవ్యాఖ్యానముం జూచునది.

159. పూర్వపాఠమున నర్థము కుదురదు.

160. సంజ్ఞికంబు– అసాధుపదము.

161. కుఱుచకాకు వొక్కటి చూపుచున్నాఁడు కావున దీనిని సామాన్యకాకుశబ్దముచేఁగాక నిడుదలకాకుశబ్దముచే విభజించుట యుక్తము. "నిడుదలకాకుదోష మంద్రుడు ముకుందా" ర ఆ. ౨౯ ప. యని తానే చెప్పఁబోవుచున్నాఁడుగదా !

164. కోమటీంద్రుడు– అనుపాఠము పూర్వపరిష్కర్తలు సూచించినదే గ్రహించితిమి.

65. "నమెడా" యని దీర్ఘ మెట్లువచ్చును ?. దీర్ఘమును హ్రస్వముగాఁ జేయుటమాత్రమే యిందు దోషము గాని యింకొకవిధ మగుదోషము లుండరాదు. అందుచే "నమెడన్" అనియే గ్రాహ్యము.

66. సమయవిరోధ మన్నట్లే ఆగమలోకవిరోధములును దోషములు. ఆ విరోధదోషయుక్తములు విరుద్ధము లగును. కావున దోషము

లను జెప్పెడియిప్పట్టున 'విరోధములు' అనియే యుండ వలయును.

167. ఎక్కటి అనునది యర్థానుగుణ మని యట్లు సరిచేయఁబడెను.

169. ద్యో+అధీశుఁడు=ద్యవధీశుఁ డని యగును. ఆపాఠమే గృహీతము. పూర్వపరిష్కర్తలు సూచించినట్లు శక్రుం డనియు సరి చేయఁబడెను.

172. ప్రవసనాదిశబ్దము లాజే కాని యేఁడు కావు. అందుచే శిఖిభ యని మార్పఁబడెను. శిఖిభ మనఁగా కృత్తికలు. అవి యాఱు.

173. మొదటనున్న అకారమునకు ఏ ఐ ఓ ఔలు పరముగా నుండి నచో ఐ ఔ లగు నను నర్థమున 'ఆద్యత్వమున' అను పాఠము వ్రాఁతప్రతిలోనిది యనుకూల మని గృహీతము.

176. అచ్చులకు నకారము కూడునేకాని అచ్చులు నకారములుగా మాఱవు. అందుచే కూడు నని సరిచేయఁబడెను.

177. 'హలంతము' లక్ష్యము కాదు. 'అనంత' ముదాహరణ మగును. చూ. వ్యాఖ్య.

178. చూ. భూమిక.

184. చూ. వ్యాఖ్య.

187. యశస్థితి- ఇది యుదాహరణము కాదు. యశస్తతి యుదాహ రణ మగును. మిథశ్ఛలంబు అనునదియు సముచితము. వాశ్ఛల సముకంటె భిన్నమగునుదాహరణము కావలయును. అందుచే ఛకారయుతమే గ్రాహ్యము.

191. యరలవహ లని అక్షరక్రమముగల పాఠ మాదృతము.

192. "వామపదముయొక్క సవిసర్గ మగునంతవర్ణము" అను నర్థము కావలయును. కావున నీపాఠము సాధువు. పూర్వపాఠమున నర్థము సరిపడదు, గణభంగమును గలదు.

194. పూర్వపాఠమున 'అత్వము' అనునది సరిపడదు. తత్త్వము అను
నది సరియగును. (వ్యాఖ్య చూ.)

195. తలమగు అనుదానియర్థము అన్వయింపదు. "దళ" మగు నను
నది తల చగు ననునర్థము నిచ్చును. అది యనంతరపదార్థమున
విశేషణ మగును.

197. ప్రసాద్యయము. పానీయశాలాదులయొక్క అయ మనఁగా
శుభావహవిధి అని యర్థము చేయవలయును. ఇది అంతగా సర
ళము కాదు. అందుచేఁ "బ్రపాద్వయము" అనుపాఠము స్వీకృ
తము.

198 కమఠాదు లనుపాఠమున ద్వంద్వసమాసము కానందున నుదా
హరణము కాదు. కమఠాద్రు లని యుండ రేఫము పోయి
యుండును. ఈపాఠమున ద్వంద్వసమాస మగుట నుదాహరణ
మగును.

199. పుణ్యాపాపము లన్నది సమాసమున రెండుపదములును సమాచ్ఛ
ములు. అందుచే "నల్పాచ్తరమ్" అనుసూత్రమునకు లక్ష్యము
కాదు. కాన "నపుణ్యాపుణ్యాములు" అనుపాఠ ముచితము. ఇం
దల్పాచ్చునకుఁ బూర్వస్థితి రాలేదు.

201. మహాత్మున కనుపాఠ మసందర్భము. మహచ్ఛబ్దమున కనునర్థ
మిచట నావశ్యకము. అందుచే మహాత్తున కనుపాఠము సరి
యయినది.

202. అభియోగము— ఇది యసందర్భము. ఆకారముతో యోగము
కలుగునని యచటఁ జెప్పవలయును. పూర్వపాఠము కేవల
దుష్టము. ఏమియర్థమని వారు తలంచిరో విచిత్రము. "ఆయోగ"
మనునది సార్థకపాఠము.

205. అచ్చులలో నేయేయచ్చు లంతమునఁగల శబ్దము లుండునో
చెప్పుచున్న సందర్భమున ఋకారమును విడిచి ౠవర్ణమును

జేర్చుట యత్యనుచితము. ఋూకారాంతములు లేక ఐకారాంతములు కానవచ్చుచుండఁగా ఋఋూ లనుపాఠ మత్యనుచితము. కనుకనే వ్రాఁతప్రతిలోని "ఋ ఐ" లను శుద్ధపాఠమును గ్రహించితిమి.

206. ఇందును బకారస్థానమున భకార ముండుటయే యుచితము. కకుభాదిభకారాంతములు కానవచ్చుచున్నవి. బకారాంతములప్రసిద్ధములును.

207. వ్యాఖ్య చూచునది.

210. శతక్రాఖ్యలు- అని లఘురేఫమును జూపుట సరికాదు. "రవలును" అని రేఫ మిదివఱకే గృహీతము. మరల దానిం జూపనేల. ఇతరగ్రంథములందును శతక్రులు శూద్రు లనియే యున్నది.

212. లసన్మతి=సద్బుద్ధితో అనునర్థము సమంజసము.

2 ఆ. 109 ప. లో ఘనసమాగమరీతిన్ అనుపాఠము వావిళ్ళవారి శివ ముద్రణమునఁ గలదు. కాని దానికి మున్నుగలపాఠము గణభంగ మని క్రింద సూచితము. నా వ్రాఁతప్రతిలోఁ గ్రమసమాహ్వాయరీతిన్ అను సరియగు నింకొకపాఠము గలదు.

ఇట్లు కొన్నిపాఠములం గూర్చి యించుక వివరించితిని. మిగిలినవి సుబోధములే యని వివరింపక విడిచితిని.

ఈసంస్కరింపఁబడినపాఠములలో నధికసంఖ్యాకములు వ్రాఁత ప్రతినిబట్టి సరిచేయఁబడినవి. ఆ వ్రాఁతప్రతులు శ్రీవిజయనగరమహారాజులకోటలోని గ్రంథాలయమునను న్న వ్రాఁతప్రతి యొకటియు విజయనగరప్రభుత్వమహారాజ సంస్కృతకళాశాలలోని వ్రాఁతప్రతి యొకటియు నగుచున్నవి, ఈ రెండుప్రతులును అభిన్నములే. వ్రాఁత ప్రతులనుబట్టి సరిచేయఁబడినపాఠములను పుష్పగుర్తుతో సూచించితిని

కొన్ని పూర్వముద్రణమునఁ బ్రమాదపతితము లయియుండ సరిచేయఁబడినవి- అవి 16, 86 సంఖ్యలుగలవానివంటివి.

13, 160, 169, 181 మున్నగునవి వ్యాకరణవిరుద్ధము లయి యసాధువు లగుచుండ సరిచేయఁబడినవి.

90, 198, 201, 202 మున్నగునవి సందర్భరహితము లయి కుదురుపడని తప్పుపాఠములు సరిచేయఁబడినవి.

38, 114, 123, 137, 140 మున్నగునవి యర్థము కుదురుబాటుకాక దోషయుక్తములుగా నుండ సరిచేయఁబడినవి.

10, 115, 124, 158 మున్నగునవి కొన్ని దుష్టసంధికార్యకములును అర్ధానుస్వార శకటరేఫాదివ్యవస్థారహితములు నయియుండ దిద్దఁబడినవి.

ఇంకఁ బలురకములపాఠదోషములు సరిచేయఁబడినవి. వాని యుక్తాయుక్తతలను సహృదయులే తెలిసికొందురు.

కౌండిన్యభాష్యకారేణ కలితా తత్త్వదర్శినీ !
సమర్ప్యతే శ్రీనివాసపదాంభోజే సతాం ముదే.

ఇట్లు
సుజనవిధేయుఁడు,
శ్రీ వేం. న. భాష్యకారాచార్యుఁడు,
విజయనగరము.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

శ్రీ

# ఛందోదర్పణము

## ప్రథమాశ్వాసము

శ్రీరామాస్తనమండలీమిళితకాశ్మీరార్ద్రవక్షంబుతోఁ
బారావారతరంగసంగతలసత్పర్యంకనాగంబుపైఁ
గారుణ్యామృతపూరపూరితకటాక్షశ్రీలఁ బెంపొందుగం
భీరస్వాంతుఁ డనంతుఁ డాశ్రితజనాభీష్టప్రదుం డయ్యెడున్. ౧

### తత్త్వదర్శిని

శ్రీమద్వేంకటనాథం
శ్రితజనమందార మాశ్రితాఘహరమ్
కమలాలంకృతవక్షస
మస్మత్కులదైవతం సదా సేవే.

అనంతామాత్యుఁడు తాను రచింపఁబోవుఛందశ్శాస్త్రము నిర్విఘ్నముగా సమాప్తి నొందఁగోరి "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపితన్ముఖ" మను పెద్దలవాక్యము ననుసరించి యాశీరూపమయినమంగళముం గావించుచున్నాఁడు.

శ్రీరామా=లక్ష్మీదేవియొక్క; స్తనమండలీ = కుచమండలమునందు; మిళిత=కూడియున్న; కాశ్మీర = కుంకుమపూవుచేత; ఆర్ద్ర=తడిసిన; వక్షంబుతోన్=వక్షఃస్థలముతోఁగూడి; పారావార=క్షీరసముద్రముయొక్క; తరంగ = అలలతో; సంగత=కూడినదై లసత్ = ప్రకాశించుచున్న; పర్యంకనాగంబుపైన్ = మంచమయిన

యాదిశేషునిపైని, కారుణ్యామృతపూర=దయయనెడి యమృతపు ప్రవాహముతో, పూరిత=నింపఁబడిన, కటాక్షశ్రీలన్ = క్రేఁగంటి చూపులశోభలతో, పెంపొందు=ఒప్పుచున్న, గంభీరస్వాంతుఁడు= ఇతరులకుఁ దెలియ శక్యముకానిహృదయముగల, అనంతుఁడు = నాశరహితుఁ డయినశ్రీహరి, ఆశ్రితజన = తన్నుజేరినవారికి, అనఁగాఁ బ్రపన్నులకు, అభీష్టప్రదుండు=వాంఛితముల నిచ్చువాఁడు, అయ్యెడున్=అగుఁగాక.

లక్ష్మీసమేతుఁ డయిననారాయణుని నుపాసించుటయు నిత్యసూరిముఖ్యుఁ డగుశేషుని స్మరించుటయు ననంతునిసంప్రదాయవేత్తృత్వమును దెల్పుచున్నది. ఇందు స్వనామధేయమును స్ఫురింపఁ జేయుచు మహావిష్ణువు ననంతనామముతోఁ గీర్తించుటయు గమనింపఁదగినది. ౧

**చ. అతనిదశావతారవిభవాతిశయంబున లోక మెల్ల శా**
**శ్వత మగుచాడ్పునన్ భజనసమ్మతరగ్ల[1]దశాక్షరాభిశో**
**భిత మగువాక్ప్రపంచ మని పెద్దయుఁ బ్రస్తుతి నొందునట్టిచో**
**వతఁడును నమ్మహాక్షరచయంబు జయంబు నొసంగుఁగావుతన్.**

అతని=ఆవిష్ణుదేవునియొక్క, దశావతార=మత్స్యకూర్మాదులయినపదిరూపములయొక్క, విభవాతిశయంబునన్ = వైభవాతిశయముచేత, (దశావతారము లనఁబడు విభవరూపములయతిశయముచేత ననియుఁ జెప్పవచ్చును. పరవ్యూహవిభవాంతర్యామ్యర్చారూపుఁ డయిననారాయణునియొక్క యవతారములను విభవరూపము లనుట యీతనిసాంప్రదాయికజ్ఞానమును సూచించును.) లోక మెల్లన్= లోక మంతయును, శాశ్వత మగుచాడ్పునన్ = ఉపద్రవములు లేక

1 గ్ల. శోట- పాఠము. పూగఁపాఠము- ల.

సుస్థిర మయినవిధముగా, భజనసమ్యతరగ్లఁ="భజనసమయతర" అను నెనిమిదిగణములును గురులఘువులు ననఁబడు, దశాక్షరాభిశోభిత మగు=పదియక్షరములతోఁ బ్రకాశితమయిన, వాక్ప్రపంచ మది= ఆవాఙ్మయము, పెద్దయుం బ్రస్తుతిన్ = శాశ్వతస్తుతిని, ఒందునట్టి చోన్=పొందెనేని, (అనఁగా లోకమునలె వాఙ్మయముగూడ నిత్యమును బ్రహ్మాత్మకము నగుట) అతఁడును=ఆనారాయణుఁడును, అమ్మహాక్షరచయంబును=ఆవాఙ్మయాధార మగునక్షరసముదాయమును, జయంబును=విజయమును, ఒసంగుఁగావుతన్=ఇచ్చుఁగాక.

ఈపద్యమున జగత్తు స్థూలసూక్ష్మావస్థాభేదమాత్రమున శాశ్వత మనియు అనఁగా నిత్య మనియు ననంతుఁడు విభవావతారములను ధరించి ధర్మసంరక్షణము చేయుచుండు ననియు శబ్దార్థములు నిత్యసంయుక్తములు కావున నర్థరూప మయినలోకము నిత్య మయిన తీరున శబ్దమును నిత్యమే యనియును సూచితము. ఈపద్యమును ఆశీరూప మగుమంగళమే యని గ్రహింపఁదగును. ౨

క. శ్రీవల్లభు యతిగణసం
సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురు నలఘుచ్ఛం
దోవినుతు ననంతశయనుఁ దోయజనాభున్. ౧

శ్రీవల్లభున్=లక్ష్మికిఁ బ్రియుఁడును, లక్ష్మియందుఁ బ్రీతిగలవాఁడును, యతిగణసంసేవిత=యోగిజనసమూహముచే సేవింపఁబడుచున్న (ఇచట వర్తమానక్తప్రత్యయ మని తెలియనగును), పాదారవిందున్=పాదపద్మములు గలవాఁడును, చింతితఫలదున్=తలంచుకొనినఫలముల నిచ్చువాఁడును, భావజగురున్ = మన్మథునికిఁ దండ్రియయినవాఁడును, మన్మథునికంటెను సుందర మగు దివ్యమంగళ

విగ్రహము గలవాఁడని భావము, అలఘుచ్ఛందః = అనంతము లయిన వేదములచేత, వినుతున్ = నుతింపఁబడువాఁడును, అనంతశయనున్ = శేషునియందు శయనించువాఁడును, అగు, తోయజనాభున్ = పద్మనాభుని, (సృష్టిమూలభూతుఁ డగునారాయణు నని భావము) ఈ ద్వితీయాంత మనంతపద్యమునందలి "అనంతుఁడు ప్రశంసించి" అనువాక్యముతో నన్వయించును.

ఈపద్యము గ్రంథప్రతిపాద్యము లగుకావ్యధర్మములం గొన్నింటిని సూచించుచున్నది. "కావ్యం యశసేఽర్థకృతే" అన్నట్లు కావ్యము శ్రీకరమనియుఁ, బద్యపాదములు యతులతోడను గణములతోడను గూడియుండు ననియు, సర్వశ్రేయస్కర మనియు, విభావాదిభావపరంపరలచే మహనీయ మనియు, గురులఘువులతోఁ గూడియుండు ననియు, వృత్తాద్యనేకచ్ఛందములతోడను శయ్యావిశేషములతోడను గూడియుండు ననియు, నాకావ్యము భగవత్స్వరూప మనియు నిందు సూచితములు. 3

క. ఛందోరీతిగ విమల
చ్ఛందుఁ డనంతుండొగిం బ్రశంసించి కృపా
మందిరు లగు శ్రీమద్గో
విందగురుప్రభులదయఁ బ్రవీణుం డగుచున్. ౪

విమలచ్ఛందుఁడు=నిర్మలాశయములుగల; అనంతుఁడు=అనంతామాత్యుండు, ఛందోరీతిగన్ = వేదమార్గమున, వేదావిరుద్ధముగా నని భావము. లేదా ఛందశ్శాస్త్రరీతిగా- అనఁగా పద్యములచేత ననియు నర్థము. ఒగిన్=క్రమముగా, ప్రశంసించి=నుతించి, కృపామందిరులగు=దయకు నివాసభూతులయిన, శ్రీమద్గోవిందగురుప్రభుల= జ్ఞానసంపదగల గోవిందాచార్యు లనఁబడు తనయాచార్యులయొక్క,

దయన్=అనుగ్రహముచే, ప్రవీణుండగుచున్=శాస్త్రప్రావీణ్యముగల వాఁడగుచును, దీని కనంతరపద్యమునందలి "చెప్పె" నను క్రియతో నన్వయము. ప్రశంసించి అనుక్రియలోనికిఁ బూర్వపద్యమునందలి తోయజనాభు నను పదము కర్మముగా నన్వయించును.

"ఛందోరీతిగ విమలచ్ఛందుఁడు" అనునది అనంతునికి విశేషణముగను నన్వయింపవచ్చును. అప్పుడు, ఛందోరీతిగ=ఉక్తాదిబహుచ్ఛందోమార్గముల నెఱింగిన, విమలచ్ఛందుఁడు=నిర్మలాశయములు గలవాఁడు అని యర్థము.

మూఁడుపద్యములతో శ్రీమన్నారాయణునిం బ్రశంసించి యీపద్యమునం దనకు విశిష్టాద్వైతసంప్రదాయపద్ధతి నాచార్యు లగు గోవిందాచార్యు లనంబడువారిని స్మరించి వారియనుగ్రహముచేఁ దనకుఁ బాండిత్యము లభించె నని చెప్పెను. సర్వశ్రేయములకు నాచార్యానుగ్రహము మూల మనఁబడుసంప్రదాయము నిచ్చట ననుసరించుట సూచితము. శ్రీవైష్ణవనామధేయములకుఁ బూర్వమున శ్రీమచ్ఛబ్దవిశేషణమును అంతమున నాచార్యశబ్దప్రయోగమును సాంప్రదాయికములు. "శ్రీమద్గోవిందగురు" అనుపద మట్టిరీతిఁ గూర్పఁబడెను. ౪

## ఛందఃప్రాశస్త్యము

**క. విద్యలలోపల నుత్తమ**
**విద్య కవిత్వంబు, మఱి కవిత్వము ఛందో**
**వేద్యము, గావునఁ జెప్పెను**
**హృద్యంబుగఁ గవితచంద మేర్పడఁ గృష్ణా! ౫**

కృష్ణా!=ఓ కృష్ణా!, విద్యలలోపలన్=అన్నివిద్యలలోను; కవిత్వము=కావ్యరచనము; ఉత్తమవిద్య=గొప్పవిద్య యనఁదగును.

మఱి=ఇంకను; కవిత్వము=కావ్యరచన; ఛందోవేద్యము=ఛందశ్శాస్త్రముచేఁ దెలియఁదగును. కావునన్=కావ్యరచనకు ఛందస్సు ఆవశ్యకము కావున; కవితచందము=కవిత్వమునకు సంబంధించిన ఛందశ్శాస్త్రమును; హృద్యంబుగన్ = మనోహరముగా; ఏర్పడన్ = స్పష్టమగునట్లు; చెప్పెన్, అనంతుఁడు ఛందశ్శాస్త్రమును రచించె నని భావము.

కవితచందము = కవిత్వముయొక్క తీరు; ఏర్పడన్ = తెలియఁబడునట్లు అనియుఁ జెప్పవచ్చును. కాని యీపక్షమునఁ జెప్పె నను క్రియలోనికి "ఛందశ్శాస్త్రమును" అను కర్మబోధకపద మధ్యాహార్యము. ౫

# సంజ్ఞా ప్రకరణము

## గద్యపద్యలక్షణము

ఆ. వె. పరగుఁ గవిత గద్యపద్యంబు నన, పాద
కల్పనంబు వలదు గద్యమునకు
పాదనియతి నొప్పుఁ బద్యంబు లవియు వృ
త్తములు జాతు లనఁగ నమరుఁ గృష్ణ!

కృష్ణ ! = ఓ కృష్ణా !; కవిత = కావ్యము; గద్య = గద్యము; పద్యంబును = పద్యమును; అనన్=అనుతీరున; పరగున్ = ఒప్పును. గద్యమునకు=గద్యకవితకు; పాదకల్పనంబు=పాదముల నేర్పఱుచుట; వలదు=చేయరాదు. పద్యంబు=పద్య మనఁబడు కవిత్వము; పాదనియతిన్=పాదముల నియమముతో; ఒప్పున్=ప్రకాశించును. అవియును=ఆపద్యములును; వృత్తములు జాతు లనఁగన్=వృత్తములును జాతులు నని రెండువిధములుగా; అమరున్=ఒప్పును.

కావ్యము గద్యము పద్యము నని రెండువిధములుగా నుండు ననియు గద్య మనఁగాఁ బాదవిభాగము లేని దనియుఁ బద్య మనఁగాఁ బాద నియమముతోఁ గూడియున్న దనియు నట్టిపద్యములు వృత్తములు జాతులు నని రెండువిధము లనియు భావము. "వృత్తం జాతి శ్చేతి ద్వివిధం పద్యం నిసర్గాఖ్యైః। సంబద్ధం వృత్తం స్యా దుపగణ మాత్రాభిరన్వితా జాతిః" అను చింతామణిశ్లోకార్థ మిం దనుసరింపఁ బడెను.

## గురు లఘు నిర్ణయము

కం. వృత్తంబులు గణబద్ధము
లుత్తమ ఘగుజాతులెల్ల నొనరఁగ మాత్రా

యత్తంబులు, లఘు వగుఁ బురు
షోత్తమ! యొకమాత్ర, గురువు లోలి ద్విమాత్రల్.

వృత్తంబులు=పూర్వపద్యోక్తవృత్తంబు లనంబడునవి; గణబద్ధంబులు=నిసర్గగణము లనఁబడు యరతాద్యక్షరగణాష్టకముచే నిబద్ధము లయియుండును. ఉత్తమ మగు=ఉత్తమము లయిన; జాతు లెల్లన్=జాతు లనఁబడుపద్యములెల్ల; ఒనరంగన్=ఒప్పునట్లుగా; మాత్రాయత్తంబులు = మాత్రాగణములతోఁ గూడియుండునవి యగును. (ఇట "నుత్తమ మగు" ననువిశేషణమునుబట్టి జాతులలో నుత్తమానుత్తమవిభాగము గల దని భ్రమింపరాదు. జాతు లన్నియు సహజముగా నుత్తమములే కాని వేఱు కావని సామాన్యవిశేషణమే యిది యని తెలియనగును.) పురుషోత్తమ! = ఓ శ్రీహరీ!; ఒక మాత్రన్=ఏకమాత్రాకాలముచే; లఘువు=లఘుసంజ్ఞ గలయక్షరము; అగున్=అగును. ద్విమాత్రల్=రెండుమాత్రలకాలము గలవర్ణములు; ఓలిన్=క్రమముగా; గురువులు="గురువు" అను సంజ్ఞ గలవి; అగు నని భావము.

నిసర్గగణబద్ధము లగుపద్యములు వృత్తము లనియు, మాత్రాపరిమితపద్యములు జాతు లనియు, నేకమాత్రాకాలికము లఘు వనియు, ద్విమాత్రాకాలికము గురు వనియుఁ జెప్పఁబడు నని తాత్పర్యము. 2

కం. వివిధముగఁ జాఁపి పలికెడు
నవియును, మఱియూఁదిపలుకునవియును గురువుల్
భువి నిలిపి పలుకువర్ణము
లవియెల్లను లఘువు లయ్యె నంబుధిశయనా! 3

అంబుధిశయనా! = పాలసంద్రమునఁ బవ్వళించువాఁడా!; వివిధముగన్=పలువిధములుగ; చాఁపిపలికెడునవియును = పొడిగించి పలుకఁబడువర్ణములును; అనఁగా ఆ ఈ ఊ ఏ ఓ మున్నగు పలు రీతుల పొడిగించిపలుకఁబడువర్ణములు (దీర్ఘములు) ను; మఱి=ఇంకను; ఊఁదిపలుకునవియును=ఒత్తి పలుకఁబడునవియును; గురువుల్=గురువు లనుసంజ్ఞ గలవి; అయ్యెన్=ఆయెను.

అనఁగా సంయుక్తవర్ణపూర్వాక్షరమును సాధారణముగా నొత్తిపలుకుదుము కావున నట్టివియు, అనుస్వార విసర్గ కేవలహల్ పూర్వవర్ణములును ఒత్తిపలుకఁబడును గాన నవియును, దీర్ఘాక్షరము లును గురువు లగును. సంయుక్తవర్ణపూర్వాక్షరమును గొన్నిచోట్లఁ దేల్చియే పలుకఁబడును. అట్టిచో గురువు కాదు. ఉదా॥ చను మగ ణము శ్రీనాథా, 1-13. దిక్కు- అద్రువ ననఁగ; 1-49. వీనిలో సంకేతితములు సంయుక్తపూర్వకములే యయినను దేల్చి పలుకఁబడుచున్నవి. కాన నివి గురువులు కాలేదు. భువిన్=భూమి యందు; నిలిపిపలుకు = చాఁపక త్రెంపిపలుకునట్టి; వర్ణము లవి = ఆవర్ణములు; ఎల్లను = అన్నియును; లఘువులు = లఘుసంజ్ఞ గలవి; అయ్యెన్=ఆయెను. "హ్రస్వం లఘు" అను పాణినిసూత్రానుసార ముగా లఘుసంజ్ఞ చేయఁబడె ననఁదగును.

ఒత్తిపలుకునవి యనుటచే దీర్ఘేతరగురువర్ణము లన్నియును సంగ్రహింపఁబడును. పొల్లుహల్లునకును, ననుస్వార విసర్గములకును బూర్వమున నున్నవర్ణము లొత్తిపలుకఁబడును గాన నవియన్నియును గురువులే యగును. "సానుస్వారో విసర్గాంతో దీర్ఘో౽యుక్తపరశ్చయః గురు మేతం విజానీయాత్" అనులక్షణమునఁ బొల్లుహల్లునకుఁ బూర్వవర్ణము సంగ్రహింపఁబడలేదు. ఇం దట్టిదోషములు లేక లక్షణము సమీచీనముగా నున్నది.

పాణినీయగురులఘులక్షణములు ఛందశ్శాస్త్రమునకు సరి పడవు. అందు సంయుక్తపూర్వములు కాని హ్రస్వము లన్నియును లఘువులే కావలయును గదా! ఇం దట్లుకాక హ్రస్వ మయినను ననుస్వారవిసర్గాదిపూర్వ మయినచో సంయుక్తపూర్వమువలె గురువే యగును. పాణినీయమున నట్టివానికి గురుత్వము లేకున్నను నెట్టి హానియు లేనందున వారిసంజ్ఞ యాశాస్త్రమునకు సరియయినదే యగును. ఛందస్సునకు లక్షణభేద మావశ్యక మయ్యెను.

కవిజనాశ్రయాప్పకవీయ గురులఘులక్షణములకంటె నియ్యది రమణీయము.

"గురువులు నిడుదలు జడ్డ
క్కరముల బొట్టుల పిఱుందకడ నూఁదినయక్కరములు"

కవిజనా. సంజ్ఞా. 13 ప.

ఇందు సంయుక్తపూర్వవర్ణమును బిందుపూర్వవర్ణమును ఒత్తి పలికినచో గురు వగు నని చెప్పఁబడెను. ఇట్లుచెప్పుటచే అద్రువ మున్నగుచోట్ల సంయుక్తపూర్వవర్ణమును రాముఁడు మున్నగుచోట్ల బిందుపూర్వవర్ణమును ఒత్తిపలుకఁబడదు కావున గురువు కాదు. అందుచే నిట లక్షణ మతివ్యాప్తము కాలేదు. కాని యూఁదిపలుకఁ బడువాని నన్నింటిని గురువు లనక సంయుక్తపూర్వమును బూర్ణబిందు పూర్వమును మాత్రమే యొత్తిపలుకునప్పుడు గురువు లగు ననుటచే విసర్గపూర్వమును పొల్లుహల్లునకుఁ బూర్వముననున్న వర్ణమును సంగ్ర హింపఁబడక లక్షణ మవ్యాప్త మగుచున్నది.

"బొట్టులపిఱుందకడ" నని యర్ధపూర్ణానుస్వార సామాన్య ముగాఁ జెప్పినను నర్ధానుస్వారపూర్వవర్ణ మూఁదిపలుకఁబడదు కానఁ దత్పూర్వవర్ణము గురువు కావలసిరాదు. కావున లక్షణ మతివ్యా ప్తముమాత్రము కాదు,

కం. ఇల జమిలియక్కరములకుఁ
బలుసున్నకు నెడమ నూఁది పల్కెడువర్ణం
బులుఁ జూఁచిపలుకునవియును
లలి గురువులు కడమలివులు లఘువు లఘూరీ !

అప్ప. 4 ఆ. 47 ప.

అప్పకవియుఁ గవిజనాశ్రయలక్షణమునే సరిగా ననుసరించియుఁ బూర్ణపదవిశేషణము లేని యనుస్వారశబ్దప్రయోగము సరిపడ దని భ్రమించియో ఛందోనుసారముగ నావశ్యక మగుటనో పూర్ణబిందు పూర్వక మనునభిప్రాయముతో "బలుసున్నకు నెడమ నూఁదిపల్కెడు వర్ణంబులు" అని చెప్పెను. ఇందు "బలు" అనుమాట లేకున్నను నతివ్యాప్తి సంభవింపదు. కవిజనాశ్రయ లక్షణదోషము లన్నియు నిందును గలవు. అనంతునిలక్షణముమాత్రము నిర్దోష మయియున్నది. ౮

**కం. గురు వమరు నూర్ధ్వపుండ్రము**
**ధరియించినరీతి, లఘువు దనరును హరి యొ**
**క్కరుఁడ పరతత్త్వ మనుచును**
**సురుచిరముగ జుట్టవ్రేలఁ జూపినమాడ్కిన్. ౯**

గురువు=గుర్వక్షరము; ఊర్ధ్వపుండ్రము=నిలువుబొట్టు; విశిష్టాద్వైతుల బొట్టు అని భావము. ధరియించినరీతిన్ = ధరించినట్లుగా; అమరున్=ఒప్పును. గుర్వక్షరమును వ్రాఁతలోఁ జూపవలసినపుడు విశిష్టాద్వైతుల "తిరుమణ్" అనఁబడు నూర్ధ్వపుండ్రమువలె వ్రాయుదురని భావము. ఉదా॥ "U". హరియొక్కరుఁడ = నారాయణుఁ డొక్కఁడే; పరతత్త్వము=సర్వోత్కృష్ట మగువస్తువు; అనుచును; సురుచిరముగన్=మనోహరముగా; జుట్టవ్రేలన్=చూపుడువ్రేలితో; **చూపినమాడ్కిన్=చూపినతీరుగా; లఘువు=లఘ్వక్షరము; తన**

ర్ణ=ఒప్పును. అనఁగా ఒకటి యనుసంఖ్యను జెప్పుచు వ్రేలు చూపిం చినతీరున ననఁగా సరళ మగుహ్రస్వరేఖ వ్రాసినట్లు లఘ్వాకార చిహ్నము వ్రాయఁదగు నని భావము. ఉదా॥ "।"

ఊర్ధ్వపుండ్రము నుపమానముగాఁ జెప్పుటయు విష్ణు వొక్కఁడే పరతత్త్వ మనుటయు నీతని విశిష్టాద్వైతసిద్ధాన్తాసక్తిని వెల్లడించు చున్నది. ఇతఁడు తనగ్రంథములలోఁ బలుచోట్లఁ దనకుఁ గల వైష్ణవ మతాసక్తిని సూచించుచుండును. చిత్తు అచిత్తు ఈశ్వరుఁడు అని తత్త్వములు మూఁడనియు నందీశ్వరతత్త్వము పరతత్త్వ మనియు "ఏకోహ వై నారాయణ ఆసీత్ నబ్రహ్మా నేశానః" ఇత్యాదిశ్రుతులచే నారాయణుఁడు పరతత్త్వ మని చెప్పఁబడుచున్న దనియు విశిష్టాద్వై తుల యాశయము.

**కం. గోవిందప్రభుఁ డనినన్**
**గోవిదు లవి మూఁడు మూఁడు గురులఘువులుగా**
**భావింతురు; గురులఘువులు**
**మోవఁగ మూఁడేసి నిక్కముగ గణము లగున్. ౧౦**

"గోవిందప్రభుఁడు" అనినన్=గోవిందప్రభుఁడు అని పలికి నపుడు, అవి=ఆయా అక్షరములును, మూఁడు మూఁడు=మూఁడేసి, గురులఘువులుగాన్=మొదటివి మూఁడును గురువు లనియు తర్వాతి మూఁడును లఘువు లనియు, గోవిదులు=విద్వాంసులు, భావింతురు= తలంతురు.

గురులఘువులు=గురువులు గాని లఘువులు గాని, మూఁడేసి= మూఁడేసివర్ణములు, మోవఁగన్=కలియఁగా, నిక్కముగా=నిజముగా, గణము లగున్=గణములు నిష్పన్నము లగును.

"గోవింద" అను మూఁడును గురువులు, "ప్రభుఁడు" అను

మూఁడును లఘువులు. గురులఘువులలో నేవేని మూఁడేసియక్షరములు కలిసినచో గణము లని వ్యవహరింతురు.

ఉదాహరింపఁబడినగురువులలో దీర్ఘము బిందుపూర్వము సంయుక్తపూర్వము ననుముత్త్రైవిధ్యములు గలవు. లఘు వేకవిధము. ౧౦

గణాష్టకలక్షణము

**కం. భ జ న స మ య ర త గణములు**
**భజనసమయరతములై సభక్తికమతిఁ బం**
**కజనాభు నహర్నిశమును**
**భజించుదిక్పాలగణముభాతిఁ దనర్చున్. ౧౧**

భ జ న స మ య ర త గణములు = భ జ న స మ య ర త అనుగణములు ఎనిమిదియు, భజనసమయ=భగవంతుని భజించునాచారమునందు, రతములై=ఆసక్తిగలవై, సభక్తికమతిన్=భక్తితోఁ గూడినమనస్సుతో, అహర్నిశమును = దివారాత్రములు, పంకజనాభున్=విష్ణువుని, భజించు=సేవించునట్టి, దిక్పాలగణముభాతిన్=దిక్పతులసమూహమువలె, తనర్చున్, ఒప్పును.

ప్రథమద్వితీయపాదములం దెనిమిదక్షరముల కావృత్తి కలదు. కాన యమకాలంకారము. ౧౧

**గీ. గురులఘువు లోలి మూఁడేసి కూడిన మ న**
**లాదిమధ్యావసానంబులందు గురువు**
**లొందు భ జ సలు, లఘువు లట్లొంద య ర త**
**లనఁగ నయ్యష్టగణము లొప్పును ముకుంద ! ౧౨**

గురువులు మూఁడు కూడిన మగణము, లఘువులు మూఁడు కూడిన నగణము, మూఁడక్షరములలో నాదిగురువు భగణము, మధ్యగురువు జగణము, అంత్యగురువు సగణము నగును. అట్లే యాది

లఘువు యగణము, మధ్యలఘువు రగణము, నంత్యలఘువు తగణము నగును. ఇట్లిమ్మదిగణములు సిద్ధించు నని తాత్పర్యము. ౧౨

కం. చను మగణము 'శ్రీనాథా'
యనిన, 'ముకుందా' యనంగ యగణము, రగణం
బన నొప్పు 'మాధవా' యన,
నొవరఁగ 'వైకుంఠ' యనఁగ నొగిఁ దగణమగున్. ౧౩

కం. భగణ మగు 'విష్ణుఁ డ' నఁగా
నగణితముగ జగణ మగు 'మురారి' యనంగా,
నగణము 'విభుఁ డ' ని పలికిన,
సగణము 'వరదా' యనంగ సత్కృతులందున్. ౧౪

౧౩, ౧౪ పద్యములు అష్టగణముల కుదాహరణములుగా మూఁడేసి యక్షరములపదములను జెప్పుచున్నవి. ఇవి సులభార్థకములు. ౧౪

కం. గురువును లఘువును, లఘువును
గురువును, హ వ లగును; గలలు గురులఘుసంజ్ఞల్
వరుసను గగ లల గణముల
కరయఁగ వర్ణములు ద్విగుణమై యొప్పు హరీ! ౧౫

గురులఘువులు హ గణము, లఘుగురువులు వ గణము, గ అనఁగా గురువు, ల అనఁగా లఘువు, "గగ" అనఁగా రెండుగురువులు, "లల" అనఁగా రెండులఘువులు అని సంజ్ఞలు చెప్పఁబడెను. ౧౫

కం. 'శౌరి' యనిన హగణం బగుఁ,
జేరి 'హరీ' యనఁగ నుల్లసిల్లును వగణం,
బరయఁ 'గృష్ణా' యనినను
ధారుణి గగ మంత్రము, లలము దా 'హరి' యనినన్.

పూర్వపదోక్తగణసంజ్ఞల కుదాహరణము లిందుఁ జూపఁ బడెను.

సీ. కమలనాభా! నగగంబు, కమరరూప!
నహ, మసురాంతక! నాఁగ నలల,
మద్రిధర! భలంబు, భద్రయశా! యన్న
భగురు, వంభోజాక్ష! మగణలఘువు,
భువనేశ్వరా! యన్న నవ, మఘవిద్వేషి!
నహము, పీతాంబర! నఁజ్ఞ తలము,
కైటభారి! రలంబు, గజవరదా! యన్న
నవ, మహిశయన! నా నలల మయ్యె,
ఆ. వె రగణగురువు దేవరాజా! యనంగఁ, బ
ద్మాపతీ! యనంగఁ దగణగురువు,
నరహరీ! యనంగ నరహరి! నరసింహ!
నాఁగ నొప్పు నగము నలము సలము. ౧౭

ఇరువదితొమ్మిదవపద్యమున గణములమొత్తము ౨౯ అని చెప్పఁ బడెను. వానిలో ౧౨, ౧౪ పద్యములందుఁ జెప్పఁబడిన ౧౨ గణములు కాక మిగిలిన ౧౭ గణముల నిందు వివరించెను. వానిలోఁ జంద్రగణములు పదునాల్గును ఇంద్రగణములలో "భ ర త" గణములు పూర్వప్రోక్తము లగుటచే మిగిలిన నల, నగ, సలము లను మూఁడుగణములు నిందుఁ జెప్పఁబడెను. సూర్యగణములలో గలము ౧౪ వ పద్యమునను నగణము ౧౨ వ పద్యమునను జెప్పఁబడెను.

"కమలనాభా" ఇది "నగగ" మున కుదాహరణము. ఇట్లే సోదాహరణముగా గణము లిటుఁ జూపఁబడినవి. ౧౭

## ఇంద్రచంద్రాదిగణభేదములు

కం. ద్వి త్రి చతు ర్గురుభవముల
ధాత్రీధర ! రెండు మడఁపఁ దక్కినగణముల్,
మిత్రేంద్రచంద్రు లనఁ జను
మాత్రాదిగణంబుమొదల మాత్ర లిడంగన్. ౧౮

ధాత్రీధర !=భూమిని ధరించువాఁడా, శ్రీహరీ ! ద్విత్రి . . . ముల=రెండు మూఁడు నాలుగు గురువులను ప్రస్తరింపఁగా నేర్పడినగణములలో, రెండుమడఁపన్=ప్రస్తారమునందలి మొదటిరెండేసి గణములను విడువఁగా, తక్కినగణముల్=మిగిలినగణములు, మాత్రాది గణంబుమొదలన్ = లఘ్వాదిగణముమొదట, మాత్ర లిడఁగన్= ఒక్కొకలఘువుం జేర్పఁగా, మిత్రేంద్రచంద్రు లనఁ జనున్=వరుసగా సూర్యేంద్రచంద్రగణము లనఁబడును. రెండు మూఁడు నాల్గు గురువులను ప్రస్తరింపఁగా నేర్పడినగణములలో మొదటి రెండేసిగణములను విడచి తక్కినగణములలో లఘ్వాదిగణములందుఁ బూర్వభాగమున నొక్కొకలఘువుం జేర్పఁగా నేర్పడినగణములు క్రమముగా సూర్యగణములు ఇంద్రగణములు చంద్రగణములు నగు నని భావము.

ఉదాహరణము —

ద్విగురుప్రస్తారము.

ں ں } మొదటిరెండును విడువఁదగినవి.
ں ں }

ں । ఇది గలము. ఇది సూర్యగణము.

। + । । ఇది లఘ్వాది యగుటచే ముందు లఘువుం జేర్పఁగా
నగణ మయ్యెను. ఇదియును సూర్యగణమే.
ఇట్లు సూర్యగణము లేర్పడెను

త్రిగురుప్రస్తారము.

∪ ∪ ∪ } ఇవి మొదటివి కనుక విడువఁబడెను.
| ∪ ∪ }

∪ | ∪ ౪, ౬, ౮ గణములు లఘ్వాదులు కావున వానికిఁ
| + | | ∪ బూర్వమున నొకలఘువుం జేర్పఁగా ౩, ౪, ౫,
∪ ∪ | ౬, ౭, ౮ గణములు వరుసగా ర, నగ, త, సల,
| + | ∪ | భ, నల గణము లగును. ఈయాఱును నింద్రగణము
∪ | | లగును.
| + | | |

చతుర్గురుప్రస్తారము.

∪ ∪ ∪ ∪ } ఇవి మొదటివి కనుక రెండును వదలినారము.
| ∪ ∪ ∪ }

∪ | ∪ ∪ మిగిలినవానిలో ౪, ౬, ౮, ౧౦, ౧౨, ౧౪,
| + | | ∪ ∪ ౧౬ గణములు లఘ్వాదులు కనుక వానికిఁ
∪ ∪ | ∪ బూర్వమున నొక్కొక లఘువుఁ జేర్పఁగా
| + | ∪ | ∪ మూఁడవగణమునుండి వరుసగా రగ, నగగ, తగ,
∪ | | ∪ సలగ, భగురు, నలగ, మలఘు, సగల, రల,
| + | | | ∪ నగల, తల, సలల, భల, నలల గణము లేర్ప
∪ ∪ ∪ | డును. ఇవి పదునాల్గును జంద్రగణములు. ౧౪
| + | ∪ ∪ |
∪ | ∪ |
| + | | ∪ |
∪ ∪ | |
| + | ∪ | |
∪ | | |
| + | | | |

**కం. గల నగణము లిను, డింద్రుఁడు**
**నల నగ సల భరత, లింక నగగ, నహ, సలా,**
**భల, భగురు, మలఘు, సవ, సహ**
**తల, రల, నవ, నలల, రగురు, తగ లిందుఁ డజా! ౧౯**

అజా !=జన్మలేనివాఁడా ! సలా=సలల; ఇట దీర్ఘము రెండు గణములను బోధించును. చూ॥ ౧ ఆ. ౧౨౮ ప.

పూర్వపద్యోక్తరీతిని సిద్ధించిన త్రివిధగణములు నిందు వరుసగాఁ జెప్పఁబడెను. ౧౯

**గీ. ఒక్కనెలవున నెనిమిది, యొకటి నాల్గు,**
**వెండి లఘు వెక్కినవి నాల్గు, వీనిలోన**
**నగణపునరుక్తి నొక్కటి డిగియె, నౌల**
**దొంతి పదునాల్గు, నిరువదితొమ్మిదింట. ౨౦**

ఇరువదితొమ్మిదింటన్ = మొత్త మిరువది తొమ్మిదిగణములలో; ఒక్కనెలవునన్ = ఒకస్థానమున; ఎనిమిదిగణములు, అనఁగా "య ర త భ జ స మ న" అను నక్షరగణములు. ఇవి 11 వ పద్యమునఁ జెప్పఁబడెను. ఒకటన్=మఱియొకచోట; నాల్గు=నాల్గు గణములు; "గల, లగ, గగ, లల" అనునవి. ఇవి 15 వ పద్యమునఁ జూపఁబడెను. వెండి = మఱియు; లఘు వెక్కినవి = పూర్వభాగమున లఘువు చేరఁగా నేర్పడినవి; నాల్గు=నాల్గుగణములు (కలవు). అనఁగా రెండుగురువులను బ్రస్తరించినపుడు ఏర్పడిన రెండుగణములలో లఘ్వాదిగణమునకు ( I I ) ఒకలఘువు పూర్వమునఁ జేరఁగా ( I + I I ) నగణమును, త్రిగురుప్రస్తారమున నేర్పడిన యాఱుగణములలో లఘ్వాదు లగు మూఁడుగణములకును ( I I U , I U I , I I I ) పూర్వభాగమున నొకలఘువు చెరఁగా ( I + I I U , I + I U I ,

I + I I I ) నేర్పడిన గణములు మూఁడును మొత్తము నాల్గగును. వీనిలోనన్=ఈ నాల్గింటిలో; నగణంపునరుక్తి నొక్కటి డిగియెన్= యరతాదిగణములలో నుక్తమయిన నగణమే గురుద్వయప్రస్తారము నను నేర్పడినది కాన దానిని విడువఁగా మూఁడుమాత్రమే యుం డును. పొలన్ = అవులన్ = తర్వాత; దొంతి=వరుసగా; పదునాల్గు చతుర్గురుప్రస్తారమున నేర్పడిన చంద్రగణములు పదునాల్గును నగు నని భావము.

అనఁగా మొత్తము ౨౯ గణములు, అం దక్షరగణములు ౮, పదునేనవపద్యమునం జెప్పినగణములు నాల్గు, అక్షరగణములలోఁ జేరని యింద్రగణములు మూఁడు, చంద్రగణములు పదునాల్గు అని భావము. సూర్యగణములలోని నగణము అక్షరగణములలోను, గలము ౧౫ వ పద్యోక్తగణములలోను జేరిపోవుటచే వానికిఁ బృథగ్గణన మక్కఱలేకపోయెను. ౨౦

## సంయుక్తవర్ణగణములు

**క. జగణము నల మగు; గగములు**
**భగణము లగు; గలము నగణభావంబుఁ గనున్**
**సగము నగణవగణము లగుఁ,**
**దగణము భల మగును సంయుతముఁదీర్చినచోన్. ౨౧**

గురువు ద్విమాత్రకము. లఘు వేకమాత్రకము. గురువును రెండులఘువులుగా మార్చినచో నేర్పడురీతిని గొన్నిగణములందుఁ జూపుచున్నాఁడు. సంయుతముఁ దీర్చినచోన్=సంయుక్తాక్షరము న సంయుతముగా మార్చినచోన్; వళ్ళు వళులు, వాకిళ్ళు వాకిళులు మున్నగురీతిని విడఁగొట్టినచో; జగణము నల మగున్=జగణమున గురువును రెండులఘువులుగా విడఁగొట్టినచో నల మగును. గగములు

భగణము లగున్=గగమున రెండవగురువును రెండులఘువులుగా మార్చినచో భగణ మగును. గలము నగణభావంబు గనున్=గలము అట్లే నగణ మగును. సగము నగణవగణము లగున్=సగమునందలి మొదటిగురువును లఘుద్వయముగా మార్చినచో నగణముపై వగణముగా మాఱును.

**కం.** [1]**మొగిళులు నల మగు నిటులన్**
**వగణము సగణ మగు నిటు లనంగునితంౘ్రడీ!**
**తగణము; పాళు లనంగా**
**భగణము వాకిళ్ళు భలము వాకిళు లనఁగాన్.** ౨౨

మొగిళులు నల మగు నిటులన్=ఇట్లే మొగిళ్ళు అనుపదమున సంయుతమును విడఁగొట్టిన మొగిళులు అని జగణము నలముగా మాఱును. ఇది పూర్వపద్యప్రథమాంశమున కుదాహరణము. అనంగునితంౘ్రడీ = మదనజనకా!, ఇటులు = ఇట్లే, నగణము, సగణము, తగణమును అగుః=నగణ సగణ తగణములును మాఱును. (వీని కుదాహరణముల నీయలేదు.) పాళు లనంగా భగణము=పాళ్ళు అనునది పాళులు అనినచో భగణ మగును. వాకిళ్ళు వాకిళు లన్నచో భల మగును.

కొన్ని తెలుఁగుపదములు సంయుక్తాక్షరములతోడను నసంయుక్తాక్షరములతోడను ద్వివిధములుగా నుండును. అట్టివి యిట నుదాహరణము లగుచున్నవి.

ఇందు 2 వ పాదమున "అనంగ" పదము నిత్యసమాసపద మగుటచే నుభయయతి కర్హము. కావున నకారము యతికి గృహీత మయ్యెను. ౨౨

---

1 ఈ పద్యమున బహువిధ పాఠములు గలవు. ఎవ్వియును సరసముగాఁ గానరావు. పూర్వపాఠమునే గ్రహించి వ్యాఖ్య చేయఁబడెను.

క. నవ్యసుఖప్రదాయి భగణంబు, జకారము రుక్ప్రదం బగున్,
ద్రవ్యముఁ జేయు నా; లయకరంబు సకారము, మా శుభంబు, యా
దివ్యసువర్ణకారి, వెతఁ దెచ్చును రేఫ, విభూతి నిచ్చుఁ దా,
కావ్యములందు నాది నిడఁ గర్తకు భర్తకు నంబుజోదరా! ౨౩

అంబుజోదరా!=ఓపద్మనాభా! కావ్యములందు నాది నిడన్=
కావ్యప్రారంభపద్యములం దుంచినచో; కర్తకు భర్తకున్ = కావ్య
ము రచించినవానికిని కృతిపతికిని; భగణంబు నవ్యసుఖప్రదాయి=
భగణము నూతనసుఖము నిచ్చునదియు; జకారము = జగణము;
రుక్ప్రదంబు = రోగప్రదమును; అగున్ = అగును. నా=నగణము;
ద్రవ్యముఁ జేయున్=ధనమును గల్గించును. సకారము=సగణము;
లయకరంబు=వినాశమును గలిగించును. మా=మగణము; శుభంబు=
శుభకరము. యా=యగణము; దివ్యసువర్ణకారి=శ్రేష్ఠమయిన బంగా
రము నిచ్చును. రేఫ=రగణము; వెతన్=వ్యథను; తెచ్చును=కలిగిం
చును. తా=తగణము, విభూతిన్=ఐశ్వర్యమును; ఇచ్చున్. గణవిజ్ఞా
నము కావ్యనిర్మాణమునకే కాక యిట్టి శుభాశుభజ్ఞానమునకును
నుపయోగించు నని తెలియనగును.

ఈ గణఫలములు కవిజనాశ్రయము ననుసరించియే యున్నవి.

శుభ సుఖ రుక్ క్షయ ధన కన
శుభ మైశ్వర్యములఁ జేయుఁ గ్రమమునఁ గావ్య
ప్రభులకుఁ గవులకు మొదలిడ
మ భ జ స న య ర త గణముల మల్లియరేచా!

కవిజనాశ్రయము. సంజ్ఞాధికారము. ౨౩

## గణాధిదైవతములు

చ. భగణము నేలుఁ జందురుఁడు, భానుఁడు దా జగణంబు నేలుఁ, దా
నగణము నేలు నిర్జరగణంబు, సమీరణుఁ డేలు నెప్పుడున్
సగణము, నుర్వి యేలు మగణంబు నొగి, న్యగణంబు తోయమున్
రగణముఁ బావకుండుఁ, దగణంబు నభంబును నేలుఁ గేశవా! ౨౪

ఇఁక గణముల కధిదైవతములను జెప్పుచున్నాఁడు. అధిదేవతల క్రూరతాసౌమ్యతల ననుసరించియే పూర్వపద్యోక్తగణఫలములును సంభవించుచున్నవి.

నిర్జరగణము=దేవతలసమూహము; సమీరణుఁడు=వాయువు; పంచభూతములును- సూర్య చంద్ర దేవగణములును అష్టగణముల కధిదేవతలు. అగ్ని వాయు సూర్య దేవతాకము లగు ర స జ గణము లశుభము లనియు మిగిలినవి శుభప్రదము లనియుఁ దెలియఁబడుచున్నది. ౨౪

## కృత్యాదివర్జనీయగణాక్షరములు

క. పుర శర రస గిరి రుద్రుల
నరయ న క చ ట త ప లిడుట యనుచిత మయ్యు
క్షరములును ర స భ జంబులుఁ
బరిహరణీయంబు లాదిఁ బంకజనాభా! ౨౫

పుర=3, శర=౫, రస=౬, గిరి=౭, రుద్రులన్=౧౧; ఆదిన్=కావ్యాదిని; కృత్యాదిప్రసంగమున గణములతోపాటు కొన్ని స్థానములందు వర్జింపఁదగు నక్షరములను జెప్పుచున్నాఁడు.

కావ్యాదిని 3, ౫, ౬, ౭, ౧౧ స్థానములందు "అ క చ ట త ప" అనునక్షరములును ఆరంభమున ర స భ జ గణములును

గూర్పరాదు. (ఇట భగణము పరిహరణీయ మనుట విచార్యము. అనేకగ్రంథములందు భగణ మాదిని ప్రయోగింపఁబడియున్నది.)

"పురాస్త్రరసగిరిరుద్రేష్వకచటతపానింద్యాః" అని చింతామణిసూత్రము గలదు. దీనిననుసరించియే యీపద్యమును నున్నది. దీని కహోబలపతియు ౩. ౫. ౬. ౭. ౧౧. స్థానములలో "అ క చ ట త ప" లుండరాదనియే వ్యాఖ్యానించెను. ఈయక్షరములకును స్థానములకును గ్రమముకూడ వివక్షితము కాదనియే చెప్పెను.

బ్రహ్మశ్రీ వ. చి. సీతారామస్వామిశాస్త్రిలవారుమాత్రము ఈపాఠమునే గ్రహించియు రస శబ్దమునకుఁ దొమ్మిది యని యర్థము చెప్పుచుం దదనుగుణముగా "గిరిరస" అని సూత్రములోని పదములక్రమమును మార్చిరి. "తృతీయోచ్చ తృతీయోష్మ తృతీయే సరళాస్త్రయః। షోడశ వ్యంజనం చాపి షష్ఠస్థానే న యుజ్యతే." అనునథర్వణకారికలో "త" కార మాఱవయింట నిషిద్ధ మగుటచేఁ బునరుక్త మగుట యుచితము కాదు కావున నిందు షష్ఠస్థాన మనక రస శబ్దమునకు నవమస్థాన మని యర్థము చేసి సూత్రమును స్వల్పముగా మార్చిరి.

అప్పకవి యీసూత్రమునకు "పురాస్త్రరసగిరిరుద్రేష్వ కచటపామాతృకానింద్యాః" అని పఠించి రసశబ్దమున కాఱనియే యర్థమును జెప్పెను. ఇతనిపాఠమున నయిదుస్థానములలో నయిదక్షరములను నిషేధించుట సమముగా నున్నను స్థానక్రమము లేదనియే చెప్పెను. అట్టివారిపద్యముల నుదాహరణముగాఁగూడ నిచ్చెను.

ఇందుఁ బరిహరణీయగణములలో భగణమును జేర్చుట యనరతామాత్యునికి సమ్మత మని చెప్పఁజాలము. అనేకు లగుకవులు గ్రంథాదిని భగణము నిడుటయేకాక యీయనంతామాత్యుఁడే భోజరాజీ

యమును "స్త్రీరమణీపయోధరపరిస్ఫుటకుంకుమఫాలభాగకస్తూరికలు ......" అని భగణముతో నారంభించెను. కావున నిందు భగణము పరిహరణీయము కారాదు. "అయ్యక్షరములునుఁ రసజంబులు, పరిహరణీయంబు లాదిఁ బంకజనాభా" అనుపాఠము సమంజస మని తోఁచెడి. భగణము చంద్రదేవతాక మగుటచేతను "నవ్యసుఖప్రదాయి భగణంబు" అని యితఁడే వచించుటచేతను భగణమును బరిహరణీయముగాఁ జెప్పరాదు. ౨౫

క. మొదలను క ఖ జ లు, చ ఛ డ లు,
దథ లు ను, భ య శ క్ష ష స లు తగవు[1]; పవర్ణ
స్పదములుఁ గాకుండిన మే
లొదవించును; స్వరములెల్ల నుత్సవకారుల్. ౨౬

కావ్యాదిపద్యమున "క ఖ జ చ ఛ డ త ధ భ య శ క్ష ష స" అనునక్షరము లారంభమున నుండరాదు. ఈవర్ణములు ఉపవర్ణములుగానైనను ననఁగా ద్వితీయాక్షరములుగాఁ గాని ప్రథమాక్షరముతో సంయుక్తములుగాఁ గాని యయినను నున్నచో మేలు కలుగదు. కావున నట్లు కాకుండిన మేలు కలుగును. స్వరములుమాత్ర మాద్యపద్యాది నుపవర్ణములుగా నున్నచో శుభకరములే యగును.

ఇందుఁ జెప్పఁబడినవర్ణములలో "జ డ" లు తప్ప మిగిలిన యక్షరములు వాయ్వగ్నిగగనబీజాక్షరము లగుటచేఁ బరిత్యాజ్యములే యగును. "జ డ" అనువర్ణములుమాత్రము భూమిబీజాక్షరము లగుటచే ధనప్రదములు కావున నిషేధ్యములు కావు. వానిస్థానమున "జ ఇ" లుండఁ బ్రమాదమున జడలు పడినవేమో యని తోఁచుచున్నది.

1 తగదు అనుపాఠము సరళముగా లేనందున "తగవు" అని పఠింపఁబడెను.

ద్వితీయపాదాదిని సంధివశమునఁ బ్రథమాంతమ్మునై యున్న తకారము దకార మయ్యె నని గ్రాహ్యము. ఆ పాదమునందలి ద్వితీయ వర్ణము తవర్గద్వితీయాక్షర మని తలంపనగును. పూర్వముద్రితములం దావర్ణము వర్గచతుర్థముగా నున్నది. అవి రెండు నత్యంతసదృశాకారము లగుటచే నిట్టి ప్రమాదము కల్గియుండును.

స్వరములుమాత్రము దుష్టబీజాక్షరము లయినను బిందుయుతాక్షరము లగుటచే శుభప్రదము లగుఁ గావున నాద్యవర్ణములు కాక యుపవర్ణము లగుట శుభప్రదమే యని భావించెను. సాధారణముగాఁ దెలుఁగుకవులు సర్వదోషహార మగుశ్రీశబ్దమునే కావ్యాదిని బ్రయోగించిరి. అట్టియెడ నితరగుణదోషచింతన మావశ్యకము కాదని వారు తలంచిరి.

ఇందు రెండవపాదమున ధ వర్ణము ప్రాసముగా నుండుట స్వవర్గజప్రాస మని తలంపవలయును. ఇతఁ డిట్టిప్రాసమును జెప్పలేదు. కాని కవులవాడుకలో నుండుటచే గ్రహించియుండును.

అప్పకవీయాదులందుఁ గావ్యాది గ్రాహ్యాగ్రాహ్యవర్ణవివేకము విపులముగాఁ గలదు. చూడవచ్చును.

క. మొదల సభంబులు రెండును
గదిసిన విభవంబు; త భ స గణసంగతి యొ
ప్పదు; రయముల నధికశుభము[1]
వొదవును; భయములను హాని యొందు నృసింహా! ౨౩

కావ్యాదిని సగణభగణములు వరుసగాఁ జేర్చినచో విభవము కలుగును. త, భ, స గణముల కలయిక మంచిది కాదు. ర య

---

1. సాధుపాఠ మని యూహింపఁబడెను.

౨౮, ౨౯, ౩౦ పద్యములు కొన్నిప్రతులందుఁ గానరావు.

గణముల కలయిక మిక్కిలి శుభకరము. భ య గణముల కలయిక హానికరము— అని భావము.

కొన్ని మంచిగణములుకూడ నితరగణములఁకూడికవలనఁ జెడు ఫలములను జెడుగణములు మంచిఫలములను నిచ్చుటయుఁ గలదు. అందుచే నేయేగణములకలయికలు గ్రాహ్యాగ్రాహ్యములో యిందు వివరించెను. సగణము లయకారి యయినను భగణముతోఁ గూడి శుభకరమే యగుచున్నది. అగ్ని రగణము హెత జెప్పినది యయినను యగణముతోఁ జేరిన శుభప్రదము. త భ గణములు మంచి వయ్యు స గణయోగమునఁ జెఱుపుఁ జేయును. కవిజనాశ్రయమునను స భ లం జెప్పిన విభవము అనియు, శుభ మగు ర య లం జెప్పిన అనియు నున్నది. (కవి. సంజ్ఞా.) ౨౭

క. ఒనరఁగ శుభవాచకములు
ఘనతర మగుదేవవాచకంబులు నై పే
ర్చినగణములు వర్ణంబులు
ననింద్యములు కృతులమొదల నహిపతిశయనా! ౨౮

అహిపతిశయనా=శేషశాయీ !; కృతులమొదలన్=కావ్యారంభములందు; శుభవాచకములు=మంగళార్థకములును; దేవవాచకములు=దేవతలను బోధించుశబ్దములును; (శుభదేవత లయిన లక్ష్మీనారాయణాదిదేవవాచకములే యిట గ్రాహ్యములు) అయిపేర్చిన గణములు=అయి అతిశయించినగణములును; వర్ణంబులున్=అక్షరములును; అనింద్యములు=దోషరహితము లగును.

కొన్ని వర్ణగణాదు లశుభదాయకము లని వెనుకఁ జెప్పఁబడెను. కాని అట్టివయినను మంగళవాచకములును లక్ష్మ్యాదిశుభదేవతావాచకములు నయినచో గ్రాహ్యములే యని భావము. ౨౯

## ప్రాసప్రకరణము

క. ప్రాసం బగు రెండవయది,
వాసన గల మొదటివ్రాయి వడి యనఁ బరగున్
బ్రాసంబు లన్నియెడలను,
[1]భాసుర మగు వడులు పాదపాదముల హరీ! ౨౯

రెండవయది=పద్యపాదమున రెండవవ్రాయి (వర్ణము); ప్రాసం బగున్=ప్రాస మనఁబడును. (వాసనగల) మొదటివ్రాయి=పాదమున మొదలియక్షరము; (వాసనగల అనునది పాదపూరణ ప్రయోజనకము) వడి యనఁ బరగున్=యతి యనఁబడును. ప్రాసంబులు=ప్రాసాక్షరములు; అన్నియెడలను = అన్నిపాదములందును; భాసురమగున్= ప్రకాశించును. హరీ !=ఓ కృష్ణా !; వడులు=యతులు; పాదపాదములన్=ప్రతిపాదమునందును; భాసుర మగునని యన్వయము. "స్వస్వ చరణేషుపూర్వః ప్రాస స్సర్వేషు చైక ఏవ స్యాత్" అను చింతామణి సూత్రార్థ మిందుఁ గూర్పఁబడెను.

పద్యపాదమున రెండవవర్ణము ప్రాస మనఁబడు ననియు, నది యన్నిపాదములందును బ్రాసమైత్రి గలదై వర్తింపవలయు ననియుఁ, బాదాద్యక్షరము యతి యనఁబడు ననియు, నయ్యది యేపాదమున కాపాదముననే వర్తించు ననియు భావము. ౨౯

క. ఆదిని గురులఘువులలో
నేది నిలిపె నదియె మొదల నిడి పాదము లు
త్పాదింపవలయు నుపజా.
త్యాదుల మిశ్రములఁ దక్క నంబుధిశయనా! ౩౦

---

1 భాసుర మగు నను పాఠము సార్థకము. భాసురముగ ననునది కేవలపాదపూరణార్థకము. కావున నాపాఠము గృహీతము.

ప్రాసపూర్వాక్షరనియమమును విశదపఱచుటకై పాదాద్యక్షర నియమమును జెప్పుచున్నాఁడు.

ఆదని=ప్రథమపాదాదిని; మొదలన్ = ఇతరపాదముల మొదటను; ఉపజాత్యాదులన్=సీసాద్యుపజాతులయాదియందును; మిశ్రములన్ = అర్ధసమవిషమాదిమిశ్రవృత్తములందును; ఆద్యపాదము మొదటి గురులఘువులలో నేది నిలిచెనో యదియే యన్నిపాదముల మొదటను నిలిపి పాదములను నిర్మింపనలయును. సీసాద్యుపజాతులందును అర్ధసమవిషమాదిమిశ్రవృత్తములందును నీనియమ మక్కఱ లేదు. అర్ధసమవృత్తము లనఁగా బేసిపాదము లొకతీరునను సరిపాదము లొకతీరునను నుండువృత్తములు. ఉదాహరణమునకు సరిపాదములందు ఇంద్రవజ్రావృత్తమును బేసిపాదములందు ఉపేంద్రవజ్రావృత్తమును గల యుపజాతివృత్తమున నొకపాదము లఘ్వాదియు వేఱొకటి గుర్వాదియు నగును కావున నట నీనియమము వర్తింపదు. ఇట్లే విషమవృత్తములం దన్నిపాదములు నొక్కతీరున నుండవు. కాన నచ్చటను నీనియమము వర్తింపదు.

ఇది పాదాదినియమముగాఁ జెప్పఁబడినను ప్రాసపూర్వాక్షరముల కన్నిటికిని అనఁగాఁ బ్రాసయతిస్థలమునను వర్తించు ననియు, నిది యుపలక్షణ మనియు గ్రహింపఁదగును. ఆవిషయ మనంతరపద్యోదాహరణమువలననే వ్యక్త మగుచున్నది. ౩౦

**ఆ. వె. కుటిలకుంతలములు నిటలంబుపైఁ దూల**
**నోట లేక ధేనువాటమునకు**
**నదె యశోదపట్టి కదలెఁ బొమ్మనినఁ బ్రా**
**పాది తేటపడుఁ బ్రమోద మెసఁగ.** ౩౧

**కుటిలకుంతలములు**=వంకరముంగురులు; **నిటలంబుపైన్**=లలా

టమ్మపైని; తూలన్=కదలుచుండఁగా; ఓటచేక=వెనుకాడక; ధేనువాటమునకు = ఆవులుండుప్రదేశమునకు; అనఁగా గోశాలలవరుసకు; యశోదపట్టి=కృష్ణుఁడు; అదె=అదిగో; కదలెన్=బయలుదేరెను. పొమ్మ=నిశ్చయము; అనినన్=ఇట్లు చెప్పఁగా; ప్రమోదమెసఁగన్=సంతోషము పొంగునట్లు, ప్రాసాది=ప్రాసపూర్వవర్ణము; తేటపడున్=స్పష్టమగును.

పూర్వపదోక్తప్రాసపూర్వాక్షరనియమమున కిది యుదాహరణము. ఇందు ౧, 3 పాదములలోఁ బ్రాసయతిలో పూర్వాక్షరము లఘువును. అట్లే ౨, ౪ పాదములందు గురువును గలదు. ఈరీతిగాఁ బ్రాసపూర్వాక్షర మొక్కరీతిగా నుండవలయు ననుట. కేవల ప్రాసస్థలమునందే కాక ప్రాసయతిస్థలమునకు బ్రాసనియమము లన్నియును వర్తించును గాన లాఘవముకొఱకై ప్రాసయతి నుదాహరించెను. పూర్వార్థమున ద్వివిధటకారప్రాసమును నుత్తరార్థమున ద్వివిధదకారప్రాసమును నుదాహరించెను. ఉపజాత్యాదులందుఁ బాదాదినియమము లేదనుటకును నిది యుదాహరణమే. ఇందు ౧, 3 పాదములు హ్రస్వాదులు. కాఁగా ౨, ౪ పాదములు దీర్ఘాదులుగా నున్నవి. ఇది దోషము కాదని యుదాహరించెను. 3౧

ఆ. వె. నందసుతుఁడు నాఁగ సౌందర్యనిధి యన
నమరు బిందుపూర్వకము మొదలను,
బక్షిగమనుఁ డన నధోక్షజుఁ డన సంయు
తాక్షరాదిఁ జెల్లు నసమగురువు. 3౨

అన నమరు=అనురీతి నొప్పుచున్న; బిందుపూర్వకము మొదలను=బిందుపూర్వకప్రాసాక్షరమునకుఁ బూర్వమునను; సంయుతాక్షరాదిన్=సంయుక్తాక్షర మగు ప్రాసాక్షరమునకుఁ బూర్వమునను; అసమ

గురువు=హ్రస్వదీర్ఘత్వములతో సామ్యములేని గురువు; చెల్లుక= ఉండవచ్చును. ఇట హ్రస్వదీర్ఘత్వములను సమగురువు చెల్లు నని యూహ్యము. ఉదా॥ ౧, ౨౧ పద్యము.

ప్రాసాక్షరము బిందుపూర్వకము గాని సంయుక్తము గాని యయినచో దానిపూర్వాక్షర మెల్లను గురువే యగును గావున నది దీర్ఘ మొకచోటను హ్రస్వ మొకచోటను నయియున్నను దప్పు కాదని భావము. ఉదా॥ నంద......సౌంద. ఇట మొదటిది హ్రస్వపూర్వము రెండవది దీర్ఘపూర్వమును. ఇట్లే "పక్షి......అధోక్షజ" అనుచోటను మొదటిది హ్రస్వపూర్వము రెండవది దీర్ఘపూర్వము.

ఇది స్పష్టప్రతిపత్తికొఱకుమాత్రమే వివరింపఁబడెను. ఏమన, వెనుకఁ బ్రాసాది నుండవలసినవర్ణము మొదట లఘు వయిన నంతట లఘువు, మొదట గురు వయిన నంతట గురువు అని చెప్పఁబడెను గాని హ్రస్వదీర్ఘశబ్దములతో హ్రస్వమయిన హ్రస్వము దీర్ఘ మయిన దీర్ఘము నన్నిట నుండవలె నని చెప్పలేదు. అట్లు హ్రస్వ దీర్ఘ శబ్దములతో లక్షణముం జెప్పినచో దానికి విభిన్నముగా నున్నను పైస్థలములలో దోషము లేదని చెప్పవలసియుండును. అప్పకవియు నిట్లే స్పష్టతకొఱకే కొంచెము లీవిషయ మిట్లే చెప్పియున్నాఁడు. 3౨

ఆ. వె. అర్ధబిందుసహిత మగువర్ణమునకుఁ బ్రా
సాది యరయ నిడుదయక్షరంబు
నేఁడు మనకుఁ గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేటి కింక నొండుమాట లనఁగ. 33

ప్రాసాక్షర మర్ధబిందుపూర్వక మయినప్పుడుమాత్రము ప్రాస పూర్వాక్షరము గురువు కావలసినచో దీర్ఘమే కావలయును గాని హ్రస్వపూర్వకము కారాదు. ఇట "నేఁడు నాఁడు" అనునవి బిందు

పూర్వకము లయినను సాబిందు వర్ధబిందువు కావునఁ బ్రాసపూర్వమున నే, నా యని దీర్ఘములే యున్నవి. కాని హ్రస్వము లుండలేదు.

పూర్వపద్యమున బిందుపూర్వకము లైనచో నసమగురువు చెల్లు నని సామాన్యముగా "బిందు" వని చెప్పుటచే నర్ధబిందువునకుఁ గూడఁ బూర్వాక్షరము హ్రస్వదీర్ఘములలో నేదియున్నను నుండ వచ్చు నని భ్రమ కలుగకుండుటకుఁగాను దన్నివారణార్థమై అర్ధబిందు పూర్వక మయినపుడుమాత్రము హ్రస్వదీర్ఘములు సమముగనే యుం డవలయును గాని భిన్నముగా నుండరాదని యిందుఁ జెప్పెను. ఈ విషయమును గుర్తింపక అర్ధబిందుప్రాసము దీర్ఘపూర్వకమే కావ లయు నని యనుకొనియేకాఁబోలును ముద్దరాజు రామన "అర్ధబిందువు నిల్చిందు వగుపదముల ప్రాసములు దీర్ఘములు మీఁదఁ బలుకఁ జెల్లు" నని చెప్పెను. అప్పకవియు నట్లు చెప్పకపోయినను అర్ధబిందుప్రాసమును దీర్ఘపూర్వకమునే యుదాహరించెను. అది సరికాదు. హ్రస్వపూర్వక మును నుండు ననుటకు నీయనంతరపద్యమే ప్రమాణము.

కాని పూర్వపద్యమున "నసమగురువు చెల్లు" ననుటచేఁ బ్రాసపూర్వాక్షరము గురువుమాత్రము కావలయు ననియు నాగురుత్వ మన్నిచోట్లను సమానముగా దీర్ఘ మగుటచేతనే కానక్కఱలే దనియు బిందుపరక మగుటచేతనో సంయుక్తపరక మగుటచేతనో గురు వయినను గావచ్చు నని చెప్పఁబడెను. అర్ధబిందుపరక మయి నపు డాయక్షరము గురువు కావలసినచో దీర్ఘమే కావలయును గాని మార్గాంతరము లేనందున నసమగురు వగుటకే యవకాశము లేదు. అందుచే నీపద్యము స్పష్టప్రతిపత్తికొఱకే చెప్పఁబడెను.

మఱియొకవిశేషము :— సంయుక్తవర్ణపూర్వమునందుఁగూడ నన్నిచోట్లను దీర్ఘమునకుబదులు హ్రస్వ ముండరాదు. భిన్నపదసం

బంధి యగు సంయుక్తవర్ణము పర మయినప్పుడు పూర్వాక్షర మితర ప్రాసముల ననుసరించి గురువు కావలసినచో దీర్ఘమే యుండవలయును. భిన్నపదాదిసంయోగము తెనుఁగునఁ బూర్వాక్షరమును గురువుగా నొనర్పదుగదా !

ఆ. వె. కుఱుచమీఁదిసున్న మఱి తేలి వ్రాయఁ బ్రా
సమ్మెయాది నిట్లు జరగు నచ్యు
తుఁడు సమస్తవల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుం డనంగ. ౩౪

కుఱుచమీఁదిసున్న మఱి తేలవ్రాయన్ = హ్రస్వముమీఁది సున్న తేల్చిపలుకునట్లు వ్రాసినచోఁ బ్రాసముల నన్నిటను నట్లే తేల్చిపలుకఁబడుసున్నయే యుండవలయును. అనఁగా హ్రస్వము మీఁద నర్ధబిందు వున్నచో నన్నిటను నట్లే యుండవలయును గాని యొకచోట నిండుసున్నయు నింకొకచోట నరసున్నయు నుండరాదని భావము. పూర్ణ మున్నచోఁ బూర్ణమే యన్నిట నుండవలయు ననియు నెఱుఁగునది. ౩,౪ పాదము లర్ధ పూర్ణములకుఁ గ్రమముగా నుదాహరణములు. ౩౪

క. సమనామప్రాసము, ప్రా
సమైత్రి, ఋ, ౖతి, మఱి ప్రాది, సమలఘువు, విక
ల్పము, బిందు, వర్ధబిందా
ఖ్య, ముభయసంయుక్తసంధిగతసంజ్ఞకముల్. ౩౫

ఇఁక ద్వాదశవిధప్రాసములను నిర్దేశించుచున్నాఁడు.

(౧) సమప్రాసము (౨) ప్రాసమైత్రిప్రాసము (౩) ఋప్రాసము. (౪) ౖతిప్రాసము (౫) ప్రాదిప్రాసము (౬) సమలఘుప్రాసము (౭) వికల్పప్రాసము (౮) బిందుప్రాసము (౯) అర్ధబిందుప్రాసము

(౧౦) ఉభయప్రాసము (౧౧) సంయుక్తప్రాసము (౧౨) సంధిగత ప్రాసము- అని వానినామములు.

ఋ = ఋ అనుపేరుగల ప్రాసము. త్రి = త్రి అనుపేరుగల ప్రాసము. ప్రాది=ప్రాది అనుపేరుగల ప్రాసము. ఇట్లే ప్రతిపదార్థము గ్రాహ్యము. ౩౫

**కం. అరసున్నలు నెఱసున్నలు**
**నొరసినవర్ణములు జడ్డయును బ్రాసములై**
**బెరసినచో సమవర్ణము**
**లరసి నిలుపవలయుఁ దోయజాసనజనకా!** ౩౬

ఒరసిన=కూడియున్న. బెరసినచోన్=చేరినచో. సమప్రాసము నందు అరసున్నలు గాని నిండుసున్నలు గాని పూర్వమునఁ గలవర్ణములును సంయుక్తవర్ణమును బ్రాసస్థానమున నున్నచో నన్నిటను నట్టివర్ణములే యుండవలయును. అన్నిప్రాసవర్ణములును నొక్కరీతిగా నుండుటచే నిది సమప్రాస మనఁబడును.

ఇట్లనుటచే నరసున్న లొకచో నున్నచో నన్నిప్రాసస్థలము లందును నవియే యుండవలయు నని భావింపరాదు. ఒకచో నరసున్న యుండి వేఱొకచో లేకున్నను బ్రాస భంగముకాదు. ఆవిషయ మిందలియర్థబిందుప్రాసమునుబట్టియే తెలియును. అర్ధబిందు వంతటను సమముగా నున్నపుడుమాత్రమే సమప్రాస మగు నని దీనిభావము. ఇట జడ్డ యన సజాతీయాక్షరసంయోగము వివక్షిత మన్నట్లు ఉదాహరణములు సూచించుచున్నవి. ౩౬

**కం. పరువడిఁ బ్రాసములు సమా**
**క్షరసంశోభితము లయినఁ జాలును, మఱి త**

తత్స్వరవైసాదృశ్యంబులు
పరిహరణీయంబు లందుఁ, బంకజనాభా! ౩౭

పరువడిన్=క్రమముగా; ప్రాసములు=ప్రాసస్థానములు; సమా...ములు = సమానము లగుహల్లులతోఁ గూడినవి; అయినం జాలును=అయియుండినం జాలును. తత్స్వర......బులు=వానియందలి అచ్చుల యసమానత్వములు; అపరిహరణీయంబులు=విడువనక్కఱలేనివి. అనఁగాఁ బ్రాసాక్షరములకు స్వరసాదృశ్య మక్కఱలేదు, హల్సామ్య ముండినం జాలును అని భావము. ప్రాసాక్షరమైత్రినే ప్రసంగవశమున నిందుఁ జెప్పెను.

"అపరిహరణీయములు" అనుపాఠము గృహీతము. "పరిహరణీయములు" అనుపాఠమున వైసాదృశ్య మనఁగా విశేషసాదృశ్యమని యర్థము చెప్పవలయును. అచ్చ్వమాత్రసాదృశ్యమే కాని తద్విశేష మగు నకారేకారాద్యవిశేషసాదృశ్య మనపేక్షిత మని భావము. ౩౭

ఆ. వె. వీఁడె కృష్ణుఁ డల్లవాఁడె ప్రలంబారి
కొండ యెత్తె నితఁ డతండు ద్రవ్వె
నొద్ద గెడవు గాఁగ దొడ్డరా జేలెడి
వీడు నాఁగఁ బ్రాస మీడు వచ్చు. ౩౮

ప్రలంబారి=బలరాముఁడు; ఇతండు కొండ యెత్తెన్=ఈ కృష్ణుఁడు గోవర్ధనగిరి నెత్తెను. అతండు దొడ్డరాజు ఏలెడివీడున్ ఒద్దగెడవుగాఁగఁ ద్రవ్వెన్=ఆబలరాముఁడు సుయోధనుఁడు పాలించుపట్టణమును (హస్తిపురమును) నిమ్నోన్నత మగునట్లు త్రవ్వెను; నాఁగన్=అనఁగా; ప్రాస మీడు వచ్చున్=ఈమైత్రి ప్రాస మగును.

ఇది 36 వ పద్యమునఁ జెప్పిన సమప్రాసమున కుదాహరణము. ఇంతవఱకుగా నాల్గుపాదములును అర్ధబిందు, పూర్ణబిందు, సంయుక్తాక్షర, సమప్రాసముల కుదాహరణములు. ఈలక్షణమునుబట్టి యిందలి నాల్గవపాద ముదాహరణము కాదు. లక్షణపద్యమున "దీర్ఘమునన్" అనుపాఠమున నుదాహరణముగాఁ దలంపవచ్చును. కాని దీర్ఘపూర్వకత్వ మున్నంతమాత్రమున సమప్రాసము కాఁజాలదు. దీర్ఘపూర్వకములుగా నున్నను స్వవర్గజప్రాసాదులు సమప్రాసములు కావు గదా! యథార్థముగా నిర్బిందువు లగు నేకహల్సామ్యము గలవియు సమప్రాసములే యగును. ఇందలి నాల్గవపాద మట్టిదియే యగును. 38

గీ. ఆయుపేంద్రుని బొడఁగాంచు టేయుపాయ
మనెడుదీర్ఘాదు లచట హ్రస్వాదు లయిన
నయ్యుపేంద్రుని బొడఁగాంచు టెయ్యుపాయ
మన సమప్రాస మగు నూఁదఁజనదు రహల. 39

ఆయుపేంద్రునిన్ = ఆకృష్ణుని; పొడఁగాంచుట=దర్శించుట; ఏయుపాయము=ఎట్టియుపాయము? అనెడు; దీర్ఘాదులు=దీర్ఘ మాదియందుఁగలపదములు; హ్రస్వాదులు=హ్రస్వ మాదియందుఁ గలవిగా; అయినచోన్=మాఱినచో; రహలన్=ర, హ, అనునక్షరములందు; ఊఁదఁజనదు=ఒత్తి పలుకరాదు.

"ఆయుపేంద్రుఁడు, ఏయుపాయము" అనుపదములను అయ్యుపేంద్రుడు ఎయ్యుపాయము అని మార్చి పలికినచోఁ బ్రాసాక్షరము సంయుక్తమయి సమప్రాస మగును. త్రికమునకు హల్లు పరమగునపుడు త్రికదీర్ఘమునకు హ్రస్వమును బరహల్లునకు ద్విత్వమును "[illegible]" ఇత్యాదిచింతామణిసూత్రము విధించుచున్నది.

అట్లు ద్విత్వము వచ్చినస్థలము సమప్రాసమున కుదాహరణ మని యభిప్రాయము. ఈ హ్రస్వద్విత్వములు రిహాలు పరమగునపుడు రావనియుఁ జెప్పెను. కాని యిచ్చట హకార మూష్మల కుపలక్షక మనియు గ్రహింపవలయును. అసంయుక్తహల్లు పరమగునపుడే యీ కార్యములు వచ్చు ననియు నీతఁడు సూచింపలేదు. సంయుక్తపరత్వ మునఁగూడ నొక్కొకచో నీకార్యము రావచ్చు నని యీతనియాశయ మేమో? "అక్షత్రకులసితప్రకాశు" నని హరిశ్చంద్రనలోపాఖ్యాన మున సంయుక్తస్థలమునను నీకార్యము కానవచ్చుట యీయభిప్రాయ మును బలపఱచుచున్నది. చింతామణి యెట్టిహల్లు పరముగా నుండ వలయునో విశేషము నేమియుఁ జెప్పయుండలేదు. ఇట్టిచోట సం యుక్తములోని మొదటిహల్లునకు ద్విత్వము వచ్చినను విరోధము లేదు. పూర్వాత్రిక మెట్లును గురు వగును. గురు వగుటయే యిట నావశ్యకము. ఉచ్చారణభేద మెట్లును గానరాదు.

హల్సామ్యముగల యర్ధబిందు, పూర్ణబిందు సంయుక్తాక్షరముల ప్రాసమువ్రాత్రమే సమప్రాస మనియు నిర్బిందువు లగు నేకహల్లుల సామ్యముగల ప్రాసము సమప్రాసములోనికి రాదనియు ననంతుని యాశయముగాఁ గన్పట్టుచున్నది. కనుకనే యుయ్యుపేంద్రు ననునది యయ్యుపేంద్రు ననునపుడే సమప్రాస మగు నని యిటఁ జెప్పెను. అప్పకవియు నిమ్మూఁడిటిచే సమప్రాసము లని యనెను.

కాని యాలోచింపఁగాఁ బ్రాసములు సమములు నసమములు నని రెండువిధములు. అందు సమప్రాస మని చెప్పఁబడిన యీప్రథమ ప్రాసమును ముందుఁ జెప్పఁబోవుసమలఘుప్రాసమును సమప్రాసము లనియు మిగిలినప్రాసము లన్నియు నసమప్రాసములనియు నెఱుంగునది. సమలఘుప్రాసము సమప్రాసములోనిదే యనుట యందలిసమశబ్దము చేతనే సిద్ధించుచున్నది. మిగిలినప్రాసములలోఁ బ్రాసాక్షరములను

భేద ముండును గావున నవి సమప్రాసములలోఁ జేర లేదు అని తెలియ నగును. ౩౯

౨. ప్రాసమైత్రిప్రాసము.

గీ. లళలు రెండును నొండొంటిఁ గలసి వచ్చు
నమరు నన్యోన్యమును ఋయుతాయుతములు,
బిందుపూర్వమై తమలోనఁ బొందు బమలు
ప్రాసమైత్రికి నిది స్వరూపంబు దెలియ. ౪౦

ల ళ లు రెండును, ఒండొంటికిన్=అన్యోన్యము, కలసి వచ్చున్=మైత్రిం జెందును. ఋయుతాయుతములు=ఋకారముతోఁ గూడినదియుఁ గూడనిదియు, అన్యోన్యమున్=ఒకదానితోనొకటి, అమరున్=మైత్రి చెందును. బ మ లు=బకారమకారములు, బిందుపూర్వమై=అనుస్వారపూర్వకము లయి, తమలోనన్=అన్యోన్యము, పొందున్=మైత్రి కలిగియుండును. ఇది, ప్రాసమైత్రికి=ప్రాసమైత్రీనామకప్రాసభేదమునకు, స్వరూపము=ఆకారము.

ల ళ, అనునవి రెండును, ఋవర్ణముతోఁ గూడియున్నదియు నది లేనివర్ణమును, అట్లే బిందుపూర్వకబకారమును "మ్మ"కారమును పరస్పరము ప్రాసమైత్రిం జెందినచోఁ ప్రాసమైత్రిప్రాస మనఁబడును అని తాత్పర్యము.

ఇందు బిందుపూర్వక"బమలు" ప్రాసమిత్రము లని లక్షణమునఁ జెప్పినను ఉదాహరణమునుబట్టి ంబ, మ్మ అనునవి పరస్పరమిత్రము లన్నట్లు తెలియఁబడుచున్నది స్థిరపరకబిందువు తెనుఁగున నుండదు కావున "నెమ్మి" అనుపదమును బిందుపూర్వకమకారముతో వ్రాయుటకును వలనుపడదు. అందుచే లక్షణమున నున్న "బిందుపూర్వమై" అనుచోట బింధ్వందమునకు "కేచిద్వదంత్య భేదత్వ మను

స్వారమకారంబొ॥" అను నాగవర్మోక్తింబట్టి యనుస్వారయుతమకారమునకునాడ స్పర్థ మగును. అప్పకవీయములో ననుస్వారపూర్వక బకారము బిందుస్తమకారపూర్వ మకారముతో యతి చెందు నని క్లిష్టమార్గమున నతిదేశించబడియున్నది. కాని యిదియంతయు కృత్రిమము. అనంతుని ఛందోదర్పణము లక్షణసారముగా బిందుపూర్వక బమలపరస్పరప్రాసమే యిట విహిత మనియు నుదాహరణమున నెమ్మి అనునదికూడ "నెంమి" అని వ్రాయుటయే సమ్మత మనియుఁ జెప్పవలసియున్నది. బిందుపూర్వకస్థిరవర్ణము "కంనాలి" "కమ్మని లతాంతములకుం బొనసి" "వచ్చెంకాత్రిపలి" మున్నగుచోట్ల క్వాచిత్కముగా నంగీకార్య మనియు దలంపవలసియున్నది. అప్పకవి మాత్రము "గట్టిబిందుపుమీఁదిబకారమునను జమిలి మా ప్రాసమైత్రి నా జరుగుచుండు" అని చెప్పెను.

ఇందు బ మ లు భిన్నవర్ణము లగుటచే నిది సమప్రాసమునం జేరక యసమప్రాసమే యయ్యెను. ఇట్లే తర్వాతిప్రాసము లన్నియు (సమలఘుప్రాసము తప్ప) నసమప్రాసము లయ్యె నని యెఱుంగు నది. ౮౦

ఆ. వె. నీలవర్ణుగర్భగోళంబునందు లో
కంబులెల్ల నుండు నెంమితోడ
శ్రీకి నొదయఁ డుజ్జ్వలాకృతి యితఁ డన్నఁ
బ్రాసమైత్రి యిట్లు పరగుఁ గృష్ణ ! ౮౧

నీల, గోళ, ఇవి లళలకును; లోకంబు, నెంమి, ఇది బిందుపూర్వకబమలకును; శ్రీకి, ఆకృతి, ఇవి ఋయుతాయుతములకును బ్రాసమైత్రి కుదాహరణము. గోళ గరళాదిశబ్దములలో నుచ్చారణానుసారముగా ళకారము పాణినీయవర్ణసమామ్నాయమున లేకున్నను

నంగీకరింపఁబడెను. ఇది చింతామణి శాబ్ద ప్రౌఢ వ్యాకరణాదులకును సమ్మతమే. ౮౧

గీ. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగఁ
బరగు నచ్చుపుజప్తతోఁ బ్రాసమైత్రి
యక్కృపానిధి హరిఁ గని మ్రొక్కి రనఁగ
సంభృతాశిషుఁ డతిశయోజ్జృంభుఁ డనఁగ. ౪౨

ఇది సందేహనిర్ణయార్థము చెప్పఁబడిన పద్యము. పూర్వోక్త ఋయుతాయుత ప్రాసమైత్రిలో ఋయుతమునకు నొకచో ద్విత్వమున్నచోఁ దక్కిన ప్రాసములందును ద్విత్వ ముండవలయును. ఋకార ముండనక్కఱలేదు. అవి ఋయుతాయుతమే యగును. ఉదా : అక్కృపా... మ్రొక్కిరనఁగ. ఇట ద్విసక్తకకారము సమానము. ఋత్వ మొక్కచోటనే కలదు. ఇట్లే "సంభృత... జ్జృంభుఁడ" అనుచోట బిందుపూర్వక భకారము రెంటను సమానము. ఋకార మొక్కచోటనే కలదు. కాన నిట్టివియును ఋయుతాయుతప్రాసములే యగును. ఋకార మచ్చు కనుక ప్రాసమున స్వరమైత్రి యక్కఱలేదు కనుక అవి యంతట నుండనక్కఱలేదు. అయినను భ్రాంతికలుగునని వివరించెను. ౮౨

౩. ఋప్రాసము

క. ఆరయ స్వరగణ మయ్యు ఋ
కారము ఋప్రాస మనఁగఁ గదియును రేఫన్
జేరి తనయురముఁ దన్నిన
యాఋషిపాదంబుఁ బిసికె నచ్యుతుఁ డనఁగన్. ౪౩

ఆరయన్=విచారింపఁగా; ఋకారము=ఋవర్ణము; స్వరగణమయ్యున్—అచ్చులలోనిదే యయినను; రేఫన్=రవర్ణమును; కది

యున్=చేరును. ఋరలకు మైత్రి చెల్లు ననియు నిది ఋప్రాస మనం బడు ననియు భావము.

ఇందు ౧, ౨, 3 పాదములంగల రేఫముతో నాల్గవపాదము నందలి "ఋ" వర్ణమునకు ప్రాస ముదాహృత మయ్యెను.

ఋకారమున రేఫసదృశహల్వర్ణద్వయ ముండు నని వైయాకరణసమ్మతము కావున ఋ ౠ వర్ణంబులను రలతుల్యములుగా భావించి తెలుఁగున సంధికార్యాములపట్లను యణాగమాదులు చేయుట లేదు. ఋకార మనేకవిధముల హల్సాదృశ్యము కలది కాన రేఫముతోఁ బ్రాసమైత్రి నంగీకరించిరి. అందు ముఖ్యకారణము ననంతర పద్యమున గ్రంథకర్తయే చెప్పుచున్నాఁడు.

తనయురముఁ దన్నినయాఋషిపాదంబు నచ్యుతుఁడు పిసికె ననఁగాఁ ద్రిమూర్తులలో శ్రేష్ఠు లెవ్వరో తెలిసికొనుటకు బయలు దేరి విష్ణువిదగ్గరకు వచ్చినభృగుమహర్షిచరిత మిట ననుసంధేయము.

గీ. తెల్లమిగ ఋకారము యణాదేశవశత
రేఫ యగుటఁ బ్రాసం బయ్యె రేఫ కిట్టు
లిదియె పరవర్ణయుత మయ్యేనేని ప్రాస
మైత్రి యగుఁగాని రేఫసంబంధి గాదు. ౪౪

తెల్లమిగన్=స్పష్టముగా, ఋకారము=ఋవర్ణము, యణాదేశవశతన్=యణాదేశమును బొందినపుడు, రేఫ యగుటన్=రేఫముగా మాఱుచుండుటచే, ఇట్టులు=ఈరీతిగా, రేఫకు=రవర్ణమునకు, ప్రాస మయ్యెన్=ప్రాసమిత్రతఁ జెందెను. ఇదియే=ఈఋకారమే, పరవర్ణయుత మయ్యేనేని=వేఱొకహల్లుతోఁ గూడియున్నచోఁ ప్రాసమైత్రి యగున్=పూర్వోక్తప్రాసమైత్రిప్రాసమే యగును. రేఫసంబంధి కాదు= రేఫముతోఁ బ్రాసమైత్రిం జెందదు. అనఁగా ఋప్రాసమునకుఁ జెందదు.

"ఇకోయణచి" యనుపాణినీయసూత్రముచే నచ్చు పరమగు నప్పుడు ఋకారము రేఫముగా మాఱును. ఇట్లు ఋకారరేఫములు స్థానాన్యాదేశభావసంబంధము కలవగుటచేఁ బరస్పరము ప్రాసమైత్రిం జెందును. కాని యీఋకార మొంటిగా నుండక యింకొకహల్లుతోఁ గూడి వ్రుయవసుడిగా నున్నచో రేఫముతోఁ బ్రాసమైత్రిం జెందదు. అట్టిహల్లుతోఁ గూడినఋకారము ప్రాసమైత్రి ప్రాస మనంబడి ఋకారములేని కేవలహల్లుతోఁ బ్రాసమైత్రిం జెందును. ఉదా. "అకృపానిధి హరిఁ గని ప్రొక్కి రనఁగ, సంభృతాశ్రితుఁ డతిశయోజ్జృంభుఁ డనఁగ." ౪౪

౪. త్రిప్రాసము

సంఖ్యఁ బలుకుత్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాససంజ్ఞ గలిగి
యాత్రివిక్రముఁ డభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తు లనఁగ. ౪౫

సంఖ్యఁ బలుకుత్రికారంబు = సంఖ్యావాచకత్రిశబ్దము, తకారసదృశమై=రేఫములేని కేవలతకారమువంటిదై, త్రికారప్రాససంజ్ఞఁ గలిగి=త్రికారప్రాస మనుపేరు కలిగి, చనున్ =ఒప్పును. ఆ త్రివిక్రముఁడు=ఆ శ్రీహరి, అభయప్రదాత=అభయము నిచ్చువాఁడు. వాక్త్రి...లులు=వాక్కనెడి గంగచే నుజ్జ్వలు లగువారు. (మహాకవు లని భావము) విష్ణుభక్తులు=హరిభక్తులు- అనఁగన్.

త్రిశబ్దము రేఫసంయుత మయియున్నను గేవలతకారముతోఁ బ్రాసమిత్రతం జెందును. ఇది త్రికారప్రాస మనఁబడును. త్రివిక్రమ, త్రిపథగా పదములలోని త్రికారము "ప్రదాత" లోని కేవలతకారముతోఁడను "భక్త" శబ్దములోని "క్త" కారముతోఁడను బ్రాసమైత్రిం

జెందుటచే నుదాహరణ మయ్యెను. మూఁడవపాదము రేఫతకార సంయోగమునకును నాల్గవపాదము కకారతకారరేఫసంయోగమునకు నుదాహరణములు అనఁగా రేఫము తప్ప మిగిలినహల్లులసామ్య మున్నం జాలు నని భావము

కవిజనాశ్రయమున త్రి ప్రధాన ప్రాసములు చెప్పఁబడలేదు. అలంకారవిశేషము లగు ప్రాసములుమాత్రమే చెప్పఁబడెను. అప్ప కవీయమున సంయుతాసంయుత ప్రాస మనఁబడు ప్రాసమున నిది యంత ర్భవించును. కాని యొక్క-సంఖ్యావాచకత్రిశబ్దమునకుమాత్రమే యాతఁడు సంయుతాసంయుతప్రాసమైత్రి నంగీకరింపఁగా నప్పక వ్యాదులు రేఫలకారసంయుతము లగునన్నివర్ణములకును మైత్రి నంగీ కరించిరి లకారమునకు సరియగునుదాహరణము నప్పకవి చూపలేక పోయినను రేఫమునకుమాత్ర ముదాహరణములం జూపెను.

అనంతునినాఁటికిఁ ద్రిశబ్దమునమాత్రమే యిట్టిప్రాసము శిష్ట సమ్మత మయియుండ ననంతరకాలమున నతివ్యాప్త మయియుండు నని తలంపవచ్చును. అప్పకవ్యుదాహృతపద్యములలో ననంతునికిఁ బ్రాచీనములు రెండుపద్యములుమాత్రమే అందు నాచనసోముని పద్యము సంఖ్యావాచకత్రిశబ్దయుక్తమే. (నాతో మార్కొనవేరు . ఈత్రైలోక్య సేనికిన్. ఉత్తరహరివంశము ఆ. ౨) ఆదిపర్వపద్య మునమాత్రము త్రిశబ్దము లేదు.

క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రు లనఁగాఁ దగునాల్గుజాతులన్ స్వచా
రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులుముదంబునఁ గాచిరె యేయుగంబునన్.

ఈయాదిపర్వపద్యమున క్షత్రియ, చారిత్ర, శబ్దగత "త్ర" వర్ణముతో మాంధా"తృ" శబ్దగత "తృ" వర్ణమునకుఁ బ్రాసకూర్పుఁ

బడెను. ఇందు "త్రి" వర్ణముతోఁ గేవలతకారమునకుఁ గాక ఋకారముతోఁ గూడినతకారముతోఁ బ్రాసము వేయఁబడెను. ఋకారమునందు రేఫము కూడ నున్నదని వైయాకరణసిద్ధాంతము మగుటచే నిది సంయుతాసంయుతప్రాసము కాదనియే యీకవితలంపుగా నూహింపనగును. అనంతునికిఁ బూర్వకవుల ప్రయోగములఁ బరిశీలించి యీవిషయమును నిర్ణయింపవలయును.

ఉభయప్రాసమునకును ద్వికారప్రాసమునకును భేదము గలదు. ఉభయప్రాసమున డకారమునకు రేఫలకారాన్యతరసంయోగమును నిందు తకారరేఫసంయోగమును నుండును.

అప్పకవి త్రిశబ్దమునందని చెప్పక రేఫయుతాయుతము లగు నన్నిహల్లులకును బ్రాసమైత్రిని విధించి సంయుతాసంయుతప్రాస మని పేరిడెను. రేఫమునకే కాక లకారమునకును సంయుతాసంయుత ప్రాసము నాతఁడు విధించెను. అనంతుఁడు చెప్పినయుభయప్రాసముఁ గూడ నీసంయుతాసంయుతప్రాసముననే యాతఁ డంతర్భవింపఁ జేసెను.

అనంతుఁడు త్రిశబ్దమునందుమాత్రమే రేఫసంయోగము నీత్రి కారప్రాసమునం దంగీకరించినను నాతని

"ఆకర్కటిగర్భమున న
నేకంబులు పుట్టెఁ బిల్ల లీనుచు మృతయై
పోక యిది యేమికతమున
నో కర్మ్యముఁ బ్రతికియుండె నొగిఁ గర్కటియున్."

భోజ 6-273 ప.

అనుపద్యమునుబట్టి తకారేతర రేఫసంయోగమును నితనికి సమ్మతమే యని కొంద అనుచున్నారు. కాని యిట్టియేకైక పద్యమునుబట్టి నిశ్చయింపరాదు. ఇట పాఠాంతరము నుండవచ్చును.

ప్రాచీనులపద్యములు మఱికొన్ని దొరకనచో నంగీకరింపవచ్చును. ఇందే "ధాత్రిభ మంబుల్ తత్సగచూదిగ్ భత్రయగాగణపద్ధతి మూటర్" ౨. ౧౭౫ వ పద్యమున "త్రి" శబ్దము కానందున నాల్గు పాదంబులందును రేఫసంయోగమును విడువలేదు. ఈ త్రికారమునకు రేఫసంయుతి లేనిదానితో మైత్రికిఁ గారణము "తృతీయ" శబ్దము నందు రేఫకు సంప్రసారణము వచ్చి యచ్చుగా మాఱుటయనికూడఁ జెప్పెను. అనంతుపద్య మిట్టియుక్తిని జూపుటకే యుదయించెను. కాన ననంతునితర్వాతికవు లీనియమమును త్యజించి రని చెప్పుట యుచితముగాఁ దోఁచుచున్నది. ౭౫

గీ. ఈ త్రికారంబునకుఁ దీయ యెసఁగఁ
గ్రింది రేఫ సంప్రసారణమున ఋత్వ మయి తృ
తీయ యగు నీ త్రికార మర్థించిచూడ
నా తకారంబునకుఁ బ్రాస మయ్యె నచట. ౭౬

ఈత్రికారంబునకు=ఈత్రిశబ్దమునకు, తీయ యెసగన్=తీయ ప్రత్యయము రాఁగా, (త్రేస్సంప్రసారణంచ- అనుసూత్రముచే) క్రిందిరేఫ=తకారోత్తరమం దున్నరేఫము, సంప్రసారణమునన్=సంప్రసారణము విధింపఁబడుటచే, ఋత్వ మయి=ఋకారముగా మాఱి, తృతీయ యగున్=తృతీయ అనునాకృతిం జెందును. అర్థించిచూడన్=కోరిచూడఁగా, అచటన్=ఆత్రికారస్థలమున, ఈ త్రికారము, ఆ తకారంబునకుఁ బ్రాస మయ్యెన్=త్రిశబ్దములోని "త్రి" అను దానికిఁ గేవలతకారము ప్రాసమైత్రిం జెందెను.

త్రిశబ్దమునందలి రేఫము "తృతీయ" అనుచోట ఋకారముగా మాఱి యుచ్చరించుటచే నొక్క తకారమాత్రమే హల్వర్ణము మిగిలియున్నది. కానఁ గేవలతకారముతో "త్రి" శబ్దమునకుఁ బ్రాస

మైత్రి యుచితమయ్యెను అని భావము. ఋప్రాసస్థలమునఁగూడ నిట్టి ఋవర్ణము రేఫముగా మారుటను జాపు యుక్తమని సమర్థించెను.

ఈ రెండుప్రాసములును స్థానాదేశ భావసంబంధమూలకములని తెలియనగును. జ్ఞ కారముతోడ న కారమున కిట్టిసంబంధముచేతనే కదా యతిమైత్రి యేర్పడెను. ౪౬

గీ. ఇ ఉ ఋ ఌ ల కచ్చు పరమగునేని సంధి
యవర లాదేశ మగు; నట్టియవరలలకు
నడరి ఇ ఉ ఋ ఌ లాదేశ మయ్యెనేని
యది కృతుల సంప్రసారణ మండ్రు బుధులు. ౪౭

పూర్వపద్యమున సంప్రసారణము ప్రసక్తమగుటచే దాని నిట వివరించుచున్నాఁడు. "ఇ ఉ ఋ ఌ' అనునచ్చులకు సంధిలో నచ్చు పరమయినచో వరుసగా "య వ ర ల" అనునవి యాదేశము లగును "య వ ర ల" లకు "ఇ ఉ ఋ ఌ" అనునచ్చు లాదేశము లయ్యెనేని యట్టియాదేశమును సంప్రసారణ మని పెద్దలు చెప్పుదు రని తాత్పర్యము. "ఇగ్యణః సంప్రసారణమ్" అను సూత్రార్థము నిందు వివరించెను. ౪౭

౫. ప్రాదిప్రాసము

గీ. ప్రాదియై యన శబ్దంబు ప్రాణ మగుటఁ
బరగ నణలకు వేర్వేఱ ప్రాస మయ్యె.
క్షోణిధరుఁ డెత్తె నేనుఁగు ప్రాణ మనఁగ
దానవారాతి ప్రేతలప్రాణ మనఁగ. ౪౮

అనశబ్దంబు = అన ప్రాణనే యనుధాతువునుండి యుత్పన్నమయిన యనశబ్దము, ప్రాదియై = ప్ర అనునది పూర్వమునం గలదై,

ప్రాణ మగుటన్="ప్రాణము" అని ణకారఘటిత మగుటచేత; పరగన్=ఒప్పఁగా; నణలకు వేర్వేఱప్రాస మయ్యెన్=న ణ అను రెండక్షరములకును బ్రత్యేకముగాఁ బ్రాణశబ్దణకారము ప్రాసమైత్రతను జెందెను. శ్రీశిఖరుఁడు=విష్ణువు; ఏనుఁగుప్రాణము = గజేంద్రుని ప్రాణమును; ఎత్తెన్=కాపాడెను—ఉద్ధరించెను. దానవారాతి=కృష్ణుఁడు; వ్రేతలప్రాణము=గోపికలకుఁ బ్రాణతుల్యుఁడు.

ప్రాణశబ్దములోని ణకార ముపసర్గగతరేఫమువలన ణత్వమొందిన నకార మగుటచే స్థాన్యాదేశము లగుననణలకు రెండిటికినిఁ బ్రాసమైత్రి చెందు నని భావము. 3, ౪ పాదములు వరుసగా "ణ న"లతోఁ బ్రాణశబ్దగతణకారము ప్రాసమైత్రత చెందుట కుదాహరణము.

ప్రాణశబ్దగతణకారమునకుమాత్రమే యీమైత్రి నీతఁడు విధించినను జెప్పనయుక్తిం బట్టి ణత్వము వచ్చినస్థలము లన్నిట నీవిధి చెల్లు నని తోఁచును. కాని భారతాదిప్రాచీనప్రయోగములు కేవల ప్రాణశబ్దమునకుమాత్రమే వర్తించియుండు నని తోఁచుచున్నది. అప్పకవి దీని నుభయప్రాస మనుపేరఁ జెప్పి యాదేశణకారములకెల్ల నీవిధి వర్తింపఁజేసెను. ఆతఁ డిచ్చినయుదాహరణములలో (1) "ద్రోణుఁడు భీష్ముఁడున్" (౧. ౨౯౯) అను నుద్యోగపర్వపద్యమునఁ బ్రాణశబ్దమే కలదు. (2) "కనకగిరిన్ ..."(౪-3౮) అను నరణ్య

1. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణ శల్యులున్
బ్రాణము లాసుయోధనుని పాలివ యింద్రుఁడు నిజానుజన్ము ల
క్షీణపరాక్రము ల్సెనలు లజేయులు బాహ్లిక సోమదత్తు లా
స్థాణునకైన నోడరు వశంబె జయింపఁగ వారి నేరికిన్.

2. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం
బనవరతంబు ద్రిమ్మరు మహాముని సప్తకమండలంబుతో
నగును తదీయశైలశిఖరాగ్రమునందుఁ బరోపకారున
ప్రణతమునిష్ఠు లుండుదురు దేవగణంబులు గొల్చుచుండఁగన్.

పర్వపద్యమున ణకారమునకు త్రినయనశబ్దము చూపఁబడెను. క్షుభ్నాదిగణపఠిత మగుటచేఁ ద్రినయనశబ్దమున ణత్వము లేదనియే చెప్పవచ్చును. కావున నకారమునకే ప్రాసమైత్రి గల దగుటచే నుదాహరణము కాఁజాలదు. శ్రీనాథుఁ డితనికి సమకాలమువాఁ డగుటచే నాతని ప్రయోగములు ప్రాచీనము లనఁజాలను.

(1) భాస్కరరామాయణపద్య మొక్కటి "శూర్పణఖ" శబ్దముతో నున్నను ణకారమునకే ప్రాసము కూర్పఁబడెను గాని నకారమునకుఁ గూర్పబడనందున నవిరుద్ధము. (2) కాళహస్తిమాహాత్మ్య పద్యమును ణకారమునకే కూర్పఁబడినది (ఇది యర్వాచీనమును) (3) కాశీఖండపద్యమునను త్రిణయనశబ్దఘటిత మయియున్న ణకారమునకే ప్రాసము కూర్పఁబడెను. (ఇది యనంతునికి సమకాలిక మగుటచేత బాధకము కాదు.) ణత్వము వచ్చినయితరశబ్దగతణకారమునకు నకారముతోఁ బ్రాసము గలస్థలము దొరకునంతవఱకును నిది స్థిర

---

1. రణమున నుగ్రసాయకపరంపర భానుకులంబ రామల
క్ష్మణము జగంబ వానరముగా విలు సేర్చును మద్భుజావిజృం
భణమును జూపి తండ్రిమదిఁ బట్టినచింత దొలంగఁ బెట్టి శూ
ర్పణఖకు నిట్లు వాటిలినబన్నము నీఁగుదు నేవవశ్యమున్. యు. కాం. ౫౪౪

2. ప్రణతుల్ సేయుచు గాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁ గూడి ద
క్షిణకైలాసము నంబికాహరకృతశ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసము న్భవమహామాయావిపర్యాసమున్
గణనాతీతసటీవిలాసము సమగ్రశ్రీసముల్లాసమున్. ౧-౧౦౯

3. త్రిణయనునిరాణివాసము, వణిమాద్యైశ్వర్యవితరణామరతరువున్
మణికర్ణిక ముక్తివధూ, మణికర్ణికఁ దలఁచె ఘనాని మానసవీథిన్. -౧౪౦

పడదు. (4) మధుసేవనపద్యమును బ్రాణశబ్దఘటితమే. (5) శృంగారషష్ఠ మేకాలమునకుఁ జెందినదో తెలియఁదగును. ఇదిమాత్రము సమాధేయమే. భారతాదిప్రాచీనగ్రంథములందు సరియగునుదాహరణము దొఱకువఱకును బ్రాణశబ్దమునకుమాత్రమే యీవిధి వర్తించు నని చెప్పవలసియున్నది. ౭౮

౬. సమలఘుప్రాసము

గీ. ఓలి రేఫతోఁ గూడియు నూఁదఁబడక
తేలి తెలుఁగునఁ దమయట్టివ్రాలతోన
సమలఘుప్రాస మగు, తెక్కు లమర బట్టి
విద్రిచె నసురఁ గృష్ణుఁడు దిక్కు లద్రువ ననఁగ. ౪౯

ఓలిన్=వరుసగా; రేఫతోఁగూడియున్=ర వర్ణముతోఁ గూడియును; (ఏయక్షర మయినను) ఊఁదఁబడక=ఒత్తి పలుకఁబడక; తేలి=తేల్చి పలుకఁబడి; తెలుఁగునన్ = అచ్ఛికపదములందు; తమయట్టివ్రాలతోన= తనవలెఁ దేల్చిపలుకఁబడిన రేఫసంయుక్తముతోడనే; సమలఘుప్రాస మగున్=సమలఘుప్రాస మను పేరునఁ బ్రాసమైత్రిం జెందును.

"కృష్ణుఁడు తెక్కు లమరన్ బట్టి దిక్కు లద్రువ నసురన్ విద్రిచెన్" అని యన్వయము. తేల్చిపలుకఁబడు రేఫసంయోగ మట్టిసంయుక్తముతోడనే ప్రాసం జెందిన సమలఘుప్రాసంబనఁబడునని భావము. నాల్గవపాదమున "విద్రిచెన్... అద్రువన్" అనునవి యుదాహరణములు.

4. పో సుద్యోగము చేసిన, ప్రాణంబా యింక నీకుఁ బాథేయం బీ
మానినిమందస్మితమధు,రాననచంద్రికలు గ్రోలి యరుగుము పిదపన్.

5. అనుటయుఁ గృష్ణద్వైపా,యనతనయుం డిట్టు లనియె నవహితమతియై
విను మతిగుహ్యము నారా,యణకవచము భక్తవాంఛితార్థప్రదమున్.

ప్రాసస్థానమున నెట్టిసంయుక్త మున్నను నంతట సమముగా నట్టిదియే యెల్లను నుండవలయును. ఒత్తి పలుకఁబడు రేఫసంయోగ మన్ని ప్రాసస్థలములం దున్నచో నెల్లను నయ్యది సమప్రాసములోనికే చేరును గదా. అట్టియెడ నిదియు సమప్రాసముననే యంతర్భవింపఁదగి యుండ వేఱుగా దీనిని గ్రహించుటకు కవిప్రాయ మొండు గలదు. ఏదన, ఊఁదఁబడని రేఫసంయోగమున కట్టి రేఫసంయోగమే ప్రాస మిత్రమగును గాని వేఱొకటి మిత్రము కాదని వివరించుటకు మాత్రమే యీప్రాస ముద్దేశింపఁబడెను. ఇట్టిస్వల్పవిశేషమును బట్టియే దీని నొకప్రాసభేదముగా నంగీకరించెను. ఇదియు సమప్రాస విశేషమే యని గ్రహింపఁదగును. ౪౯

౭. వికల్పప్రాసము

గీ. సానునాసికలౌ వర్గహల్లులకుఁ దృ
తీయములు వికల్పప్రాసమై యెలర్చుఁ
బ్రాఙ్నగంబుపై రవి దోఁచె నగ్ని వోలెఁ
బ్రాఙ్ముఖుండై నుతించె నీ వాగ్మి యనఁగ. ౫౦

సానునాసికలౌ=అనునాసికములతోఁ గూడిన; వర్గహల్లులకు= కకారాదిస్పర్శవర్ణములకు; తృతీయములు= గజడదబలు; వికల్ప ప్రాసమయి యెలర్చున్ = వికల్పప్రాస మనుపేరుతో మిత్రములగును.

"యరోఽనునాసికేఽనునాసికో వా" అనుసూత్రముచొప్పున వర్గీయహల్లు లనునాసికపరత్వమున ననునాసికములుగా మాఱును. (ప్రాక్+నగ=ప్రాఙ్నగ) లేదా జశ్త్వముతో వర్గతృతీయములుగా మాఱును. (ప్రాక్+నగ=ప్రాగ్నగ.) ఇట్టిచోటఁ దృతీయాక్షరములతో సానునాసికవర్గహల్లులు ప్రాసమైత్రిం జెందు నని భావము.

3, ౪ పాదము లుదాహరణములు. "ప్రాఙ్నగ- అగ్ని" ప్రాఙ్ముఖ-వాగ్మి" ఇట "ఙ్న ఙ్మ" అను ననునాసికసంయుక్తములై యనునాసికములుగా మాఱినవర్గహల్లులకు గ్న, గ్మ అనుచోట నున్న తృతీయాక్షరములతో వికల్పప్రాస మయ్యెను. హల్సామ్యము లేక జకారమునకు గ కారము మైత్రము కాకపోవుటచే నీవిధాన మావశ్యక మయ్యెను.

"వాఙ్మనోహరనుత యసదృఙ్మహాత్మ" వంటి యేకరూపములు సమప్రాసములలో నెట్లును జేరును. హల్సామ్యముగల యిట్టివి సమప్రాసముననే చేరునని యనంతుని యాశయముగాఁ దోఁచుచున్నది. కావుననే యుదాహరణములు రెండును నేకరూపములుగా నున్నవి. అప్పకవి యిట్టివియును వికల్పప్రాసముననే చేర్చెను. ౫౦

౮. బిందుప్రాసము

పేర్చు పొల్లునకారంబు బిందు వగుచు
మీఁద నున్న ధకారంబు నూఁదఁ బ్రాస
బంధ మగుఁ గృష్ణుఁ డుదయించినం ధరిత్రి
యంతయును నిరుపద్రవం బయ్యె ననఁగ. ౫౧

పొల్లునకారము "బిందుం ప్రవదంతి తం క్వచిత్క్వచిత్" అనుసూత్రముచొప్పున బిందువుగామాఱి మీఁదనున్న ధకారముతోఁ గూడి పలుకఁబడునపుడు సామాన్యబిందుపూర్వకధకారముతోఁ బ్రాసము చెల్లును. అట్టిది బిందుప్రాస మని భావము. మూఁడవపాదముదాహరణము. (పై చింతామణిసూత్రము మకారమాత్రవిషయక మని కొందఱియాశయము.)

ఈప్రాసవిధాన మనావశ్యకము. బిందుపూర్వకధకారము రెండుచోట్లను దుల్యముగా నుండుటచే నెట్లును బ్రాస చెల్లును.

ఇదియు సమప్రాసభేదముగానే యెన్నఁదగును. అయినను వర్గయుక్తా లకుఁ బూర్వమున బిందువు సాధారణముగా నుండదు కావున నిట్టి చోట్ల బిందువు గలదా? లేదా? నకార మున్నచోఁ బ్రాస మెట్లు కుదురును? అనుశంక కలుగకుండ నిట్టితావుల బిందు వుండు ననియు నయ్యది సామాన్యబిందుతుల్యమే యగుచుఁ బ్రాసమునకుఁ జెల్లు ననియుఁ దెలియుటకుమాత్రమే యీప్రాసమును వివరించెను. "వచ్చెం గుంతీసుత" వంటి యితరబిందుపూర్వకప్రాసము లితరప్రాసముల లోనే చేరునుగాన వీనిలోఁ జేర్పనక్కఱలేదు.

ఇది యనావశ్యక మనియోకాఁబోలు నప్పకవి దీనిని బ్రాస భేదముగాఁ జెప్పలేదు. సంధివశమున ద్రుతపూర్వకత్వమునఁ గల్గిన సరళాదేశస్థలములును బ్రథమాంతపదపూర్వకత్వమునఁ గల్గిన గసడద వాదేశస్థలములును జూపె సంధిగతప్రాసము లని యొకభేదముగా నాతఁడు నిర్ణయించెను. ఈతఁడును సంధిగతప్రాసము నొకదానిం జెప్పెను. కాని దీని నాప్రాసముచం జేర్పక వేఱుగాఁ జూపెను.

ఇదియు సమప్రాసభేదమే యని యెన్నఁదగును. ౫౧

౯. అర్ధబిందుప్రాసము

సార్ధబిందువులై తేలినట్టి ప ట ల
కరయఁ బ్రాసంబు నిర్బిందు వయినఁ జెల్లు
వీఁపు మూఁపులు మఱి తలమోపు లయ్యె
మాఁటు లేటికి మేటితాఁబేటి కనఁగ. ౫౨

సార్ధబిందువులై=అర్ధబిందుపూర్వకములై; తేలినట్టి = తేల్చి పలుకఁబడునట్టి; ప ట లకు = "ప, ట" అనువర్ణములకు; నిర్బిందు వయినన్=బిందుపూర్వకము కానిదియు; ప్రాసంబుచెల్లున్=ప్రాసమై యొప్పును.

వీఁపు మోపు, మాఁటు తాఁపవి అనునవి యుదాహరణములు. అనంతునిలక్షణముఁబట్టి యర్థగింపఁ పూర్వాక్షరము లఘువగుటకును మాత్రమే యీప్రాసము విహితము. నేఁడున్నసర్వకవులకు నిది యంగీకృతమే. అప్పకవ్యాదులు దీర్ఘపూర్వకమునకుమాత్రమే దీని నంగీకరించుట యనంతునియుదాహరణమునుబట్టియే యయియుండును. కాని యనంతుఁడు దీర్ఘమే కావలయు నని లక్షణమునఁ జెప్పలేదు. తర్వాతివారట్లు భావించిరి. కూచిమంచితిమ్మకవి హ్రస్వములకును, తదితరముల కునుగూడ నీప్రాసము చెల్లుననియే చెప్పెను. భారతప్రయోగములం జూపెను.

౧౦. ఉభయప్రాసము

క. చూడఁగ లకారరేఫలు
గూడు డకారంబు, చను నకుంఠితగతిఁ దో
డ్తోడన నుభయప్రాసము
జాడఁబడు [1]నసంయుతప్రసంగతిఁ గృష్ణా! ౫౩

చూడఁగన్=విమర్శింపఁగా; లకారరేఫలు గూడుడకారంబు=ల, ర, సంయుక్తడకారము; అసంయుతప్రసంగతిన్=సంయుతము కాని డకారముతో ప్రాససాంగత్యమును బొందుటచే; చనునకుంఠితగతిన్=ఒప్పుచున్న నిర్నిరోధమగుతీరున; తోడ్తోడన=వెనువెంటనే; ఉభయప్రాసముజాడఁబడును=ఉభయప్రాస మను పేరఁ బ్రవర్తించును.

ఇందు "సంయుతప్రసంగతి" అను చోట నర్థము పొందికకై "అసంయుతప్రసంగతి" అని దిద్దుట కవిహృదయానుగుణ మని భావింపఁబడెను. "చను నకుంఠితగతి; తోడ్తోడన" అనుమాటలు పద్యపూరకములుమాత్రమే.

1. సంయుతప్రసంగతి అని పూర్వపాఠము. అసంయుత అనిన నర్థము సరసముగా నుండు నని యీపాఠ మూహింపఁబడెను.

ల, ర లతోఁ సంయుత మగుడకారము కేవలడకారముతోఁ ప్రాసమైత్రిం జెంది యుభయప్రాస మనంబడు నని భావము. ఉభయ శబ్దముచే ర, ల లిట గ్రాహ్యములు. ౫౩

ఆ. వె. పాఁడి మరగి బ్రతుకువాం డ్రిల వ్రేఁతలు
వాండ్ర వెన్న లేల తండ్రి! యనఁటి
పండుకొఱకు వింతయిండ్లకుఁ బోకు కృ
ష్ణుండ! నీకు బ్రాఁతె పండ్లు నిచట. ౫౪

పాఁడి=గవ్యము; వ్రేఁతలు=గోపకాంతలు; వింతయిండ్లకు= ఇతరుల యిండ్లకు; బ్రాఁతి+ఏ=అలభ్యములా!

ఇందుఁ బ్రథమపాదము రేఫసంయుతాసంయుతడకారమున కును (పాఁడి—వాండ్రిల) 3, ౪ పాదములు లయుతాయుతప్రాసము నకును (పండు—యిండ్లు; కృష్ణుండ—పండ్లు) ఉదాహరణములు. రెండ వపాదమున రెండుస్థలములందును రేఫసంయుతడకారములే యుండు టచే నుదాహరణము కాదు.

ఇందు మొదటిపాదమున "పాఁడి" అనుచోటఁగూడ "పింగున పారసత్త్వము" మున్నగువానితోపనఁ బూర్ణానుస్వారమే యభిమతము. అప్పకవియు నీ "పాండి" శబ్దమునే గ్రహించి "తండ్రి" అను దానితోఁ బ్రాసముఁ జూపెను. అర్ధపూర్ణబిందుపూర్వకములకుఁ బ్రాసము నెవ్వరు నంగీకరింపరు కావునను, వీరిగ్రంథములయందైన నట్టి ప్రయోగములు వృగ్యములు కావునను "పాఁడి" అనుశబ్దమును బూర్ణబిందుయుతముగనే యనంతుఁడు ప్రయోగించె నని యూహింప వలసియున్నది. అనంతున ననుసరించి పాండి, వేండు అనునవి పూర్ణ బిందుయుతము లని యప్పకవియుం దలంచియుండును. లేదా యనం తునిపాండిశబ్ద మర్ధబిందుయుత మని భ్రమించి తానును దాని నను సరించె నని భావింపవలయును.

అప్పకవి రేఫలకారయుతత్వాయుతత్వములను నన్నిహల్లులకును వర్తించునని చెప్పెను. అనఁగా ప్రాసము నకారమునకుమాత్రమే వర్తింపఁజేయుటచేతఁ ద్రికారప్రాసము దీనిలో నంతర్భవింపను. ఇవి భిన్నభిన్నములే యని తెలియవలెను. వీనిలో లకారసంయుతా సంయుతప్రాస మప్రసిద్ధ మని కొందఱు భావించుచున్నారు. ౫౪

గీ రలయుతాయుతప్రాసమార్గముఁ దలంచి
వాండ్ల లేఁజూపు మోములఁ దీండ్ర మూరెఁ
ననుచు రెండును గూర్చిన నసువుఁ దప్పు
నం(డ్రు నిఖిలార్థవిదు లయినదండికవులు. ౫౫

రలయుతాయుతడకారములకుఁ బ్రాసము కలదుకదా యని రయుతడకారమునకు లయుతడకారముతోఁ బ్రాసము వేయుటమాత్రము అనుచిత మని భావము. అనఁగా రలప్రాసము నీతఁ డంగీకరింపలేదని తలంపనగును. కనుకనే యప్పకవియు లడలను లళలను బ్రాసముఁ జెప్పెఁ గాని రలలఁ జెప్పలేదు. "మాపుం డద్భుత... రేఖాలిప్సన్" అను చోటఁ గల రల మైత్రి సంధిగతప్రాస మని యెట్లో సమర్థించుకొనవలసివచ్చెను.

కావున రల మైత్రి దుష్ట మని భావించి యనంతుఁ డిట్టినిషేధముం గావించెను. రలలు గలవానికి రలలు లేనివానితోఁ బ్రాసముఁ గూర్పవచ్చునుగాని రలలకుమాత్రము మైత్రి సమ్మతము కాదని యాశయము. వాండ్ల అనుదానిసాధుత్వము విచార్యమే యగును. ౫౫

## ౧౧. సంయుతప్రాసము

ఆ. వె. పాడు నూరు ప్రోలు బహువచనంబులై
పరగుచుండు నూఁదిపలుకునపుడు

తేల్చిపలుకునపుడు; దీపించు సంయుత
ప్రాస మిరుదెఱఁగులఁ బద్మనాభ ! ౫౬

ఓ పద్మనాభ !

పాడు, ఊరు, ప్రోలు అనుపదములు ఊఁదిపలుకునప్పుడును దేల్చిపలుకునప్పుడును (రెండువిధములుగా) బహువచనాంతము లయి యుండును. (అనుట) [illegible] [illegible] దీపించును అని యన్వయము.

పాడు ఊరు ప్రోలు అనుపదములు బహువచనాంతము లయిన యప్పుడు ఊఁదిపలుకఁగా పాళ్లు, ఊళ్లు, ప్రోళ్లు అనియుఁ దేల్చిపలుకఁగా "పాళులు, ఊళులు, ప్రోళులు" అనియు రెండువిధములుగా నుండును. అట్టి ప్రాసము [illegible] రెండువిధముల సంయుత ప్రాస మగును.

"పాళ్లు" మున్నగువానితోఁ బాటు పాళులు మున్నగునసంయుతముల ప్రాసమునుగూడ సంయుతప్రాస మనుట యుచితముగాఁ గానరాదు. అయినను జిత్రకవిపెద్దనాదులు నిట్లే చెప్పుటచే నట్టియభిప్రాయముగా ననుసరింపవలసి వచ్చెను. ౫౬

ఆ. వె. పాళ్లు మనుజు లెక్క నూళ్లు గాఁదొడఁగె, న
యూళ్లు మిగుల బలిసె ప్రోళ్లు గాఁగ;
భాగ్యవంతుఁ డేలు పాళులు నూళులు
ప్రోళు లయ్యెఁ బ్రాఁతె కూళు లిచట. ౫౭

పాళ్లు మనుజు లెక్క నూళ్లు గాఁదొడఁగెన్=మనుష్యులు నివసించుటచేఁ బాటినేలలు గ్రామములు కాఁజొచ్చెను. అయ్యూళ్లు ప్రోళ్లు గాఁగ మిగుల బలసె=ఆగ్రామములు పట్టణములుగాఁ బెంపొందెను. భాగ్యవంతుఁడు......లయ్యెన్=భాగ్యశాలి యేలుచున్న

పాళ్లును నూళ్లును పట్టణము లయ్యెను. ఇచటఁ గూళులు బ్రాఁతే = ఇట్టిపట్టణములందు అన్నములు (భోజనవస్తువులు) వింతసుమా ? లభించు నని భావము.

ఇందు ౧, ౨ పాదములలో పాళ్లు ఊళ్లు ప్రోళ్లు అనుబహు వచనాంతములకుఁ బ్రాస ముదాహరింపఁబడెను. నాల్గవపాదమున వీని యసంయుక్తబహువచనాంతరూపము లుదాహరింపఁబడెను. ఈ రెండు విధములనుగూడ సంయుతప్రాస మనియే భావము.

లక్షణమునఁ "బాడు ఊరు ప్రోలు" అనుపదములనే చెప్పి నను నుదాహరణమునఁ "గూళ్లు" అనుపదముకూడఁ జూపఁబడుటచే నిట్టిరూపములు గల బహువచనాంతము లన్నియు నీప్రాసమునకు సంబంధించుననియే గ్రహింపనగును. ౫౭

ఆ. వె. తెలుఁగునందు లేదు లలిఁ గ్రిందిసుడి, గ్రుచ్చెఁ
గ్రుమ్మెనాఁగ రేఫకొమ్ము గాని
ప్రాసమైత్రి చొరదు, దా సంయుతప్రాస
మగును రేఫసంయుతమును ననుసరించి. ౫౮

తెలుఁగునందు లేదు లలిఁ గ్రిందిసుడి = తెనుఁగుభాషలో హల్లుక్రింద వ్రాయువట్రువసుడి లేదు. గ్రుచ్చెఁ గ్రుమ్మె నాఁగ రేఫ కొమ్ముగాని ప్రాసమైత్రి చొరదు = గ్రుచ్చెన్, క్రుమ్మెఁ మున్నగు చోట్ల రేఫము నత్వమేకాని (వట్రువసుడి కానందున) ఋయుతాయు తములకుఁ జెందెడిప్రాసమైత్రి చెందదు. తా రేఫసంయుతము ననుస రించి సంయుతప్రాసమగును = అచ్చట రేఫసంయుతము కావున దాని ననుసరించి సంయుతప్రాసమే యగును అని యర్థము.

తెనుఁగున వట్రువసుడి యుండదు. "గ్రుచ్చెఁ" మున్నగు నవి రేఫోకారములే కాని వట్రువసుడులు కావు. కనుక ఋకారము

నకుఁ జెందెడిప్రాసమైతిప్రాస మచట నుండదు. అది సంయుతాక్షరమే కావున సంయుతప్రాసమే యగును. ౫౮

క. ఈ క్రిందటిరేఫలు సమ
మై క్రాలుచుఁ దేలిప్రాస మగుసంయుక్తం
బా క్రూరనక్రభయమున
వాక్రువ్వదె గజము భక్తవత్సలు ననఁగన్. ౫౯

ఈక్రిందటిరేఫలు=ఈపద్యమునందలి "క్రింధటి, క్రాలుచు" మున్నగుపదములలోఁ గ్రిందనున్న రేఫలు; సమమైక్రాలుచు=సమానముగా నొప్పుచు; తేలిప్రాస మగుసంయుక్తంబు=తేలిప్రాస మనఁబడు సంయుక్తప్రాసము అగు నని భావము. గజము ఆక్రూరనక్రభయమున భక్తవత్సలున్ వాక్రువ్వదే అని యన్వయము.

ఈపద్యమున నాల్గుపాదములందును దేల్చిపలుకఁబడు రేఫసంయోగము పూర్వాక్షరమునకు గురుత్వము కలిగింపదు. తేల్చిపలుకఁబడురేఫములే దీని కుదాహరణములు. పదాది నున్నసంయోగము పూర్వపదాంతమునకు గురుత్వము నాపాదింపదు. తెనుఁగుపదములలో నేకపదమున నున్నను రేఫసంయోగము కొన్నిచోట్లఁ బూర్వాక్షరమునకు గురుత్వము నాపాదింపదు. సంస్కృతపదములలో నేకపదమున నెచ్చటను రేఫసంయోగము పూర్వాక్షరమునకు లఘుత్వమును గలిగింపదు. రేఫసంయోగమున కట్టితేల్చిపలుకఁబడు రేఫసంయోగమునే ప్రాసముఁ గూర్పవలయును. సంస్కృతపదమునందైనను బదాదినున్న సంయోగ మయినచోఁ బూర్వపదమునకు గురుత్వము నాపాదింపదు కావున నట్టిపదాదిరేఫసంయోగమే యాతెలుఁగురేఫసంయోగమునకుఁ బ్రాస మగు నని యట్టివే యీపద్యమున నుదాహరించెను. ౧, ౨, ౪ పాదములందుఁ దెలుఁగుపధములంధలి

రేఫసంయోగము 3 వ పాదమున సంస్కృత రేఫసంయోగమును గలవు. అన్నియుఁ జేర్చి పలుకఁబడునవియే. ౬౯

12. సంధిగతప్రాసము

క. ధ్రువముగ సంధిజనితరూ
పవిశేషప్రాస మనఁగఁ బరగు, పకారం
బవిరళవకార మగు న
య్య వదాఱవపా లెఱుంగ ననఁగ ముకుందా! ౭౦

ముకుందా! = శ్రీహరీ!, అయ్య=అయ్యా; పదాఱవపా లెఱుంగఁగ=కొంచె మెఱింగినను; పకారం బవిరళవకార మగుననం గన్=పకారము వకార మగు నని పలుకఁగా (అనఁగా పకారము వకారముగా మాఱునేని); ధ్రువముగఁ = నిశ్చయముగా; సంధి... ప్రాసము=సంధిగతప్రాసము; అనఁగఁబరగున్=అన నొప్పును.

అయ్య + పదాఱవ = అయ్య వదాఱవ— అని సంధివశమున పకారమ వకార మయ్యెను. ఇట్లు సంధివలన "ప" కారము వ కారము కాఁగా దానికి సామాన్యవకారముతోఁ గల్గినమైత్రి సంధిగత ప్రాస మనఁబడు నని భావము.

ఇది యొక్క-వకారమునకే వర్తించునట్లు చెప్పినను సంధివశమున వచ్చినసరళాదేశాదిస్థలమునను నీప్రాసమే చెల్లు ననియు నిది యుపలక్షణ మనియు గ్రాహ్యము. (చూ. సింగం బాఁకటితో...... వచ్చునో, జంగాంతార...) భార. విరా. ౪-౯౨. ౭౦

వ. అది యెట్లనిన. ౭౧

అట్టిసంధికార్య మెట్లుసంభవించునో యనంతరపద్యమున వివరించుచున్నాఁ డని భావము. ౭౧

క. ప్రథమాంతవిభక్తులపైఁ
గథితము లగుకచటతపలు గసడదవ లగున్
పృథివి నివి గజడదబ లగు
ప్రథమప్రసున్న లగు నాంతపదములమీఁదన్. ౭౨

ప్రథమా ... ... పైన్ = ప్రథమావిభక్త్యంతపదములమీఁద నున్నవిభక్తులకుఁ బరమునన్; కథితము లగు=ఉచ్చరింపఁబడు; కచటతపలు=పరుషములు; గసడదవలు = గసడదవ అనునక్షరములుగా; అగున్=అగును. పృథివిని=భూమియందు; ప్రథమప్ర=పూర్వభాగముననుండెడి; సున్న లగు=ద్రుతములు బిందువులుగా మాఱునట్టి; నాంతపదములమీఁదన్ = ద్రుతనకార మంతమునఁ గలపదములమీఁదను; ఇవి=ఈపరుషములు; గజడదబ లగును=సరళములుగా మాఱును అని భావము.

ప్రథమాంతపదములమీఁద నున్నపరుషములకు ("గసడదవాస్స్యుః ప్రథమామాత్రాత్" అను సూత్రముచే) గసడదవాదేశమును ద్రుతప్రకృతికపదములమీఁద నున్నపరుషములకు సరళములను ("పరుషా ద్రుతప్రకృతికా త్సరళాస్స్యుః" అనుసూత్రముచే) నగు నని భావము.

సున్న లగు నాంతపదములమీఁదన్ అనుటచే ద్రుతాంతమగుటమాత్రమే యపేక్షితము. ఆ ద్రుతము నకారరూపముగా నున్నను బిందురూపముగా నున్నను సరళాదేశమునకు నిమిత్త మగుటలో నాటంకము లేదు.

"నాంతపదములమీఁద సున్న లగు" ననులక్షణసమన్వయము సరిపడునట్లు తోఁచదు. నాంతపదములమీఁద సున్న లగునవి యేవియో ఇట నిర్దేశింపఁబడలేదు. ద్రుతములుగదా సున్న లగును.

నాంతపదములమీఁద నివి (కచటతపలు) గజడదబ లగు నని యన్వయము సరళము.

ఉదాహరణము :—

**వాఁడు గను, వాఁడు సేకొను, వాఁడు డెక్కు-**
**లాఁడు, వాఁడు దపోనిధి, వాఁడు వెద్ద,**
**చిక్కెఁ గరి, మ్రొక్కెఁ జెలి, వాక్కుఁ డక్కు వెట్టె,**
**శౌరిఁ దలఁచె, నిం బిలిచె నా సంధు లిట్లు.** ౬౩

పూర్వపద్యోక్తాదేశముల కీపద్యమున నుదాహరణముల నిచ్చుచున్నాఁడు. పూర్వార్ధమున వరుసగా "వాఁడు" ను ప్రథమాంతములమీఁద గసడదవాదేశము నుత్తరార్ధమునఁ జిక్కెన్, మ్రొక్కెన్, వాక్కున్, శౌరిన్, నిన్ అను ద్రుతాంతములమీఁద వరుసగా గజడదబాదేశమును జూపెను.

"వాఁడు దపోనిధి" యనుచోట దకారాదేశము "నవికృతి శబ్దాత్పరతః" అనుసూత్రముచే నిషిద్ధ మనరాదు. ఆసూత్రమునకు వజ్ఝలవారివ్యాఖ్యానము చూచునది. ప్రౌఢవ్యాకరణకర్తయుఁ "తెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గదవలు గానంబడియెడి" నని సూత్రించి ఇట్లు దపంబు, ఎంతగుమతు లైన, పీరల్గోపించిన, వేవణములు మున్నగుప్రయోగములఁ జూపెను.

ఇందు నిన్ బిలిచె- అనుచోట "న్" అనునది ద్రుతము కావునఁ బూర్ణబిందురూపముం జెందవచ్చును. నుడి తొలిహ్రస్వము మీఁది దగుటచే నర్ధబిందువుగా మాఱదు. "అవికారగ తేతస్మిన్నపి"[2] అను చింతామణిసూత్రమునుబట్టి పకారము బకారముగా మాత్రము మాఱును. ౬౩

ఆ. వె. ఆయచేతనద్వితీయ దా నిజరూప
మయ్యు నుండుఁ, బ్రథమయట్టు లుండుఁ,
[1]గ్రతువుఁ గాచె దాశరథి, కృష్ణుఁ డొకపర్వ
తంబు గొడుగుభంగిఁ దాల్చె ననఁగ. ౬౪

ఆయచేతనద్వితీయ = జడవాచకములమీఁద నున్నద్వితీయా విభక్తి; తాన్=తాను; నిజరూపమయ్యు నుండున్=ద్వితీయారూపముతోడను నుండును. (లేదా) ప్రథమయట్టు లుండున్=ప్రథమాంతముగను నుండును. "తస్యాః ప్రథమాచ జడపదానాం స్యాత్" అను సూత్రముచే జడవాచకములకు ద్వితీయాస్థానమునఁ బ్రథమయు నుండునని భావము.

"క్రతువున్" అనునది ద్వితీయాంతముగానున్న జడవాచకము. "పర్వతంబు" అనునది కర్మవాచకజడపదమునకుఁ బ్రథమ వచ్చుట కుదాహరణము.

ఈవిభక్తివిషయము ప్రథమమీఁద గసడదవలును, ద్వితీయమీఁద సరళములును నగు ననుసందర్భమునఁ జెప్పవలసివచ్చెను. ఇట్టివియు సంధిగతప్రాసమున కుదాహరణములు కావచ్చును. ౬౫

గీ. అచ్చుమీఁదచ్చున యకార మాయజుండు,
కొమ్ముగలహల్లు ప్రథమైనఁ గ్రుంకు నచ్చు,
గురుఁ డుపేంద్రుండు, పెఱచోటఁ గ్రుంకు నొందె,
జను నకారంబు జనులందు జనులయందు. ౬౬

అచ్చుమీఁదచ్చునన్ = అచ్చునకుఁ బరమందున్నయచ్చునందు; యకారము = యశ్రుతి (యడాగమము) వచ్చును. ఉదా॥

1. వావిళ్లవారి ద్వితీయముద్రణపాఠము పూర్వార్థోద్దేశక్రమానుసారిగా నుండుటచే నిదియే గ్రహింపఁబడెను. తృతీయముద్రణపాఠ ముద్దేశక్రమానుసారిగా లేదు.

ఆ+అజుండు=ఆయజుండు; కొమ్ముగలహల్లు = ఉత్వముతోఁ గూడిన హల్లు; ప్రథమయిన్=ప్రథమావిభక్తిసంబంధి యయినచో; అచ్చు క్రుంకున్=ఆయచ్చు అనఁగా నుకారము, క్రుంకుఁ = లోపించును. (నిత్యసంధి వచ్చు నని భావము.) ఉదా॥ గురుఁడు+ఉపేంద్రుండు= గురుఁ డుపేంద్రుండు; పెఱచోటఁ = ప్రథమేతరవిభక్తులందు; ఒం డెఁ=వికల్పముగా; క్రుంకుఁ = లోపించును. అకారంబు=జనుల+ అందు మున్నగుచోట్ల నున్న అకారము; జనులందు జనులయం దుఁ = జనులందు జనులయందు అనురీతిని రెండువిధములుగా; చనున్ =ఒప్పును.

సంధి రానిపక్షమున నచ్చుమీఁదనచ్చు వినఁబడునపు డచ్చట యశ్రుతి యగు ననియు (యశ్రుతిమాహ్యా లఘుయం ప్రవదంతి ప్రాణతః పరంప్రాణమ్) కళలగు ప్రథమాంతములయుకారమునకు నిత్యసంధి యనియు, ప్రథమేతరవిభక్త్యుకారమునకు సంధి వైకల్పిక మనియు, అకారమునకు సంధి బహుళమనియు నిందుఁ జెప్పెను. సంధివశాగతయకారప్రాసము స్వప్రాసమునకుం జెందు నని గ్రాహ్యము.

గీ. ఓలిఁ గర్మధారయషష్ఠు లుత్వములుగ
నచ్చుతుద నుండ టనములౌ నాంధ్రసంధిఁ
గలుగుటగచరు ల్గట్టి రక్కాజపుటుదధి
వితతయశుఁ డైనరాజునానతి ననంగ. ౬౬

కర్మ...ష్ఠులు=కర్మధారయ, షష్ఠీతత్పురుష సమాసములం దలిపూర్వపదములు; ఉత్వములుగన్=ఉకార మంతమునఁగలవిగా నుండఁగా; అచ్చు తుద నుండఁ=అచ్చు పరమం దున్నచో; ఆంధ్ర సంధిన్=తెనుఁగుసంధులలో; ఓలిన్=వరుసగా; టనములౌన్=టకార నకారములు ఆగమములుగా నగు నని భావము.

కర్మధారయోదాహరణము- కఱకు+అగచరులు=కఱకుటగచరులు. అక్కజము+ఉదధి=అక్కజపుటుదధి. షష్ఠికి- రాజుయొక్క+ఆనతి=రాజునానతి. ౬౬

గీ. ను ఱులు రుల పొల్లు లౌను దెనుంగునందు
హేమ మిది పదార్వ[1]న్నె నల్మోము లతఁడు
ప్రబలి హరిఁ గొల్చియున్న వార్వరమునులు
గోటిలో నొప్పు సతికిఁ గన్గొన లసంగ. ౬౭

తెనుఁగుపదములలో "ను, ఱు, లు, రు" అనువానిలో నున్న 'ఉత్వ' ము లోపించి పొల్లుహల్లుమాత్రము కొన్నిచోట్ల శేషించును. ఉదా॥ పదాఱు+వన్నె=పదార్వన్నె. (సంయుక్త మగుటచే రేఫముగా ఱవర్ణము మారెను.)

నలు+మోము=నల్మోము; వారు+పరమమునులు=వార్పరమమునులు; కను+కొనలు=కన్గొనలు.

గోటి...నంగ = నేత్రాంతములు గోటిలో నిముడునంతటి సన్ననివని భావము. నేత్రాంతములకు బాణాగ్రసాదృశ్యాదులు ప్రసిద్ధములు గదా. ౬౮

గీ. ద్విత్వమున కాదివర్ణంబు తెనుఁగునందు
నూఁదకుండును, వలసిన నూఁదియుండు,
జానకీవల్లభుఁడు క్షమాశాలి యనఁగ,
దశరథాత్మ[2]జుఁడే స్వామి ధాత్రి కనఁగ. ౬౯

తెనుఁగునందు = తెనుఁగుభాషలో; ద్విత్వమునకు = రెండు హల్లులసంయోగమునకు; (ఇట ద్విశబ్ద మనేకోపలక్షణము. సజాతీయ

1. ర్వ అనుపాఠము గృహీతము.
2. "జ్ఞే" యని సవరింపఁబడెను.

విజాతీయోభయసంయోగ మనియు గ్రాహ్యము.) ఆదివర్ణము=పూర్వ వర్ణము; ఊఁదకుండును = తేల్చిపలుకఁబడును. (ఇదియే తఱచుగా నుండునది యని సూచితము) వలసిన నూఁదియుండున్ =కావలసినచో నొక్కొకచోట నొత్తియుఁ బలుకఁబడును.

తెనుఁగున సాధారణముఁగా భిన్నపదసంయుక్తమునకుఁ బూర్వాక్షరము తేల్చియే పలుకఁబడును. కొన్నిచోట్లమాత్రము కావలసినచో నొత్తిపలుకవచ్చు నని యిందుఁ జెప్పఁబడెను. ఉదా॥ వల్లభుఁడు+క్షమాశాలి. ఇట క్షకారపూర్వాక్షరమును దేల్చియే పలుకుచున్నాము.

"దశరథాత్మజుఁడే+స్వామి." ఇట "స్వా" అనుసంయోగము నకుఁ బూర్వాక్షరము వలసినచో నొత్తిపలుకవచ్చును గనుక యుదా హరణ మయ్యెను. సంయోగపూర్వాక్షరము దీర్ఘ మయినచో నొత్తి పల్కినను దోషము లేదు. హ్రస్వ మయినచో నొత్తిపలుకరాదు. కనుక దీర్ఘము నొత్తిపల్కుట యాచారములో నుండవచ్చును. "డు" అని హ్రస్వముగా వ్రాసి దానిని గురువుం జేయుటయు నొత్తి పల్కుటయు నసాంప్రదాయికము. అది యనంతునికి సమ్మతము కాదని యాతనికావ్యములవలననే తెలియఁబడును. ౯౧

**వ. మఱియు శబ్దాలంకారవిశేషఁబులు ప్రాసంబులు నెట్టి వనిన.**

శబ్దాలంకారవిశేషము లయినప్రాసము లని యన్వయము. ౯౨

**క. అమరఁగ దుష్కరమును ద్వం**
**ద్వము త్రి చతుష్ప్రాసములును దగ నంత్యప్రా**
**సమును ననుప్రాసము ననఁ**
**గ్రమమున షడ్విధము లయ్యెఁ గంసవిదారీ ।**

కంసవిదారీ !=కృష్ణా ! దుష్కరప్రాసము, ద్వంద్వప్రాసము, త్రిప్రాసము, చతుష్ప్రాసము, అంత్యప్రాసము, అనుప్రాసము అను భేదములచే శబ్దాలంకారవిశేషప్రాసము లాఱువిధములు.

వెనుకఁజెప్పిన సమప్రాసము మున్నగుపండ్రెండువిధముల ప్రాసములను ప్రధానప్రాసము లని యప్పకవి వ్యవహరించెను. ప్రాసనియమము గలపద్యములలోఁ బ్రధానప్రాసములలో నొక్కటి నియతముగా నుండవలయును. ఈవిశేషప్రాసములు నియతములు కావు. ఐచ్ఛికములు. 20

౧. దుష్కరప్రాసము

క. దోఃకీలితమణికటక ! యు
రఃకలితరమాభిరామ ! రంజితసుజనాం
తఃకరణ ! ఖండితారిశి
రఃకందుక ! యనఁగ దుష్కరప్రాస మగున్. ౭౧

దోః...టక=భుజమున ధరింపఁబడినరత్నఖచితవలయము గలవాఁడా !, ఉరః...రామ=వక్షఃప్రదేశమున ధరింపఁబడినలక్ష్మితోఁ బ్రకాశించువాఁడా !, రంజి...రణా=రంజింపఁజేయఁబడిన సజ్జనుల మనస్సు గలవాఁడా !, ఖండి...దుక=నఱుకఁబడిన బంతులవంటిశత్రుశిరస్సులు గలవాఁడా !

ప్రాసాక్షరము దుష్కర మయినచో దుష్కరప్రాస మగును. ఇందు విసర్గ (జిహ్వామూలీయ) పూర్వకకకారము ప్రాసస్థానఘటితము కావున నిది దుష్కరప్రాస మయ్యెను. 21

౨. ద్వంద్వప్రాసము

క. కంజనయన ! భవభీతివి
భంజన ! శుకశౌనకాదిబహుమునిచేతో

రంజన ! ద్వంద్వప్రాస మ
నం జను నిప్పాటఁ బల్కినం గృతులందున్. ౭౨

కంజనయన=పద్మనేత్రా !, భవ...జన=సంసారభయమును బోఁగొట్టువాఁడా !; శుక...జన=శుకుఁడు శౌనకుఁడు మున్నగు ననేక మునుల మనస్సుల రంజింపఁ జేయువాఁడా !; ఇప్పాటన్=ఈతీరున; కృతులందుఁ బల్కినఁ ద్వంద్వప్రాస మనం జను నని యన్వయము.

ప్రాసాక్షరము తోఁబాటు దానియనంతరాక్షరముంగూడఁ బ్రాసముగాఁ గైకొని రెండక్షరములను బ్రాసముగాఁ జేసినచో ద్వంద్వప్రాస మనఁబడును. ఇందు 'జన' అను రెండక్షరములు గ్రహీతములగుట నిది యుదాహరణ మయ్యెను. ౭౨

౩. త్రిప్రాసము

క. తా నవనీతప్రియుఁ డన
దానవనిర్మూలనైకతత్పరుఁ డన స
న్మౌనివినుతుఁ డన నతసుర
ధేను వనం గృతులయందుఁ ద్రిప్రాస మగున్. ౭౩

తాన్+నవనీతప్రియుఁడు. నతసురధేనువు=నమ్రము లగువారికి కామధేను వయినవాఁడు.

ప్రాసాక్షరముతోఁబాటు దానియనంతరాక్షరములను రెంటినిఁగూడఁ బ్రాసముగాఁ గైకొని 'నవన' అను 3 అక్షరములను బ్రాసముగా నిట గ్రహించుటచేఁ ద్రిప్రాస మయ్యెను. నియతప్రాసముల లోని నాల్గవప్రాసభేదము త్రికారప్రాస మనియు నిది త్రిప్రాస మనియు నిందు సాధారణముగా వ్యవహరింపఁబడును.

౪. చతుష్ప్రాసము

వారణవరద! నిశాటవి
దారణ! వీరావతార! ధరణీవలయో
ద్ధారణ! విరచితసత్యవ
ధూరణవరవిజయ! యనఁ జతుప్ప్రాస మగున్. ౭౪

వార...ద=గజవరదా!, విరచిత...రణ=రచింపఁబడిన సత్యభామచేత నగుయుద్ధవిజయము గలవాఁడా!

ప్రాసాక్షరముతోఁబాటు దానియనంతరాక్షరములను మఱి మూఁడిటినిగూడ గ్రహించి నాల్గక్షరములను ప్రాసముగా నిట గ్రహించుటచే నిది చతుప్ప్రాసోదాహరణ మయ్యెను. ప్రాసాక్షర సంఖ్య నాల్గిటికి మించినచోఁ ప్రాసవిశేషముగాఁ బరిగణింపఁబడలేదు. అట్టిది యమకాద్యలంకారములలోన పరిగణింపవలయు నని కవుల యాశయము. లేనిచో ననవస్థ యగును. ౭౪

౫. అంత్యప్రాసము

క. అగణితవిభవస్ఫూర్తీ!
నిగమాగమసతతవినుత! నిర్మలమూర్తీ!
జగదభిరక్షణవర్తీ!
యగు నంత్యప్రాస మిః ట్లుదంచితకీర్తీ! ౭౫

అగ...ర్తీ=అమేయ మగువైభవప్రకాశము గలవాఁడా!; నిగ...నుత=వేదములచేతను శాస్త్రములచేతను నెల్లప్పుడుఁ గొని యాడఁబడువాఁడా!

ఇం దన్నిపాదములయంతమునను "ర్తీ" అనునక్షర మొక్క తీరున నుండుటచే నిది యంత్యప్రాస మయ్యెను.

పాదాంతములం దక్షరములను సమానముగా ప్రాసాక్షరనియమములతోఁ గూర్చిన నంత్యప్రాస మగును. దీని కితరచ్ఛందశ్శాస్త్ర

కర్తలు మఱికొన్నినియమములం జెప్పిరి. ఎట్లన, అంత్యప్రాసము గురుపూర్వక మయినచో నేకాక్షరమును లఘుపూర్వక మయినచో రెండక్షరములును నుండవలయు ననియు స్వరభేదముకూడ నుండరా దనియు భావించిరి. అంత్యప్రాసము పాదాంతములకే వర్తించు నను టచే నిట నంత్యశబ్దమునకుఁ బాదాంత్య మని యర్థ మగును.

అంత్యప్రాసోదాహరణములు సాధారణముగా సంబోధనాంత పదములతోఁ గానవచ్చుచున్నవి. అట్టివానియందుఁ బాదమధ్యమున నున్నసంబోధనపదములును బ్రాసయుక్తములు కావలయు నను నియ మము లేదు. కనుకనే యీపద్యమున "సతతవినుత" యనునది యవి రుద్ధ మయ్యెను.

కం. నందాంగనాకుమారా !

మందరగిరిధీర ! దనుజమదసంహారా ! అప్ప. 3 ఆ. 3౮ ప.

కం. జననుతభీమతనూజా !

సునయార్జితవిభవతేజ ! సుభగమనోజా ! ఆ.రం.ఛం.3ఆ.౨3 ప.

అనుచోట్ల "గిరిధీర !" "విభవతేజ !" అనుచోట్లను బ్రాసము పాటింపఁబడుట యానుషంగిక మని గుర్తింపనగును. ఆవశ్యకము కాదనుట. పద్యప్రాసాక్షరమే యంత్యప్రాసమునకుం గూర్చుట శోభా తిశయాధాయకమని కొందఱు వచియించిరి. వీనిలో మొదటిపద్యమునఁ బాద మంతయు నొక్క-సమాసపద మని భావింపఁగల్గినను రెండవ పద్యమున నేకసమాస మనుటకు వలనుపడదు.

పాదాంతమునఁ బ్రాసము లేక పాదమధ్యములందలి సంబోధ నాంతపదము లంత్యప్రాసనియమములతోఁ గొన్ని కానవచ్చుచున్నవి:

క. దాంతు హరిచరణభక్తి

స్వాంతు రసాతలనిశాంతు నత్యంతదక్షూ

వంతు సమతీతవిధిక
ల్పాంతుఁ బరమశాంతు నయ్యనంతుఁ దలంతున్.
(అప్ప. ౧. ౧౧.)

ఇట్టివి పైలక్షణమునుబట్టి యంత్యప్రాసములు కాఁజాలవు. లక్షణసారసంగ్రహమున "పాదిలు రాఘవదాస కదనజయోల్లాస కదియు నంత్యప్రాస మిది సువాస" అని యుదాహరింపఁబడెను. ఇది యంతయు నొక్కపాదమే. ఇందు పాదఖండములయందే యంత్య ప్రాసము కానవచ్చుచున్నది. ఇది విలక్షణము. ఇట్టివిశేషములు గ్రంథాంతరములవలనఁ దెలియనగును. ౭౫

క. మొదలిటిప్రాసమె కానీ
యిది యంత్యప్రాస మనఁగ నే దట కానీ
కదియింపవలయు దా నీ
పద నెఱిఁగినబుధుఁడు కృతులఁ బరమజ్ఞానీ! ౭౬

ఈపదను=ఈతీరు; కృతులన్=గ్రంథములయందు; మొదటి సామాన్యప్రాసము కాని యీయంత్యప్రాసము కాని యేదయినను నేను జెప్పినయీపద్ధతి ననుసరించి గ్రంథములయందు బుధులు ప్రయోగింపవలయును.

ఇందును "నీ" యనునక్షర మంత్యప్రాసముగాఁ గూర్పఁబడెను. ఈ రెండుపద్యము లుదాహరించి యంత్యప్రాసాక్షరములను స్వరభేదములేకుండ నుపయోగించి చూపినందున నీతనికిని స్వరభేదాభావనియమము సమ్మతమని తెలియఁబడుచున్నది. ౭౬

౬. అనుప్రాసము

క. విప్రప్రకరమునిప్రీ
తిప్రదసుప్రభవ! యప్రతిమదోఃప్రభవా!

విప్రణుత ! సుప్రసన్న ! యను
ప్రాసప్రవర మిది మనుప్రియచరితా ! ౭౩

విప్రప్రకర=బ్రాహ్మణసమూహమునకును; ముని=మునులకును; ప్రీతిప్రద=సంతోషకరమయిన; సుప్రభవ !=శోభనజన్మములు (అవతారములు) కలవాఁడా !; అప్రతిమనోః ప్రభవా !=సాటిలేని రాజశ్రేష్ఠా ! (రామునికి సంబోధనము); విప్రణుత=బ్రాహ్మణులచే నుతింపఁబడువాఁడా !; సుప్రసన్న=అనుగ్రహించినవాఁడా; మనుప్రియ=మను వనుధర్మశాస్త్రకర్తకు ప్రియమయిన; చరితా !=నడువడిగలవాఁడా ! ధర్మమార్గసంచారి యని భావము; ఇది; అనుప్రాసప్రవరము=అనుప్రాసశ్రేష్ఠము.

ఒకవర్ణమే పలుతావుల నావృత్తిఁ జెంది కానవచ్చుట యనుప్రాసము. ఈపద్యమున "ప్ర" అనునది ౧౨ పర్యాయము లావృత్త మగుటచే నిది యనుప్రాసమున కుదాహరణ మయ్యెను. ఇదియే సంస్కృతమున వృత్త్యనుప్రాస మనఁబడును. ౭౭

## యతిప్రకరణము

**యతిసంజ్ఞలు**

క. విరతులు విశ్రాంతులు మఱి
విరామములు విశ్రమములు విశ్రామంబుల్
విరమంబులు యతు లనఁగా
విరమణములు నాఁగ వళ్లు వెలయు మురారీ ! ౭౪

వళ్లు=వడులు;

యతులకుఁ బర్యాయపదములను తొమ్మిదింటి నిందుఁ జెప్పెను. కవిజనాశ్రయమున నెన్మిదింటినే చెప్పెను వడి యను పేరు

కూడ నాతఁడు వాడుటచే నాతనికిని నీతొమ్మిదినామములు సమ్మతములే. అప్పకవి పైఁజూపిన తొమ్మిదింటినేకాక "విశ్రాంతి" రూపాంతర మగు "శ్రాంతి" పదము నొకదాని ననేకముగాఁ జూపెను. వడి యనుమాట నప్పకవి "వళి"గా సంస్కరించి యుపయోగించెను. ఎట్లయినను శ్రము, రము, యము అను మూఁడుధాతువుల కృదంతరూపములే యందఱును గ్రహించిరి. ఇవియన్నియును సంస్కృతపదములే. వడి యనున దొక్కటియే తెనుఁగుపదము. ౭౮

యతిపంచకము

క. స్వరయతులు వర్గయతులును
సరసయతుల్ ప్రకటమైన సంయుక్తయతుల్
పొరిఁ బ్రత్యేకయతులు నన
బరగును యతిపంచకంబు పంకజనాభా! ౭౯

అనంతుఁడు తాఁ జెప్పఁబోవుయతులను ముందుగా నయిదు వర్గములుగా నిందు విభజించి నిర్దేశించుచున్నాఁడు.

౧. స్వరయతులు- అచ్చులకు సంబంధించినయతు లొకవర్గము.
౨. వర్గయతులు- కకారాదిమకారాంతవర్గాక్షరములకు సంబంధించినయతులు రెండవవర్గము.
3. సరసయతులు- ఒకవర్గమునకుఁ జెందక మిశ్రముగా మైత్రిగల యతులు. అ య హ లు, న ణ లు, మున్నగునవి.
౪. సంయుక్తయతులు- ఒకయక్షరము కాక సంయుక్తము లయినవర్ణముల యతులు.
౫. ప్రత్యేకయతులు- మీఁదినాల్గువిధములలోఁ జేరక ప్రత్యేకలక్షణము గలయతులు.

**యతిపంచకభేదములు**

క. స్వరయతులు ప్రాది కాకు
స్వర నిత్యసమాసయతులు, వర్గయతులు ని
ద్ధరఁ బోలికవడి, సంయుత
విరతి యనుస్వారయతులు వెలయు ముకుందా! ౮౦

తాఁ జెప్పఁబోవుయతుల నిట వరుసగా నిర్దేశించుచున్నాఁ డని భావింపరాదు. పూర్వోక్తపంచవిధయతులలోఁ జెప్పఁబోవుయతివిశేషము లేయేవర్గములకుఁ జెందునో వివరించుచున్నాఁడు.

ప్రాది ... యతులు, స్వరయతులు=ప్రాదియతి. కాకుస్వరయతి, నిత్యసమాసయతియు స్వరయతు లగును. (ఇద్ధరన్=ఈభూమియందు) పోలికవడి వర్గయతులు=పోలికవడియు వర్గయతులలోనిదియే. అనుస్వారయతులు సంయుతవిరతి=అనుస్వారయతులు సంయుతవిరతిగను ఓముకుందా వెలయు నని యన్వయము.

స్వరయతు లనుపేరుతో నిర్దేశింపఁబడు గూఢస్వర, ఋకారస్వరూప, రియతి, ఌకారయతులు ఎట్లును స్వరయతులే కావున వానిని వేఱుగా వివరింపనక్కఱలేదు. ౧ నుండి ౮ వఱకును గలయతులు స్వరయతు లని భావము. అనుస్వారయతులు పరసవర్ణతం జెందిన సంయుక్తాక్షరములయతు లగుట నిర్వివాదము. పోలికవడి వర్గీయాక్షరములకు సంబంధించినదే యగుటచే వర్గయతి యగుటయు నుచితము.

క. ప్రభునామాంతవిరతి యన
విభాగవిరమణము భిన్నవిశ్రమమును గా
స్తుభధర! వికల్పయతి యన
నభేదవిరమణ మనంగ నైదు తెఱంగుల్. ౮౧

పూర్వపద్యమున మూఁడుయతులకు సంబంధించినయతిభేదములను వివరించెను. సరసయతి కొన్నియక్షరములకుఁ బ్రత్యేకనిర్దిష్ట మగుటచే దానం జేర్పఁదగినయతిభేదము లుండ వని తలంపవచ్చును. ఇంకఁ బ్రత్యేకయతులలోఁ జేరఁదగినయతులను జెప్పవలసియుండుటచే వానినే యిందు వివరించియుండు నని యూహింపఁబడుచున్నది. మకారయతి, నిత్యయతి, ఎక్కటియతి అనువానింగూర్చి వివరించిన పద్య మీపద్యమునకుఁ బూర్వభాగమున లుప్త మయియుండును. ప్రత్యేకయతిభేదములనే యిందును వివరించుచున్నాఁ డని యూహింపఁదగును.

ప్రభునామాంతవిరతి, విభాగయతి, భిన్నయతి, వికల్పయతి, అభేదయతి అను నయిదువిధములును బ్రత్యేకయతులే యగు నని యిందు వివరించె నని భావింపఁదగును.

ఎక్కటియతి యనఁ బ్రత్యేకయతి యనియే భావము. నిత్యయతియుఁ బ్రత్యేకలక్షణలక్షితము కావున నదియుఁ బ్రత్యేకయతియే. మకారయతియు బహుశః ప్రత్యేకయతిగనే భావించియుండును. యుక్తవికల్పయతి వికల్పయతిభేదమే యగుట నిశ్చయము.

కాఁగా ౧ నుండి ౯ వఱకును స్వరయతు లనియు, ౧౦, ౧౧ వర్గయతు లనియు, ౧౨ సరసయతి యనియు, ౧౩, ౧౪, ౧౫, ౧౬ సంయుక్తయతు లనియు, ౧౭, ౧౮, ౧౯, ౨౦, ౨౧, ౨౨, ౨౩, ౨౪ యతులు ప్రత్యేకయతు లనియుఁ దలంపవలసియున్నది.

విన్నకోట పెద్దన్నయు స్వరజలు, వర్గజలు, ఇతరేతరవర్గజలు, ఏకతరజలు అని నాల్గువిధములుగా యతులను విభజించి ప్రత్యేకముగా ముకారయత్యాదులను విశేషించి చెప్పెను. ఆవిభాగమునే యనుసరించి యితఁడును బ్రత్యేకయతు లని యొకవిభాగములోఁ వానిం జేర్చియుంచుకభేదములో యతుల నయిదువిధములుగా విభజించెను. ౪౧

౧. స్వరయతులు

ఆ. వె. అగు నకారమునకు నైత్వౌత్వములు వడి,
ఈకి ఋత్వమునకు నేత్వ మమరు,
నుత్వమునకు నోత్వ మొనరు, నీగతి స్వర
యతులు విస్తరిల్లు నబ్జనాథ! ౮౨

అ, ఐ, ఔ లును, ఇ, ఋ, (ఌ), ఏ లును, ఉ, ఓ లును తమలోఁదాము యతిమిత్రము లని భావము. “ఋ ఌ వర్ణయోర్మిథ స్సావర్ణ్యం వాచ్యం” అని చెప్పిన ఋకార ఌకారములు మిత్రములు కావున ఌకారము ఇకారవర్గములోని దని గ్రహింపనగును. ౮౨

క. స్వరములు హ్రస్వము దీర్ఘము
నరయంగా నొక్కరూప యతులకు, సంధ్య
క్షరము లగునచ్చులందు సు
చరితా! హ్రస్వములు లేవు సంస్కృతభాషన్. ౮౩

పూర్వపద్యమున నచ్చులయతిమైత్రిం జెప్పెను. కాని హ్రస్వములను గొన్నింటిని దీర్ఘములను గొన్నింటినిమాత్రము నిర్దేశించెను. విడువఁబడిన ఆ, ఈ, ఊ మొదలగువానిమైత్రి యెట్టి దని సంశయము కలుగుచుండ దానిం దీర్చుట కీపద్యముం జెప్పెను.

స్వరములు హ్రస్వదీర్ఘములు సమానములే యని తెలియ నగును. అనఁగా హ్రస్వదీర్ఘములలో వేనిం జెప్పినను శేషించినవానికిని ఆమైత్రి చెల్లు నని యర్థము. ఏ, ఓ, ఐ, ఔ అను నాల్గక్షరములును సంధ్యక్షరము లనఁబడును. వీనికి సంస్కృతమున హ్రస్వము లుండవు. అందుచే సంస్కృతపదములలో యతిమైత్రీసంశయ మక్కఱలేదు. తెనుఁగున దీర్ఘములమైత్రియే హ్రస్వములమైత్రియు నను టచే నిస్సంశయమే.

ఏ ఓ లకుఁ దెనుఁగున హ్రస్వములు గలవు. ఐ ఔ లకు హ్రస్వములు తెనుఁగునను లేవు. కాని అయి, అవు అను హ్రస్వమయ రూపాంతరములుమాత్రము గలవు అని యనంతరపద్యద్వయమున వివరించును. ౮౩

క. అలఘుచతుస్సంధ్యక్షర
ములలో నై యౌలు దక్క మొదలిటిరెంటిన్
దెలుఁగునను హ్రస్వ దీర్ఘము
లొలయును నె ఏ లనంగ నొ ఓ లనఁగన్. ౮౪

అలఘు...లోన్ = గొప్పవియగు నాల్గుసంధ్యక్షరములలో=ఏ, ఓ, ఐ, ఔ లలో; మొదలిటిరెంటన్=ఏ ఓ లలో.

తెనుఁగున "ఏ ఓ" లకు ఎ, ఒ అని హ్రస్వములు నుండు నని భావము. వీనికి దీర్ఘములకు విధించినతీరుననే ఇ, ఋ, ఌ లతో యతిమైత్రి చెల్లు నని తెలియునగును.

ఇందు "నె ఏ లనంగ నొ ఓ లనఁగన్" అనుచోట ఎ, ఒ, అనువర్ణముల నొత్తి పలుకవలయును. అనఁగా సంయోగపరములుగాఁ జేసి "నెయ్యే లనంగ నొవ్వో లనఁగన్" అని పఠించి గణభంగ సంధిదోషములను బరిహరింపవలయును. నిక్కలావెగ భావించి దీనిని సాధువు లనఁదగును. ఎయే లనికాక ఎయ్యే లనుటకు నిక్కలాదిగణ పాఠమే యాశ్రయణీయము.

లేదా, ఎ, ఒ అను హ్రస్వాచ్చులు స్ఫుటముగాఁ దెలియుట కొత్తిపల్కవలయును. అపు డవి గురువు లయి ఛందోభంగము లేకుండఁ జేయును. ఇట్లే ర. ఆ, ౧౦౯ పద్యమున "అ ఆ ఇ ఈ లనఁగా" నని ప్రయోగించెను. ఇట యతి వచ్చినచో "నె యే లనంగ" నని యగును. అప్పుడైనను హ్రస్వముల నొత్తి పల్కిననే

గురువు లగును. కనుకనే యితఁడు "మఱి యూఁదిపలుకునవియును గురువుల్" అని వచియించెను. ౮౮

క. క్రియ నై యౌ లకు హ్రస్వ
ద్వయము లమరు నాంధ్రభాషితప్రకరములోఁ;
నయి దనఁదగు నై దనుచో
జయకీర్తీ ! యవు ననంగఁ జనునౌ ననుచోన్. ౮౯

ఆంధ్ర...లోన్=తెలుఁగుపదములసమూహమున; క్రియను+ఐ ఔ లకు=క్రియ నై యౌ లకు; క్రియయందుఁగూడ ననఁగా నితర పదములందును నని భావము. హ్రస్వద్వయములు=అయి, అవు అని రెండేసిహ్రస్వాక్షరములు ఐ ఔ అనువానికి వరుసగా; అమరున్= ఒప్పును.

సంధ్యక్షరప్రసంగమున నీవిషయము చెప్పఁబడెను. ఉదా: ఐదు=అయిదు (సంఖ్యార్థక సుబంతము) ఔను=అవును (అగుధాతు తద్ధర్మరూపము) ఇందుఁ "గ్రియన్" అనుటచే నీరూపాంతరములు క్రియలలోమాత్రమే యని స్ఫురించుచున్నను నుదాహరణమునుబట్టి సుబంతములందును నీవిధి వివక్షిత మగుటచేఁ "గ్రియను" అని సముచ్చయముద్వారమున నీయర్థము సంపాదితము. ౯౦

౨. గూఢస్వరయతి

గీ. స్వరము తుద నుండ లుప్తవిసర్గకోత్వ
మైన స్వరవిరామంబు, దానోహ మనఁగ
నచ్యుతాశ్రితు లుర్వి నన్యోన్యమిత్రు
లనఁగ నమ్మకుందుండు యశోర్థి యనఁగ.

స్వరముతుదనుండ=అచ్చు (అకారము) పరమందుండ; లుప్తవిసర్గకు=విసర్గలోపము గలపదమునకు; ఓత్వ మయినన్=ఓకార మంత

మునఁ జూపట్టినచోఁ; స్వరవిరామంబు = పరముననున్నయచ్చునకే యతి యగును.

ఉదా. (దాసః+అహమ్)=దాసోహమ్. ఇందలి పరపదాద్యకారమునకు "ఐన" అనుచోటి "ఐ" కారముతో యతి వేయఁబడెను. ఇట్లే 3. ౪. పాదములలో నన్యోన్య యశోర్థి పదములలోనున్న పరపదాద్యచ్చునకు యతి వేయఁబడెను.

(దాస+సు) దాసస్+అహమ్ అని యుండఁగా సకారమునకు "ససజుషోరుః" అని రుత్వము వచ్చి "అతోరోరప్లుతాదప్లుతే" అను సూత్రముచే రేఫమున కుకారమును "ఆద్గుణః" అనుదానిచే నోకారము ఆదేశమునయి "ఏజఃపదాంతాదతి" అనుదానిచేఁ బూర్వరూపమువచ్చి "దాసోహ" మయ్యెను. ఇట్టిచోట్లఁ బరపదాద్యకారమునకే యతి వేయవలయు నని భావము.

ఇందలియుదాహరణములలో దాసస్ అనుచోట ప్రథమాప్రత్యయసకారము, అన్యస్ అనుచోట సుడాగమసకారము, యశస్ అనుచోటఁ ప్రాతిపదికావయవసకారమును గలవు. ఎట్టిపదమయినను యతి నిర్ణయమున భేదము లేదనుటకే వివిధపదముల నుదాహరించెను.

ఈయతికి గూఢస్వరయతి యనుపేరు పద్యమునఁ గానరాదు. శీర్షికలో నీపేరు కానవచ్చుచున్నది. ఈపేరు గ్రంథకర్తకు సమ్మతమయినచోఁ బరపదాదిస్వరము "ఓకార" రూపమున గూఢముగా నుండుటచే నీసంజ్ఞ నుపయోగించియుండును. ఇట్టియతిని బూర్వులు వివరింపలేదు. అప్పకవి దీనికి లుప్తవిసర్గకస్వరయతి యనిపేరుపెట్టెను. అతఁ డిట్టి ఓకారమున 'కయహ'లు యతి చెల్లు ననియెను, పరమున స్వర మున్నచో స్వరవిరామమే చెల్లు నననియమముచే నయహలే కాక ఐఔలును జెల్లు ననువిశాలభావ మిందుఁ గలదు. అప్పకవి యుక్తికంటె ననంతునిసూక్తి రమ్యముగా నున్నది.

3. ఋకారస్వరూపయతి

గీ. క్షితి ఋకారరూపస్వరయతులు పరగు
ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుఁడు దేవవృషభుఁ డనఁగ. ౮౨

వృష్ణికులజుఁడు=వృష్ణి యనువానివంశమునఁ బుట్టినవాఁడు=కృష్ణుఁడు; దేవవృషభుఁడు = దేవులలో శ్రేష్ఠుఁడు. వృషభశబ్దము శ్రేష్ఠార్థకము.

కేవలఋకారమునకు ఇ, ఏ లమైత్రి మున్నే చెప్పఁబడెను. అంతియకాక వట్టువకును (హల్లుతోఁగూడినఋకారమునకును) నే యే వర్ణములతో యతి చెందునో యిందు వివరించుచున్నాఁడు. ఇవి ఋకారరూప మగు స్వరమునకుఁ జెందుయతు లగుటచే "ఋకార రూపస్వరయతు" లనఁబడెను. రెండవపాదమున వట్టువకు హల్లుతోఁ గూడని కేవలఋకారముతో యతిని జూపి ఋకారమిత్రము లయిన ఇ, ఏ లతోడను మైత్రి గల దని సూచించెను. మూఁడవపాదమున వట్టువ కింకొకవట్టువతో హల్లులమైత్రి యక్కఱలేక యే యతిమైత్రి గల దని సూచించెను. నాల్గవపాదమున వట్టువకు స్వరమైత్రిగల యహాలతో మైత్రి గల దని "హే" అనుదానితో యతి వేయుటచే సూచితము.

అప్పకవి యిందలి ౨, ౪ పాదములయందలియతిని ఋత్వసంబంధయతి యనియు ౩వ పాదమునందలియతిని ఋత్వసామ్యయతి యనియును వ్యవహరించెను.

ఋకారము హల్ధర్మముకూడఁ గలదగుటచే నితరస్వరముల కంటె విలక్షణముగా నిట్టియతిమైత్రి గలదయ్యె నని యూహింపవచ్చును.

౪. రీవిరమము

విలసదృకారమునకు వ
ట్రిలు రీ విరమంబు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ, నీ యే లకుఁ
దలఁపఁగ రీ తోడివిరతి దలకొన దెందున్. ౭౪

విలసదృకారమునకు=ఒప్పునట్టి ఋకారమునకు, రీవిరమంబు=రి వర్ణముతో విరామము; వట్రిలున్=వర్తించును. శౌరి=విష్ణువు; ఋషులకు=మునులకు; శశ్వత్సులభుఁడు=ఎల్లప్పుడును సులభుఁడు; ఈ యే లకు=ఈ, ఏ అనువానికి; రీతోడివిరతి=రివర్ణముతో యతి; ఎందున్ దలకొనదు=ఎచ్చటను వర్తింపదు.

ఉదా: రెండవపాదమున ట్రి, ఋ లకు.

ఋకారమునకు రివర్ణముతో యతి చెందును. రివర్ణము ఋకారముతో యతిచెందినట్లు ఋకారమైత్రవర్ణము లయిన "ఇ ఏ" లతో మాత్రము యతి చెందరాదు అని తాత్పర్యము.

ఋకారమునకు రివర్ణముతో యతి వర్తించు నని మాత్ర మిందుఁ జెప్పఁబడెను. కాని హల్లుతోఁ గూడిన ఋకారమునకును నీమైత్రి నప్పకవ్యాదు లుదాహరించిరి.

ఇటఁ బాఠాంతరము గలదు, "విలసద్రికారమును వట్రిల" నని. ఆపక్షమున, విలసద్రికారమును=ప్రకాశించెడి రివర్ణముకూడ; వట్రిలన్=ఋకారమైత్రమై వర్తింపఁగా; రీవిరమము=రివడి అగు నని యర్థము. మిగిలినదంతయు సమానము.

గీ. తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫ, యిత్వమునందుఁ గనిసి యతికి

నట్టి రికి నీ యే లతో నన్వయించు
నట్టిసత్త్వంబు లే, దది హల్లు గాన. ౭౫

పూర్వపద్యోక్తవిషయమున యుక్తిం జూపి యిందు సమర్థనము కావించుచున్నాఁడు.

తెల్లముగన్=స్పష్టముగా; ఋకారము=ఋవర్ణము; యణాదేశశక్తిన్=యణాదేశసామర్థ్యముచేత; రేఫ=రవర్ణము: కలుగున్=అగును. అందున్=ఆరేఫమునందు; ఇత్వము=ఇకారము; కదిసి=కలసి; అతికినట్టిరికి=అతుకఁబడినట్టిరివర్ణమునకు; ఈయేలతోన్=ఇ, ఎ అనువర్ణములతో; అన్వయించునట్టిసత్వంబు=మైత్రిఁ జెందుశక్తి; అది=ఆరేఫము; హల్లు కాన=హల్వర్ణ మగుటచే; లేదు=ఉండదు.

ఋకారము యణాదేశవశమున రేఫముగా మాఱును గావున నికారముతో నారేఫము కూడఁగా "రి" యగును. అట్టిది హల్లు కాన ఇ, ఏ లతో యతిమైత్రిం జెందుటకుఁ దగదు. ఋకారము మాత్రము రేఫముగా మాఱును గాన దానికి రివర్ణమైత్రి యుక్తమే యని తాత్పర్యము. ౭౫

౫. ఌకారవిరతి

గీ. మును ఋకార మీ యే లతో నొనరినట్లు
చేర దొకట, యణాదేశకారణమున
ఘనలకారంబ యగును, ఌకారవిరతి
క్లిప్తి లేదు శౌరిగుణావళికి నన(ఁగ. ౭౬

మును=పూర్వమున; ఋకారము=ఋవర్ణము; ఈయేలతో నొనరినట్లు='ఈ ఏ' అనువర్ణములతో యతిచెందినట్లు; (ఌకారము=ఇది ప్రకరణవశమున లబ్ధము) ఒకటి=ఒక్కటియే; చేరదు=ఈ ఏ లతో ఒంటరిగానుండి యతి చెందదు. అనఁగా ఋణ, ఋషి మున్నగు

పదములలోఁ బ్రత్యేకముగా ఋకారము వినవచ్చుచున్నట్లు ౠకార మొక్కటియు వేఱొకహల్లుతోఁ జేరక ప్రత్యేకముగా నుండదు కావున ఇ ఏ లతో యతి చెందదు. కేవల ౠకారము ఈ ఏ లతో యతి చెందదనుట కిదియే భావము.

యణాదేశకారణమునన్ = యణాదేశము వచ్చుటచే; ఘన లకారంబయగును=లకారముగా మాఱును. "క్లప్తి లేదు శౌరిగుణావళికి ననఁగ" అనురీతిని ౠకారమునకు (హల్లుతోఁ గూడినదానికి) ళివర్ణ ముతో యతి వేసినచో ౠకారవిరతి యగును.

ఇచ్చట ౠకారము (క్లప్తి) కకారముతోఁ గూడియున్నది కాని ప్రత్యేకముగా నచ్చుమాత్రము వినవచ్చుటలేదు. ఇట్టిహల్లు తోఁ గూడిన ౠకారమునకుమాత్రమే ళివర్ణముతో యతి సంభవిం చును. అదియే ౠకారయతి యనఁబడు నని భావము.

ఋ, ౠ అనునవి రెండును తుల్యాచ్చులు. వానిలో ఋకా రము ప్రత్యేకముగాను (ఋషి) హల్లుతోఁగూడియుఁ (కృష్ణ) గాన వచ్చును. అందులోఁ బ్రత్యేకఋకారము ఇ ఏ లతో యతిఁ జెందును. హల్లుతోఁగూడినఋకారము కేవలాజ్ఋకారముతోను హల్లుతోఁగూడిన ఋకారముతోడను స్వరమైత్రిగలయహాలతోడను, రి, రే లతోడనుగూడ యతిఁ జెందును.

ౠకారమునకు ఋకారముకంటె భేదము కలదు. ఇది హల్లుతోఁ గూడక కేవలముగాఁ బ్రయోగింపఁబడదు. కావున "ఇ ఏ" లతో యతి సంభవింపదు. హల్లుతోఁ గూడినౠకారము మఱియొక హల్లుతోఁ గూడినౠకారముతో యతి చెందునని చెప్పనక్కఱలేదు గదా! స్వరమైత్రిగల యహాలతో దీనికి యతి యున్నట్టు కానరాదు. ఈవిషయము నీతఁడు వివరింపలేదు.

ఇక 'రి రీ' లతో ఋకారము మైత్రిం జెందునట్లు ఌకారము లి లీ (ఇది ళి ళీ లకును ఉపలక్షణము) లతో యతిమైత్రి చెందు ననియు నది ఌకారయతి యనఁబడు ననియుఁ జెప్పెను.

పైసందర్భమునుబట్టి కేవలాచ్చులయిన 'ఇ ఏ' లతో యతి చెందుట కవకాశము లేదనిసూత్రము చెప్పెనేగాని ఇ, ఏ, ఋ అను వానితోఁ హల్లులమీఁదఁగల స్వరమైత్రికి భంగము లేదు. కనుక హల్లులతోఁ గూడిన ఋకారము ఇ, ఏ, ఋ లతోఁ గూడినహల్లులతో యతిమైత్రిం జెందవచ్చును. ఋ, ౠ వర్ణము లాక్షేపవర్ణములుగాఁ బరిగణింపఁబడుసాదృశ్యము గలవి కనుక వానిపరస్వరమైత్రిని వేఱుగా విధింపనక్కఱలేదని విడిచెను.

ఈ ఛందోదర్పణము, కవిజనాశ్రయము మొదలగు ఛందోగ్రంథములు సూచనారూపముగా నాయావిషయములం జెప్పెనేకాని యవ్యభిచరితలక్షణములతోఁ జెప్పవు. కనుక సంప్రదాయానుసారముగా మిగిలినవిషయము లూహ్యము లగును. ౯౦

క. స్వరములు కాదుల నొందిన
నరుదుగ స్వరయతులు దగును, ప్రాదులు కాకు
స్వరమును నిత్యసమాసా
క్షరసంధులు రెండు నగు భుజంగమశయనా! ౯౧

భుజంగమశయనా! = ఓ శేషశాయీ!

స్వరములు = సంధిస్థలమునఁ బరపదాది నున్నయచ్చులు; కాదులన్ = పూర్వపదాంతమున నున్నకకారాదిహల్లులను; ఒందినన్ = కూడినయపుడు; స్వరయతులు దగును = పరపదాదిస్వరములకే యతి చెల్లును. పూర్వపదాంత్యహల్లును గ్రహించి యతి వేయరాదని భావము. ప్రాది, కాకుస్వర, నిత్యసమాసయుతులందుమాత్ర మట్లు

కాక యుభయమునకుఁ జెల్లు నని యుత్తరార్ధమునఁ జెప్పుచున్నాఁడు. ప్రాదులు=ప్రాదియతులును; కాకుస్వరమును=కాకుస్వరయతియును; నిత్య ... సంఘులు=నిత్యసమాసయతియొక్క-యక్షరసంఘులును; రెండు నగుక్=అచ్చులకును హల్లులకును రెంటికిని యతి చెల్లును.

ప్రాది, కాకుస్వర, నిత్యసమాసయతులు మూఁడిటియందు నుభయయతులు వర్తించు నని భావము. కనుకనే యప్పకవి వీని నుభయయతులలోఁ జేర్చెను. ౯౧

గీ, ప్రాది నిత్యసమాసశబ్దములు గాక
పెరపదంబులపైన నచ్చులు బెరసినప్పు
డన్నియును స్వరయతు లగు సాంబగురుఁడు
శ్రీశుఁ డమరాన్వయాబ్ధిపూర్ణేందుఁ డనఁగ. ౯౨

ప్రాది ... గాక = ప్రాదియతియందలిశబ్దములును నిత్యసమాసయతియందలిపదములును దప్ప; పెరపదంబులపైన్=ఇతరశబ్దముల మీఁద; (ఇచట కాకుస్వరయతికిని ఇది ఉపలక్షణము.) అచ్చు బెరసినపుడు=పరపదాది నున్నయచ్చు కూడినపుడు, అన్నియును = అన్నిస్థలములును; స్వరయతు లగున్=స్వరమునుబట్టి మైత్రిం బాటింపఁదగుయతుల యగునుగాని పూర్వపదాంతమున నున్నహల్లుంబట్టి వ్యంజనాక్షరయతులు వేయరాదని భావము (స్వరప్రధానయతి యని యప్పకవి చెప్పిననియమము నిందుఁ జెప్పెను.)

అజాద్యుత్తరపదముతోఁ బూర్వపదము సంధించునపుడు పూర్వపదమునంతమున నున్నహల్లును గ్రహించి యతి వేయరాదు. ఉత్తరపదాది నున్నయచ్చునే గ్రహించి యతి వేయవలెను. ఈనియమము ప్రాద్యాద్యుభయయతులందు వర్తింపదు. అచట నచ్చును హల్లునుగూడ గ్రహింపఁబడును. ఈవిషయము పూర్వపదోక్తమే

యయినను సోదాహరణముగా నిందుఁ జూపుట విశేషము. నాల్గవ పాద ముదాహరణము.

శ్రీ+ఈశ. పూర్ణ+ఇందు. ఈసంధులలో నుత్తరపదాదినున్న ఈ, ఇ అనునచ్చులే గ్రహింపఁబడెను.

అమరా...ర్ణేందుఁడు=దేవతలకు సంతోషకరుఁ డని భావము. అమర=దేవతలనెడి; అన్వయాబ్ధి = పాలసముద్రమునకు; పూర్ణేందుఁడు = పూర్ణచంద్రుఁడు. అన్వయ మనఁగాఁ బాలసముద్రము. "అన్వయః క్షీరజలధిః రత్నదీపస్తుచంద్రమాః" అని నిఘంటువు. "రఘుకులాన్వయరత్నదీపం" ఇత్యాదిసాంప్రదాయికప్రయోగములును గలవు. పరిణతగజ మన్నట్లే యన్వయాబ్ధి యని సామాన్య విశేషవాచకముల సహప్రయోగము.

లేదా, కశ్యపప్రజాపతి దేవర్షి యగుటచేతను దేవతలకుఁ దండ్రి యగుటచేతను నమరుఁ డగును. ఆతనికి వామనుఁడుగా నవతరించుటచేతను విష్ణుఁ డమరాన్వయాబ్ధిపూర్ణేందుఁ డగును.

లేదా, అన్వయ మనఁగా సమూహ మని యర్థమున దేవసంఘసంతోషకారి యగుటచే నావిశేషణము అమరసంఘ మనెడి సముద్రమునకుఁ బూర్ణచంద్రునివంటివాఁ డనునర్థము నిచ్చును. 62

౬. ప్రాదియతి,

క. ధర నుపసర్గలు ప్రాన్వవ
దురపాభిప్రతిసువిన్యుదుపపర్యధిసమ్
నిరతిపరాజప్య లిరువది,
పరాజపులు చొరవు తెలుఁగుబాసను నెందున్. 63

ప్ర, అను, అవ, దుర్, అప, అభి, ప్రతి, సు, వి, ని, ఉత్, ఉప, పరి, అధి, సమ్, నిర్, అతి, పరా, ఆఙ్, అపి అను నివి యిరువది

యుపసర్గములు. (వీనిలో పరా, ఆఙ్, అపి అన్నవికాక మిగిలినపదు నేడును ఉత్తరపదముతో సంధించునప్పుడు స్వరయతి యైనను వ్యంజనయతి యైనను బ్రయోగింపఁదగు నని భావము.)

ఇందు నిస్, దుస్ అను రెంటిని విడిచి యిరువదియుపసర్గములనే యితఁడు చూపెను. అప్పకవియు నీతని ననుసరించియే నిస్, దుస్ లను వర్జించెను. కాని వానిని విడుచుట విమర్శనీయమే యగును. సామాన్యముగా నీరెండిటియందును గల సకారములు "ససజుషోరుః" అనుసూత్రముచే రేఫలుగనే మాఱును. కావున నిర్, దుర్ అనువానిచేతనే యీరెండును గతార్థము లని తలంచి విడిచియుండును. కాని అయధాతువు పరంబగునపుడు ఉపసర్గగతరేఫము లకారమగును. (నిలయః) నిస్, దుస్ అనునుపసర్గలయందలి సకారాదేశ మగు రేఫమునకు లత్వము చేయఁదలంచినపుడు రుత్వ మసిద్ధమగుటచే నది ప్రవర్తింపక నిరయాదిశబ్దములు సిద్ధించును. ఇవి (నిస్, దుస్) లేనిచో నిరయాదులు సిద్ధింపకపోవును. ఇట్టిశబ్దములందు ననీయుభయయతి చెల్లుట న్యాయ్యమేకావున నీరెండుపసర్గలఁగూడ గ్రహించుటయే యుచితము.

ఈప్రాదు లవ్యయములు. ఇవి క్రియలతోఁ గూడినపు డుపసర్గసంజ్ఞ నొందును. ఉపసర్గముల కజాదిపదములు పరమయినపు డుపసర్గాంతమునఁ గలహల్లునకుఁ గాని పరపదాద్యచ్చునకుఁ గాని యతి చెందును. అట్టియతి ననంతరపద్యమున నుదాహరణరూపమున వివరించుచున్నాఁడు.

ఈయుపసర్గలలో పరా, ఆఙ్, అపి అను మూఁడును తెనుఁగునఁ జొరవని చెప్పుటకుఁగారణము దురూహముగా నున్నది. ప్ర, ప్రతి మున్నగునవి యెట్లు సంస్కృతపదములతోఁగూడియే తెనుఁగునఁ బ్రవేశించునో యట్లే పరాబవులును అవ్యయ, పరాభవ, ఆక్రాంత

మున్నగుతీరున సంస్కృతపదములతోఁగూడి వచ్చుచునేయున్నవి. ఉపసర్గమున హల్లు లేనందున నుభయయతిగా ఆఙ్పర నుపయోగము లేకున్నను దెనుఁగునఁ బ్రయోగమువూత్రము లేకిపోలేదు. ఈయల్ప విషయము ననంతుఁ డెఱుంగకయుండఁడు. అనాలోచితముగఁ బూర్వుల ననుసరించె ననుటకును నితనికిము న్నెవ్వరు నిట్లు చెప్పినట్లు కానరాదు. కావున నీపద్యమున నాల్గవపాదమునఁ బ్రమాదపతిత పాతము గతానుగతికముగ ననువర్తించుచున్న దని తోఁచుచున్నది. "పరాదికము వోరదు తెలుఁగుభాసను నెందుఁ" అని సాధుపాఠ మయియుండునేమో! ఈపరాద్యుపసర్గవింశతి యాచ్ఛికపదములలోఁ జేర దనునంశమును దెలియఁబఱచుటయే దీనితాత్పర్య మయియుం డును. పాఠమును మార్పకయు నవిరుద్ధముగా నర్థముఁ జెప్పవచ్చును. పరాజపులు అనుదాని నుపలక్షణముగా భావించి యుపసర్గల నన్నిం టిని గ్రహించి యివియన్నియుఁ దెనుఁగుపదములతోఁ బ్రయోగింపఁ బడ వని యర్థము చేయవలయును.

అప్పకవి యనాలోచితముగ నీతనియీపద్యభాగమునుబట్టి యపసిద్ధాంతమును వ్రాసినవాఁడయ్యెను. తర్వాతివారిలో రంగ రాట్ఛందముమున్నగుచోట్ల నీవాదమును ఖండించి యుపసర్గవింశతికి నుదాహరణములం జూపుట రమ్యముగా నున్నది.

వస్తుతస్తు- కావ్యాలంకారచూడామణిలో అవ్యాజ్నిరూపణ మప్రసిద్ధ మనుట కభిప్రాయ మేమనఁగా- అవ్యయాదిపదములు భాషలోఁ దఱచుగాఁ బ్రయోగములందుఁ గానరావు. "ఆఙ్" అను నది హల్‌శూన్యము. కావున దానిప్రయోగమునం దుభయయతు లప్రసిద్ధములు. ఇట్టియభిప్రాయముతో కా. చూ. మణిలో నవ్యాజు లప్రసిద్ధము లని చెప్పఁగా దానిననుసరించి యనంతుఁడు 'పరా' అను నుపసర్గాద నధికప్రసిద్ధము కాదని యీమూఁడును దెనుఁగునఁ గాన

కావని చెప్పెను. సంస్కృతగ్రంథములం దప్యయాదిశబ్దములు ప్రయుక్తము లయినను దెనుఁగున నప్రసిద్ధములే యని కా. చూ. మణి వచియించెను. అంతియకాని తెనుఁగున నట్టియుపసర్గలు చేరుట కవకాశము లేదని యభిప్రాయము కాదు. ఈయభిప్రాయమునే యప్ప కవియు "నాంధ్రమునకుఁ జేరనిపరాజప్రాలు వుూఁడు గాక" అని చెప్పెను. అంతియకాని కావ్యాలంకారచూడామణినైనను నప్పకవి పరిశీలింపలే దనుట సరికాదు. అతఁడు ప్రాచీనగ్రంథముల ననేకము లం జూచినట్లు తీమన పది చెప్ప నిత్యాదిపద్యమే సాక్షి యగు చున్నది. పరేతనాథుఁడు, పరోక్షభుజుఁడు అను నాతనియుదాహరణ ములం జూచియు నవి యాతనికల్పితము లయినసాధుశబ్దములే యయి నను మహాకవిప్రయోగములందు సుప్రసిద్ధములు కావనియు "పరా జయపరాభ"వాదులలో "పరా" అనునది యున్నను నజాదిపదము లతోం సంబంధింపని వగుటచే నుభయయతి కవి నిరుపయోగము లనియు నభిప్రాయముతోఁ దెనుఁగున నప్రసిద్ధములే యని వారి భావము కాని తెనుఁగున నవి యుండుటకే యనర్హము లని కాదు.—3

వీని కుదాహరణము.

ఉ. ప్రాంత నిరంతరాన్విత దురంత సమస్త పరాక్రమంబు న
త్యంత [1]మవాప్త శోభన మపాయ ముపాయమువీక్షణంబు ప్ర
త్యంత మభీష్ట మధ్యయము[2]స్వాంతము నీత ముదంచితంబుప
ర్యంత మనంగ సంధిలఁ దిరంబుగ రెంటను బ్రాదు లచ్యుతా!

1, 2 ఈపాఠములు వ్రాఁతప్రతిలోనివి యుచితము లగుటచే గ్రహింపఁ బడెను. స్వాంతముకంటె స్వంతము సరిశము. సు + అంతము = స్వంతము. సు + అ + అంతము = స్వాంతము. అజ్ నిరుపయోగము కనుక స్వాంతముకంటె స్వంతము గ్రహించుట యనుచిత మని తలంపఁబడెను.

ప్రాదులు=ప్రాద్యుపసర్గలు; కెంటను=స్వరములతోడను వ్యంజనములతోడను; సంధిలున్=యతిమైత్రిం జెందును.

ఈపద్యము ప్రాదియతుల కుదాహరణముగాఁ జూపఁబడినది. ఇందు, "అపి, ఆ" అనునవితప్ప మిగిలిన ౧౮ ఉపసర్గములతోఁ గూడినపదములుఁ జూపఁబడెను. అపికిఁ దఱచుగాఁ బ్రయోగములు లేకుండుటచేఁగాఁబోలు నుదాహరింపలేదు. ఆకుఁ బ్రయోగమున్నను నీయతి కుపయోగము లేదు. ఒక్కొకయుపసర్గతో నొక్కొక పదము నిందుఁ జూపెను. ఉపసర్గములను జూపుటకే పదము లుద్దిష్టము లయ్యెను. వానికిఁ బరస్పరాన్వయ ముద్దేశింపఁబడలేదు. ఉదాహరణమునకై యుపసర్గల నీపద్యమునఁ జూపెను. దీనింబట్టియు నుపసర్గల కాచ్ఛికపదములతోఁ బ్రయోగము లేదనియే పూర్వపద్యమునకుఁ దాత్పర్య మని దృఢ మగుచున్నది.

ఇం దనేకోపసర్గలం జూపినను యతిస్థలమున నే డుపసర్గలు మాత్రమే యున్నవి. అందు "ప్రాంత...దురంత" అనుచోట నచ్చునకును హల్లునకుఁగూడ యతి గలదు. "అత్యంత...అపాయ" అనుచోట అచ్చునకు యతి చెందుచున్నది. "అత్యంత" లోని యకారమునకును యతి చెందవచ్చును. "ప్రత్యంత...స్వంత" అనుచోటను నచ్చునకే యతి వర్తించెను. నాల్గవపాదమునమాత్రము "పర్యంత... దిరంబుగ" అనుచోట హల్లు గ్రహింపఁబడెను. కావున నచ్చునకును హల్లునకునుగూడ యతి చెందుట కీపద్య ముదాహరణ మయ్యెను. ౯౮

౭. కాకుస్వరయతి.

క. కాకుస్వరయతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీర్ఘ మగు నితఁ
గే కవ్వడిరథము గడపె నిమ్ముల ననఁగా, ౯౯

ఇతఁడే=ఇతఁడా? ప్రశ్నా...దీర్ఘము = ప్రశ్నార్థమునం బొందఁబడిన దీర్ఘముకలది. ఇందు ఇతఁడే అనుచోట "ఏ" అనునది కాకుస్వరము. ప్రశ్నార్థకము. శోకభీత్యాదిజనితధ్వనివికారము కాకుస్వర మనఁబడును.

ఇందు రెండవపాదమున డ, శ అనుహల్లులకు నాల్గవపాదమున ఏ, ఇ అను నచ్చులకును యతి యయ్యెను. కనుక నిది యుభయ యతి యయ్యెను. ఇందుఁ బ్రశ్నార్థకస్వర ముదాహరణ మయ్యెను. లక్షణమును వేఱుగాఁ జూపక ఉదాహరణములం జూపి యిట్టిది కాకుస్వరయతి యగు నని చెప్పెను. దీనిఁబట్టి లక్షణ మూహ్యము. కాకుస్వరముగలచోట నాయచ్చునకుఁ గాని దానితోఁగూడిన హల్లునకుఁ గాని యతి వేయుట కాకుస్వరయతి యని భావము. ౯౫

ఆ. వె. వలదు కృష్ణ! యెఱుఁగవా! [1]నన్ను, నీతగ
వా! విరుద్ధభాష లాడ నేల!
లోన నెట్టియలుకలో? నాఁగఁ గాకుస్వ
రోక్తి రెంటఁ జెల్లు నొగి ధరిత్రి. ౯౬

కృష్ణ!=(ఓకృష్ణా) వలదు. నన్ను ఎఱుఁగవా? నీతగవా= నీధర్మ మగునా! విరుద్ధభాష లాడ నేల? లోనన్ (=మనసులో) ఎట్టియలుకలో అని యన్వయము. నాఁగన్ = ఇట్లనఁగా; కాకుస్వరోక్తి = ధ్వనివికారము; రెంటన్ = స్వర వ్యంజనయతులందు; చెల్లున్=మైత్రి చెందును.

ఇందు ఎఱుఁగవా, తగవా, అలుకలో అనుపదములయంతమున కాకుస్వరము గలదు. ప్రథమ తృతీయపాదములందు కాకుస్వరయుతహల్లునకును ద్వితీయపాదమున కాకుస్వరమునకును యతి చూపఁబడెను. ౯౭

1. వాత్రప్రతిపాఠము గృహీతము.

గీ. వరుస దీర్ఘాంతసంబుద్ధివచనయతుల
కమరుఁ గాకుస్వరము పరమా ! సహస్ర
నామశోభిత ! గోపకృష్ణా ! యనంగ
నమరవందిత ! గోపకృష్ణా ! యనంగ. ౯౭

దీర్ఘాంత= దీర్ఘ మంతమునఁగల; సంబుద్ధి = సంబోధనార్థక ములయిన, వచనయతులకు =సంబోధనప్రథమావచనములకు సంబంధించిన; యతులకు =యతిస్థలములకు; కాకుస్వరం బమరున్ = కాకుధ్వని కలిగియుండును. కృష్ణా యనునట్టి సంబోధనార్థకము లగు దీర్ఘాంతములకుఁ గాకుస్వరము చేరును. (సంస్కృతమున దూరాహ్వానమునఁ బ్లుతమగును.) తెనుఁగున దూరాహ్వానము కాకన్నను సంబోధనార్థక దీర్ఘాంతమునకుఁ గాకుస్వరము వచ్చు ననియు నట్టిచోట నుభయయతి చెల్లుననియు భావము. ౨, ౪ పాదము లచ్చునకును ౩వ పాదము హల్లునకు నుదాహరణములు. ౯౭

౮. నిత్యసమాసయతి

గీ. పదము విభజించి చెప్పఁ జొప్పడనియది[1]యు
నన్యశబ్దంబు గొని విగ్రహంబుఁ జెప్ప
న[2]దియు నిత్యసమాసమై యతిశయిల్లు
నట్టిసంధుల నచ్చు హల్లైన విరతి. ౯౮

ఏసమాసమునకు విగ్రహవాక్యము లేకుండునో యదియు, సమాసఘటకపదములతోఁ గాక భిన్నపదములతోడి విగ్రహము గలదియు నిత్యసమాస మనఁబడును. అట్టిసమాసపదములసంధులలో నచ్చయినను హల్లయినను యతికి గ్రాహ్యము లని భావము. "అవిగ్రహః అస్వపదవిగ్రహో వా నిత్యసమాసః" అను వైయాకరణోక్తిం బట్టి నిత్యసమాసనిర్వచనముం గావించెను. ౯౮

1, 2 సరళముగా నుండుటచే నీయేకవచనాంతపాఠము గృహీతము.

ఆ. వె. నాస్తి యనక మహి ననంతసంపదలు నా
రాయణుం డొసంగు, రమ్య మగు ర
సాయనంబు బుధుల కతఁ, డన్న నిత్యస
మాసయతులు రెంట నంటియుండు. ౯౯

రసాయనంబు=బలవర్ధకమహౌషధము; రెంటన్=స్వర వ్యంజనముల రెండింటను;

నాస్తి... ...అనంత
రసాయన... ...అతఁడు
సమాస... ...అంటి

} వీనిలో నచ్చు గ్రహింపఁబడెను. అనంత, నారాయణ, రసాయన, సమాస పదములు నిత్యసమాసములని భావము.

నారాయణ... ...రమ్య. ఇట హల్లు గృహీతము.

న+అంత=అనంత; నార+అయన=నారాయణ; రస + అయన=రసాయన; సమ్+ఆ + అస = సమాస అని పదముల విభాగము. ౯౯

వ. ఈనిత్యసమాసయతిపే రఖండయతి. ౧౦౦

ఈనిత్యసమాసయతినే యఖండయతి యనియును వ్యవహరింతురని భావము. ఇట్టిస్థలములందు హల్లులకు యతి వేయుట యఖండయతి యని నేఁటివ్యవహారము.

గీ. అఱు ననంగను బోవుట కర్థ మైన
సంధి నిత్యసమాసోక్తి జరగు రెంట
నసురవీరుల నెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపఱిచె ననఁగ, ౧౦౧

"పోవుట"-అనునర్థముగల అఱు అనుధాతువుయొక్క రూప

ములతో సంధి వచ్చినస్థలమునందును నిత్యసమాసయతి యను పేరుతో నచ్చునకును హల్లునకు యతి చెల్లును.

ఉక్కు+అఱ = ఉక్కఱ; ఏపు+అఱిచెన్ = ఏపఱిచెన్. ఉక్కఱ, ఏపఱుచు మున్నగు తెనుఁగుపదములందును సంస్కృతపదములందువలె నిత్యసమాసయతి యుభయమునకుం జెందు నని యుదాహరించెను.

అఱు, అఱుచు అనునవి ల్య ప్రేరణ ప్రేరణార్థకధాతువులు. అఱ= (పోవఁ.) ఇది సుబ్జ్యంతధాతువు. అఱి = ఇది క్త్వార్థకము. అఱుఁ=తద్ధర్మార్థకము. ౧౦౧

వ. అట్లు మఱియును. ౧౦౨

౯. నిత్యయతి

ఆ. వె. ఏని యనుపదంబుతో నాదిపద మంది
సంధి నిత్యయతుల జరగుచుండు,
నెట్టిక్రూరకర్ముఁ డేని సద్గతి నొందు
నిన్ను నాత్మఁ దలఁచెనేని కృష్ణ. ౧౦౩

ఆదిపదము=పూర్వపదము; ఏని యనుపదంబుతోన్=ఏని యనునుత్తరపదముతో; సంధి నందిన=సంధిం బొంది; నిత్యయతులన్=నిత్యయతులందు; జరగుచుండున్=వర్తించుచుండును. మూఁడవపాదమున ఎట్టి- ఏని అనువానికి యతి. ఇటఁ గర్ముఁడు + ఏని అనువానికి సంధి జరిగెను. నాల్గవపాదమున నిన్ను-నేని అని హల్లులకు యతి వేయఁబడెను. ఇటఁ దలఁచెన్+ఏని= (తలఁచెనేని) అనుపదములకు సంధి జరిగెను.

ఈ నిత్యయతియు నిత్యసమాసయతి భేదమే యనఁదగును. ఇది సమాసము కాకున్నను సమాసమువలె నేనిపదముతో నవ్యవహితముగా

నుండవలసినపదసమావేశమే యగుటచే దీనిఁ దద్భేదముగనే పరిగణిం పఁదగును. కనుకనే యతిభేదములను నిర్దేశించునపుడు "కాకుస్వర నిత్యసమాయతులు" అని నిత్యయతిని వేఱుగా నిర్దేశింపలేదు. ౧౦౩

**ఆ. వె. కదియు వడులు స్వరముకైవడిఁ గాదులు**
**ఋత్వమునకు నెత్వ మెనయుచోటఁ**
**గృష్ణుఁ డాజిఁ గంసుఁ గెడపె నం డ్రార్యులు**
**కూర్మరూప! విమలకోమలాంగ! ౧౦౪**

కాదులు=కకారాదిహల్లులు; స్వరముకైవడిన్=స్వరమునను సరించియే; వడులు=యతులను; కదియున్=చెందును. హల్లులమైత్రి కిని స్వరమైత్రికూడ నుండవలయు నని భావము.

ఋత్వమునకు=ఋకారమునకు; ఎత్వము=ఎకారము; ఎనయు చోటన్=మైత్రిఁ జెందినచో; "కృష్ణుఁ డాజిఁ గంసుఁ గెడపెన్" అం డ్రార్యులు="కృష్ణుఁ డాజిన్" ఇత్యాదివిధముగా స్వరమైత్రి ననుస రించియేయుండు నని పెద్దలు చెప్పుదు రని భావము.

స్వరములయతులం జెప్పి కేవలహల్లులయతు లగు వర్గయతులు మున్నగువాని నారంభింపఁబోవుచుఁ గేవలహల్లుల యతులయం దును స్వరమైత్రి యుండవలయు ననియు నాస్వరమైత్రి ననుసరిం చియే ఋకారమైత్రియు నుండు ననియు నిందు వివరించెను.

ఋకారము స్వరములలోనిదే యయినను దీనికి కొన్నిహల్ ధర్మము లుండుటచే సందేహనివృత్తికై ఋకారమునకును స్వరమైత్రి ననుసరించియే హల్లులయతియందును ప్రవృత్తి యుండు నని ప్రత్యేక ముగా నిందలిరెండవపాదమునం జెప్పెను.

ఇందు ౩ వ పాదమునఁ గృ...గె అను ఋత్వయుతహల్లునకు స్వరమైత్రీయుతహల్యతిం జూపెను. ఇట్లే ౪ వ పాదమున కూ, కో,

అనువానికి మైత్రిం జూపి కకారహల్లునకు స్వరమైత్రీయుతత్వము నుదాహరించెను.

స్వరయతులను నుభయయతులను జెప్పి పిమ్మట వర్గయతి మున్నగు కేవలహల్లులయతులను జెప్పుట కారంభించుచున్నాఁడు. స్వరవ్యంజనములకు రెండిటికిని జెందినవగుటచే నుభయయతులను స్వరవ్యంజనయతుల మధ్యభాగమునఁ జేర్చెను. కాని ప్రభునామాంత విరతి, భిన్నయతి, విభాగయతులు మూఁడుమాత్రము వ్యంజనాక్షర యతులమధ్యమునఁ జెప్పఁబడుటకంటె నవియు స్వరవ్యంజనములకు రెండిటికిని సంబంధించినవి కావున నిచ్చట వర్గయతులకుబూర్వమే చేర్పఁదగును. అయినను ప్రత్యేకయతులనిర్దేశము ననుసరించి వాని నట్లు చెప్పె నని భావింపనగును. ౧౦౪

**౧౦ వర్గయతి**

**క. తలకొని కచటతపంబులు**
**తల నొక్కొకవ్రాయి తొలఁగఁ దమతమనాల్గున్**
**విలసిల్లు వర్గయతు లనఁ**
**గలికల్మషతిమిరతపన ! ఘననిభవర్ణా !** ౧౦౫

కలిక ... పన = కలివలనఁ గలుగుపాప మనునంధకారమునకు సూర్యుఁడా; ఘననిభవర్ణా = మేఘతుల్యవర్ణముగలవాఁడా; కచటతపంబులు = కచటతపవర్ణము లయిదును; తలన్ = అంతమునందలి; ఒక్కొక వ్రాయి = ఒక్కొక్కయక్షరము, అనఁగా ననునాసికవర్ణములు; తొలఁగన్ = విడువఁగా; తమతమనాల్గున్ = ఆయావర్గముల యొక్క నాల్గేసి యక్షరములును; వర్గయతు లనన్ = వర్గయతు లనుపేరున; విలసిల్లున్ = ప్రకాశించును.

వ్యంజనాక్షరయతులను విశదీకరించుట కారంభించి యందు

మొదటి వగువర్గాక్షరములకు సంబంధించినయతి నిందు వివరించెను. కవర్గాదు లగునయిదువర్గములందును ననునాసికవర్ణములుతప్ప మిగిలిన నాల్గేసివర్ణములును బరస్పరయతిమైత్రిం జెందుట వర్గయతి యనఁబడు నని భావము. ఛందశ్శాస్త్రజ్ఞు లందఱు నీయతి నొక్క తీరుననే చెప్పిరి. మతభేద మిందుఁ గానరాదు.

నాల్గవపాదమున 'క ఘు' లకు యతి నుదాహరించెను. రెండవ పాదమున యతిస్థానములరెండిటియందును 'త' కారమే కలదు. ఇట్టిచోకూడ వర్గయతియే యని యాతనియాశయముగాఁ దోఁచుచున్నది. అప్పకవిమాత్ర మిట్లు స్వవ్యంజనములలోఁ దమకుఁదామే యతి చెందినప్పుడు ప్రాసయతి యను పేరఁ యతిం జెప్పెను. ౧౦౫

౧౧. పోలికవడి

క. వెలసిన పుఫుబభువర్ణం
బులు పోలికవడి ముకారముగ నిడఁదగు ని
మ్ముల హరిచరణసరోరుహ
ములు నాహృత్సరసియందుఁ బొదలు ననంగన్. ౧౦౬

పోలికవడిన్=పోలికవడియందు; వెలసిన=ప్రకాశించిన; పుఫుబుభువర్ణంబులు=పుఫుబుభు అను నాల్గక్షరములును; ముకారముగన్=ముకారముతో మిత్రము లగునట్లు; ఇడన్‌దగున్ = కూర్పఁదగును. ఇందలినాల్గవపాదమున "ము, పొ"లకు యతి యుదాహరింపఁబడెను.

పుఫుబుభులు ముకారముతో యతిఁ జెందిన పోలికవడియనఁబడు నని యిందుఁ జెప్పఁబడెను. కాని పొఫొబొభొలుకూడ ముకారముతో మైత్రిం జెందు ననియు నిది యుపలక్షణ మనియు నిందలి నాల్గవపాదమునందలి యుదాహరణమునుబట్టి యూహింపవలయును. కవిజనాశ్రయమునను పొ ఫొ బొ భొ లతో యతి చూపఁబడెను,

ఇందలి రెండవపాదమునఁ గల 'ము బు' ల యతిలో బువర్ణము బిందు పూర్వక మగుటచే పోలికవడి కుదాహరణము కాక యిది యనుస్వారయతియే యగును.

ఇట నుదాహృత మగుముకారము విభక్తిముకారమే యయిన ను లక్షణమున విభక్తిముకారమే యీయతిలో నుండవలయు నని చెప్పలేదు. కావ్యాలంకారచూడామణియందుఁ బదాంతముకారమనుటచే విభక్తిముకారమే యట నభీష్ట మని తోఁచును. ద్వివిధము లగుముకారములకు నీయతి ప్రయోగములందుఁ గానవచ్చుచున్నది. అప్పకవి ముకారయతి యనియు మువిభక్తియతి యనియు వేర్వేఱఁ జెప్పెను. అందు ముకారయతికి ఒత్వవిశిష్టపవర్గము నుదాహరింపనందున నాతని కం దది యసమ్మత మని తోఁచుచున్నది. కనుకనే యీయతిని రెండువిధములుగాఁ జేయవలసివచ్చియుండును. కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులందు విభక్తిముకారమే యుదాహరింపఁబడెను గాని యితరముకారము చూపఁబడలేదు. అప్పకవి నాఁటి కీవిశేష మవతరించెను. ౧౦౬

౧౨. సరసయతి

ఆ. వె. [1]ణ నలు చెల్లుఁ గమలనాభ! యొండొంటికి
న య హ లమరియుండు హస్తివరద!
శ ష స లొందు నంద్రు చఛజఝుంబులతోడ
సరసయతు లనంగ జలధిశయన! ౧౦౭

కమలనాభ=పద్మనాభా!; హస్తివరద = గజేంద్రరక్షక!; జలధిశయన=ఓ క్షీరసాగరమున శయనించుస్వామీ!; చిత్తగింపుము=అవధరింపుము. సరసయతు లనంగన్=సరసయతు లనుపేరుతో;

1. ఉచితమని యీపాఠము గ్రహింపఁబడెను.

ణనలు = ణకారనకారములు; ఒండొంటికిన్ = అన్యోన్యమునకు; చెల్లున్=మైత్రినొందును. అయహలును, ఒండొంటికి, అమరియుం డున్=ఒప్పును. శషసలు చఛజఝంబులతోడ; ఒందున్=మైత్రిచెందును.

ఇందు వరుసగా ౧, ౨, ౩, ౪ పాదము లుదాహరణములు.

ఈయతిని గవిజనాశ్రయమున లక్షణపద్యమున సరసయతి యని వ్యవహరింపలేదు. శీర్షికమాత్రమే సరసయతి యని కలదు. అది కవికృత మని చెప్పఁజాలము. ఇఁక లక్షణపద్యమున సరసగుణప్రియ యని యున్నది. అందలి సరసపదము యతినామముగా నన్వయింపఁబడదు. కావ్యాలంకారచూడామణియందు దీని నితరేతరవర్గయతి యని వాడెను. దీని కనంతుఁడే సరసయతినామకరణము కావించెనేమో, అయహలు వర్గీయాక్షరములు కానందున నితరేతరవర్గజయతి నామము సరిపడ దని యీతనియాశయమేమో ! కాని పెద్దనయాశ యమున నిచట వర్గశబ్దము పారిభాషికము కాదు. సంఘవాచకము. స్వరములు, అంతస్థములు, ఊష్మములు అను భిన్నవర్గములకుఁ జెందినవర్ణములకు యతి చెందుటచే నివియు నట్టివే యనితలంచిన ట్లూహింపనగును. ౧౦౭

౧౩. సంయుక్తయతి

క. ఏ నిను వేఁడెద లక్ష్మీ
క్ష్మానాయక ! నీవు నన్నుఁ గైకొని యిష్టం
బైనవి యొసఁగుము శుభల
క్ష్మా ! నీవాఁడ నన నొప్పు సంయుక్తయతుల్. ౧౦౮

లక్ష్మీక్ష్మానాయక = శ్రీభూనాథా !; శుభలక్ష్మా=శుభ లక్షణా ! ఏన్=నేను; నిను=నిన్ను; వేఁడెదన్=ప్రార్థించెదను. నీవు

నన్నుఁ గైకొని=నీవు నన్ను ఆత్మీయునిగా స్వీకరించి; ఇష్టంబయి నవి యొసఁగుము=వాంఛితముల నిమ్ము. నీవాఁడను=నిన్ను శరణు పొందినవాఁడనుసుమ్మా; ఈవాక్యము లీతని ప్రపన్నధర్మవిజ్ఞత్వ మును జాటుచున్నవి.

యతిస్థానమున సంయుక్తాక్షర మున్నచో నాసంయోగమునం దలి యేహల్లునయినను గ్రహించి యతి వేయవచ్చునని యుదాహ రణమూలముననే తెలియఁజేసి వేఱుగా లక్షణమును నిర్వచింపలేదు.

ఇందు రెండవపాదమునఁగల క్ష మసంయోగములో నొక్క కకారమును గ్రహించియు నాల్గవపాదమున క్ష మలలో నొక్క షకా రమును గ్రహించి తన్మాత్రవర్ణములతో యతి వేసెను. ౧౦౮

క. ఒక్కడుగున విశ్రాంతులు
పెక్కగుచో సంయుతముల పెనుపక మును జ
డ్డక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యునుపవలయు నన్నిటఁ గృష్ణా! ౧౦౯

ఒక్కడుగునన్ = ఒక్కపాదమున; పెక్కువిశ్రాంతు లగు చోన్=అనేకయతిస్థానము లున్నచో; సంయుతములు=సంయుక్తాక్షర ములను; పెనుపక=ఒకదాన నొకటియు నొకదాన మఱియొకటియు మార్పక; జడ్డక్కరమునన్=సంయుక్తాక్షరమునందు; మును = ముం దుగా, ననఁగాఁ బాదాదిని; తా నెత్తినయక్కరమే=తాను గ్రహిం చినయక్షరమునే; అన్నిటన్ = అన్నియతిస్థానములందును; ఉనుపవల యును=ఉంచవలయును. దీనికి ౧౧౧ వ పద్య ముదాహరణము. బహుయతిస్థానములు గలపాదముమొదట సంయుతాక్షర మున్నపుడు తర్వాతియతిస్థానములం గూర్చి యిందుఁ జెప్పఁబడె నని భావింపవల యును. ౧౧౦ వ పద్యమున నఁ బాదమధ్యమున సంయుక్తాక్షరము లున్నచో నెట్లుండవలయునో శాసించుచున్నాఁడు.

అప్పకవియు రెండువిధములుగాఁ బాదాదిసంయుక్తము, పాద మధ్యసంయుక్తము అను భేదమును బురస్కరించుకొని లక్షణలక్ష్యము లం జూపెను. ఆతని కీతనిపద్యములే మూలము లయియుండును. కాని బహుయతు లున్నపుడు సంయుతాక్షరములోని యొక్కహల్లునే యన్నియతులందును గ్రహింపవలయు ననిమాత్రము చెప్పినచో నవ్యాప్త్యాదిదోషము లెవ్వియు నుండవు కాని స్పష్టతకొఱకును నవాంతరభేదపరిజ్ఞానముకొఱకును ననంతుఁడును నప్పకవియు విపుల ముగాఁ జెప్పియుందురు. ౧౦౯

**క. వడినెలవులలోఁ జేరువ**
**యెడ నొకసంయుతము నొలయెడ నొకటిని దా**
**రిడిరేని కవులు తప్పట**
**యొడఁబడదు పృథగ్యతిప్రయోగముల హరీ! ౧౧౦**

ఓహరీ!; వడినెలవులలోన్ = యతిస్థానములలో; చేరువ యెడన్=పాదాదికిసమీపమున; ఒకసంయుతమును=ఒకసంయుతాక్షర మును; ఔలయెడన్=ఆవలిభాగమున; ఒకటిని=వేఱొకసంయుతాక్షరమును; కవులు; ఇడిరేని=కూర్చిరేని; పృథగ్యతిప్రయోగములన్= వేర్వేఱుయత్యక్షరములను బ్రయోగించుటలో (అసంయుతాక్షరములను బ్రయోగించుతావుల); తప్పట = ఒకయక్షరమునే యంతట గ్రహింపక తప్పిపోవుట; ఒడఁబడదు=సమ్మతము కాదు.

పాదమధ్యములందు సంయుతాక్షరములు రెండు, యతిస్థానములం దున్నచో వానిలోఁ బాదాదిసవర్ణమే యన్నిసంయుతాసంయుతస్థానములందును నుండవలయును. అందుకుభిన్నముగా నుండ రాదు.

౧౧౨ వ పద్య ముదాహరణము. ౧౧౦

**ఉదాహరణము :-** [1]జయభద్రరగడ

క్ష్మావలయ మంతయు విషాణమున నెత్తు కిటి
మహిమఁ దలపోయ నక్కజ మనుచు నిట్లనక
క్ష్మావలయ మంతయు విషాణమున నెత్తు కిటి
సత్త్వ మరు దన నొప్పు సంయుక్తయతి చెడక. ౧౧౧

క్ష్మావలయము=భూమండలము; విషాణము=కొమ్ము (కోఱ యని భావము); కిటి=ఆదివరాహము, సత్త్వము=బలము; అక్కజము= ఆశ్చర్యము; అరుదు=అద్భుతము.

ఇందు "మొదటిపాదమున క్ష్మా. షా, మ, క్క" అను నాల్గక్షరములును యతిస్థానములందుఁ గలవు. క్ష్మ అను 'కషమ'ల సంయోగములోని భిన్నజాతికిఁ జెందినహల్లులు మూఁడుచోట్లను మూఁడు గ్రహింపఁబడెను. ఇది తప్పు. రెండవపాదమున నట్టిసంయుక్తమున నే యొక్క-ష కారమును గ్రహించి తన్మైత్రవర్ణములనే "క్ష్మా, షా, స, సం" అనువానిని యతిస్థానమునఁ గూర్చెను. ఇది యొప్పు. ఇట్లుండవలయు నని భావము. ౧౧౧

**అట్లె మఱియొక రగడ. (ఇదియు జయభద్రమే.)**

**రంపమున వచ్చుగతి వచ్చె నఖముల రిపుని**
**వక్షము నృసింహుఁ డని వ్రాయువడి సొరదు కృతి**
**రంపమున వచ్చుగతి వచ్చె నఖముల రిపు ను**
**రంబు నరసింహుఁ డనఁ గ్రాలు సంయుక్తయతి. ౧౧౨**

వ్రాయువడి=వ్రాయు నట్టియతి; ప్రయోగింపఁబడుయతి యని భావము. కృతిన్=కావ్యమున; సొరదు=ఒప్పదని భావము. క్రాలున్=

(1) ద్విపదగతి యని పూర్వముద్రణము- అది పొరపాటు. ఇందు రెండు [illegible] లొక్కపాదము కావలయును. అనేకయతులు చూపఁబడుస్థలముకదా,

ఒప్పును. మొదటిపాదమున నిందు ర, వ్ర, వ, వ్రా, అను నాల్గక్షరములు యతిస్థానమున నున్నవి. పాదప్రథమఖండమున పాదాదిసవర్ణ మగు "వ్ర" యనుసంయుతములోని రేఫమును గ్రహించియు ద్వితీయఖండమున "వ్రా" అను సంయోగములోని వకారమును గ్రహించుట తప్పు. ద్వితీయపాదమున 'ర, వ్రు, ర, గ్రా' అను సంయుతములు యతిస్థానములం గలవు. ఇట నంతటను వకారరేఫసంయోగములోని పాదాదిసవర్ణ మగు రేఫముమాత్రమే గృహీతము. ఇది సాధుపద్ధతి.

ఇందు రంప మనుపదమున ర వర్ణమే యనంతునికి సమ్మతమని గ్రహింపఁదగును. ఎక్కటియతిలో నీతఁడు రేఫఱవర్ణములం జేర్చినవాఁడగుటచే రఱల కితఁడు యతిమైత్రిఁ గూర్పఁడుకదా. ఇతర లాక్షణికుల కసమ్మత మయినను ననంతునికి రంప మనుపదమునందు రేఫమే సమ్మత మగునని భావింపనగును.

ఇందు మొదటిపాదమున "రాయు" అను పూర్వపాఠము ద్వితీయపాదానుగుణము కానందున లక్షణానుగుణముగా 'వ్రాయు' అని సవరింపఁబడెను. ఇదియ యర్థానుగుణమును నగును. ౧౧౨

## ౧౪. తద్భవవ్యాజయతి

అప్రసిద్ధముల్ జ ఞ లు శబ్దాదియందు,
ఞా, జసంయుక్తిఁ[1] దద్భవవ్యాజమునను
నణలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ
జలరుహోదరాశ్రితులు సుజ్ఞాను లనఁగ. ౧౧౩

జ ఞ లు=జ ఞ అను రెండక్షరములును; శబ్దాదియందు=పదములమొదట; అప్రసిద్ధములు=ప్రసిద్ధములు కావు; లేవని భావము.

---

1 "సంయుక్తిఁ దద్భవ" అనుపాఠమున ఞకారము జకారసంయోగముచేత నణలతో గతి బెందునని యర్థ మగును. ఈపాఠము సరళముగా నున్నది. సంయుక్తి దద్భవ అనునది పూర్వపాఠము.

తద్భవవ్యాజమునను=తద్భవవ్యాజయతియందు; జసంయుక్తిన్=జకారముతోఁ గూడుటచే; ఞా=ఞ అనువర్ణము; నణలతోన్=న ణ అను నక్షరములతో; విరతి=యతిని; పొందున్=లభించును.

ఇందు మూఁడవపాద ముదాహరణము. పాదాదిగతనకారము 'ఆజ్ఞప్తి' లోని జ్ఞకారముతో యతి చెందెను. ఈ జ్ఞకారములోని జకారమునుబట్టి వచ్చెడియితరయతులును రావచ్చు నని నాల్గవపాదమున 'జ, జ్ఞ' లకు యతి చూపెను. ౧౧౩

**ఆ. వె. యజ్ఞమునకు జన్న మాజ్ఞప్తి కానతి**
**యాజ్ఞ కాన సంజ్ఞ కరయ సన్న**
**విన్నపంబు వెండి విజ్ఞాపనమునకు**
**జ్ఞాకుఁ దద్భవంబు నా ధరిత్రి.** ౧౧౪

జ్ఞకారమునకు నణలతోఁ గలమైత్రికి యుక్తి నీపద్యమునం జూపుచున్నాఁడు.

తద్భవములందు 'ఆజ్ఞప్తి'కి 'ఆనతి' యనియు, ఆజ్ఞకు ఆన యనియు, సంజ్ఞకు సన్న యనియు, విజ్ఞాపనమునకు విన్నప మనియు రూపము లగును. ఏమనఁగా జ్ఞకారమునకు నకారము తద్భవ రూపము.

తద్భవములందు జ్ఞకారము నకారముగా మాఱుచున్నది. కావున దీనికి పరస్పరయతి గ్రామ్య మనియు నకారమిత్రమగు ణకారమును దీనికి యతిమిత్ర మగుట న్యాయ్యమే యనియుఁ గనుకనే దీనికిఁ దద్భవవ్యాజయతి యని నామధేయ మనియుఁ దెలియునది.

అప్పకవి పదాదినున్న జ్ఞకారము నకారముగాఁ దద్భవములందు మాఱు ననియు సంస్కృతపదమధ్యావసానములందలిది మ్మాత్రమే ణకార మగు ననియుఁ జెప్పెను. ౧౧౪

౧౫. రేఫయుతయతి

గీ. ఆంధ్రలిపిఁ జొప్పడదు ఋకారాన్వితంబు
క్రొత్త గాదు కృష్ణుని వెన్నద్రుచ్చి మనఁగ
స్రుక్కఁ డతఁ డాజి నెట్టివిరోధినైనఁ
గ్రుమ్మ నన రేఫయుతయతి గూడుఁ గాన. ౧౧౫

ఆంధ్రలిపిన్ = తెనుఁగుపదముల వ్రాఁతలో; ఋకారాన్వితంబు=ఋకారముతోఁగూడినది; చొప్పడదు=ఉండదు. కృష్ణుని వెన్నద్రుచ్చి యి=కృష్ణుని నవనీతచౌర్యము; క్రొత్త గాదు = నూతనము కాదు. అతఁడు=ఆకృష్ణుఁడు; ఆజిన్=యుద్ధమున; స్రుక్కఁడు=శ్రమచెందఁడు. ఎట్టివిరోధినైనన్=ఎంతటిశత్రువునయినను; క్రుమ్మున్=సంహరించును.

తెనుఁగుపదములలో ఋకార ముండదు. కనుక తెనుఁగుపదములలోని ఋకారకల్ప మగునుచ్చారణము రేఫమే యగును. అట్టిదానికి రేఫముతో యతి వేసిన రేఫయుతయతి యనఁబడును అని భావము. ౨, 3 పాదము లుదాహరణములు. అందు ౨ వ పాదమున రెండును దెనుఁగుపదములందలి రేఫములు. 3 వ పాదమున నొకటి తత్సమమును నొకటి తెలుఁగుపదమును నయియున్నవి. ఇట ఋకారము కాదనుటకు సంస్కృతసమపదమునందలి రేఫముతో మైత్రియే సాక్షి యగుచున్నది.

దీని నొకయతిభేదముగాఁ బరిగణింపనక్కఱలేదు. సంయుక్తయతిలోనిదే యగును. భీమన, పెద్దన, అప్పకవి, దీనిని యతిభేదముగాఁ జెప్పలేదు. తెనుఁగుపదములలో సందేహము నివారించుటకేఁ డే యిట్టిభేదమును జూపుట కారంభింపఁగా నప్పకవి రేఫయుతప్రాసమున నీఋకారవిషయమును వివరించెను. ౧౧౫

౧౬. అనుస్వారయతి

భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ
ణాకు నిట నాల్గు చెల్లుఁ బాండవసహాయ।
నాకు నిట నాల్గు చెల్లుఁ గందర్పజనక।
మాకు నిట నాల్గు చెల్లు సంపదలరాజ! ౧౧౬

పాండవసహాయ=కృష్ణా!; భువిన్=భూమియందు; అనుస్వారయతిన్=అనుస్వారయతి యను పేరుగలయతియందు; ఇటన్=ఈ తెనుఁగున; నాల్గు=టవర్గమునందలి మొదటినాల్గక్షరములును; బిందుపూర్వకముగన్=పూర్ణబిందుపూర్వకములుగా నుండునప్పుడు; ణాకున్=ణకారమునకు; చెల్లున్=మిత్రము లగును; కందర్పజనక=మదనజనకా!; నాల్గు=తథదధలు నాల్గును; నాకు=నకారమునకు; చెల్లును. సంపదలరాజ=సంపదలకుప్రభువా!; నాల్గు=పఫబభలు నాల్గును; మాకు=మకారమునకు; చెల్లును. ౨, ౩, ౪, పాదములు వరుసగా టతపవర్గాక్షరముల కుదాహరణములు.

ఇట "క, చ" వర్గముల కీయతి చెప్పలేదు. విన్నకోటపెద్దనయు టతపవర్గములకే యీయతిం జెప్పెను. "అప్రసిద్ధముల్ ఙ ఞ లు శబ్దాదియందు" అని యీతఁడే వఙకే చెప్పియుండుటచే ఙ ఞ లు పదాది నుండవు కావునఁ బదమధ్యమునందయినను జాల నరుదుగా నుండునవియగుటచే వీనిని బెద్దనయు ననంతుఁడును విడిచిరి. కవిజనాశ్రయమున 'ఙాకు వడి చెల్లు రత్నకంకణ మనంగ. ఞాకు వడి చెల్లు బర్హిపింఛం బనంగ' అనుపద్యభాగమును వీ రెఱింగినవారయ్యును ఙ ఞ ల కుదాహరణముఁ జూపలేదు. ఙాకు, ఞాకు, ఇత్యాద్యక్షరనిర్దేశమునందప్ప పదాది నుండవు. పదమధ్యముననయినను సజాతీయవర్గాక్షరసంయుక్తములుగనే యుండునుగాని (పిఞ్ఛ-శఙ్కణ)

ప్రత్యేకముగ నుండవు. జ్ఞానాదిపదములం దున్న ఇకారమును దద్వర్గీయాక్షరసంయుక్తముగనే యుండునుగదా. అక్కారణమున ఇ జ లకు బిందుయతివిధాన మనావశ్యక మని తలంచి వీరు పరిత్యజించిరి. ఈయతి తెనుఁగుపదములకే యత్యావశ్యకము. సంస్కృతపదములం దుఁ బరసవర్ణ మునుండవచ్చును గావున సంయుక్తయతిలో నెట్లును నంతర్భవించును. కావునఁ దెనుఁగుపదములలో నదృశ్యము లయిన జ ఇ ల కీయతివిధాన మనావశ్యక మని తలంచి 'ణ న మ' లకు మాత్రమే నిరూపించెను.

ఉదాహరణమునఁ బాండవాదిసంస్కృతపదములనే చూపినను దెనుఁగుపదములకే యీయతి యావశ్యక మయి సంస్కృతపదములందును బ్రవర్తించె నని తెలియనగును. ఈయనుస్వారయతి నప్పకవి బిందుయతి యనియుఁ బెద్దన సబిందువర్గవళి యనియు నామభేదములతో వ్యవహరించిరి. ౧౧౬

## ౧౭. మకారయతి

> యరలవలు శషసహలును నాదిబిందు
> యుతము లై మకారవిరామయుక్తిఁ దనరు;
> మారుతాత్మజుఁ డరిదిసంయమి యనంగ
> మదనజనకుఁడు దనుజసంహరుఁ డనంగ. ౧౧౭

యరలవలు శషసహలును=అంతస్థములును నూష్మములును; ఆదిబిందుయుతములై = పూర్ణబిందుపూర్వకములై; మకారవిరామయుక్తిన్=మకారముతోడి యతిసంబంధముతో; తనరున్=ఒప్పును.

అరిదిసంయమి=అద్భుతయోగి; దనుజసంహరుఁడు = రాక్షససంహర్త.

అంతస్థములును సూష్మములును బూర్ణబిందుపూర్వకము లయినచో మకారముతో యతి చెందును. దీనిని మకారయతియందు రని భావము.

ఈయతి ననంతునికిఁబూర్వు లగు భీమన, చిన్నకోటపెద్దనలు చెప్పలేదు. ఈయతి విరళప్రయోగముగా నున్నది. భారతాదిగ్రంథములందుఁ గానరాదు. అనంతుననుసరించి యప్పకవియు దీనిఁ జెప్పె నను గ్రంథస్థోదాహరణముం జూపలేదు. భీమకవి చాటుధార యని [1]"గరళపుముద్ద... సంహా... మైలముభీమన" అనుదానినిమాత్ర ముదాహరించెను. దశకుమారచరిత్రములోని [2]"కమలాప్తాంశులు... సంయమివర్యులఁ జూచి రాకుమారకులెల్లన్" అను మఱియొక పద్యము సులక్షణసారమున నుదాహరింపఁబడెను. ౧౧౭

౧౮. ఎక్కటియతి

ధర నెక్కటిపల్లైతగు
లరమఱవలు, వానిలోఁ దొలంగక లాకున్
సరి శా యసి విశ్రమవే
శ రమాధిప! రెండునుం గలసి వర్తిల్లున్. ౧౧౮

1. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్లుకార్లు ది
క్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁ డగుమైలముభీమనఖడ్గసృష్టికిన్.

2. కమలాప్తాంశులు బలవి
క్రమవంతులు ఖడ్గధరులు రణజాలు మీఁగల్
మముఁ బ్రోవఁగఁ దగదే సం
యమివర్యులఁ జూచి రాకుమారకులెలన్.

"ధరన్ "లరమఱవ" లు ఎక్కటివళ్లై తగున్. వానిలోఁ దొలంగక లాకుళా శా సరి" అని యన్వయము. (వానిలోనిదగు లకారమునకని భావము.)

"లరమఱవ" అనునవి తమకుఁదామే యతిఁ జెందును. కాని లకారముమాత్రము 'ళ' వర్ణముతో మైత్రి చెందును అని భావము. ముందుగా నీయయిదక్షరములకు నెక్కటివళ్లను విధించి లకారము మాత్రము ళ కారముతో యతి చెందవచ్చు నని తదపవాదముగాఁ జెప్పెను. ఇట్లే ఇందలివకారమునకును బకారముతో నభేద యతి వర్తించు నని ౧ ఆ. ౧౨౬ వ పద్యమునం జెప్పెను.

మఱియు మకారమునకు బిందుపూర్వకపఫబభలతో యతి నితఁడే చెప్పెను. సుప్రసిద్ధము కాకున్నను మకారయతియుఁ గలదు. అయినను కేవలవర్ణాంతరముతోఁ గాక బిందుపూర్వకములతో మాత్రమే యతిమైత్రి కలదగుటచే మకారము నిందుఁ జేర్చెను.

కవిజనాశ్రయకావ్యాలంకారచూడామణులం దీయయిదక్షరములును నెక్కటివడులలోఁ జేర్పఁబడుటచేఁ దదనుసారముగామాత్ర మీయెక్కటివడిని జెప్పినను ర ఱ లకుమాత్రమే యెక్కటివడి నిర్ణిరోధముగా వర్తించుచున్నది. కావుననే యప్పకవి యెక్కటివడి నీరెండిటికే చెప్పెను. లకారమునకు ళకారముతోమాత్రమే యతిమైత్రి నంగీకరించుటచేతనే యప్పకవి రేఫముతో మైత్రిని నిరసించి రేఫలకారమైత్రీస్థాపకోదాహరణముల నన్యథా సమర్థించెను. (రేకులతో మురాళించుచెక్కులు నిత్యాదులు)*

---

*ఇట ళకారస్థానమునఁ గవిజనాశ్రయాదులందు లకారమే కానవచ్చుట చేతను మఱికొన్ని వ్రాఁతప్రతులందును నట్లే కానవచ్చుటచేతను నదియే యర్థానుకూలమగుటచేతను "లరమఱవ" లనుపాఠమే గ్రహింపఁబడెను, ళరమఱవ లనుపాఠమున నెక్కటివళ్లలో లకారము చేరదు. వానిలోఁ జేరనిలకారమును గ్రహించి యెక్కటివడిప్రసంగములో లళలకు యతిమైత్రి కలదని చెప్పుటయు సరసముగా నుండదు. "ళ" అనునదియే యెక్కటివడిలోఁ జేర్పబడినచోఁ బద్యమునందలి "వానిలోన్" అనుపదమును "ళా" అనుదానితో సంబంధింపఁజేయవలయును. "వానిలో శా ళాకున్ సరి" అని యన్వయము.

ఈ లక్షలమైత్రి కుదాహరణముగా నాల్గవపాదము కూర్పఁబడెను. ౧౧౭

ఆ. వె. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహ [1]మార్తరక్షకుండు;
జాఁగవేలు పనఁగ జుంపిల్లు నెక్కటి
వల్లు నాఁగ నిట్లు వనజనాభ! ౧౧౮

యాదవరాజసింహము = యాదవరాజశ్రేష్ఠుఁడు; ఆర్తరక్షకుఁడు=ఆర్తులను రక్షించువాఁడు; జాఁగ=ఉద్ధతుఁడు=చతురుఁడు.

ఇందు వరుసగా "మ ర జ వ" లకు నాల్గుపాదములందు నెక్కటివడి యుదాహరింపఁబడెను. లకారమునకుఁ బూర్వపద్యచతుర్థపాదముననే యుదాహరణముఁ జూపెను. ౧౧౯

౧౯. ప్రభునామాంతయతి

గీ. ఒరుల నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతవిరమణంబు;
మహి నయోధ్యకు రాజు రామన యనంగ
నతనిపట్టపుదేవి సీతమ యనంగ. ౧౨౦

అన్న, అమ్మలను చోటన్ =అన్న, అమ్మ యని యూఁదిపలుకునపుడును; ఊఁదఁబడక = తేల్చిపలుకఁబడినపుడును, ప్రభునామాంతవిరమణంబు = ప్రభునామాంతయతి, ద్వివిధమగున్ = అచ్చునకును హల్లునకునుగూడ యతి చెల్లుటచే రెండువిధము లగును.

"అన్న, అమ్మ" అనుపదములు సాధారణముగా నామధేయములయంతమునఁ జేర్పఁబడి వాడఁబడుచుండును. అవి కొన్నిచోట్ల నూఁదఁబడక తేల్చి "అన, అమ" అనియుఁ బలుకఁబడును. అట్టి

ద్వివిధస్థలములందునుగూడ నచ్చునకును బూర్వనామాంతహల్లునకుఁ గూడ యతి చెందునని భావము.

మూఁడవపాదము హల్లునకును నాల్గవపాద మచ్చునకు నుదాహరణములు.

విచారింపఁగా "అన్న, అమ్మ" అను ద్విరుక్తస్థలములందు భిన్న భిన్నపదములుగా భాసించుస్థలమున నెట్లును నీయతి చెందును గావున నూఁదబడనిచోట్లమాత్రమే సందేహనివృత్తికొఱకీ యతి చెప్పినట్లు తోఁచుచున్నది. ఆపక్షమున "న న్నమ్మ యనుచోట నూఁదఁబడక యున్నస్థలమున ద్వివిధముగా యతి చెందు నని"భావము గ్రహింపనగును. కావ్యాలంకారచూడామణియందును "చెన్నక్కకుఁ జెన్నక,మాచన్నను మాచన యనంగ నచ్చట వళియై చెన్నగు నకార మార్యుల మన్నన హల్లేని గలుగు మఱియొక్కొ-కచోఁ" అని చెన్నక్కకు చెన్నక, మాచన్నకు మాచన యని తేల్చిపలికినప్పుడే యచ్చునకును హల్లునకును యతిని శాసించెను. ఊఁదిపలుకువానిఁ గూర్చి వివరింపలేదు.

అన్న, అమ్మ అనువానింగూర్చియే యిందుఁ జెప్పబడినను "అక్క, ఆయి, అసు" మున్నగువానికిని నిది యుపలక్షణ మని గ్రహింపఁదగును. కనుకనే పెద్దన కావ్యాలంకారచూడామణియందు "అక్క" యనుపదమును, నప్పకవి "యయ్య, అసు" మున్నగుపదములను నీయతిగాఁ జూపిరి. ౧౨౦

**౨౦. విభాగయతి**

గీ. సంఖ్యకుం బరిమాణసంజ్ఞకుఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తిసరణి సంఘ
టించినప్పుడు యతులు రెండేసి యగు ను
పేంద్రుఁ డిచ్చునర్థము మోపెఁడేసి యనఁగ. ౧౨౧

సంఖ్యకుం బరిమాణసంజ్ఞకును=సంఖ్యకును కొలతకును; తనచ్చ శబ్దములపైన్=సంబంధించినశబ్దములమీఁద; విభాగోక్తిసరణి=విభాగమును జెప్పుతీరు; సంఘటించినప్పుడు=కూడినయపుడు, యతులు=వడులు; రెండేసి=అన్నిచోట్లను రెండువిధములుగా; (అనఁగా నచ్చునకును హల్లునకునుగూడ) అగును=వర్తించును.

సంఖ్యావాచకము లయిన రెండు మూఁడు మున్నగువానికిని బరిమాణార్థకము లయిన యేఁడుప్రత్యయాంతము లగు మోపెఁడు, గంపెఁడు మున్నగువానికిని విభాగార్థక మగు "ఏసి" యనునది చేరునపుడా "ఏ"కారమునకును దానితోఁగూడిన పూర్వపదాంత్యహల్లునకుఁగూడ యతి చెల్లునని భావము. దీనిని విభాగయతి యందురు.

మూఁడవపాదము (టించి ...ఁడేసి) హల్లునకును నాల్గవపాదము (ఉపేంద్రు ...ఁడేసి) అచ్చునకును యత్యుదాహరణములు. ౧౨౧

**౨౧. భిన్నయతి**

**క. అంచితతిలకము శౌరి ధ**
**రించె ననఁగ జగణమధ్యరేఫవిరతి యౌ**
**నంచితతిలకము హరి ధరి**
**యించె ననఁగ భిన్నవిరతి నిత్యము వచ్చున్. ౧౨౨**

శౌరి = విష్ణువు; అంచితతిలకము = ప్రకాశించుపుండ్రమును; ధరించెన్; అనఁగన్=అనువాక్యమును ప్రయోగింపఁగా జగణమధ్యరేఫవిరతి = ధరించె అను జగణరూపముగా నున్నపదముమధ్యభాగమునఁ గల రేఫకు సంబంధించినయతి; ఔన్=అగును. అంచితతిలకము హరి ధరియించెన్ అనఁగన్=అంచితతిలకము హరి ధరియించెన్ అను తీరున; భిన్నవిరతిన్=భిన్నయతి యనఁబడు యతిభేదమున: ఐతేఁము—

ఇకారము; వచ్చున్ = కానవచ్చును. ధరించు ననుపదమున వేఱొక యికారము కానవచ్చి "ధరియించు" నని యయ్యె నని భావము.

ధరించు మున్నగునించుగంతధాతువులలో 'ఇంచు' అనుభాగమును విడఁదీసి ధరియించు అనువిధమునఁ బల్కినపుడు ఇంచుక్కులోని యికారమునకు యతిఁ గూర్చినచో నది భిన్నయతి యగును. పదము విడివడక "ధరించు" అనురీతినున్నపు డించుక్కులోనియికారమునకుఁ బూర్వమున నున్నపల్లునే గ్రహించి యతి వేయనగును- అనువిషయము నుదాహరణరూపముగా నిందు వివరించెను.

ఇందు నాల్గవపాదము భిన్నయతి కుదాహరణము. రెండవ పాదము భిన్నయతిగా లేనిస్థలమున కుదాహరణము. అనఁగాఁ బ్రత్యుదాహరణ మనుట.

ఇందు ధాతువుతో నభిన్నముఁగా నున్నయించుక్కును భిన్నము చేయుటచే దీనికి భిన్నయతినామము సంభవించెను. ధరించు అనురీతి నభిన్నముగానున్నపుడు సంభవించినయతియు భిన్నయతి యని భ్రాంతి పడరాదు. కనుకనే యప్పకవి యట్టిది భిన్నయతి కాదనియు నితర వ్యంజనాక్షరయతులలోనే యది చేరుననియు విశదీకరించెను. (చూ. అప్ప. 3 ఆ. 81 ప.) 112

గీ. అటు లికారాంతపదముమీఁదటి దికార
మది యనంగ నవ్వల భిన్నయతికిఁ జెల్లు;
దివిజవిభవంబు శౌరిచేతిది యనంగ
నసురనాశంబు హరిచేతియది యనంగ. 113

అవ్వలన్=ఆపిమ్మట; అటులు=ఆవిధముగా; ఇకా... దికారము=ఇకారాంతము లయిన "చేతి" మున్నగువానిమీఁద నున్న "ది" అనుభాగము. అదియనంగన్=అది యనురీతిని విడిగానున్నపుడు;

భిన్నయతికిఁ జెల్లున్=అనలనున్న "అ"కారము భిన్నయతిలోనికిఁ జేరి యతి చెందును. దివిజవిభవంబు=దేవతావైభవము; శౌరిచేతిది= విష్ణునిచేత నగునట్టిది; లేదా, విష్ణునిచేత నున్నయట్టిది.

చేతన్+అది=చేతిది లేదా, చేతియది యని యగును. లేదా. చేయి+యొక్క+అది=చేతిది; లేదా, చేతియది యగును. ఈపక్షమున యొక్కకు వృత్తిలో లోపము.

ఇట్టిస్థలములలో "చేతిది" యను నభిన్నరూపము "చేతియది" యని భిన్నరూపముగా నున్నపుడు పూర్వోదాహరణమునందువలె రెండవభాగమున నున్నయచ్చునకు యతి వేసినచో నిదియు భిన్న యతి యనఁబడును. అభిన్నముగా 'చేతిది' యనురీతి నున్నపుడు హల్లునకే (తివర్ణమునకే) యతి చెల్లును. అట్టిదిమాత్రము భిన్నయతి కాదు. ఇతరయతులలోనికే చేరు నని తెలియనగును. మూఁడవ పాద మట్టియభిన్నస్థలమునకును (దివిజ... చేతిది) నాల్గవపాదము భిన్న యతికిని (అసుర...... చేతియది) ఉదాహరణములు.

అన్యకవి యీరెండుస్థలములను రెండుయతులుగా విడఁదీయు టచే దీనిని ప్రత్యేకయతి యని వ్యవహరించెను.

ఈపద్యమున 'అట' అనుపాఠముకంటె 'నటుల' అనుట రమ్యము. అది యే కవ్యుద్దిష్టపాఠ మని యూహింపఁబడెను. ౧౨౩

## ౨౨. వికల్పయతి

**గీ, [1]హాయుతమౌ పొల్లుల వికల్పయతులు చెల్లు**
**దేవకీనందనుఁడు జగద్ధితుఁ డనంగ**
**హలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ**
**నవని ప్రోచినయవి కకుబ్భస్త్రు లనఁగ.** ౧౨౪

హయుతమే=హకారముతోఁ గూడిన; పొల్లుల౯ = పొల్లు హల్లులయందు (ఇట వర్గీయహల్లు లని గ్రాహ్యము); వికల్పయతులు= వికల్పయతు లనుయతులు; చెల్లు౯=వర్తించును. హలధరుఁడు=బల రాముఁడు; కకుబ్భస్తులు=దిగ్గజములు.

హకారము పొల్లుహల్లులతోఁ గూడి సంధికార్యములం బొంది నప్పుడా హకారమునకును పొల్లుహల్లునకునుగూడ యతి వర్తింప వచ్చును. అట్టిది వికల్పయతి యనఁబడును. వికల్పముగా నిది హకా రమునకుఁ బూర్వసవర్ణము వచ్చుస్థలము కావున దీనికి వికల్పయతి యని పేరు పెట్టఁబడెను. ఇందలి ౨, 3, ౪ పాదములం దట్టిసంయోగ ములు కలవు. అవి యుదాహరణములు.

1. జగత్+హిత=జగద్ధిత (జగద్హిత- రూపాంతరము)
2. ఉద్+హత=ఉద్ధత (ఉద్హత- రూపాంతరము)
3. కకుభ్+హస్తి=కకుబ్భస్తి (కకుబ్హస్తి- రూపాంతరము)

వీనిలో వరుసగా 'త, ద, భ' లతో హకారము సంయుత మయి పూర్వసవర్ణ మయ్యెను. అందుచే నిట హకారమునకుఁగాని తదభలకుగాని యతి చెందవచ్చును. రెండవపాదమునఁ బొల్లుహల్లును 3, ౪ పాదములందు హకారమును గ్రహించి యతి చూపఁబడెను. అప్పకవి దీని నంత్యోష్మసంధియతి యని వ్యవహరించెను.

ఇట "ఝయోహోఽన్యతరస్యామ్" అనుశాస్త్రముచేఁ బూర్వ సవర్ణాదేశము హకారమునకు వైకల్పికము. కాన "జగద్ధిత" అనియు "జగద్హిత" అనియుఁగూడ రూపములుండును. హకారమిశ్రవర్ణము లకు యతి వలసినచోఁ బూర్వసవర్ణాదేశము చేయక "జగద్హిత" అను

---

౧౨౪ పద్యమునకు—1. హయుతవర్గువులు- అను పాఠము కొన్నిచోట్లఁ గలదు. అది కొంత యుచితముగా నున్నది- హయుతమై అను పాఠ మంతగా సరళాన్వయమునకు గలది కాదు. సన్నిహిత మగుటచే 'మై' అనునది 'మే' అని దిద్దఁబడెను.

రూపమునందలి హకారమును గ్రహించి యతి వేసె ననవచ్చును. హకారమునకుఁ గాక యితరము లయినపొల్లుహల్లులకు యతి వేయ వలయు నప్పుచో నవి చెప్పుదు నట్లే యుండును గావున వానికిని యతి గ్రహింపవచ్చును. కావున నీయతి సంయుక్తయతిలోనే చేసెను. అయినను బార్వ్యసన్హాదేశము చేసినపదములంగూడ హకారమునకు యతి వేయుట క్లిష్ట మగుటచేతనే యానిర్ణయము పూర్వోక్త మని యచటఁ బ్రత్యేకించి చెప్పవలసివచ్చెను. కనుకనే యిందలి 3, ౪ పాదములలో యతి సరిపడెను.

౨౩. యుక్తవికల్పయతి

గీ. నలిఁ గకారహ ల్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమము గా వికల్పవిరతి
గలుగుఁ జక్రి వల్లవసుదృఙ్మధుఁ డనంగఁ
గమలనేత్రుండు సకలదిఙ్మహితుఁ డనఁగ. ౧౨౪

నలిన్=యోగ్యముగా; కకారహల్లు = కకారము; ఇతరానునాసికాఖ్యన్ = ఇతరమయిన యనునాసికవర్ణమును; కదిసి=కూడి; తత్పంచమము = ఆవర్గమునకుఁ జెందినపంచమాక్షరము; కాన్=కాఁగా; వికల్పవిరతి=వికల్పయతి; కలుగున్=అగును. చక్రి=కృష్ణుడు; వల్ల...ధుఁడు=గోపకాన్తావసంతుఁడు.

వర్గీయాక్షరములు పంచమాక్షరములతోఁ గూడినపుడు తాము కూడఁ బంచమాక్షరములుగా వికల్పముగా మాఱును. "యరోనునాసికేను నాసికోవా" అనుసూత్రము దీనికి మూలము. ఉదా॥ సుదృక్+మధుఁడు=సుదృఙ్మధుఁడు. లేదా; సుదృగ్మధుఁడు. ఇట్టి చోట్లఁ బంచమాక్షరములకును దృతీయాక్షరములకును గూడ యతి చెల్లవచ్చు నని భావము. ఇందలి 3, ౪ పాదములలో వర్గపంచమమునకును ఇతరతద్వర్గీయాక్షరములకును యతి చూపఁబడెను.

(ఉదా॥ కలుగు...పద్మృష్మసుఁడు. కమల...విబ్మహితుఁడు) ఇచ్చటఁగూడ "సుద్మృగ్మసుఁడు, దిగ్మహితుఁడు" అనురూపములనే యంగీకరించి వర్గయతిలోనే చేర్ప నవకాశ మున్నను ననునాసికాదేశ స్థలమునందుఁగూడ ఝ ఞ వర్ణములకు యతిమైత్రిని సంపాదించుట కీ నిర్ణయ మావశ్యక మయ్యె నని తెలియనగును.

ఇదియుఁ బూర్వపదోక్తవికల్పయతిభేదమే యగును. ఈ పద్యమునందును వికల్పయతి యనియే పేర్కొనఁబడెను. యుక్తవికల్పయతి యని యుక్తశబ్దముతోఁ గూర్చి యీపద్యమునకు మీఁది భాగమున నెట్లు నామధేయము లిఖింపఁబడెనో తెలియకున్నది. ఇది గ్రంథకర్తృకృత మన్నట్లు నిశ్చయింప వలనుకాదు. కాని యప్పకవియు నీరెండు యతులను వేర్వేఱు యతులుగనే చెప్పెను. దానిం బట్టియే యిందును రెండుగా విభజనము జరిగెనేమో. ఈరెండును నొక్కభేదముగాఁ దలంచుటయే యుచితము. వర సంఖ్యాపూర్తికి దీని నెవ్వరో విడఁగొట్టియుందురు. భిన్నయతిని విడఁగొట్టి సంఖ్యాపూర్తి చేయుట యింతకంటె సముచితము.

కకారమునకు మాత్రమే యీయతి ననంతుఁడు చెప్పెను. ఇట్టిది పంచవర్గములహల్లులకును వర్తించునని యప్పకవి చెప్పెను. కావున నిటఁ గకార మితరవర్గీయహల్లుల కుపలక్షణముగనఁ దగును.

ఇందలి యుదాహరణములందుఁ బంచమాక్షరమునకు యతిమైత్రి కల స్థలము చూపఁబడలేదు. కకారమునకుమాత్రమే యుదాహరణము చూపఁబడెను. అప్పకవి పంచమవర్ణములకును దత్పూర్వవర్ణములకుఁగూడ యతి నుదాహరించెను. (నందసుకుమార గూఢపాన్మదవిహార, దళితశిశుపాల గోత్రభిన్మశిపసీల) కవర్గ చవర్గముల కుదాహరణము మృగ్యము. అప్పకవి తవర్గీయపంచమాక్షరమునకుమాత్రమే **యతి నుదాహరించెను.**

అనంతుఁడు యతిప్రాసాదులను దిక్ప్రదర్శనన్యాయమునం జెప్పువాఁడేకాని యవ్యభిచరితలక్షణములతోఁ జెప్పఁదలంచినవాఁడు కాఁడు. కావుననే కొన్నియెడల నుదాహరణములమూలముననే యతులస్వరూపము తెలిసికొనవలసినట్లుగు జెప్పెను. భిన్నయతి, సంయుక్తయతి మున్నగునవి యిట్లేగదా వివరించెను. ౧౨౫

## ౨౪. అభేదవిరతి

క. ప్రకట పకార వకార
ద్వికమునకుం జను నభేదవిరతి, నిశాట
ప్రకర మెరిసె రాముని పా
వకశరమున జనకసుతనెపంబున సనఁగన్. ౧౨౬

ప్రకట...నకున్=ప్రసిద్ధములయిన ప, వ అనునక్షరములకు; అభేదవిరతి=అభేదయతి; చనున్=చెల్లును. నిశాటప్రకరము=రాక్షస సమూహము; ఎరిసెన్=నశించెను.

ప వ ల కభేదయతి చెల్లు నని భావము. నాల్గవపాద ముదాహరణము.

ఇందు పవల కభేదయతిఁ జూపెను. కాని "వబయోరభేదః" అని చెప్పఁబడుటచే వబల కభేదము ప్రసిద్ధము కాని పవలకుఁ బ్రసిద్ధము కాదు. ఇతరలాక్షణికులు వబల కభేదయతి యనియు పఫభ లతో వకారమున కభేదవర్గయతి యనియుం జెప్పిరి.

వబలకుఁ గాని పవలకుఁ గాని యతిమైత్రిని గావ్యాలంకార చూడామణి కవిజనాశ్రయములు చెప్పలేదు. అనంతుఁడే పవల కభేద యతివిధానము నారంభించెనేమో, అనేకవిధములుగా ననంతు ననుసరించినయప్పకవియయినను పవల కభేదయతిని గాక యభేదవర్గ యతినే చెప్పెను.

అభేదవిరతి యనఁగా ప వ ల కభేద ముని యభిప్రాయము

కాదు. వ బ లకుఁగల యభేదముచే సిద్ధించినయతి యని భావము. ఈ యభేదసంబంధముచే వకారము బకారమువంటిది కాఁగా సహజ బకారముతోడను దానిమిత్రవర్ణము లగు ప ఫ భ లతోడను వకారమునకు మైత్రి సిద్ధించెను. ఇట్టికారణముచేతనే యీ యతి కదవయతి యని నామము వచ్చెను.

ఈ పకారము "ఫ బ భ" యనునక్షరములకును నుపలక్షణమని గ్రాహ్యము. ౧౨౬

గీ. చెల్లుబడి వళ్ళు ప్రాసము ల్చెప్పఁబడియె,
నిందుఁ బూర్వప్రయోగంబు లెఱిఁగి యెవ్వి
బహుళమై తోఁచె నవి యొనర్పంగవలయు
నవ్యకావ్యప్రియోక్తుల నలిననాభ ! ౧౨౭

నలిననాభ=పద్మనాభా ! చెల్లుబడిన్ = మైత్రింబట్టి; వళ్ళు ప్రాసముల్ =యతిప్రాసములు; చెప్పఁబడియెను.

యతిప్రాసములమైత్రిం జెప్పితిని. వీనిలోఁ బూర్వకవుల ప్రయోగంబులఁ దఱచుగా నెవ్వికాన్పించునో యట్టివియే గ్రహింపవలయును; అని యనంతామాత్యుఁడు పూర్వప్రయోగములకుఁ బ్రామాణ్యాధిక్యమును వచించి ప్రకరణము నుపసంహరించుచున్నాఁడు.

దీనింబట్టి తత్కాలలాక్షణికులమతముల ననుసరించి మకారయతి మున్నగునవి కొన్ని యప్రసిద్ధము లగుయతులు చెప్పఁబడినను బ్రయోగంబులందుఁ దఱచు కానరానివి యప్రయోజ్యములేయని యూహింపనగును. ౧౨౭

క. వరగణవర్ణము దీర్ఘ
స్వర మగుచో గణయుగంబు, చను యతుఁ బుధా
కర కర గుణ గతి శర రుచి
గిరి గజ రుద్రాదిసంజ్ఞ కేశవ ! నాథా ! ౧౨౮

కేశవ! నాథా! వరగణవర్ణము దీర్ఘస్వర మగుచో గణయుగంబు; యతులఁ సుధాకర... సంజ్ఞచనుఁ. అని యన్వయక్రమము.

గణవాచకము లగు మ, భ, మున్నగువర్ణములు దీర్ఘస్వరములతోఁ గూర్చి మా, భా యని ప్రయోగించినచో రెండేసిగణములకు సంజ్ఞ లగును. మా=రెండుమగణములు; భా=రెండుభగణములు; మున్నగుతీరునఁ దెలియనగును.

యతులవిషయమున స్థానములను జెప్పవలసినప్పుడు సంఖ్యల నుపయోగింపవలసియుండును. అట్టిసంఖ్యలకుఁ గొన్నిసంజ్ఞలను బద్యోత్తరార్థమునఁ జెప్పుచున్నాఁడు.

సుధాకర=చంద్రుఁడు- ౧. కర=హస్తములు- ౨. గుణ=సత్త్వరజస్తమోగుణములు- ౩. గతి=అశ్వగమనములు- ౪. శర=మన్మథబాణములు- ౫. రుచి=తిక్తాదిరసములు ౬. గిరి=కులాచలములు- ౭. గజ=దిగ్గజములు- ౮. రుద్ర=రుద్రులు- ౧౧.

యతిస్థానాదిసంఖ్యలను సూచింపవలసినపు డాయాచంద్రాది పదార్థములఁ బేర్కొన్నచో వానిసంఖ్య నిట గ్రహింపవలయు నని భావము. 'రుద్రాది' అనునాదిపదముచే భాస్కరబ్రహ్మతిథ్యాకాశాదిశబ్దములు ద్వాదశ, నవ, పంచదశ, శూన్యాదిసంఖ్యలను బోధించు ననియు గ్రాహ్యము. అనంతరాశ్వాసమునం జెప్పఁబోవు నంశముల కీపద్యోక్తవిషయ మావశ్యకము కావున నిటఁ జెప్పఁబడియెను. ౧౨౮

క. ఎన్నిట యతి రావలె నని
యన్నిట సంస్కృతము నందు నగు విచ్ఛేదం
బెన్నిట యతి రావలె నని
యన్నిటఁ దెలుఁగునకు మొదలియక్షర మమరున్ ౧౨౯

ఎన్నవస్థానమున యతి యుండవలయు నని చెప్పుదురో యాస్థానమున సంస్కృతభాషయందైనచోఁ బదము విచ్ఛేదము నొందవలయును. అనఁగాఁ బదమధ్యము కారాదు. తెనుఁగున యతి యనఁగా నట్టిచ్ఛేద మని తలంపక పాదముమొదటియక్షరమునే యచట మరల నుంచవలయు నని తెలియవలెను.

సంస్కృతము ననుసరించి తెనుఁగునను నాయాస్థానములందు యతి రావలయు నన్నచోఁ బదవిచ్ఛేదము కావలయు నని భ్రాంతి కలుగకుండుటకై తెలుఁగుపద్యములందలి యతిస్వరూపము నిందు వివరించెను.

సంస్కృతాంధ్రభాషలందు యతివిషయమున నామసామ్యమే కాని ధర్మసామ్య మేమియు లేదు. సంస్కృతమున శార్దూలవిక్రీడితమున ౧౨ వ యక్షరము యతిస్థానము. అనఁగా నటఁ బదవిచ్ఛేదము కావలయును. ఉదా॥ "శ్రీమద్వేంకటనాయకం కులగురుం, నత్వా సదాభీష్టదం" ఈ శార్దూలపాదమున "రుం" అను ౧౨ వ యక్షరముతోఁ బదము విచ్ఛేదము చెందెను. ఇట వర్ణసాదృశ్య మక్కఱ లేదు. ఇట్టిపదవిచ్ఛేదరూపయతి తెనుఁగున వర్తింపదు. అందు లేని పాదాదివర్ణసాదృశ్య మిందు నియతముగా నుండవలయును. ఇట్లు సంస్కృతాంధ్రభాషలయతులకు సాదృశ్యము లేదని యిందుఁ దెలియఁజేసెను. ౧౨౯

గద్యము : ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్య తనూభవ సుకవిజనవిధే యానంతనామధేయప్రణీతం బయిన ఛందోదర్పణమునందు గద్యపద్యాదికావ్యలక్షణంబును గురులఘునిర్ణయంబును గణనిరూపణంబును బ్రాస యతి విశేషంబులును బిరిగణనసంజ్ఞయు నన్నది ప్రథమాశ్వాసము.

వాణీ...విభవ=సరస్వతియనుగ్రహముచే లభింపఁబడిన వాగ్వైభవము గలవాఁడు. ఇది తిక్కనామాత్యునికిఁ గాని యనంతునికిఁ గాని విశేషణము కావచ్చును. ఈవిశేషణము సొగసుగాఁ గూర్పఁబడెను. తనకు వాగ్వైభవము గల దని చెప్పిన నించుక యాత్మస్తుతిదోషము సంక్రమించునేమో యని దానిని దప్పించుకొనుటకు విశేషణము తిక్కనామాత్యుని కన్వయించునట్లును జెప్పఁబడియెను. తనతండ్రియు వాణీప్రసాదము గలవాఁడే యనియు సూచింపవచ్చును. విభవ, తనూభవ, అను ప్రాసముచే నివి యేకవ్యక్తిబోధకము లగుటయే కవ్యభీష్టమనియుఁ దెలియఁబడును.

సుకవిజనవిధేయుఁ డనుటచే నీతనివినయసంపత్తి సూచిత మగుచున్నది. "సుకవిజనవిధే యానంతనామధేయు" అనుపాఠము నిర్దోషమగుటచే "విధేయ, అనంత" అను సంధికార్యరహితరూపమును విడచి యీపాఠము గృహీతము. "నిత్యాసమాసే" అని సమాసమున సంహిత నిత్యము కావున "విధేయానంత" అనియే యుండవలయును గదా.

శ్రీ

# ఛందోదర్పణము

## ద్వితీయాశ్వాసము

శ్రీరమణ భక్తలోకమ
నోరమణ జగత్త్రయాభినుత రంజితగౌ
రీరమణ సంభరితవా
ణీరమణ యనంతశయన నీరజనయనా! ౧

శ్రీరమణా=లక్ష్మీపతీ!, భక్త...మణా=భక్తజనులమనస్సులను సంతోషపెట్టువాఁడా!; జగత్త్రయాభినుత=మూఁడులోకములచేతను నుతింపఁబడువాఁడా!; రంజితగౌరీరమణ = రంజింపఁజేయఁబడిన శివుఁడుగలవాఁడా!; జగన్మోహిన్యవతారమున శివుని విభ్రాంతచేతస్కునిం గావించుట యిట ననుసంధేయము. సంభ...మణా=పోషింపఁబడిన బ్రహ్మగలవాఁడా!; అనంతశయన = శేషశయనా!; నీరజనయనా=పద్మనేత్రా! ౧

క. కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దె వోలె బహుముఖరచనం
బున మెఱయుగద్య మది దాఁ
దెనుఁగుకృతుల వచన మనఁగ దీపించుఁ గడున్. ౨

కనుఁగొనన్=చూడఁగా; హరిగద్దె వోలె=శేషస్వరూప మగు విష్ణువిసింహాసనమువలె; పాదరహితమై=పాదములు లేనిదై; సింహా

సనపక్షమునను శేషుఁడు గూఢపాత్తు కనుక పాదరహిత మనుట సరిపడును. బహుముఖరచనంబునన్ = గణయతినియమములు లేక పలు రీతులతో నొప్పెడిరచనముతో; (పక్షాంతరమున శేషుఁడు సహస్రముఖుఁడు కావున ననేకముఖములతో రూప్పు గలదనుట.) మఱియు గద్యము = ప్రకాశించుచున్నగద్యము; తెనుఁగుకృతులన్ = తెనుఁగు కావ్యములందు; వచన మనఁగన్ = "వచనము" అనఁబడి; కడున్ = మిక్కిలిగా; దీపించున్ = ప్రకాశించును.

"నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః। శరీరభేదై స్తవ శేషతాంగతైర్యథోచితం శేష ఇతీర్యతే జనైః" అను రీతిని శేషుఁడు విష్ణుని కాసనరూపత్వమును బొందుటయు సుప్రసిద్ధమే.

పాదరహిత మయిన బహువిధరచనముతో నొప్పారుగద్యమును దెనుఁగున వచన మని వ్యవహరింతు రని భావము. "వ్యాహార ఉక్తి ర్లపితం భాషితం వచనం వచః" అను నమరోక్తిచే వచన మనఁగా వాక్కని యర్థము. పద్యరూప మయినను గద్యరూప మయినను వాక్కగుటకు బాధకము లేదు. సంస్కృతమున గద్యమును వచన మని వ్యవహరింపరు. తెనుఁగునమాత్రము గద్యమును వచన మని వ్యవహరించుచున్నారు. తిక్కనాదిమహాకవులు గద్యమును వచన మని వ్యవహరించుటచే ననంతుఁ డిట్లు చెప్పవలసివచ్చెను. ౨

**గద్యము : స్వస్తి సమస్తభువనరక్షాదక్ష! శ్రీపుండరీకాక్ష! భుజగపతిసింహాసనారూఢ! సురనికరమకుటతటఘటిత సురుచిరమణిగణప్రభావిభాసితపాదపీఠ! వేదనినదానుకారి గౌరవలలితనూపురాలంకృతచరణసరసిజయుగళ! సవ్యపదాంగుష్ఠనఖమయూఖరేఖాయిత సురసరిత్ప్రవాహ! పీతాంబరధర! నూత్నమేఖ**

**లాకలిత కటీతటప్రదేశ ! చతురాననజనక ! నాళీకశోభితనాభి సరోవర ! అఖండ బ్రహ్మాండకలాప గోపననిపుణోదర ! క్షీరసాగరతనయామనోజ్ఞగేహీకృతవిపులవక్షఃస్థల ! కనత్కనక కటక కేయూర ప్రముఖభూషణ భూషిత చతుర్భుజ ! శంఖ పంకజ సుదర్శన గదాధర ! కిరీటకుండలాభిరామ ! అనవరతప్రసన్నవదన ! కౌండిన్యవరద ! శ్ర్యనంతపద్మనాభ ! నమస్తే నమస్తే నమః అని గద్యపఠనం బొనర్చు నుత్తములకు నుత్తమాయురారోగ్యంబు లొదవు నని విశదవచనంబుల విద్వజ్జనంబు లభినుతింతురు.** ౩

స్వస్తిత్యాదికము గద్యమున కుదాహరణము. పూర్వపద్యమున హరిగద్దెవోలె యని శ్లేషానుప్రాణితోపమాలంకారమును ప్రయోగించియుండెను. హరిగద్దెయొక్క స్వరూపము నింక వెన్వెంటనే తెలుపుటకై "భుజగపతిసింహాసనారూఢ" యని సంబోధించెను. భుజగపదప్రయోగమును బాదరహిత మనుటను సూచించుటకే యనఁ దగును. అఖండ...ఉదర=అనేకబ్రహ్మాండసమూహములను నిముడ్చుకొనుటలో నైపుణ్యముగల యుదరముగలవాఁడా !; కౌండిన్యవరద= కౌండిన్యగోత్రజాతుఁ డగుననంతునికి వరముల నిచ్చువాఁడా ! యని భావము. "నమస్తే నమః"అనునంతవఱకును సంస్కృతభాషాగద్యము. తర్వాతిభాగము తెనుఁగువచనము. "అని" అనుపదముచే సంస్కృతభాగము ననుకరించెను. సంస్కృతభాగమున "యఖండ, యనంత" ఇత్యాదిగా యకారశ్రుతి అశాస్త్రీయము. కావున యకారయుత పాఠము లపపాఠము లని తెలియనగును. అట్లే "శ్రీఅనంత" అని విసంధియు దుష్టమే. "శ్ర్యనంతపద్మనాభ" యని యణాదేశముతోఁ గాని లేదా శ్రీమదనంతపద్మనాభ యనిగాని యుండవలయును. ఈగద్య

మున వరుసగా శ్రీమహావిష్ణుని పాదాదిశిరఃపర్యంతవర్ణనము గావింపఁబడెను. గద్యాదియందు రెండుసంబోధనములును గద్యాంతమున రెండుసంబోధనములునుమాత్రము నాకారవర్ణనమున కాద్యంతమున సామాన్యగుణస్తుతిపరములు. "శ్ర్యనంతపద్మనాభ" అనుసంబోధనము "అనంతామాత్యునిపద్మనాథా" యనునర్థముం గూడ స్ఫురింపఁజేయుచున్నది.

## ఛందములు

సమవృత్తము లనియెడు ను
త్తమరత్నమ్ములకు జన్మధామములై పెం
పమరు సముద్రమ్ములచం
దములై ఛందములు మహి సుదర్శనపాణీ! ౪

ఓ సుదర్శనపాణీ !; మహిన్=భూమియందు; ఛందములు= ఉక్తాదిఛందములు; సముద్రముల చందము లయి=సముద్రములవంటివై; సమవృత్తము లనియెడునుత్తమరత్నములకు జన్మధామములై=అన్ని పాదములు నొక్కతీరుగా నుండుసమవృత్తము లనఁబడు జాతిరత్నముల కుత్పత్తిస్థానములై; పెంపమరున్=వర్ధిల్లుచున్నవి.

సముద్రములవంటి ఛందములయందు రత్నములవంటి సమవృత్తము లనేకములు జన్మించె నని భావము.

ఇందు రూపకానుప్రాణితోపమాలంకారము సంఘటితము. అనంతుఁడు సరసకవితాభిరాముఁ డగుటచేఁ దాను రచించినది శాస్త్రగ్రంథ మయినను గుణాలంకారాదిభూషితపద్యప్రచురము గావించుచుండుట మిగుల రమణీయముగా నుండును. "కనుఁగొనఁ బాదరహిత మయి" (౨-౨) అనుపద్యమును దదనన్తరగద్యమును నిట్టివే కదా! కవితాచమత్కారముతోఁబాటు తనకుఁగల శ్రీవై

ష్ణవసంప్రదాయానుగుణనారాయణభక్తిం గూడ నచ్చటచ్చట సూచించుచుండును. ౪

సీ. ఉక్తయు నత్యుక్తయును మధ్యయును బ్రతి
ష్ఠయు సుప్రతిష్ఠయు సరళ మైన
గాయత్రి యుష్ణిక్కు నాయనుష్టుప్పును
బృహతియుఁ బంక్తియు మహిత మైన
త్రిష్టుప్పు నలజగతియు నతిజగతియు
శక్వరి మఱి యతిశక్వరియును
నష్టియు వెండి యత్యష్టియు ధృతియును
నతిధృతియును మఱి కృతియుఁ బ్రకృతి
ఆ. వె. యాకృతియును వికృతి యటు సంకృతియును నభి
కృతియు నుత్కృతి యనఁ గీర్త్య మగుచు
జరగు నిరువదాఱుఛందంబు లేకోత్త
రాధికాక్షరముగ నబ్జనాభ! ౫

ఛందముల నిరువదాఱింటి నిందుఁ గ్రమముగా నిర్దేశించుచున్నాఁడు (1) ఉక్త (2) అత్యుక్త (3) మధ్య (4) ప్రతిష్ఠ (5) సుప్రతిష్ఠ (6) గాయత్రి (7) ఉష్ణిక్కు (8) అనుష్టుప్పు (9) బృహతి (10) పంక్తి (11) త్రిష్టుప్పు (12) జగతి (13) అతిజగతి (14) శక్వరి (15) అతిశక్వరి (16) అష్టి (17) అత్యష్టి (18) ధృతి (19) అతిధృతి (20) కృతి (21) ప్రకృతి (22) ఆకృతి (23) వికృతి (24) సంకృతి (25) అభికృతి (26) ఉత్కృతి- అనఁబడు నిరువదాఱుఛందములును వరుసగా నొకదానికంటె నింకొకదానియం దొక్కొకయక్షర మధికముగా నుండు సమవృత్తములకు స్థానము లయి యొప్పుచుండు నని భావము.

ఉత్క్రాచ్ఛందమున నేకాక్షరకపాదవృత్తములును నత్యుత్క్రాచ్ఛందమున ద్వ్యక్షరకపాదవృత్తములును మధ్యాఛందమునఁ ద్ర్యక్షరక పాదవృత్తములును ననురీతి నొక్కొకయక్షర మధికముగా నున్న పాదములు గలవృత్తము లీఛందములందు జన్మించె నని భావము. ౫

## ఛందోవృత్తసంఖ్య

సీ. కరములు వేదముల్ కరులు రాజులు రాగ
సంఖ్యవిద్యలు నిభ చక్షు రిందు
లంగాస్త్రబాహువు లక్షీందుశరములు
గతిలోచనాంబరకమలరిపులు
నాగవేదాంబరనయనముల్ ఋతునిధి
ఖాబ్ధులు కరవిరించాబ్జఫణులు
గతి నాగగుణశాస్త్రకైరవాప్తులు దిగ్గ
జాంగపర్వతలోచనానలములు
ఆ. వె. శాస్త్రవహ్నిబాణశరతర్కములు బాహు
శైలఖేందురామచంద్రసంఖ్య
గతి గతీందుబాహు ఋతుబాహు లహి నాగ
బాహు వేదబాహు బాణచయము. ౬

పూర్వోక్తచ్ఛందములలో నేఛందములం దెన్నెసివృత్తములు జన్మించునో యీపద్యమునం జెప్పుచున్నాఁడు. ఏఛందమునం దెన్ని వృత్తములు పుట్టునో తెలిసికొనుటకు మార్గము ౭ ఆ. ౬౯. పద్యమునఁ జెప్పఁబడును.

౧ ఆ. ౧౨౯ పద్యమున సంఖ్యల సంజ్ఞలను వివరించియున్నాఁడు. ఆపద్ధతి ననుసరించి యీపద్యమున సంఖ్యలను దెలిసికొనవలయును.

కరములు=చేతులు=అనఁగా రెండు. మొదటి దగు నుక్తాఛందమున రెండువృత్తములు పుట్టు నని భావము.

వేదముల్=ఋగాదివేదములు=నాలుఁగు. రెండవ దగు నత్యుక్తయందు నాల్గువృత్తములు పుట్టు నని బావము. కరులు=దిగ్గజములు=ఎనిమిది. మధ్యాఛందమున నెన్మిదివృత్తములు జన్మించును. ఇట్లే రాజులు=షోడశమహారాజులు = ౧౬. రాగసంఖ్య=రాగముల సంఖ్య=౩౨. విద్యలు=౬౪. ఇభచక్షురిందులు= దిగ్గజములు, నేత్రములు, చంద్రుఁడు; అనఁగా ౧౨౮. "అంకానాం వామతో గతిః" అను శాస్త్రమర్యాద ననుసరించి యంకెలను కుడినుండి యారంభించి యెడమకు నడపవలయును. అంగుచే గజసంఖ్య యగు నెన్మిదికి నేత్రసంఖ్య యగు రెండు పూర్వభాగమునను జంద్రసంఖ్య యగు నొక్కటి దానికిఁ బూర్వమునను వేయఁగా ౧౨౮ సంఖ్య వచ్చెను. ఇట్లే తరువాతిసంఖ్యలను గుర్తింపనగును.

| ఛందస్సంఖ్య | వృత్త సంఖ్య | |
|---|---|---|
| 1 | కరములు | 2 |
| 2 | వేదములు | 4 |
| 3 | కరులు | 8 |
| 4 | రాజులు | 16 |
| 5 | రాగసంఖ్య | 32 |
| 6 | విద్యలు | 64 |
| 7 | ఇభచక్షురిందులు | 128 |
| 8 | అంగాస్త్రబాహులు | 256 |
| 9 | అక్షీందుశరములు | 512 |
| 10 | గతిలోచనాంబరకమలరిపులు | 1024 |

(అంబర=ఆకాశము ౦. కమలరిపు=చంద్రుఁడు 1.)

11 నాగవేదాంబరనయనములు 2048

(సర్పకులము లెన్మిది.)

12 ఋతునిధిభాబ్ధులు 4096

13 కరవిరించాబ్జఘనులు 8192

(అబ్జ=చంద్రుఁడు. 1)

14 గతి నాగ గుణ శాస్త్ర కైరవాప్తులు 16384

(గతులు- 4. శాస్త్రములు-6)

15 దిగ్గజాంగపర్వతలోచనానలములు 32768

16 శాస్త్రవహ్ని బాణశరతర్కములు 65536

(తర్కములు-6. శాస్త్రములు-6)

ఆర్హతభదంతలోకాయతసాంఖ్యన్యాయవైశేషికములు ఆఱును తర్కము లనంబడును.

17 బాహుశైలఖేందురామచంద్రసంఖ్య 131072

18 గతిగతీందుబాహుఋతుబాహులు 262144

19 అహినాగబాహువేదబాహుబాణచయము 524288

ఇట్లే యనంతరపద్యార్థమును గ్రహింపనగును. ౬

సీ. ఋతుశైలశరగజగతిఖేందు, లక్షిభూ
తేంద్వద్రినిధిగగనేక్షణములు,
విగమాత్రగుణగతినిధిచంద్రగతులు, వా
రణఖర్తుగజదంతిరామకరులు,
తర్కేందుకరమునిత్రయతర్కవిధు, లక్షి
పావకాబ్ధిసముద్రబాణబాణ
వహ్నివహ్నులు, బ్రహ్మవదనాంగభుజగేభ
ఖేందుశైలర్తులు, ఛందములను

ఆ. వె. వేఱువేఱ పుట్టువృత్తసమూహంబు
వెండి సర్వవృత్తవితతి యరయ
ఋతుకరాద్రిశైలసితదీప్తినయనతో
యధికృశానుచంద్రు లబ్జనయన!

| ఛందము | | | వృత్తసంఖ్య |
|---|---|---|---|
| 20 | ఋతుశైలశరగజగతిఖేందులు- | | 1048576 |
| 21 | అక్షి ... | ఈక్షణములు | 2097152 |
| 22 | నిగమా ... | గతులు | 4194304 |
| 23 | వారణ ... | కరులు | 8388608 |
| 24 | తర్కేందు ... | విధులు | 16777216 |
| 25 | అక్షి ... | వహ్నులు | 33554432 |
| 26 | బ్రహ్మ ... | ఋతులు | 67108864 |

వేఱువేఱన్=ప్రత్యేకముగా నొక్కొకఛందమునందు; వృత్తసమూహంబు పుట్టును. వెండి=మఱియు; అరయన్=విమర్శింపఁగా; సర్వవృత్తవితతి=వృత్తము లన్నింటిగుంపు; ఋతుకరాద్రి......చంద్రులు=134217726 సంఖ్యగలవి యగును. వేర్వేఱపుట్టునట్టివృత్తసమూహంబు ఋతుశైలాదిసంఖ్యగలది అని యయినను అన్వయము.

## సర్వసమవృత్తభేదసంఖ్య

చ. ఒగిఁ బదమూఁడుకోటులును నొప్పుగ నల్వదిరెండులక్షలుం
దగఁ బదునేడువేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచిన ఛందము లిర్వదాఱిటన్. ౮

పూర్వపద్యమున ఋతుకరాద్రీత్యాదిపదములచే సర్వవృత్తసంఖ్యను సూచించియు సాక్షాత్సంఖ్యావాచకశబ్దములతో విస్పష్ట

ముగా నింక మరల సర్వఛందములందు జనించిన వృత్తములను చెప్పెను.

ఛందము లిర్వదాఱిటన్ = ఇరువదియాఱుఛందములందును; పంచినన్=పంపకము చేయఁగా; సమవృత్తభేదము లు ఇరువదాఱు గదా! ౮

క. హెచ్చును గుందును బొరయక
యచ్చొత్తినయట్లు నాలుగడుగులు సమమై
వచ్చును యతినియమంబును
జెచ్చెర సమవృత్తములకుఁ జిత్తజజనకా! ౯

అచ్చువేసినట్లు నాల్గుపాదములు నొక్కరీతిగా హెచ్చుతగ్గులు లేక సమముగా నుండి యతినియమముగూడ సమముగా నున్నచో నవి సమవృత్తము లని భావము. ౯

వ. సమవృత్తంబు లెట్టి వనిన. ౧౦

మొదలి యుక్తాఛందంబునందు "శ్రీ" యను వృత్తము.

శ్రీ, భా, విం, తున్. ౧౧

రెండవ యత్యుక్తాఛందమునందు "స్త్రీ" యను వృత్తము.

స్త్రీరూ, పారున్, ఘోరా, ఘూరీ. ౧౨

స్త్రీ=స్త్రీవృత్తము. రూపారున్=ఒప్పును. ౧౨

మూఁడవది యగు మధ్యాఛందమునందు "వినయం" బను వృత్తము.

(సగణము)

వినయం, బొనరిం, తు వనం, తునకున్. ౧౩

నాల్గవది యగు ప్రతిష్ఠాఛందమునందు "బింబ" మను వృత్తము.

(భ, గురు.)

శ్రీకలితా, శ్లోకకళగల, ప్రాకటబిం, బాకృతికిన్. ౧౪

అందే "సుకాంతి" యను వృత్తము. (జ, గ.)

అగున్ సుకాం, తి గూర్పఁగా, జగంబులన్, జగత్పతీ! ౧౫

అయిదవది యగు సుప్రతిష్ఠాఛందమునం "దంబుజ" మను వృత్తము (భ, ల, గ.)

పంబిభలగా, డంబరముగా
నంబుజము చె, ల్వం బగు హరీ! ౧౬

అందు "పంక్తి" యను వృత్తము. (భ, గ, గ,)

ఒక్క భకారం, బెక్క గగంబుల్
నెక్కొను బంక్తిం, దక్కక శౌరీ! ౧౭

ఆఱవది యగు గాయత్రీఛందమునందు "తనుమధ్య" యను వృత్తము. (త. య.)

గోపాలుని దేవే, నాపాలికి నాఁగాఁ
బైపై తనుమధ్యన్, బ్రాపించుఁ దయంబుల్. ౧౮

ఏడవది యగు యుష్ణిక్ఛందమునందు "*మధుమతి" యను వృత్తము (న, న, గ.)

మధురిపుఁ డనినన్, మధురపు నగల్
మధురము లగుచున్, మధుమతి నమరున్. ౧౯

అందు "మదరేఖ" యను వృత్తము. (మ, స, గ.)

రూపింపన్ మగ ణాద్యం, బై పెంపార సగంబుల్
దీపించున్ మదరేఖన్, గోపస్త్రీహృదయేశా! ౨౦

ఎనిమిదవది యగు ననుష్టుప్ఛందంబునందు "విద్యున్మాల" యను వృత్తము. (మ, మ, గ, గ.)

---

*దీనికి మదనవిలసిత మని కొందఱు వాగ్రేయాదులందు వ్యవహారము. అప్పకవీయమునందును మదనవిలసితయే.

**మాద్యద్భక్తిన్ మాగాయుక్తిన్, విద్యున్మాలావృత్తం బొప్పన్**
**చైద్యధ్వంసిన్ సంబోధింపన్, సద్యశ్శ్రేయో జాతం బయ్యెన్,**

మాగాయుక్తిన్=మగణద్వయ, గురుద్వయ యోగముచే;
రనసముల్=రనసగణములు; పొత్తు గాన్=కూడఁగా. ౨౦

అందు "చిత్రపద" మను వృత్తము. (భ, భ, గ, గ)

**వారక భాగురుయుగ్మం, బారగఁ జిత్రపదాఖ్యం**
**జేరిన వేడ్కఁ గవీంద్రుల్, గోరి నుతింతురు శౌరిన్. ౨౨**

అందు "ప్రమాణి" యను వృత్తము. (జ, ర, ల, గ)

**సరోజనాభుఁ డచ్యుతుం, డరాతిభంజనుం డనన్**
**జరేఫలన్ లగంబులన్, ధరం బ్రమాణి యొప్పగున్. ౨౩**

తొమ్మిదవది యగు బృహతీఛందంబునందు "హలముఖి" యను వృత్తము. (ర, న, స.)

**చిత్తజాతుని గురునికై, యెత్తుఁ డంజలు లనినచో**
**సత్తుగా రనసము లొగిన్, బొత్తుగా హలముఖి యగున్. ౨౪**

రనసముల్=ర, న, స గణములు; పొత్తు గాన్=కూడఁగా. ౨౪

**క. వదలక పంక్తిచ్ఛందము**
**మొదలుగ నిటమీఁదిఛందముల కందముగా**
**నుదయించు వృత్తసమితికి**
**విదితంబుగ వళులు వలయు విధురవినయనా ! ౨౫**

పంక్తి యనఁబడు పదియవ ఛందము మొదలుకొని తరువాతి ఛందములందుఁ బుట్టినవృత్తములలో యతినియమ ముండును. దీనికిఁ బూర్వము లగు తొమ్మిదిఛందములందుఁబుట్టిన వృత్తములందు **యతు లుండ వనియు భావము లభించుచున్నది.** ౨౫

పదియవది యగు పంక్తిచ్ఛందమునందు "రుక్మవతి" యను వృత్తము (భ, మ, స, గ.)

రూపితరీతిన్ రుక్మవతీసం
రూపభమంబుల్ రూఢి సగంబుల్
ప్రాపుగ భూతవ్రాతయతుల్గా
శ్రీపతి లీలన్ జెప్పఁగ నొప్పున్. ౨౬

భూతవ్రాతయతుల్=అయిదవస్థానమున యతి యని భావము. (శ్రీపతిన్- అని ద్వితీయాంతము)

అయిదింట యతి యనఁగా నయిదక్షరములతర్వాత నాఱవ యక్షరము యతిమైత్రి గల్గియుండవలయు నని భావము. ఇట్లే యతి స్థానముల నంతట నూహించునది.

రుక్మవతి యని వ్రాఁతప్రతులలో నున్నపాఠము గృహీతము. కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులందు రుగ్మవతి యని యున్నను వృత్తరత్నాకరాదులపాఠము గ్రహింపఁబడెను. ౨౬

అందు "మత్త" యను వృత్తము. (మ. భ. స. గ.) యతి- 6.

మొత్తం బార న్మభములు నిత్యో
దాత్తంబై సస్ఫురితగకారా
యత్తంబై షణ్మితయతి నొందన్
మత్తావృత్తం బగు మహిఁ గృష్ణా! ౨౭

అందు "*పణవ" మను వృత్తము: (మ, న, య, గ.) యతి- 5

ఆరంగా మనయగసంయుక్తిన్
సారోదంచితశరవిశ్రాంతిన్

*దీని వ్రాఁతప్రతియందును అప్పకవీయమునను "పణవ" మనియే కలదు. పూర్వముద్రణమున "ప్రణవ" మని యున్నది.

శ్రీరాజుం బొరసిన నత్యంత
స్ఫారంబై చను పణవం బుర్విన్. ౨౮

అందు "మయూరసారి" యను వృత్తము : (ర, జ, ర, గ) యతి- 6

చూతమా యశోదసూను నంచున్
వ్రేత పల్కఁ దర్కవిభ్రమంబుల్
ఖ్యాతిగా రజంబుపై రగంబుల్
జాతిగా మయూరసారిఁ జెప్పున్. ౨౯

దీనిపేరు మయూరభాషిణి యనియు వ్యవహృతము.

అందు "శుద్ధవిరాటి" యను వృత్తము :- (మ, స, జ, గ.) యతి- 5

శ్రీమంతుం డగు చిన్నికృష్ణునిన్
ధీమంతు ల్ప్రణుతింప బాణవి
శ్రామంబు న్మసజంబు గంబునై
రామా! శుద్ధవిరాటి యొప్పగున్. ౩౦

చిన్ని=సుందరుఁడగు.

అందు "మణిరంగ" యను వృత్తము : (ర, స, స, గ) యతి- 5

శ్రీమనస్సరసీరుహమిత్రున్
బ్రేమ మొప్పఁగఁ బేర్కొనుచోటన్
రామునప్పువిరామరసాగల్
కోమలంబు లగు న్మణిరంగన్. ౩౧

"శ్రీమనస్సరసీరుహమిత్రుణ్ రామున్ బ్రేమ మొప్పఁగఁ బేర్కొనుచోటన్" అని యన్వయము. ౩౧

పదునొకండవది యగు త్రిష్టుప్ఛందమునందు "తోదక" వృత్తము :
(భ, భ, భ, గ, గ) యతి- 6

తోరపువేడుకఁ దోదకవృత్తా
కారముగాఁ ద్రిభకారగగంబుల్
నీరజనాభుని నెమ్మి నుతింపన్
జారు విరామము షణ్మితి నొందున్. 32

అందు "యింద్రవజ్ర" యనువృత్తము (త, త, జ, గ, గ) యతి- 7

సామర్థ్యలీలన్ తతజద్విగంబుల్
భూమిధ్రవిశ్రాంతులఁ బొంది యొప్పున్
ప్రేమంబుతో నైందవబింబవక్త్రిన్
హేమాంబరుం బాడుమరింద్రవజ్రన్. 33

అందు "ఉపేంద్రవజ్ర" యను వృత్తము. (జ, త, జ, గ, గ) యతి- 7

పురారిముఖ్యామరపూజనీయున్
సరోజనాభున్ జతజద్విగోక్తిన్
దిరంబుగా నద్రియతి న్నుతింపన్
ఇరానుప్రాణేశు నుపేంద్రవజ్రన్. 34

ఇరానుప్రాణేశుఁ=భూదేవీప్రియుని; ఇట "ను" అనునది పరమున నున్న రేఫసంయోగముచే గురువు కాలేదు. "ఇరాను" అను పాఠ మంతగా సరళము కాదు. పాఠాంతరము కానరాలేదు. 35

అందు "ఉపజాతి" యను వృత్తము.

పినాకికోదండము బిట్టు ద్రుంచెన్
దా నొప్ప గెల్చెన్ జమదగ్నిసూనున్
అనంతసత్త్వం డితఁ డంచు మెచ్చన్
జానైనవృత్తం బుపజాతి యయ్యెన్. 36

ఇది యర్ధసమవృత్తము. ఇందు సమపాదము లొకతీరునను

విషమపాదము లొకతీరునను నుండును. ఇట్టిచోటఁ బ్రాసపూర్వాక్షర మేకరీతిగా లేకున్నను దోషము లేదు. ఈవృత్తమును సమవృత్తములమధ్యను జెప్పుట సరికాదు. అయినను ఇంద్రవజ్రోపేంద్రవజ్రలను జెప్పి ప్రసంగవశమున తదుభయాత్మక మగు నీయుపజాతిని గూడఁ జూపెను. ఈ సమవృత్తములయంతమున "ఇవి సమవృత్తభేదములు" అని యుపసంహారవాక్యమును బట్టియు నిది యిచ్చట నుండఁదగదు. ఇది స్వస్థానార్ధసమవృత్తములలోఁ జెప్పఁదగును. వృత్తరత్నాకరమునను నింద్రోపేంద్రవజ్రాప్రసంగమున నీయుపజాతి చెప్పంబడుటచే ననంతామాత్యుఁడును దదనుసారముగా నట్లే సమవృత్తమధ్యమునం జెప్పెను. అప్పకవి దీనిని సవరించి యర్ధసమవృత్తములలోనే చెప్పెను. అది సమంజసముగా నున్నది. వ్రాఁతప్రతులలోఁ "దా నొప్ప" అని యుండుటచే నట్టిపాఠమును గ్రహించి "జా నొప్ప" యను యతిభ్రంశదోషయుక్తపాఠము విడువఁబడెను. సూనుఁ+అనంత- అనుచోట ద్రుతద్విత్వసంధి కావించె నని తలంపవలెను. (ఎన్నఁడున్నే నివంటిది) "జమదగ్ని" అనునది నిత్యసమాసమగుటచే నిట నిత్యసమాసయతి యగును. 3౫

క. సమపదము లింద్రవజ్రవి
షమపదము లుపేంద్రవజ్రఁ జను నుపజాతిన్
సమవిషమాంఘ్రులు తద్వ్య
త్క్రమ మయినను నదియ పేరు కమలదళాక్షా! 3౬

పూర్వోదాహరణమున సమపాదములు ఇంద్రవజ్రను విషమపాదము లుపేంద్రవజ్రను జెప్పఁబడెను. అట్లేకాక సమపాదము లుపేంద్రవజ్రను విషమపాదము లింద్రవజ్రను జెప్పినను నీయుపజాతి యనియే నామధేయ మగును. అట్లును జెప్పవచ్చునని భావము. 3౬

అందు "రథోద్ధత" మను వృత్తము : (ర, న, ర, లగ.) యతి. 6

నందగోపవరనందనున్ రమా
నందుఁ బ్రస్తుతి యొనర్చి షడ్యతిన్
అందమై రనరవాహ్వయంబు లిం
పొందఁ జెప్పిన రథోద్ధతం బగున్. 30

ఇందు ద్వితీయ తృతీయపాదములకు ద్రుతద్విత్వసంధి జేసి "షడ్యతి నన్దమై" అని ప్రయోగించె నని భావింపఁదగును. వాక్యాంతము కానందున సంధ్యభావ మని తలంప నవకాశము లేదు. సంస్కృతమునందు ద్వితీయ తృతీయపాదములకు సంధి చేయఁబడదు. కాని తెనుఁగున నట్లుగాక పద్యమున సంధి నిత్యము గదా, కావున "ఎన్నఁడున్నేని మోఘము కాదు" ఇత్యాదులవలె ద్రుతద్విత్వ మని తలంపనగును. 32

అందు "గీతాలంబన" మను వృత్తము : (త, జ, జ, వ.) యతి-7

నాళీకభవామరనాథు లొగిన్
శ్రీలోలునిఁ గీర్తన సేయునెడన్
బోలంగఁ దజావలిఁ బొందిన, గీ
తాలంబన మై చను నద్రియతిన్. 33

అప్పకవి దీనిని "కవితాంత" మని వ్యవహరించెను. వ్రాత ప్రతియందును నట్లే కలదు.

అందు "స్వాగత" మనువృత్తము : (ర, న, భ, గగ.) యతి-6

నారదాది మునినాయకవంద్యున్
శౌరిఁ జేరఁ దన స్వాగత మొప్పన్
సారమైనయతి షణ్మితి నొందన్
భూరిరేఫ నభముల్ గగయుక్తిన్. 34

అందు "శాలిని" యనువృత్తము : (మ, త, త, గగ.) యతి-6

చేతోరాగం బుల్లసిల్ల న్మతాగా
ద్యోతంబై షడ్వర్గయుక్తిన్విరామం
బేతేరంగా నిందిరేశప్రభావా
న్వీతం బైన న్శాలినీవృత్త మయ్యెన్. ౪౦

అందు "శ్యేని" యనువృత్తము · (ర, జ, ర, వ.) యతి-6

ఆరమాధినాథుఁ దక్షయంబుగాఁ
జీర లిచ్చె యాజ్ఞసేని కంచుఁ బెం
పారఁ జెప్ప శ్యేని యయ్యె షడ్యతిన్
స్ఫారమై రజంబుపై రవంబు గాన్. ౪౧

అందు "వాతోర్మి" యనువృత్తము : (మ, భ, త, లగ.) యతి-6

దేవాధీశున్ హరిఁ దేజోవనధిన్
భావింపంగా బుతుభాస్వద్విరతిన్
ఈవాతోర్మి న్మభ లేపారుఁ దకా
రావాసంబై లగ మర్థిన్ గదియన్. ౪౨

ఇందును 2, 3 పాదములకు ప్రమృత్వద్విత్వసంధి గలదు. ర౨

అందు "చంద్రిక" యనువృత్తము : (న. న, ర, వ.) యతి-6

నగణయుగమునన్ రవంబులన్
బ్రగుణరసవిరామసంగతిన్
తగిలి హరికథాసమేతమై
నెగడుఁ గృతుల నిండి చంద్రికన్. ౪౩

ప్రాఁతప్రతిలో దీనిని భద్రిక యని వ్రాసిరి. అప్పకవి చంద్రిక
యనెను.

పండ్రెండక్షరపదగు జగతీఛందమునందు "భుజంగప్రయాతము"
(య. య. య, య.) యతి-7

భుజంగేశపర్యంకపూర్ణాసుధాగున్
భుజంగప్రయాతాఖ్యఁ బూరించుచోటన్
సుజంబై ప్రభూతావనీభృద్విరామం
బజస్రంబుగాఁ గూర్ప యాద్వంద్వ మొప్పున్. ౪౪

యా=రెండు యగణములయొక్క; ద్వంద్వము=జత. నాల్గు
యగణము లని భావము. ౪౪

అందు "తోటక" మనువృత్తము : (స, స, స, స,) యతి-8

జలజోదర నిర్మలసంస్తవముల్
విలసిల్లెడుఁ దోటకవృత్తమునన్
బొలుపై సచతుష్కము బొందఁగ నిం
పలరారఁగఁ బల్కుదు రష్టయతిన్. ౪౫

అందు "తోవక" మనువృత్తము : (న, జ, జ, య.) యతి-7

చెలఁగి నజాయులఁ జెందిన నారీ
తిలకము లద్రియతిన్ మృదురీతిన్
వెలయఁగఁ దోపకవృత్తవిభాతిన్
బలుకుదు రిమ్ములఁ బంకజనాభున్. ౪౬

దీనిని తామరస మనియు నందురు. దీనిని తోదకమని యప్ప
కవి వ్యవహారము.

అందు "స్రగ్విణీ" వృత్తము : (ర, ర, ర, ర.) యతి-6

దేవకీనందనున్ దేవచూడామణిన్
భూవధూవల్లభుం బుండరీకోదరున్

భావనాతీతునిం బల్కఁగా స్రగ్విణీ
భావ మాద్యంతరేఫం బగుణా షడ్యతిన్. ౪౭

అందు "ఇంద్రవంశ" మనువృత్తము ; (త, త, జ, ర.) యతి-7

సొంపార నీదేవునిసూనుఁడై కదా
అంపిల్లెఁ బుష్పాస్త్రుఁడు ఔఁగ యౌ ననన్
ఇంపార భూభృద్యతి నింద్రవంశమున్
బెంపారఁ దాజంబులఁ బేర్చు రేఫతోన్. ౪౮

అందు "వంశస్థ" మనువృత్తము : (జ, త, జ, ర.) యతి-7

నమో నమో దేవ జనార్దనాయతే
నమో నమః పంకజనాభ ! నావుడున్
రమించు వంశస్థ విరామ మద్రులన్
సమంచితంబై జతజంబు రేఫయున్. ౪౯

అందు "ద్రుతవిలంబిత" మనువృత్తము : (న, భ, భ, ర.) యతి-6

శ్రుతిమతాంగనిరూఢమహోయతిన్
యతివరప్రముఖార్యజనం బొగిన్
ద్రుతవిలంబిత తోషితరీతులన్
క్షితిధరు న్నుతిసేయు నభారలన్. ౫౦

అందు "జలధరమాల" యనువృత్తము : (మ, భ, స, మ.) యతి-8

శ్రీతన్వీశుం దగిలితిఁ జిత్తంబారన్
మాతా యంచున్ జలధరమాలావృత్తం
బేతేరంగా మభసమ లింపొందంగాఁ
బ్రీతిం బల్కన్ విరతి కరిన్ బ్రాపించున్. ౫౧

"త్వమేవ మాతాచ పితా త్వ మేవ" అనుశాస్త్ర మిచట నను సంధేయము, ౫౧

అందు "ప్రియంవద" యనువృత్తము ; (న, భ, జ, ర.) యతి-7

త్రిభువనాభినుతు దేవదేవునిన్
బ్రభు ముకుందు నిటు ప్రస్తుతింపఁగా
నభజర ల్గదిసినం బ్రియంవదా
విభవ మొప్పు గిరివిశ్రమంబులన్. ౫౨

అందు "ప్రమితాక్షర" మనువృత్తము : (స, జ, స, స.) యతి-౯

కమనీయతేజుని నగణ్యయశున్
గమలాధిపుం బలుకఁగా సజసల్
క్రమ మొప్పఁ గూడఁగ సకారముతోఁ
బ్రమితాక్షరం బహివిరామ మగున్. ౫౩

అందు "జలోద్ధతగతి" యనువృత్తము : (జ, స, జ, స.) యతి-7

సరోరుహదళాక్ష శాశ్వతయశా
పురారినుత యంచు భూధరయతిన్
సరాగ మగుచున్ జసల్ జసలతో
నురుప్రభ యగున్ జలోద్ధతగతిన్. ౫౪

అందు "విశ్వదేవి" యనువృత్తము : (మ, మ, య. య.) యతి-7

జానొందం గావ్యశ్రీకి సంప్రీతితోడన్
మానాథు న్నాథున్ జేసి "మా యా" గణంబుల్
దీనిత్యుల్ ధాత్రీభృద్యతిం గూర్తు రింపుల్
తేనెల్ సోనల్‌గా విశ్వదేవీసమాఖ్యన్. ౫౫

ధాత్రీభృత్ =పర్వతములు.

పదుమూఁడనదగు "అతిజగతీ" ఛందమునందు "మత్తమయూర"
మనువృత్తము : (మ, త, య, స, గ.) యతి-7

భోజాధీశుం డంచుఁ బ్రభూతాత్మకుఁ డంచున్
భ్రాజిష్ణుం డంచుఁ యతి బాగౌ గిరిసంఖ్యన్
ఓజస్స్ఫీతం బై మతయోపేతసగం బి
య్యోజం బక్కన్మత్తమయూరం బలరారున్. ౫౭

తెనుఁగునఁ బద్యములలో నంతట సంధి నిత్యము. పాదాంతమున వాక్యాంతముకూడ నయినచోఁ గొన్నిపట్టుల విసంధి యుండ వచ్చును. ఇందు ద్వితీయపాదాంతమున నున్న నకారమును దృతీయ పాదాది నున్న "ఓ" తోఁ గూర్చినచో "సంఖ్య నోజస్స్ఫీత" అని యుచ్చరింపఁబడును. అపుడు ద్వితీయపాదాంతవర్ణము లఘువుగా నుండుటచే ఛందోభంగ మగును. కావున నిట "అన్నిష్టసఖ నూఁది యున్న" ఇత్యాదులవలె ద్రుతద్విత్వము చేసి సరిపెట్టుకొనవల యును. ఇట్టి ద్రుతద్విత్వము లిం దీ యాశ్వాసమున ౩౮, ౩౯, ౩౭, ౪౨, ౪౮ వృత్తములందును నావశ్యకములే. ఇట్టిసంధి నీతఁడు దుస్సంధి యన్నను మహాభారతాదిప్రయోగములనుబట్టి క్వాచిత్క ముగా నివి యంగీకార్యములే యని తలంపనగును. కాని బాగుగా విమర్శించినచో నీస్థలము లన్నియుఁ బాదాంతము లగుటచే సంధి చేయకుండుట యవిరుద్ధ మని చెప్పఁదగియున్నది. ఈపాదాంతములం దంతటను సంపూర్ణవాక్యసమాప్తి కాకున్నను నవాంతరవాక్యములు సమాప్తి నొందియే యున్నవి. అనఁగా నసమాపకక్రియలతోఁ గూడి యవాంతరవాక్యము సమాప్త మగుచున్నది. అందుచే నిచట ద్రుత ద్విత్వము చేయనక్కఱలే దని యనంతునియాశయము కానోపును. "గిరిసంఖ్యన్" అనుచోట "గిరిసంజ్ఞన్" అని పూర్వముద్రణపాఠము.

ఇందుఁ దృతీయపాదాంతమున "సగంబుల్" అని పూర్వ ముద్రితపాఠము. ఆపాఠమునఁ జతుర్థపాదాదితో సంధి కుదురదు. వాక్యాంతమును గానందున విసంధి కుదురదు. అందుచే వ్రాఁతప్రతు

లలోని నిర్దోష మగు "సగం బియ్యోజన్" అనుప్రాసము గృహీతము.

అందు "జలద" మనువృత్తము : (భ, ర, న, భ, గ.) యతి-9

మ్రొక్కఁల కెల్ల నెల్ల యగు మూర్తి గదా
యక్కమలాక్షుఁ డంచుఁ జతురాస్యయతిన్
దక్కక ప్రస్తుతింప జలదం బగు ని
ట్లొక్కటియై భరేఫనభ లొందు గురున్. ౫౭

అందు "మంజుభాషిణి" యనువృత్తము: (స, జ, స, జ, గ.) యతి-8

దివిజేంద్రుఁ డాది యగు దేవసంఘముల్
భువి మంజుభాషిణికి భోగిరాడ్యశిన్
సవరింపఁగా సజసజంబుగాంతమై
భువనోదరస్తుతి యపూర్వమై చనున్. ౫౮

అందు "ప్రహర్షిణి" యనువృత్తము : (మ, న, జ, ర, గ.) యతి-7

ముక్తి శ్రీకరు భవమోచను స్మరారిన్
భక్తిం బ్రోడజనులు ప్రస్తుతింప నొప్పున్
వ్యక్తగ్రావయతిఁ బ్రహర్షిణీసమాఖ్యన్
యుక్తంబై మనజరగోజ్జ్వలద్గణాప్తిన్. ౫౯

అందు "ప్రభాత" మనువృత్తము : (న, జ, జ, ర, గ.) యతి-7

సరసిజనాభ భుజంగరాజతల్పా
శరణము నీ వని సన్మతిం దలంపన్
బెరయు నజారలు పేర్మి నొప్పుగన్ గన్
జరగుఁ బ్రభాతము శైలవిశ్రమంబున్. ౬౦

అందు "రుచిర" మనువృత్తము : (జ, భ, స, జ, గ.) యతి-8

అనంగకోటివిలసదంగవైభవున్
మనంబులో నిలిపిన మాను నాపదల్
అనన్ జభంబులు సజగానుసంగతిన్
దనర్చు సీరుచిరకు దంతిరాడ్యతిన్. ౬౧

ఇందు ద్వితీయపాదాంతమున వాక్యాంత మగుటచే సంధ్యభావము దోషము కాదని తెలియనగును. ఇందు "సజగానుసంగతిన్" అనుపాఠమున రెండుగురువు లనునర్థము వచ్చును. అది సరిపడదు- "సజగ + అనుసంగతి" అని యీపాఠమున పదచ్ఛేదము- ఇది నిర్దోష పాఠము. ౬౧

పదునాల్గవది యగు శక్వరీఛందమునందు "వనమయూర" మనువృత్తము. (భ, జ, స, న, గగ.) యతి-8. (దీని "ఇందువదన" యనియు నందురు.)

ఉన్నతములై వనమయూరకృతు లోలి
నెన్నగ భజంబులపయి న్సనగగంబుల్
చెన్నొదవ దంతియతిఁ జెంది యలరారన్
వెన్నుని నుతింతురు వివేకు లతిభక్తిన్. ౬౨

ఇందు 'వాపాదాన్తే' యనురీతిని "లి" గురు వయ్యెను. ౬౨

అందు "వసంతతిలక" మనువృత్తము: (త, భ, జ, జ, గగ.) యతి-7

గౌరీనితాంతజపకారణనామధేయున్
దూరీకృతప్రణతదుష్కృతు నంబుజాక్షున్
ధీరోత్తము ల్గిరియతిఁ దభజాగగ ల్పెం
పార న్వసంతతిలకాఖ్య మొనర్తు రొప్పన్. ౬౩

దీనినే సింహోన్నతము, ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి అని అప్పకవీయము.

అందు "ప్రహారణకలిత" యనువృత్తము (న, న, భ, న, లగ.) యతి-7

వనరుహసఖుఁడుఁగా వనరుహరిపుఁడున్
గనుఁగవ యగు నాకడవరదునకున్
ననఘనవనములు స్నగడు తెఁ బలుకఁగా
బనుపడుఁ గృతులం బ్రహారణకలితన్. ౬౪

అందు "సుందరవృత్తము" (భ, భ, ర, స, వ.) యతి-8

కోరిసకోరిక దెచ్చుఁ గోమలి చూడవే
మారునితండ్రి యనం గ్రగమంబున నీక్రియన్
భారసవంబుల నొప్పుఁ బన్నగరాడ్యతిన్
సూరిజనంబులు సెప్పు సుందరవృత్తముల్. ౬౫

అందు "అపరాజిత" మనువృత్తము (న, న, ర, స, లగ.) యతి-8

మునిజనవినుతుం దమోఘజయోన్నతుం
దనితరసదృశుం దనంగగురుం దనం
జను ననయుతమై రసంబు లగంబులై
తనరఁగ నపరాజితం బహిరాడ్యతిన్. ౬౬

అందు "అసంబాధ" యనువృత్తము : (మ, త, న, స, గగ.) యతి-11

సౌమ్యంబై విష్ణుస్తుతుల నెనసి శ్రావ్యంబై
రమ్యస్ఫూర్తిన్ రుద్రవిరమణము రమ్యంబై
గమ్యాకారం బొప్పు మతనసగగ ప్రాప్తిన్
సమ్యగ్భావంబై పొలు పమరు నసంబాధన్. ౬౭

సేవ్యంబై యనుపాఠంబున యతి భంగము. కావున పాఠాంతరము గృహీతము. ౬౮

అందు "భూనుత" మనువృత్తము : (ర, న, భ, భ, గగ.) యతి-9

శ్రీనివాస పురుషోత్తమ సింధువిహారా
పూని మమ్ముఁ గృపఁ జేకొని ప్రోవు మనంగా
భూనుతంబు రనభాగగఁ బొంది గయుక్తిన్
పూని సొంపుగ గ్రహాక్షరమున్ వడి నొందన్. ౮౮

అందు "కమలవిలసిత" మను వృత్తము : (న, న, న, న, గగ.) యతి-8

నగణము నగణము నగణముఁ జేరన్
నగణము గగము నొనర నటమీఁదన్
దిగిభవిరమణము దిర మగునేనిన్
దగుఁ గమలవిలసితము కమలాక్షా ! ౮౯

పదునేనవది యగు నతిశక్వరీచ్ఛందంబునందు "మణిగణనికర" మను వృత్తము : (న, న, న, న, స.) యతి-8

కనకపువలువలుఁ గరకటకములున్
ననుపగు తులసియు నొసలితిలకమున్
దనరెడుహరిఁ గని తగ ననననసల్
వినిచిన మణిగణనికర మిభయతిన్. ౯౦

అందు "మాలిని" యనువృత్తము : న, న, మ, య, య.) యతి-8

సకలనిగమవేద్యున్ సంసృతివ్యాధివైద్యున్
మకుటవిమలమూర్తిన్ మాలినీవృత్తపూర్తిన్
నకలితనమయాయు జ్ఞాగవిశ్రాంతియుక్తిన్
సుకవులు వివరింపన్ సొంపగు న్విస్తరింపన్. ౯౧

ఇందు 'నమయోక్తిన్' అనుచోట యా+ఉక్తి అను పదచ్ఛేదములో రెండుయగణము లనునర్థము సంపాదింపవలసియున్నది, నక

లితనమయాలన్ అని పాఠము కలదేమో, లేదా నమయాయుల్ అనినైన నుండఁదగును. గణనిర్ణయముకడ సందిగ్ధపాఠము కవి కభిమతము కాదు. సంధిస్థలముల నొక్క-గణమునే యాతఁడు గణించును (చూ. 2 ఆ. 113 ప. జయభ్రాశిత.) కవిసమ్మతపాఠ మూహింపఁదగును. ౭౧

అంద "సుకేసర" మనువృత్తము : (న, జ, భ, జ, ర.) యతి-10

యతి, యవతారసంఖ్యనిడి యాదరంబుతో
నతిశయమై నజంబులు భజాంతరేఫలన్
వితతముగా నొనర్చి యరవిందలోచనున్
క్షితిధరు సంస్తుతించిన సుకేసరం బగున్. ౭౨

అంద "మణిభూషణ" మను వృత్తము : (ర, న, భ, భ, ర.) యతి-9

హస్తిరాజ భయనిర్హర యండజవాహనా
ధ్వస్తసంసరణ యంచుఁ బితామహవిక్రమ
ప్రస్తుతంబుగ రనంబుల భారగణంబులన్
విస్తరింప మణిభూషణ వృత్తము చెల్వగున్. ౭౩

అంద "మనోజ్ఞ" యనువృత్తము : (న, జ, జ, భ, ర.) యతి-9

అజ శివ శక్ర నిరంతరార్చిత పద్మయున్
భుజగకులాధిపతల్పుఁ బూని నుతింపఁగా
సజయతి నొంది నజాభరార్చిత మై చనున్
ఋజు వగు నుర్వి మనోజ్ఞ ఋష్యనురాగమై. ౭౪

"ఋషీణామనురాగోయత్ర" అని బహుప్రీహిసమాసము. మనోజ్ఞ (అను వృత్తము) ఋజువగున్ అని యన్వయము. ౭౪

పదునాఱవ దగు నష్టిచ్ఛందంబునందు "ప్రియకాంత" యనువృత్తము:

(న, య, న, య, స, గ.) యతి-10

అవనియు శ్రీయు న్పసు లొరుఁ డాలో గన్పుఁ డాప్తుల్
దివిజులు దామోదరునకు దేవ సేవక సేరి
నవతుగ నాఁగా నయనయనవ్యంస్నగయుక్తిన్
గవినుతమై దిగ్యతిఁ బ్రియకాంతాకృతి యొప్పున్.

అంద "పంచచామర" మనువృత్తము: (జ, ర, జ, ర, జ, గ.) యతి-9

జరేఫలన్ జరేఫలన్ జసంయుతంబులై తగన్
గురూపరిస్థితిం బొసంగి గుంఫనం బెలర్పఁగా
విరించిసంఖ్య నంటమైన విశ్రమంబు లం ఘ్రులం
బ్రరూఢ మైనఁ బద్మనాభ పంచచామరం బగున్ ౨౭

అంద "పద్మక" మనువృత్తము: (న, భ, జ, జ, జ, గ.) యతి-10

నకలితంబుగ భజాజగణంబులు గాంతమై
సకలదిగ్విరమణంబులు సన్నుతమై చనన్
శకటదైత్యమదభంజను సన్నుతి సేయఁగాఁ
బ్రకటమై కృతులఁ బద్మము పద్మకఁ బట్టగున్.

పద్మము=పద్మకవృత్తము; పద్మకు=లక్ష్మికి; పట్టగున్=స్థానమగును. ఈవృత్తమునకు "పద్మము" అనియే పే రన్నట్లు లక్షణపద్యమునుబట్టి తోఁచుచున్నది. ౨౨

అంద "ఫలసదన" మనువృత్తము: (న, న, న, న, స, గ.) యతి-9

ననలను ననలను దనరఁగ సగయుక్తిన్
వనరుహభవయుతు లవహిత మతితోడన్
వినుపుచు సుకవులు మణివిలసదురస్కా
గొనకొని పొగడఁగ నగు ఫలసదనంబుల్. ౭౮

అంద "చంద్రశ్రీ" యనువృత్తము:(య, మ, న, స, ర, గ.)యతి-11

జగన్నాథున్ లక్ష్మీహృదయజలజప్రోద్యదర్కున్
ఖగాధీశారూఢుఁ సుకవిజనకల్పద్రుమంబున్
దగ న్వర్ణింపంగా యమనసయుతంబై రగంబుల్
మొగిం జంద్రశ్రీకి న్నిలుచు, యతి ముక్కంటినొందున్.

అంద "మేదిని" యనువృత్తము : (న, జ, భ, జ, ర, గ.) యతి-10

నగణముతో జకారభగణంబులున్ జకార
ప్రగుణితరేఫయుఁ గురువు భాతిగాఁగ నోలిఁ
దగ నవతారవిశ్రమము దండిగా నొనర్పఁ
మృగమదవర్ణుఁ డీయకొను మేదినీసమాఖ్యన్. ౨౦

పదునేడవ దగు నత్యష్టిచ్ఛందంబునందు "నర్కుట" మను వృత్తము:

(న, జ, భ, జ, జ, వ.) యతి-10

కొలిచెద నందగోపసుతుకోమలపాదములన్
దులిచెదఁ బూర్వసంచితపుదోషములన్, సుఖినై
నిలిచెద నన్న నర్కుటము నిర్మలవృత్త మగుఁ
సలలితమై "నజంబుల భజావ"ల దిగ్విరతిఁ. ౨౧

తులిచెదఁ=తూల్చెదను- పోఁగొట్టుకొందు నని భావము.

అంద "శిఖరిణి" యనువృత్తము : (య, మ, న, స, భ, వ,)యతి-12

గజేంద్రాపద్ధ్వంసిన్ మదిరసదృశుం గంజనయనున్
భజింతుం దాత్పర్యంబున ననినచో భాస్కరయతిన్
ప్రజాహ్లాదం బై సన్ యమనసభవ [1]ప్రస్ఫురితమై
ద్విజశ్రేష్ఠ ల్మెచ్చన్ శిఖరిణి గడున్ విశ్రుత మగున్.

---

1. ప్రాఁచిప్రతిలో నీపాఠ మీ క్లలదు.

మునిరసదృశున్ = మేఘతుల్యుని- నీలమేఘశ్యాముఁ డని భావము. ౨౨౨

అంద "మందాక్రాంత" యనువృత్తము : (మ, భ, న, త, త, గగ.) యతి-10

చెందెం బాదాంబుజరజముచే స్త్రీత్వ మారాతికిం జే
యందెం జాపం బిరుతునుకలై యద్భుతం బావహిల్లన్
క్రమందె న్మా రొడ్డి దశముఖుఁడున్ రాముచే నంచుఁజెప్పన్
మందాక్రాంతన్ మభనతతగా మండితాశాయతుల్గాన్. ౨౨౩

చేయి=హస్తము, చాపంబు=ధనుస్సును అందెన్=పట్టెను అని అన్వయము.

ఆరాతికిన్=ఆశిలకు; క్రమందెన్=వచ్చెను, మందాక్రాంత యనియే దీనిపే రని పద్యమునుబట్టి తెలియుచున్నది. సంస్కృతమున నట్లే వాడుక.

అంద "పాలాశదళ" మనువృత్తము : (15 లఘువులు, గగ.) యతి-10

పదునయిదులఘువులును బరగ గగ మొందన్
బది యగునెడ విరతులు బలసి పొడసూపన్
బొదలి హరినుతులఁ గడుఁ బొలుపగుచుఁ బాలా
శదళ మనఁ బరగుఁ గవిజనులు గొనియాడన్. ౨౨౪

అంద "పృథ్వి" యనువృత్తము : (జ, స, జ, స, య, లగ.) యతి-11

జసంబులు జసంబులన్ యలగసంగతిన్ సొంగమై
పొసంగ నమృతాంశుభృద్యతులుపొందఁ బాదంబులన్
బిసప్రసవలోచనా! వినుము పృథ్వి నాఁ బృథ్విలో
నసంశయ మగున్ శివద్యునుతులందు నింపొందినన్.

అందు "హరిణి" యనువృత్తము ; న, స, మ, ర, స, లగ.) యతి-11

జరగు ననమప్రోద్యద్రేఫల్ ససంగతమై లగల్
దొరయఁగ మురద్వేషిన్ సద్భక్తితో వినుతించెదన్
సరసిరుహగర్భేశానాదిత్యసత్తము నన్నుచో
హరిణి యనువృత్తం బొప్పారున్ బురారివిరామమై. ౨౬

పదునెనిమిదవ దగు ధృతిచ్ఛందంబునందు "మత్తకోకిల" యను
వృత్తము ; (ర, స, జ, జ, భ, ర.) యతి-10

ఒక్కచేత సుదర్శనంబును నొక్కచేతను శంఖమున్
ఒక్కచేతఁ బయోరుహంబును నొక్కచేత గదం దగన్
జక్కడం బగుమూర్తికిన్ రసజాభరంబులు దిగ్యతిన్
మక్కువందగఁ బాడిరార్యులు మత్తకోకిలవృత్తమున్, ౨౭

చక్కడంబగు=చక్కని కాంతిగల.

అందు "కుసుమితలతావేల్లిత" యనువృత్తము : (మ, త, న,
య, య, య.) యతి-11

శ్రీనాథున్ బ్రహ్మాద్యమరవరసంసేవ్యపాదారవిందున్
దీనానాథవ్రాతభరణగుణోదీక్షనిం బాడి రోలన్
గానారూఢాత్ముల్ మతనయయయల్ కామజిద్విశ్రమంబై
వీనుల్విందారం గుసుమితలతావేల్లితావృత్తమొప్పున్. ౨౮

పందొమ్మిదవ దగు నతిధృతిచ్ఛందంబునందు "శార్దూలవిక్రీడిత"
యనువృత్తము : (మ, స, జ, స, త. త, గ.) యతి-12

పద్మప్రోద్భవసన్నిభుల్ మసజసప్రవ్యక్తతాగంబులన్
బద్మాప్తాంచితవిశ్రమంబుగ సముత్పాదింతు రుద్యన్మతిన్
బద్మాక్షాయనిజాంఘ్రిసంశ్రితమహాపద్మాయయోగీంద్రహృ
త్పద్మస్థాయ నమోస్తుతే యనుచు సీశార్దూలవిక్రీడితన్. ౨౯

మహాపద్మ మనఁగా నిధివిశేషము. ఆశ్రితులకు నిధివంటివాఁడ వని భావము. ౮౯

అందు "తరళ" మను వృత్తము : (న, భ, ర, స, జ, జ, గ.) యతి-11

జలరుహాహితసోదరీముఖచంద్రచంద్రిక లాదటన్
గొలఁది మీఱఁగ లోచనంబులఁ గ్రోలి యొప్పుమహాసుఖిన్
బలుకుచో నక్షరంబులుం బిదపన్ సజంబు జగంబులున్
జెలువుగాఁ దరళంబు నోలి రచింతు రంధకజిద్కృతిన్. ౯౦

అందు "మేఘవిస్ఫూర్జిత" మను వృత్తము : (య, మ, న, స, ర, ర, గ.) యతి-12

రమానాథున్ నాథున్ యదుకులశిరోరమ్యరత్నాయమానున్
సముద్యత్తేజిష్ణున్ దనుజయువతిస్ఫారహారాపహారున్
మిముం బ్రీతిం బేర్కొం ద్రదఃణవిరతిన్ మేఘవిస్ఫూర్జితాఖ్యా
గ్రమం బొప్పన్ బెద్దల్ యమనసములన్ రాగముల్గాముకుందా!

అందు "భూతిలక" మను వృత్తము : (భ, భ, ర, స, జ, జ, గ.) యతి-12

వాఁడె వధూమణి! చూడవే త్రిదివద్రుమంబు ధరిత్రికిన్
బోఁడిమి దెచ్చినశూరుఁ డీతనిఁ బోలలే రిల నెవ్వరున్
వీఁ డధికుం డని భీమవిక్రమవృత్తి భూతిలకం బగున్
వేఁడి నుతింతురు భారసంబులవెంట జాగములొందఁగాన్.

భీమ=శివుఁడు.

అందు "చంద్రకళ" యను వృత్తము. (ర, స, స, త, జ, జ, గ) యతి-10

వీనులారఁ బ్రసిద్ధపదంబుల్ వేడుకఁ గూర్చి దిశాయతిన్
గాన వచ్చి రసాతజజంబుల్ గల్గ దిటంబుగఁ జెప్పఁగన్
జానకీవదనాంబుజశశ్వత్సౌరభలోలమధువ్రతా !
దానవాంతక! చంద్రకళావృత్తంబు సభం గడు నొప్పుగున్.

ఇరువదియవ దగు కృతిచ్ఛందంబునందు.

"మత్తేభవిక్రీడిత" యను వృత్తము. (స, భ, ర, న, మ, య, వ.)
యతి-13

భవరోగప్రవినాశనౌషధ కలాప్రావీణ్యగణ్యుండు శై
లవిభేదిప్రముఖాఖిలామరవరోల్లాసుండు గోవిందుఁ డం
చు వివేకు ల్సభరంబులు న్నమయవస్తోమంబు గూడన్ సమ
ర్మవిధిం జెప్పుదు రాత్రయోదశయతి న్మత్తేభవిక్రీడిత[illegible]

అంద "అంబురుహం" బను వృత్తము : (భ, భ, భ, భ, ర, స, వ.)
యతి-12

తార తుషార పటీరమరాళ సుధాసమాన మహాయశా !
నీరదభృంగతమాల దళాసితనీరజేంద్రమణిద్యుతీ !
హారకిరీట ముఖాభరణాంచిత ! యంచు శ్రీపతిఁ గూర్చి భా
భారసవంబుం భానువిరామముఁ బల్క నంబురుహం బగున్.

తార=వెండి. అసితనీరజ=నల్లతామర- లేదా నల్లకలువ.

అంద "ఉత్పలమాల" యను వృత్తము : (భ, ర, న, భ, భ, ర, లగ.) యతి-9

శ్రీరమణీముఖాంబురుహసేవనషట్పద ! నాథ ! యంచు శృం
గారరమేశ ! యంచు ధృతకౌస్తుభ ! యంచు భరేఫనంబులన్

ధారలగంబులుం గనియెఁ బల్కుచు నుత్పలమాలికాకృతిన్
గారవ మొప్పఁ జెప్పుదురు కావ్యవిదుల్ యతితొమ్మిదింటఁ
గాన్. ౯౭

అంద "ఖచరప్లుత" మను వృత్తము: (న, భ, భ, మ, స, స, వ.)
యతి-11

వరద! కేశవ! దైత్యవిదారీ! వారిజనాభ! జగన్నిధీ!
కరుణఁ జూడుము మమ్ముఁ బ్రసన్నాకార! హరీ! యనిపల్కినన్
వరుసతో నభభంబు మసావల్ వాలఁగ రుద్రవిరామమై
యరుదుగా మునిపుంగవవర్ణ్యంబై ఖచరప్లుత మొప్పగున్ ౯౮

ఇరువదియొకటవ దగు ప్రకృతిచ్ఛందంబునందు "చంపకమాల" యను
వృత్తము: (న, జ, భ, జ, జ, జ, ర.) యతి-10

త్రిభువనవంద్య గోపయువతీజన సంచిత భాగధేయరుక్
ప్రభవ సముత్కరోజ్జ్వల శిరస్స్థితరత్నమరీచిమంజరీ
విభవ సముజ్జ్వలత్పదరవింద ముకుంద యనంగ నొప్పెసన్
జభములు జాజరేఫములఁ జంపకమాల కగున్ దిశాయతిన్.

నా, జభములు అనుపాఠమున నీక్రిందివిధమునఁ దెల్పనగును.

నా=నగణము; జభములు=జగణ, భగణములు; ఇట "దీర్ఘ స్స్యాద్వర్ణనిర్దేశే" అనుశాస్త్రమువొప్పున దీర్ఘము వచ్చెను. (చూ. ఛాజసంయుక్తితద్భవవ్యాజమునను) అంతియకాని గణద్వయ మనుట కొఱకుఁ బెట్టినదీర్ఘ మని తలంపరాదు. లేదా నన్=నగణమును అనునర్థమున నన్ అనుపాఠమును గ్రహింపవచ్చును. ఈపాఠము నిస్సంశయము.

(చూ... ఆదిభఁ జేసి- భన్=భగణమును.)

అంద "స్రగ్ధర" యను వృత్తము : (మ, ర, భ, న, య, య, య.)
యతి-7, 7

తెల్లం బై శైలవిశ్రాంతిని మునియతినిం
దేజరిల్లుఁ దృఢం బై
చెల్లెం బెల్లె మకారాంచితరభనయయల్
చెంద మీఁదన్ యకారం
బుల్లం బారన్ బుధారాధ్య సురగళయనుఁ
యోగివంద్యుం గడున్ రం
జిల్లం జేయం గవీంద్రుల్ జితదనుజగురుం
జెప్పుదుర్ స్రగ్ధరాఖ్యన్. ౯౯

చెప్పుదుర్=బాల ప్రకి 16 సూ॥చే ఉత్వలోపము.

అంద "వనమంజరి" యను వృత్తము : (న, జ, జ, జ, జ, భ, ర.)
యతి-13

హరి పురుషోత్తమ కృష్ణ కృపానిధి యాదిమూలమ యంచు నా
కరిపతి పల్కఁగఁ గాచె నితం డని కౌతుకంబునఁ బల్మరున్
జరగుఁ బ్రమోదవశవిశ్రమముల్ నజజాజభాంచితరేఫలన్
మరుగురునిం బ్రణుతింతు రిలన్ వనమంజరిం గవిపుంగవుల్.

అంద "మణిమాల" యను వృత్తము : (స, జ, స, జ, స, జ, స.)
యతి-10

శరణాగతార్తిహర ణాంబుజాతదళసన్నిభాంబకయుగా
కరుణాసముద్ర జగదాదికారణపురాణమూర్తి యనుచున్
వరుస న్సజత్రితయమున్ ద్రివార మొనరు న్సకారము తుదిన్
దిరమొంద దిగ్యతిఁగవుల్నుతింప మణిమాలవృత్త మమరున్.

అంద "లాటీవిట" మను వృత్తము : (స, స, స, స, మ, త, య.)
యతి-12

సగణంబులు నాల్గిటిపై మతయల్ సమ్యగ్భావంబై యరుదేరన్
బగలింటికి నేలిక యెవ్వ [1] డగున్ భావింపంగా నయ్యెడ వళ్లన్
మిగుల న్మధురం బగుశబ్దములన్ మిశ్రంబై లాటీవిటవృత్తం
బగు నిందుకళాధరసన్నుతనామాంకా! శంకాతంకవిదారీ! ౧౦౨

ఇరువదిరెండవ దగు నాకృతిచ్ఛందంబునందు.

"మానిని" యను వృత్తము : (భ, భ, భ, భ, భ, భ, భ, గ.)

క్రొన్నెలపువ్వును గోఱలపొంగయుఁ
గూర్చిన కెంజడకొప్పునకుఁన్
వన్నె యొనర్చినవాహిని యాతని
వామపదంబున వ్రాలె ననన్
జెన్నుగ నద్రిభసేవ్యగురు ల్విల
సిల్లు రసత్రయచిహ్నయతుల్
పన్నుగ నొందెఁ ప్రభాకరవిశ్రమ
భంగిగ మానిని భవ్య మగున్. ౧౦౩

అద్రిభ=7 భగణములతో; సేవ్య = కూడిన; గురుల్=గురువులు; రసత్రయ=ఆఱు మూఁడులు; ఆఱేసియక్షరములకు మూఁడు సార్లు యతు లని తాత్పర్యము. ఒందె=లేదా, ప్రభాకరవిశ్రమభంగిగన్=పండ్రెండింట యతి గాని యుండఁగా; మానిని భవ్య మగున్=మానినీవృత్త మగును.

---

1. వావిళ్ళవారిముద్రణమున "యెవ్వఁడు నాభావింపంగా భాసురభంగిన్, మిగుల న్మధురం బగుశబ్దములన్ విశ్రాంతిన్ లాటీవిటవృత్తంబు" అనుపాఠ మున్నది. అం దర్థము పొందుపడదు. యతిస్థానము చెప్పఁబడలేదు. మూఁడవపాదమున యతి చెడినది. కావున దానిని విడిచి వ్రాతప్రతులనుండి మంచిపాఠము గ్రహింపఁబడెను.

వావిళ్ళవారి తృతీయముద్రణమున నీపద్యమున నాల్గవపాదము "పన్నుగ నొందఁ బ్రభాసురవిశ్రమభంగిగ మానిని భవ్య మగున్" అని యున్నది. ఈపాఠమునఁ బంద్రెండింట యతి చెప్పఁబడలేదు. యతుల్, విశ్రమ, అని రెండుసార్లు యతినామములు పడియున్నవి. అప్పకవి "రాజిలుసప్తభముల్గము, విరామము మానినియందు భర ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు దైత్యగురున్ భృగువాక్యమునన్" అని ద్వాదశస్థానవిరామముతోడనే యీవృత్తమును రచించెను. దీనింబట్టి యీమానినీవృత్తమునకుఁ గొందఱు రసత్రయయతిని మఱికొందఱు ద్వాదశయతిని నంగీకరించి పద్యములను రచించు చున్నారనుట స్పష్టము. కవిజనాశ్రయమున లక్షణపద్యమునఁ బంద్రెండింటనే యతి చెప్పఁబడినను.

కారకముల్ క్రియ గన్గొన నేడు భకారము లొక్కగకారముతో
గారవమై చనఁగా యతి పంద్రెటఁ గల్గిన మానిని కామనిభా.

అని లక్షణమునఁ జెప్పబడినదానికి భంగము లేక రసత్రయ యతియు వేయఁబడెను; కావ్యాలంకారచూడామణియందును రసత్రయయతియే వేయఁబడెను. వీనినిబట్టిచూడఁగా రసత్రయయతి కాని ద్వాదశయతి కాని యిందు వేయవచ్చుననియే తోఁచుచున్నది. తద నుగుణముగా నేను జూపిన "పన్నుగ నొండెఁ బ్రభాకరవిశ్రమభంగిగ మానిని భవ్య మగున్" అనుపాఠ ముండుటచే నిదియ కవ్యభిప్రేత మని గ్రహించితిని. చిత్రకవిపెద్దన స్పష్టముగా నీయతిస్థానవైకల్పికత్వమును "ఏడ్భగురుల్ రవినేని రసత్రయినేన్వడి మానిని కిట్లిడనౌ" అని చెప్పెను. కావున ననంతామాత్యున కిట్టిపాఠమే సమ్మతమని భావింపనగును.

అంద "మహాస్రగ్ధర" యను వృత్తము : స, త, త, న, స, ర, ర, గ). యతి–8, 7

కొలిచెం బ్రోత్సాహవృత్తిం
గుతలగగనముల్ గూడ రెండంఘ్రులం దా
బలిఁ బాతాళంబు చేరం
బనిచెఁ గడమకై బాపురే వామనుం డ
స్ఖలితాటోపాధ్యుఁ డంచుం
గరిగిరివిరమాకార మారన్ సతానో
జ్జ్వలసోద్యద్రేఫయుగ్మా
శ్రయగురుల మహాస్రగ్ధరం జెప్ప నొప్పున్.

అంద "భద్రక" మను వృత్తము : (భ, ర, న, ర, న, ర, న, గ.)
యతి-11

ఆది భఁ జేసి యవ్వల రనద్వ
యంబు నొగి మూఁడుతానకములుఁ
బాదుకొనంగ నొక్కగురు వొందఁ
బై విరతి రుద్రసంఖ్య నిడినన్
గాదనరాదు భద్రకము నాఁగ
గాథ మగువృత్త మొప్పుఁ గృతులఁ
శ్రీదనరార నాశ్రితవితాన
చింతితఫలప్రదాన ! నృహరీ ! ౧౦౫

ఇరువదిమూఁడవ దగు వికృతిచ్ఛందంబునందు "కవిరాజవిరాజిత"
మను వృత్తము : (న, జ, జ, జ, జ, జ, జ, లగ.) యతి-7,6,6

కమలదళంబులకైవడిఁ జెన్నగు
కన్నులఁ జారుముఖప్రభలఁ
సమధికవృత్తకుచంబుల నొప్పఁగ
శైలరసర్తువిశాలయతిన్

సముచితనాన్వితషడ్జలగంబుల
జానుగఁ బాడిరి చక్రధరుఁ
రమణులు సొంపలరం గవిరాజవి
రాజితమౌఁ జహంగాగములన్. ౧౦౬

జానుగ=మనోహరముగా.

అందు "అశ్వలలిత" మను వృత్తము : (న, జ, భ, జ, భ, జ, భ, వ.) యతి-12

ఇనవిరమంబున న్నజభజంబు
లింపుగ భజంబులున్ భవమలై
చనఁ జనునొప్పు నశ్వలలితంబు
సత్కృతులఁ జెప్పఁగా విశదమై
యనుపమవైభవోజ్జ్వల ! హరీ ! స
హస్రకరదోర్విదారణచణా !
నినుఁ గొనియాడ ధన్యుఁడు గదయ్య
నీకరుణ దా ననంత మగుటఁ. ౧౦౭

అంద "పద్మనాభ" మను వృత్తము : (త, త, త, త, త, త, త, గగ.) యతి-12

మున్నెవ్వరున్ లేనికాలంబునన్ సృష్టి
మూలంబుగాఁ బద్మగర్భుఁ సృజించెన్
మున్నీటిలోఁ బాపతల్పంబుపై వెన్ను
మోపెం ద్రిలోకంబులం గుక్షి నుండన్
ఎన్నంగ నీతం డ నాద్యంతుఁ డంచున్ ని
రీక్షింతు రెవ్వాని వాఁ డెల్లనాఁడున్

న న్నేలునా నర్కవిక్రాంత మై పద్మ
నాభం బగున్ సప్తతంబు ల్గగంబున్. ౧౦౮

ఇరువదినాల్గవ దగు సంకృతిచ్ఛందంబునందు. "అష్టమూర్తి" యను వృత్తము (మ, న, త, స, ర, భ, జ, య.) యతి-8, 8

శ్రీనాథున్ సరసిజాక్షున్ సితసరోజాతనాథున్
జితనిశాటవరేణ్యున్
గానోదంచితరసజ్ఞుం గరిభయధ్వాంతభానున్
గనకవస్త్రవిలాసున్
జానొంద న్మనతయుక్తిన్ సరభజల్ యాంతమై కుం
జరయతిద్వయ మొప్పం
గా నిట్లింపెసఁగఁ జెప్పెం గవిజనం బష్టమూర్తిన్
[1]ఘనసమాగమరీతిన్. ౧౦౯

అంద "సరసిజ" మను వృత్తము: (మ, త, య, న, న, న, న, స.)
యతి-9,8

మౌళిం బిల్లంగో లొకచేత
న్మఱియొకకరమున మణిమయలతయున్
బాలశ్రేణు ల్రోమల వసింపన్
బసుల నొదిగి చనుపసగలప్రభువున్
జాలు గొల్వం జాలిన కోర్కుల్
సఫలము లగు నన సరసిజమమరున్
శ్రీలన్ బ్రహ్మవ్యాళవిరామ
స్ఫురదురుమతయనములు నననసలున్. ౧౧౦

1. "క్రమశుభమావ్యాయరీతిన్" అనియు సాధుపాఠము వ్రాతప్రతులలోఁ గలదు.

ఈ సరసిజవృత్తమునకుఁ బ్రతిపాదమునను 1, 5 అక్షరములకుఁ బ్రాసయతి యుండవలయు నని తోఁచుచున్నది. ఇం దట్లు కలదు. లక్షణమునఁ బ్రాసయతినియమము చెప్పఁబడకున్నను లక్ష్యమును బట్టి యూహింపనగును. ఈ ప్రాసము కాకతాళీయ మనుటకు వలను పడకున్నది. "చాపసహ్యశిష్యాపాలవదేన్యా" యని కావ్యాలంకార చూడామణియందును,

"మారాకారా చారుచరిత్రా మతయునవనప మహీయతి రచనన్
సారం బైనన్ సూరికవీంద్రుల్ సరసిజ మని వినఁ జదివిరి సభలన్"

అని కవిజనాశ్రయమందును ప్రాసయతి కానవచ్చుచున్నది. లక్షణ సారసంగ్రహమున "సారాజాహిస్ఫారయతుల్ మించ మతయననవన సల సరసిజమా" అని ప్రాసయతి వాడఁబడియున్నది. అప్పకవి మాత్రము ప్రాచీనులు ప్రాసయతి నుపయోగించినను లక్షణమునఁ జెప్పఁబడకుండుటచేఁ గాఁబోలు నది నియతము కాదని తలంచియుం డును. ఆతఁడు ప్రాసశూన్యముగనే యీవృత్తమును జూపెను. అనేకుల లక్షణపద్యములంబట్టి ప్రాస నియతమనియే తలంపనగును.

అంద "క్రౌంచపద" మను వృత్తము: (భ, మ, స, భ, న, న, న, య)
యతి 10, 8.

కాంచనభూషాసంచయ మొప్పన్
ఘనకుచభరమునఁ గవు నసియాడన్
జంచలనేత్ర ల్వంచనతోడన్
సముచితగతి వెను చని తనుఁ గొల్వన్
అంచితలీల న్మించినశౌరిన్
హరిదిభపరిమితయతు లొనఁగూడన్
ముంచి రచింపం గ్రౌంచపదం బి
మ్మొగి భమసభననముల నయ లొందున్. ౧౧౧

ఇందును 2, 7 అక్షరములకుఁ బ్రాసము కానవచ్చుచున్నది. కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణి లక్షణసారసంగ్రహములందును నిట్లే ప్రాసము కానవచ్చుచున్నది. అనేకగ్రంథములందుండుటచే నిదియు నియతమే యనఁదగును గాని కాకతాళీయముగాఁ బడిన దని భావింపఁదగదు. సంస్కృతమున లేకున్నను ద్వితీయాక్షర ప్రాసము తెనుఁగునఁ బ్రవేశించినట్లే యిట్టి ప్రాసవిశేషములు కొన్ని వృత్తములందు నియతము లగుట విరుద్ధము కాదు. అప్పకవి దీనికిని నిట్టిప్రాసము నుపయోగింపలేదు. రంగరాట్ఛందమునం దిట్టిగణముల తోడనే పంచశర మనుపేర వృత్తము కలదు.

ఇరువదియేనవ దగు నతికృతిచ్ఛందంబునందు "బంధుర" మను వృత్తము : (న, న, న, న, స, భ, భ, భ, గ.) యతి-15

ఋభువులు, దితితనయులుసమజులునై
యెంతయు మత్సరము ల్పెరయన్
రభస మలరఁ గలశనిధిఁ దఱవఁగం
గ్రక్కునఁ గవ్వపుఁగొండకు నీ
ప్రభు పనువుగఁ గుదురుగ నిలిచె ననం
బంచదశాక్షరవిశ్రమమై
ప్రభ మిగులఁగ ననననసభభభగల్
బంధురవృత్తము చెప్పఁదగున్. ౧౧౨

అంద "భాస్కరవిలసిత" మను వృత్తము : (భ, న, జ, య, భ, న, న, స, గ.) యతి-12

గోపనికరముల నేలినవానిన్
గోవృషదనుజుల నడఁచినవానిన్

గోపికలను భ్రమయించినవానిన్
గుబ్జకు విలసన మొసఁగినవానిన్
గోపకులము వెలయించినవానిక్
గొల్చెద మని బుధు లినయతిఁ బల్కన్
బ్రాపుగ ఘనజయభాశ్రితనాసల్
భాస్కరవిలసిత మగు గురుయుక్తిన్. ౧౧౩

ఇరువదియాఱవ దగు యుత్కృతిచ్ఛందంబునందు "భుజంగవిజృంభిత" మను వృత్తము : (మ, మ, త, న, న, న, ర, స, లగ.)
యతి-8, 10

స్వారాజారివ్రాతారాతీ శశితపనమయనయన
సర్వదా మునివందితా
గౌరీశాద్యామర్త్యస్తుత్యా కమలభవజనక మధు
కైటభాసురమర్దనా
శ్రీరామా హృత్స్వామీ యంచున్ జెలఁగి మమతననలఁ
జెంద రేఫసలుగా లగన్
[1]ఘోరాఘౌఘాభిద్వేషిం బేర్కొనఁగ వసుదశయతి య
గున్ భుజంగవిజృంభితన్. ౧౧౪

స్వారాజ=ఇంద్రుని యొక్క; అరివ్రాత = శత్రువులగు రాక్షసులగుంపునకు; అరాతీ=శత్రువయినవాఁడా; శశితపనమయనయనా= చంద్రసూర్యాత్మకనేత్రా ! (గౌరీశ+ఆద్య+అమర్త్య- అని పదవిభాగము.)

అందు "మంగళమహాశ్రీ" యను వృత్తము : (భ, జ, స, న, భ, జ, స, న, గగ.) యతి-8, 8

---

1. ఘోరాఘుద్వేషిం బ్రీతిన్ బేర్కొన- అని పాఠాంతరము.

చిత్తములఁ జూపులను జిత్తజనిలంఘ్రిపయిఁ
జెంది గజదంతియను లొందన్
వృత్తములతోడఁ దరుణీమణులు గానరుచి
నింపుచును మంగళమహాశ్రీ
వృత్తములఁ బాడిరి సువృత్తకుచకుంభముల
వింతజిగి యెంతయు దలిర్పన్
మత్తిలుచు నబ్బజనసంబు లిరుచోటులఁ ద
నర్పగఁ దదన్ గగ మెలర్పన్. ౧౧౪

గానరుచి నింపుచును- లేదా, నింపుగను- అనునది సరియగు పాఠములు. పూర్వపాఠము (రుచులింపుగను) సరిగాదు. యతిభ్రష్టము.

ఇవి సమవృత్తభేదములు.

వ. మఱియు నర్ధసమవృత్తవిషమవృత్తంబు లెట్టి వనిన, ౧౧౬

క. ధర నొకటియును, మూఁడును నగు
చరణంబులు మఱి ద్వితీయ చాతుర్థిక వి
స్ఫురితాంఘ్రులుఁ దమలోనను
సరియగు నర్ధసమవృత్తచయమునఁ గృష్ణా! ౧౧౭

అన్నిపాదములు నొక్కతీరున నుండువృత్తములు సమవృత్తములు- అనగా నొక్కఛందమునఁ బట్టిన యొక్కవృత్తమే యన్ని పాదముల నుండవలయు ననుట.

ఇట్టిసమవృత్తము లింతవఱకుఁ జెప్పఁబడెను. ఇఁక నర్ధసమవృత్తములం జెప్పును. వీనిలో సమపాదము లొకతీరునను, విషమపాదము లొకతీరునను నుండును. వీనిలో సగము సాదృశ్యమును, సగము భేదము నుండుటచే వీని నర్ధసమవృత్తము లని వ్యవహారిం

చిరి. లేదా పూర్వార్ధోత్తరార్ధములు సమము లగుటచే నర్ధసమ వృత్తము లనిరి.

విషమవృత్తములలోఁగూడ కొన్నిటికిఁ బూర్వార్ధ మొకతీరు నను, నుత్తరార్ధము వేఱొకతీరునను నుండును. మఱికొన్నిట నొక పాద మొకతీరునను, మిగిలినమూఁడుపాదములు వేఱొకతీరునను నుండును. ఇదిమొదలు బహురీతుల విషమవృత్తము లుండును. అట్టి వానిలోఁ గొన్ని భేదముల నింకఁ జూపును. అం దర్ధసమవృత్తములను రెండుపద్యములతో వివరించి పిమ్మట కేవలవిషమవృత్తములను వివ రించును.

అర్ధసమవృత్తచయమునన్ = అర్ధసమవృత్తసమూహమునందు; ద్వితీయ చాతుర్థిక విస్ఫురితాంఘ్రులు = రెండవదియు నాల్గవదియు నగుపాదములు, సరియగున్ = సమానము లగును.

ప్రథమ తృతీయ పాదము లొకతీరుగను, ద్వితీయ చతుర్థపాద ము లొకతీరుగను నర్ధసమవృత్తములం దుండు నని భావము. ఇట్లు చెప్పుటచే 1, 2 పాదము లొకతీరుగను, 3, 4 పాదము లొకతీరుగను నున్నవృత్తములను రెండేసిపాదములసామ్య మున్నను నర్ధసమ వృత్తము లని వ్యవహరింపరాదని భావము. ఈసందర్భమునుబట్టి యిందలియర్ధశబ్దమునకు పద్యపూర్వభాగము పద్యోత్తరభాగము ననియే తాత్పర్యము గాని పద్యములో సగభాగ మని యర్ధము కాదు. పద్యములోఁ బూర్వార్ధమున కుత్తరార్ధము తుల్యముగా నుండవలెను. అంతియేకాని ఏవియో రెండుపాదము లొకతీరునను మఱిరెండుపాదములు మఱియొకతీరునను నున్నంతమాత్రమున నర్ధ సమవృత్త మనఁబడదు. కనుకనే యర్ధసమవృత్తలక్షణమున 1, 3 పాదములును, 2, 4 పాదములు నొక్కతీరున నుండవలయు నని చెప్పఁబడెను.

కవిజనాశ్రయమునను నర్ధసమవృత్తలక్షణ మట్లే చెప్ప
బడెను. ౧౧౭

గీ. జరగు నందు స్వస్థానార్ధసమ మనంగ
ఛంద మొక టన నిట్టిలక్షణము దగుల
నమరు నట పరస్థానార్ధసమము నాఁగ
నెలమిఁ దరువాతిఛందంబు గలయఁ గృష్ణ! ౧౧౮

పూర్వపద్యమునం జెప్పఁబడిన యర్ధసమవృత్తములలో నన్ని
పాదములును నొక్కఛందమునకే సంబంధించిన వయినచో స్వస్థా
నార్ధసమవృత్త మనియు విషమపాదము లొకఛందమును సమపాద
ములు వేఱొకఛందము నయినచోఁ బరస్థానార్ధసమవృత్త మనియుఁ
జెప్పఁబడును, ౧౧౮

సీ. విషమవృత్తంబులు వెలయుఁ బాదంబుల
గణములు వేర్వేఱుగా నొనర్చ
నవియు స్వస్థానంబు నట పరస్థానంబు
సర్వపరస్థానసంజ్ఞకంబు
నొక్కఛందంబున నొగిఁ గొని పాదముల్
వేఱైన స్వస్థానవిషమ మయ్యె
నొకపాద మొక్కట నున్నపాదంబులు
క్రిందటిచందంబునందు నైన

గీ. మీఁదిచందంబునం దైన మెఱయఁ జెప్ప
నవి పరస్థానవిషమవృత్తాహ్వయములు
వెండి సర్వపరస్థానవిషమమునకు
నన్నియును జెప్ప ఛందంబు లబ్జనాభ! ౧౧౯

విషమవృత్తము లనఁగా పాదములు భిన్నలక్షణయుతము లగు వృత్తములు. అనఁగాఁ బూర్వార్ధోత్తరార్ధములకు సామ్యము లేక రెండురకములు కాని అంత కెక్కువరకములు గాని గలపాదంబులు గల వృత్తములు విషమవృత్తములని భావము. "పాదంబుల గణములు వేఱువేఱుగా నొనర్ప విషమవృత్తంబులు వెలయున్ అని యన్వయము,

అవియున్ = ఆవిషమవృత్తములును; ఆవిషమవృత్తములు స్వస్థానవిషమవృత్తము, పరస్థానవిషమవృత్తము, సర్వపరస్థానవిషమ వృత్తము నను మూఁడు భేదములతోఁ గూడియుండును.

ఒక్కఛందంబున్ + అ = ఒక్కఛందంబున = ఒక్కఛందమునే; ఒగిఁ గొని = వరుసగా గ్రహించి; ఛందము = ఛందస్సు.

ఒక్కఛందమునే గ్రహించి పాదములుమాత్రము భిన్నభిన్న లక్షణయుక్తములు గావించినచో నవి స్వస్థానవిషమవృత్తము లగును. ఒకటన్ = ఒక్కఛందంబునందును: ఉన్నపాదంబులు = శేషించిన పాదములు; క్రిందటిచందంబునందైన మీఁదిచందంబునందైనన్ = ఆ ఛందమునకుఁ బూర్వపుఛందమునంగాని తర్వాతిఛందమునందుగాని; మెఱయఁజెప్పన్ = ప్రకాశించునట్లు చెప్పఁగా; అవి = అట్టివి; పరస్థా... వ్యాయములు = పరస్థానవిషమవృత్తము లనుపేరుగలవి.

ఒకపాదము నొకఛందమునం జెప్పి మిగిలినపాదము లన్నియును వేఱొక్కఛందమునం జెప్పినచో నవి పరస్థానవిషమవృత్తము లనఁబడును.

వెండి = మఱియు; సర్వపరస్థానవిషమమునకు = సర్వపరస్థాన విషమ మనువృత్తమునకు; అన్నియును = అన్నిపాదములును; ఛందంబులు = భిన్నభిన్నఛందములు; చెప్పన్ = చెప్పఁగా; అగును.

లేదా, "చెప్ప" అనుమాటకు వివిధములు అనునర్థమును గొన్ని చోట్లవాడుకలో నున్నది. ఆపక్షమున "చెప్ప ఛందములు= వివిధఛందంబులు" అని యర్థ మగును. సర్వపరస్థానవిషమవృత్తమున నన్నిపాదములును వేర్వేఱుఛందముల నుండు నని భావము.

సర్వపరస్థానవిషమవృత్తములకు నాల్గుపాదములును నాల్గు ఛందస్సులలో నుండును.

సమవృత్తములు- ఏకవిధములు, అర్ధసమవృత్తములు- స్వస్థానార్ధసమవృత్తములు పరస్థానార్ధసమవృత్తములు నని రెండువిధములు. విషమవృత్తములును- స్వస్థానవిషమవృత్తములును బరస్థానవిషమవృత్తములును సర్వపరస్థానవిషమవృత్తములు ననిమూఁడు విధములు.

ఇట్టివిభాగ మిందుఁ జూపఁబడినను విషమవృత్తములలో నాల్గుపాదములును మూఁడుఛందములలో నున్నవృత్తములుకూడ నొకతెగకుఁజెందినవి యుండును. అట్టివాని నుదాహరింపకపోయినను నొకతెగలోఁ జేర్పఁదగును. అట్టిదాని నేలనో యప్పకవియు నుదాహరింపలేదు.

స్వస్థానార్ధసమవృత్తములలో "నారీప్లుత" మను వృత్తము: (మ, త, త, గ, గ- త, త, జ, గ, గ.)

క్షీరోదన్వన్మధ్యగేహా మతాగా
పారంబు నుద్వృత్తతజ గ్లగంబున్
బూరింపంగాఁ బాదముల్ రెంట రెంటన్
నారీప్లుతం బయ్యె ననంతమూర్తీ ! ౧౨౦

ఇందు బేసిపాదములు రెండు నొకతీరుగను సరిపాదములు రెండు నొకతీరునను నున్నవి. అన్నిపాదములు నొక్కపదునొకండవ ఛందముననే పుట్టినవి. కావున నిది స్వస్థానార్ధసమవృత్త మయ్యెను.

పరస్థానార్ధసమవృత్తంబులలో "మనోహర" మనువృత్తము :

క్ష్మారాజ రమేశ తజావము లు
ద్ధుర మైన సకారచతుష్కముతోఁ
గూరంగ సగంబులు గూడి మనో
హరవృత్తము చెల్వగు నద్రిధరా! ౧౨౧

ఇందు బేసిపాదములు రెండును "తజజలగ" ములతోఁ గూడి 11 వ ఛందమునకుఁ జెందియున్నవి. సరిపాదములు ససససగణములతోఁ గూడి 12 వ ఛందమునకుఁ జెందియున్నవి. కనుక నిది పరస్థానార్ధసమవృత్తము.

కూరంగ=కూడఁగా; అద్రిధరా !=గోవర్ధనమును ధరించినవాఁడా ! ౧౨౧

స్వస్థానవిషమవృత్తములం "దంగజాస్త్ర" మను వృత్తము.

భూరిభమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్ధంబై యట సామున్
శౌరీ వి న్మసజంబు గాంతమై
యారూఢం బగు నంగజాస్త్రమున్. ౧౨౨

ద్వివిధము లగునర్ధసమవృత్తముల నుదాహరించినపిమ్మట విషమవృత్తోదాహరణము లారంభించుచు నంగజాస్త్ర మను వృత్తమును జూపెను. ఇందుఁ బ్రథమ ద్వితీయపాదములందు "భమస" గణములు నొక్కగురువును నుండును. తృతీయ చతుర్థపాదములందు మస జగణములు నొక్కగురువు నుండును. 6 వ యక్షరము యతిస్థానము.

ఇందుఁ బూర్వార్ధ మొకతీరుగను నుత్తరార్ధము వేఱొకతీరుగను నుండుటచే విషమవృత్త మయ్యెను. అన్నిపాదములు నొక్క పదియవఛందముననే జన్మించిన వగుటచే స్వస్థానవిషమవృత్త

మయ్యెను. ఇందుఁ బూర్వోత్తరార్ధములకుఁ బరస్పరసాదృశ్యము లేనందున నర్ధసమవృత్తములలోఁ జేరక విషమవృత్తములలోఁ బరిగణింపఁబడెను. కవిజనాశ్రయమునను నర్ధసమవృత్తములకుఁ బూర్వోత్తరార్ధసాదృశ్య ముండవలయు ననియే చెప్పఁబడెను.

ఆది ద్వితీయ విలస
త్పాదంబులు వేఱువేఱుభంగుల నిడి యా
పాదములఁ బోలఁ దక్కిన
పాదము లర్ధసమవృత్తపద్ధతి నొప్పున్.

(కవిజనాశ్రయము. వృత్తాధికారము– 133 పద్యము.)

కవిజనాశ్రయకర్త విషమవృత్తములను వివరింపలేదు. ౧౨౨

అందు "వరాంగి" యను వృత్తము :

సరిత్పదాబ్జా జతజల్ గగల్ బం
ధురం బగున్ రెంటఁ జతుర్థకాంఘ్రిన్
గారాముతోఁ దాజగగల్ వరాంగిఁ
హరార్చితా మూఁడవయంఘ్రి నొందున్. ౧౨౩

సరిత్పదాబ్జా ! = పాదపద్మమున గంగానది గలవాఁడా ! రెంటన్=రెండుపాదములయందును=ప్రథమద్వితీయపాదములందును; చతుర్థకాంఘ్రిన్=నాల్గవపాదమునను.

మూఁడవపాదమున "తతజగగ" లును మిగిలిన మూఁడుపాదములందును "జతజగగ" లును ఉండి 8 వ యక్షరము యతిస్థానమయినచో వరాంగి యనువృత్త మగును.

ఇందు 3 వ పాద మొకతీరునను 1, 2, 4 పాదములు వేఱొకతీరునను నుండుటచే విషమవృత్త మయ్యెను. అన్నిపాదములును 11 వ ఛందముననే పుట్టిన వగుటచే స్వస్థానవిషమవృత్త మయ్యెను.

రెంటన్, జతుర్థకాంఘ్రిన్ జతజల్ గగల్ బంధురం బగున్-తొజగగల్ మూఁడవయంఘ్రి నొందున్- అని యన్వయము, ౧౨౩

అందు "నదీప్రఘోష" యను వృత్తము :

**నాగతల్పా! మొద ల్నాల్గురేఫంబులున్**
**జగన్నివాసా! జతజంబు రేఫమున్**
**దగంగ నమ్మూఁడుపదంబులందు జా**
**తిగాఁ బ్రవర్తించు నదీప్రఘోషకున్. ౧౨౪**

మొదలు=మొదటిపాదమునందు; సప్తమ్యర్థమునఁ బ్రథమ. నదీప్రఘోషకున్=నదీప్రఘోష యనువృత్తమునకున్; అమ్మూఁడు పదంబులందు=ఆమిగిలిన 3 పాదములందును 2, 3, 4 పాదములందు; జాతిగాన్=సర్వసామాన్యముగా; ఈవృత్తముల నన్నింటను నని భావము.

మొదటిపాదమున నాల్గురగణములును మిగిలినమూఁడుపాదములందున "జ త జ ర" గణములు నుండును. ఒకపాద మొకతీరు నను మిగిలినమూఁడుపాదములు మఱియొకతీరునను నుండుటచే విషమ వృత్త మయ్యెను. అన్నిపాదములును 12 వ ఛందమునఁ బుట్టినవే యగుటచే నిది స్వస్థానవిషమ వృత్తము. ౧౨౫

పరస్థానవిషమవృత్తములందు "శ్రీరమణ" మను వృత్తము :

**ధాత్రి భమంబుల్ తత్సగ మాదిన్**
**ఛత్రయగాగణపద్ధతి మూఁటన్**
**గోత్రధరా! యిటుఁ గూర్చ పదంబుల్**
**చిత్రగతిం జను శ్రీరమణంబుల్. ౧౨౬**

ఆదిన్=మొదటిపాదమున; భమంబుల్ = భగణమగణములును; తత్సగము=ఆసగణగురువులును; (తచ్ఛబ్దము ప్రసిద్ధార్థకము).

మూఁటన్=మిగిలిన 3 పాదములందున; భత్రయగాగణపద్ధతి=భగణములు మూఁడును రెండు గురువులు ననుపద్ధతిని; ఇటు=ఇట్లు; శ్రీరమణములు=శ్రీరమణవృత్తములు; చిత్రగతిన్ = విచిత్రమగురీతున; చనున్=నడచును.

ఇందు మొదటిపాదము పదియవఛందమునకును మిగిలిన మూఁడుపాదములును బదునొకండవఛందమునకును జెందుటచే నిది పరస్థానవిషమవృత్త మయ్యెను. ౧౨౪

అంద "రథగమనమనోహర" మను వృత్తము :

రథగమనమనోహరంబు రెండవంఘ్రిన్
బ్రథితం బగున్ సజజంబు రప్రయుక్తయంబున్
బ్రథమపదమునందుఁ బైపగంబునందున్
గధితననరజంబు గద్వయంబుఁ గృష్ణా ! ౧౨౮

రెండవ+అంఘ్రిన్=రెండవంఘ్రిన్- రెండవపాదమున; రప్రయుక్తయంబున్ = రగణముతోఁ గూడినయగణము; ప్రథమపదమునందుఁ బైపగంబునందున్=మొదటిపాదంబునందును నుత్తరార్థమునందును.

ఈవృత్తమునకు 1, 3, 4 పాదములందు ననరజగగములును 2 వ పాదమున "సజజరయ" గణములు నుండు నని భావము. ఇదియుఁ బరస్థానవిషమవృత్తమే.

ఇంతకుమున్ను స్వస్థానవిషమవృత్తములలో మూఁడువిధములగువృత్తముల నుదాహరించి పరస్థానవిషమవృత్తముల నీపద్యమును దీనిపూర్వపద్యమునను నుదాహరించెను. ఇందు రెండవపాదము 15 వ ఛందమునకును మిగిలినపాదములు 14 వ ఛందమునకును సంబంధించుటచే నిది పరస్థానవిషమవృత్త మయ్యెను. ౧౨౮

సర్వపరస్థానవిషమవృత్తులందు "పీణారచన" మను వృత్తము :

పీణారచనం బయ్యె భువిన్ తయసాగల్
బాణప్రహరా తజసభభవ్యగగంబుల్
బాణారహరా తజనభసప్రకటయతిన్
వేణుధరభననజనగవిశ్రుత మగుచున్. ౧౨౩

ప్రకటయతిన్=ఈపద్యమునం బ్రసిద్ధ మయినయతితో.

ఈపద్యమున నాల్గుపాదములును నాల్గువృత్తములకు సంబంధించినవి. అందు మొదటిపాదమున "తయసగ" లు. 13 వ ఛందము. 9 వది యతిస్థానము. రెండవపాదమున "తజనభగగ" గణములు. 14 వ ఛందము. 10 వ అక్షరము యతిస్థానము. మూఁడవపాదమున "తజనభస" గణములు. 15 వ ఛందము. 10 వ అక్షరము యతిస్థానము. నాల్గవపాదమున "భననజనగ" గణములు; 16 వ ఛందము. 11 వ అక్షరము యతిస్థానము.

ఈపద్యమున నాల్గవపాదము సవరింపఁబడెను. పూర్వపాఠమున 15 అక్షరములుమాత్రమే యున్నవి. ఇది సర్వపరస్థానవృత్తము కనుక 3 వ పాదమున నున్న 15 సంఖ్యకంటె భిన్నసంఖ్య గలయక్షరములతో నీపాద ముండవలయును. అప్పకవీయము ననుసరించి యిందలి "భస" అనుదానికిబదులు "జనగ" అని దిద్దఁబడెను. వ్రాతప్రతియందునునిట్లేగలదు. లక్షణసారసంగ్రహమునను నిట్టిలక్షణమే కన్పట్టుచున్నది. కవిజనాశ్రయమునఁ గొన్నిపుస్తకములలో నిది కానరాదు. కొన్నిపుస్తకములలో నున్నను నన్నిపాదములందును దీనికయ్యది భిన్నమే. కావ్యాలంకారచూడామణియందును సర్వపాదములును నీలక్షణమునకు సరిపడనివే.

విచిత్రాంగుగాక సమవృత్తంబులలోఁ "బంచపాది" యను వృత్తము:

క. పాదచతుర్వృత్తమ్మున
నాదరమునఁ బంచపాది యనుసమవృత్తం
బైదవపదంబు గలిగిన
మాదయితా! కృతులయందు మహనీయ మగున్ ౧౨౨

మాదయితా=లక్ష్మీపతీ ! పాదచతుర్వృత్తంబునన్ = నాల్గు పాదములు గలవృత్తమున; ఐదవపదంబు గలిగినన్ = అయిదవపాదమును జేర్చినచో.

సామాన్యముగఁ బద్యములు నాల్గుపాదములతో నుండును. అట్టియెడ నింకొకపాదమును జేర్చినచోఁ బంచపాది యని చెప్పఁబడును, ఈవృత్తము సమవృత్తములలోనిదే యగును. అట్లనుటచే విషమవృత్తములలో నాల్గుపాదములకంటె నధికపాదములు సమ్మతములు కావన్నట్లు తోఁచుచున్నది. సమ, అర్ధసమ, విషమవృత్తములను వరుసగా వివరించి, మరల సమవృత్తములలోని విశేషాంశములను జెప్పుట కారంభించుచు ముందుగా నీపంచపాదివృత్తమును జెప్పెను.

శ్రీసతిఁ బేరురంబున ధ
రించినభోగి, చతుర్ముఖుండు, నా
భీసరసీరుహంబునకు
బిడ్డఁడుగా విలసిల్లుమేటి, కై
లాసనగాలయుండు జడ
లన్ సవరించినయేటిపుట్టినిల్
భాసురపాదపద్మ మగు
బల్లిదుఁ డీ, విభుఁ డంచు సన్నుతుల్
సేసిరి సన్మునీంద్రు లనఁ
జెన్నగు వృత్తము పంచపాదియై. ౧౨౩

విశాలవక్షస్స్థలమున లక్ష్మియు నాభిపద్మమున బ్రహ్మదేవుఁడు కుమారుఁడుగను ఈశ్వరునిజటలయందు నివసించుగంగానదికిఁ బుట్టిన యిల్లగుపాదపద్మమును గలవిష్ణువు అనిభావము.

ఉత్పలమాలావృత్తము సమచతుష్పాదవృత్తము. దీని కయిదవ పాదమునుగూడఁ జేర్చుటచేఁ బూర్వపద్యోక్తపంచపాదివృత్తమున కిది యుదాహరణ మయ్యెను. ౧౨౯

పరగఁగ నిరువదియాఱ
క్షరములకును నధిక మగుచుఁ జరణంబుల ను
ద్ధరమాలావృత్తంబులు
జరగు లయగ్రాహి మొదలు జలరుహనాభా! ౧౩౦

ఇంతవఱకును నిరువదియాఱుఛందములందు జన్మించినవృత్తములను వివరించి యింక నంతకుఁబైఁబడిన యక్షరములు గలపాదములతో నుండువృత్తముల నుద్ధరమాలావృత్తము లని వ్యవహరింతు రని యిందు వచించెను.

ఇవియును సమవృత్తములే. ౧౩౦

ఏకోనచత్వారింశన్మాత్రాగర్భితంబుఁ ద్రింశదక్షరంబు నైన "లయగ్రాహి" (భజసనభజసనభయ.)

ఎందు నిల వేజనులకుం దలఁపరానితప
మందికొని చేసి రొకొ నందుఁడు యశోదా
సుందరియుఁ బూర్ణనిధి నొందినటు లొందిరి గ
డుం దడసి యొప్పుతఱి నందనునిగా శ్రీ
మందిరుని నంచు నిటు లందముగఁ బ్రాసములు
గ్రందుకొని చెప్పు మునిబృందము లయగ్రా

**హిం దనర నబ్బుజసలుం దగ నకారముమ**
**బొందు నిరుచోట్లను బిఱుంద భయ లొందన్.**

లయగ్రాహివృత్తమున ముప్పదియక్షరములును ముప్పది తొమ్మిదిమాత్రలును గలపాదము లుండును. ప్రతిపాదమునను భజ సనభజసనభయగణము లుండును. పాదమున నెన్మిదేసియక్షరముల కొక్కటిచొప్పున మూఁడు ప్రాసయతులును బద్యమంతట నొక్క-టియ ప్రాసాక్షరమును నుండవలయును. యతినియమము లేదు. ఈ లక్షణపద్యమే లయగ్రాహి కుదాహరణము నగును. ఇందుఁగల మాత్రాసంఖ్యఁ జెప్పినను నిది మాత్రాగణనిబద్ధము కాదు. అక్షర గణనిబద్ధమే. కనుకనే యిది జాతులలోఁ జేరక వృత్తములలోనే చేరి యున్నది. ఇట్లే లయవిభాతి, లయహారి, త్రిభంగియు నుద్ధరమాలా వృత్తములలోనివే యగును. వీనిని మాలికావృత్తము లనియు, మాలా వృత్తము లనియుఁగూడ వ్యవహరింతురు. ౧౩౧

ఏకోనచత్వారింశన్మాత్రాగర్భితపాదంబును జతుస్త్రింశదక్షరంబును నయిన "లయవిభాతి." (నసననసననసననసగ)

**పడయరె తనూభవులఁ బడయుదురు గాక పెర**
**పడఁతులును భర్తలును బడసిరె తలంపన్**
**బుడమి నల నందుఁడును బడఁతుక యశోదయును**
**గడుపున జగత్త్రియము నిడికొనినపుత్త్రిన్**
**బడసిరఁట యంచు బెడఁ గడరు నసనత్రివృతి**
**గడనసగముల్ పొసఁగ నిడ లయవిభాతిన్**
**నొడువుదురు సత్కవు లెపుడును విరితేనియలు**
**వడియుపగిదిన్ రసము కడలుకొనుచుండన్.**

లయవిభాతి యనువృత్తమునకు ముప్పదినాల్గక్షరములును ముప్పదితొమ్మిదిమాత్రలును గలపాదము లుండును. పదేసియక్షరములకుఁ బ్రతిపాదమునను మూఁడు ప్రాసయతు లుండును. ప్రాసము (సామాన్యప్రాస) నుండును. ననన త్రివృతి=నసనగణముల మూఁడావృత్తులు. అనఁగా "నసననసనసనసన" గణములును బిమ్మట సగణగురువులును పాదమున నుండును. ఈపద్యమే దీని కుదాహరణము నగును. తొమ్మిదేసియక్షరములకుఁ బ్రాసయతియు సామాన్యప్రాసమును నుండును. యతినియమము లేదు.

ఏకోనచత్వారింశన్మాత్రాగర్భిత పాదంబును సప్తత్రింశదక్షరంబు నయిన "లయహారి" యను వృత్తము.

(న న న న న న న న న న న స గ)

చదువులును గిదువులును జదువ ధన మొదవు నని
మదిఁ దలఁపవలదు మును చదివిరె ధరిత్రిన్
సదమలినహృదయుఁ డనఁ బొదలుదితిసుతసుతుఁడు
మొదలఁ బలికినపలుకుఁ జదువఁగ ముకుందుం
డద నెఱిఁగి కదిసెఁగద చదివినభృగువుకొడుకు
చదువు తుది నొకపనికి నొదవెనె యటంచున్
బదునొకఁడు నగణములు గదిసి సగ మెనయ భువి
విదితముగ బుధులు పలుకుదురు లయహారిన్. ౧౩౩

సదమలినహృదయుఁడు = యోగ్యమును నిర్మలమును నగు హృదయము గలవాఁడు. ఇట "సదయఘనహృదయుఁడు" అను పాఠము సరసమే. "సదయ=దయతోఁగూడిన; ఘన=గొప్పదియగు; హృదయుఁడు=మనసుగలవాఁడు" అని యాపక్షమున నర్థము. దితిసుతసుతుఁడు=ప్రహ్లాదుఁడు; అదను= సమయము; భృగువుకొడుకు=

శుక్రాచార్యుఁడు; (ప్రహ్లాదునికి శుక్రాచార్యుని లేదా శుక్రపుత్రుల యుపదేశములు నిరర్థకము లయ్యె నని యిట భావ మనుసంధేయము.)

ఈవృత్తమున 37 అక్షరములును 39 మాత్రలును గలిగినపాద ము లుండును. పదేసియక్షరముల కొక్కటిచొప్పున 3 ప్రాసయతు లుండును. 11 నగణములును సగణముఁ గురువుఁ బ్రతిపాదమున నుం డును. యతి లేదు. సామాన్యప్రాసమును గలదు. ౧౩౩

ద్విచత్వారింశన్మాత్రాగర్భితంబును జతుస్త్రింశ దక్షరంబు నయిన "త్రిభంగి" యను వృత్తము. (ననననననససభమసగ).

ననననననససలును భమసగలును
దనరి నటింపఁ గణంకన్ నలువంకం బెంపు దొలంకన్
మునుకొని నఖముఖమున వెడఁ గదలుపఁ
జనుఁ గడు నొప్పగువీణల్ నెఱజాణల్ వేలుపుగాణల్
వనరుహజనితుని తనయులు మొదలుగ
ఘనమతు లాదటతోడన్ శ్రుతిగూడన్ వెన్నునిఁబాడన్
వినఁగలిగిన నది జననము ఫల మని
మునిజనులిందుకుఖాంగున్ దగుభంగిన్ జెప్పఁద్రిభంగిన్,

జాణలు=నేర్పరులు; గాణలు=గాయకులు; ఆదటతోడన్= ప్రేమముతో; వెడన్=ఇంచుక; కణంకన్=ప్రయత్నముతో

త్రిభంగి యనువృత్తమునకు ముప్పదినాల్గక్షరములును నలువది రెండుమాత్రలును గలిగి ఆఱునగణములును బిమ్మట రెండుసగణము లును "భమసగ"లును గలిగి నాల్గు పాదము లుండును. 1, 9, 17 వర్ణములు ప్రాసయతిస్థానములును 25, 29, 34 అక్షరము లంత్యప్రాస స్థానములును నగును. యతి యుండదు. ఈలక్షణపద్యమే యుదా హరణము.

అప్పకవీయమున దీనిలక్షణమునఁ బ్రమాద మున్నను దదు దాహరణపద్యముంబట్టి యందలి గణములు మీఁదఁజెప్పఁబడినవే యగుట నిశ్చయము. పాఠభేదములతో దీనిలక్షణము నుదాహరణము లును వేఱువిధముగాఁ గానవచ్చుచున్నను నప్పకవీయాదీతరచ్ఛందో గ్రంథములంబట్టి దీనికి సరియగులక్షణ మిందుఁ జెప్పఁబడినదే యని గ్రహింపనగును. యతిప్రాసములవిషయ మిందు వివరింపఁబడలేదు. కొన్నిగ్రంథములందు యతి యుండదనియుఁ బ్రాసము లుండుననియు మాత్రము చెప్పఁబడెను. ప్రాసస్థానము లుదాహరణములఁబట్టి యూహ్యములు. 3 ప్రాసయతులును 3 అంత్యప్రాసములును నుండుట చేతనే కాఁబోలును దీని కీపేరు కల్గెను.

అంద అనియతాక్షరం బయిన దండకము.

సిరి నేలురసికుండు శ్రీవత్సవక్షుండు నీరేరుహాక్షుండు నిత్యా సదృక్షుండు త్రైలోక్యసంరక్షణోపాయదక్షుండు మాపాలిదేవుండు ధీరుం డుదారుం డితం డిచ్చు మాయిచ్చకు న్వచ్చుసౌఖ్యమ్ము లంచు న్మదిం గోరి పెద్దల్ సకారంబుతో సంగతం బై నహాంబాది నొండేఁ దకారాదిగా నైన లో నెల్లచోటన్ దకారంబులన్ బెల్లు చెందన్ గకారావసానంబు నై దండకాకార మేపారఁ గీర్తింతు రెల్లప్పుడున్.

అంద=ఆ మాలావృత్తములయం దే.

ఇన్నియక్షరము లుండవలయు నను నియమములేని దండక మనఁబడువృత్తవిశేషమును లక్షణోదాహరణములతో నిందు వివరిం చెను. దండకమున కాదిని 'సగణము' గాని "నగణగురులఘువులు" గాని యుండవలయును. తరువాత నన్నియుఁ దగణములు నంతమున గురు వొక్కటియు నుండవలయును. దండకాదిని స, నహ గణము లకు బదులు తగణమును నుండవచ్చును. దండకమునకుఁ బాదనియ

మము లేకున్నను గణనియమ ముండుటచే గద్యములం జేరక వృత్త జాతికే చెందెను.

దండకములకుంగూడ 999 అక్షరములు పరమావధి యని కొన్నిచోట్లం జెప్పంబడినను నట్టినియమము కవు లనుసరింపకపోవుట చేంగాంబోలు ననంతుండును నట్టినియమముం జేయలేదు.

దండకమునను బాదనియమ మున్నట్లును చండవృష్టిప్రయాతము, అర్ణము, అర్ణవము, వ్యాళము, జీమూతము మున్నగుపేర్లతో బహువిధము లగువానిని సంస్కృతఛందోగ్రంథములు చెప్పియున్నవి. దండమువలె నవిచ్ఛిన్నముగా నుండునుగావున దీనిని దండక మని వ్యవహరించిరి.

అప్పకవి హగణముకాని నగణముకాని సగణముకాని ముందుగాం గూర్చి తగణములతోం దుదిదాంక చెప్పంబడునవి దండకము లని చెప్పెను. ౧౩౫

గద్యము : ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య తనుసంభవ సుకవిజనవిధేయానంతనామధేయప్రణీతం బైన ఛందోదర్పణంబునందు నుభయభాషానురూపంబు లగుగద్య పద్యంబులవిధంబును, షడ్వింశచ్ఛందోనామంబులును, దదుద్భవంబు లగుసమవృత్తంబులును, వృత్తమిశ్రంబు లగు నర్ధసమవిషమవృత్తంబులును, ఛందోఽతిరిక్తంబు లగు మాలావృత్తంబులును దద్భేదం బగు దండకంబు నన్నది ద్వితీయాశ్వాసము.

ద్వితీయాశ్వాసము సంపూర్ణము.



శ్రీః

# ఛందోదర్పణము

## తృతీయాశ్వాసము

శ్రీమదనంతశయన ! భవ
భీమదహనసిఖిలహరణభీషణవర్ష్మా !
సామజభీతినివారణ !
కామజనక ! శిష్టలోకకామితవరదా ! ౧

శ్రీమ... యన=శోభావంత మగు ననంతుఁ డనుశయ్యగల వాఁడా ! భవభీమదహన=సంసార మను భయంకరవహ్నియొక్క; నిఖిలహరణ=సంపూర్ణముగా నశింపఁజేయుటయందు; భీషణవర్ష్మా= భయంకరమగు వర్ష మయినవాఁడా ! సామ...వారణ=గజేంద్రుని భయమును బోఁగొట్టినవాఁడా !; శిష్టలోకకామితవరదా=సజ్జనుల కోర్కుల నిచ్చువాఁడా !

### కందములు

క. నలగగభజసలు కందం
బుల మూఁడును నైదు, షష్ఠముల నలజలు, బే
సుల జగణరహిత, మంత్యగ
మలఘుపదత్రిగణవిరతి, యర్థముల హరీ ! ౨

కందంబులన్=కందపద్యములందు; అర్థములన్=పద్యమునం దలి ప్రతియర్థభాగమునను, నలగగభజసలు = నల, గగ, భ, జ, స

గణములలో నేవేని; మూఁడును నైదు=బేసి పాదములందు మూఁడు గణములును సరిపాదములం దయిదుగణములును (ఉండవలయును.) షష్ఠములన్=ఆఱవస్థానములందు; నలజలు=నలము గాని జగణము కాని (ఉండును.) బేసులన్ = విషమగణస్థానములందు; జగణరహితము=జగణ ముండరాదు. అంత్యగము=అంతమున గురువుగల దగును. అలఘుపదత్రిగణవిరతి=పెద్దపాదములందు, అనఁగా సరిపాదములందు మూఁడుగణములపిమ్మట ననఁగా నాల్గవగణము నారంభమున యతి యుండును.

కందపద్యమునకుఁ బూర్వార్ధ మెట్లుండునో యుత్తరార్ధమును నట్లే యుండును. కావునఁ గందపద్యములందలి యర్ధభాగములకు లక్షణముం జెప్పెను. అనఁగాఁ గందపద్యార్ధమున మొదటిపాదమునకు మూఁడుగణములును రెండవపాదమున నైదుగణములును ఉండును. ఆ గణములు "నల, గగ, భ, జ, స" లను నయిదు చతుర్మాత్రగణములలో నేవేని యయియుండవలయును. ఆఱవగణమనఁగా రెండవపాదమున మూఁడవగణము నలము కాని జగణము గాని యయియుండవలయును. బేసిగణములు జగణములు కారాదు. అర్ధభాగము నంత్యాక్షరము గురువు కావలయును. పెద్దపాదమునందలి మొదటియక్షరమునకును నాల్గవగణము నాద్యక్షరమునకును యతి యుండవలయును అని భావము.

గీ. కంద మరయ నార్యాగీతి, కడగణంబు
నపరషష్ఠంబు, గురు లఘు లైన నార్య
నలఘు లాఱింట గిరిశరస్థలుల నున్న
నగు ద్వితీయప్రధానలఘ్వాదియతులు. 3

కంద మరయ నార్యాగీతి=ఆలోచింపఁగాఁ గందపద్య మార్యాగీతి యనఁబడు పద్యభేదమే యగును. కడగణంబును=కందపద్యము

నంత్యగణమును, అపరషష్ఠంబు=ఉత్తరార్ధమునందలి యాఱవగణ మును; వరుసగా గురులఘులయినన్=గురువును నొక్కలఘువును నయ్యేనేని; ఆర్య=కందపద్యమే యార్యాపద్య మగును. ఆటెంటన్= ఆర్యయందలి యాఱవస్థానమునందును; గిరిశరస్థలులన్ = సప్తమ పంచమ స్థానములందును; నలఘులు=నలములు; ఉన్నన్=ఉన్నచో; ద్వితీయ ప్రధాన ఘ్వాదియతులు=రెండవలఘువునందును మొదటి లఘువునందును; ఆది=మొదటిలఘువునకుఁ బూర్వభాగమునందును; యతులు=విచ్ఛేదములు; అగున్=ఉండును.

ఆలోచింపఁగాఁ గందపద్య మార్యాగీతి యనఁబడుపద్యభేదమే యగును. ఇందలి యెనిమిదవగణము నొక్కగురువుగాను నుత్తరా ర్ధమునందలి యాఱవగణము నొక్క లఘువుగాను మార్చినచో నార్యాపద్య మగును. అనఁగా నార్యాగీతియొక్క చివరిగణమును నుత్తరార్ధమునందలి యాఱవగణమును వరుసగా గురులఘువులుగా మార్చినచో నార్యాపద్య మగు నని భావము. కందపద్యము సాక్షా త్తుగా నార్యాగీతియు, నించుకమార్చినచో నార్యయు నగు నని భావము.

ఈ యార్యాపూర్వార్ధమున నాఱవగణము నల మయినచో రెండవలఘువునకుఁ బూర్వమునను నేడవస్థానమున నల మున్నచో మొదటిలఘువునకుఁ బూర్వమునను నయిదవస్థలమున (ఉత్తరార్ధ మున) నల మున్నచో మొదటిలఘువునకుఁ బూర్వమునను యతి యుండవలయు ననియు భావము.

అయిదవస్థానమున నల మున్నచో మొదటిలఘువునకుఁ బూర్వభాగమున యతి యుండవలయు నను నియమ ముత్తరార్ధము నకుమాత్రమే యనియు మిగిలిన రెండునలములలఘువులయతులు పూర్వార్ధమునకే యనియుఁ దెలియవలయును. ఆవిషయము పద్య

మున సూచింపఁబడలేదు. సంస్కృతచ్ఛందములంబట్టి యూహింప నగును.

ఈయార్యాపద్యయతినియమములు సంస్కృతచ్ఛందమునందే వర్తించు ననియుఁ దెనుఁగునకు వర్తింప వనియుఁ దెలిసికొనవల యును. కనుకనే తెలుఁగునకు యతు లెట్లుండునో యనంతరపద్యమున వివరించుచున్నాఁడు.

కందమే యార్యాగీతి యని యిట స్థూలముగాఁ జెప్పఁబడెను. సూక్ష్మదృష్టితోఁ జూచినచోఁ జిన్నభేదము గలదు. ఆర్యాగీతికి సమపాదాంతములందు రెండుగురువు లుండును. కందమునను రెండు గురువు లుండవచ్చును గాని సగణముగూడ నుండవచ్చును. మాత్రా సంఖ్య సరిపోయినను నిట్టియల్పభేదము గలదు. ఈభేదమునుబట్టి యార్యాగీతి కంద మగుట కాటంకము లేదు. కాని కందములెల్ల నార్యాగీతు లగుటకు వలనుకాదు. ఇంతియకాక యార్యాగీతియందుఁ గొన్నియతినియమములు గలవు. అవి కందమునం బాటింపఁబడవు. అందుచేఁగూడఁ గంద మార్యాగీతి యగుట కుదురదు. కాని తెనుఁ గున నార్యాగీతి కీయతినియమము లేనందునఁ గందము కావచ్చును. ఆర్యాగీతి కంద మగుట కభ్యంతరము లేదు. ఆర్యాగీతిలక్షణము వ్యాపకము; కందలక్షణము వ్యాప్యము నగు నని గుఱుతింపనగును.

**వ. ఈచెప్పిన యతినియమంబులు సంస్కృతార్యాదుల కయ్యె మఱియుఁ దెలుఁగున కెట్లనిన. ౪**

**క. వడి యగు నార్యకు రెండవ**
**యడుగునఁ ద్రిగణంబుమీఁద నంధ్రకవితకున్**
**గడపటిపాదమునకు వడి**
**యడరును ద్విగణయుతలఘువు కవ్వలిచోటన్.**

తెనుఁగున నార్యకు రెండవపాదమున మూఁడుగణముల తర్వాత యతి వర్తించును. నాల్గవపాదమున రెండుగణములును మూఁడవగణముస్థానమున నున్నలఘువును దాఁటినపిమ్మట యతి చెల్లును. ఇది తెనుఁగున నార్యాపద్యమునకు యతినిర్ణయము.

ఆర్యాపద్యమున నుత్తరార్ధమున నాఱవగణముగా నొక్క లఘువుమాత్రమే యుండును. కావున రెండుగణములును నొక్క లఘువును దాఁటినపిమ్మట ననఁగా మూఁడుగణములతర్వాతనే యతి యని భావము. సంస్కృతమునందువలె నలము లున్నను వానిలో వేఱుగా యతులు పాటింపనక్కఱలే దనియు నూహింపనగును.

అనంతుఁడు వృత్తాదులలక్షణములం జెప్పుపద్యములు వానికి లక్ష్యము లగునట్లు రచించుట యాచారము. అందుచే నిదియు నార్యాలక్షణబోధకము కావున నార్యాలక్షణఘటితమే యయియుం డును. పథ్యార్యాదులందువలెనే యెవరో లేఖకులు కందపద్యము లను భ్రాంతితో సవరించి యనంతుని నియమమును జెడఁగొట్టిరి. ఇంచుక యూహించినచో దీనిమూల మగు నార్యాపద్యము తెలియనగును. చూడుఁడు.

వడి యగు నార్యకు రెండవ
యడుగునఁ ద్రిగణంబుమీఁద నంధ్రమునన్
గడపటిపాదమునకు వడి
యడరును ద్విగణలఘు వవ్వలిచోన్.

ఇది యనంతుని సరియగుపాఠము కానోపును. ౪

ఆ. వె. సరవిఁ బథ్య, విపుల, చపలార్య, ముఖజఘ
నాఖ్యచపల లనఁగ నార్య లయిదు
నొనర గీతి యనఁగ నుపగీతి యుద్గీతి
యార్యపేరిగీతి యనఁగ నాల్గు. ౫

ముఖ...పలలు=ముఖచపలా, జఘనచపలలు; ఆర్యాపేరిగీతి= ఆర్యాగీతి; నాల్గు=నాల్గువిధములగీతులు.

ఆర్యలు 1. పథ్యార్య 2. విపులార్య 3. చపలార్య 4. ముఖచపలార్య 5. జఘనచపలార్య యని యయిదువిధములు.

గీతులు 1. గీతి 2. ఉపగీతి 3. ఉద్గీతి 4. ఆర్యాగీతి యని నాల్గువిధములు. ఉద్దేశక్రమానుసారముగా వీనిలక్షణములం జెప్పెను.

క. బేసులు త్రిగణయుతములై
యా సమపాదములఁ బొరసి యార్య యనఁ గడున్
భాసిల్లుఁ బథ్య యనఁగా
వాసవముఖసకలదివిజవర్గప్రణుతా ! ఉ

బేసులు=విషమపాదములు; త్రిగణయుతములై=మూఁడుగణములతోఁ గూడినవై; ఆ సమపాదములం బొరసి=ఆ శేషించినగణములతోఁ గూడినసరిపాదములతోఁ గూడి.

ఆర్యాపద్యమునకు నొకయర్ధమునం దేడుగణములు నొకగురువు నుండును. అందు మొదటిమూఁడుగణములతో బేసిపాదముల నేర్పఱచినచో నది "పథ్యార్య" యనంబడును.

ఈలక్షణపద్యము పథ్యార్యయే యయియుండును. కందముగా నెవ్వరో భ్రాంతిఁ జెంది సవరించియుందురు. ఇట్టియభిప్రాయముతోడనే శ్రీ గి. వెం. సీతాపతిగారు కించుకమార్పులతో వీనిమూలపద్యముల నూహించి సూచించియున్నారు. నాకును నదియే సమంజస మని తోఁచి యాపద్యము నిటఁ జూపుచున్నాను.

బేసులు త్రిగణయుతములై
యా సమపాదములఁ బొరసి యార్య గడున్

భాసిల్లఁ బథ్య యనఁగా
వాసవముఖదివిజవర్గనుతా !

ఇందు "అనఁ" అనుటకుబదులు "కడుఁ" అనునది యుండుట యుచిత మని యట్లు మార్చితిని. "అనన్, అనఁగాన్" అని రెండు పదము లనవసరములు గదా !

ఈపద్యమున 3 గణములకు పదములు విచ్ఛేదముం బొంది విషమపాదములు పూర్తి యగునట్లుఁ గూర్పఁబడుటచేఁ బథ్యార్య కుదాహరణ మయ్యెను.

అనఁ, అనఁగాన్ అను రెండుపదములు సమానార్థకము లయి యుట ననన్వితములుగా నున్నవి. ఇట్టియస్వాభావికరచనమే యిది కృతక మనుట సూచించుచున్నది.

అట్లే యుత్తరార్థమున సకల, వర్గ శబ్దములు రెండును బ్రయుక్తము లగుట సరసము కాదు. ప్రక్షేప్త లెట్లో పద్యమును గుదురు పాటుచేయుటలో నిట్టియవకతవకలు చేరియుండును. ౬

**వి పు లా ర్య**

**క. ప్రకటాసమపదములు నిలు**
**వక శబ్దము సరులఁ జొచ్చి వచ్చె ననం ద**
**క్కక విపులార్య యగును సే**
**వకజనమందార ! ధీర ! వనజదళాక్షా !** ౭

ప్రకటాసమపదములు=ప్రసిద్ధములయిన బేసిపాదములు; నిలువక=పాదాంతముననే బదవిచ్ఛేదము కాక, శబ్దము = బేసిపాదముల యంతమున నున్నశబ్దము, సరులన్=సరిపాదములందు, చొచ్చివచ్చె ననన్=ప్రవేశించివచ్చెననఁగా, తక్కక=తప్పక, విపులార్య యగును= విపులార్య యనుపద్య మగును. సేవకజనమందార !=తన్నుసేవించు

భక్తజనులకుఁ గల్పవృక్షమువంటివాఁడా ! ధీర !=ధైర్యశాలీ !; వనజ దళాక్షా=పద్మపత్రనయనా !

విషమపాదములు మూఁడుగణములతో సమపాదములయొద్ద నిలువక విషమపాదములయంతమున నున్నశబ్ద మావలి (సమ) పాదమునఁ జొచ్చియున్నచో విపులార్య యనఁబడును.

ఈపద్యమునకు సరియగు పాఠము.

ప్రకటాసమపదముల నిలు
వక శబ్దము సములఁ జొచ్చివచ్చినఁ ద
క్కక విపులార్య యగును సే
వకజనమందార ! వనజాక్షా !

ఇందు నిలువక, సేవక అనుపదములు విషమపాదములం దారబ్ధములయి సమపాదములం జొచ్చియుండుటచే నిది విపులార్య కుదాహరణ మగును. "శబ్దము సములఁ జొచ్చివచ్చె నన్నచో విపులార్య యగు" నన్నవాక్యమును సరసముగా లేదు. చొచ్చివచ్చినచో విపులార్య యగు ననుట సమన్వితముగా నుండును. ఇట్టిలోపములు ప్రక్షేప్తల యజాగ్రత్తవలన నేర్పడినవి. 2

## చ ప లా ర్య

క. వరుసన్ ద్వితీయతుర్య
స్ఫురణ న్మధ్యగజకారములను దగన్ రెం
డరలం దనర్చునేనిన్
సరవి నదియ హరి ! మురారి ! చపలార్యయగున్. 3

(ఇందు "తుర్య, అరలన్" అనుపదములు వ్రాఁతప్రతులను బట్టి గ్రహింపఁబడినవి.) వరుసన్ = వరుసగా; ద్వితీయ...స్ఫురణన్= రెండు, నాల్గు స్థానములయందుఁ బ్రకాశించుటచే; మధ్యగజకారార

ములు=మధ్యగురువులగు జకారములు; తగన్=తగునట్లు; రెండ రలన్=పూర్వార్ధోత్తరార్ధములందు రెంటను; తనర్చునేనిన్=ఉన్నచో; హరి=ఓహరీ; మురారి!= ఓమురారీ!; సరవిన్ = క్రమముగా; అదియ=అదియే; చపలార్య యగున్=చపలార్య యను నార్యాభేద మగును.

ఆర్యాపద్యమునఁ బ్రతిపద్యార్ధమునను ద్వితీయ చతుర్థగణములు జగణము లయినచో నది చపలార్య యగు నని తాత్పర్యము. ఈజగణములు గురుమధ్యగతములు కావలయు ననుసంస్కృతఛందో గ్రంథోక్తలక్షణ మిటుఁ జెప్పఁబడ లేదు. ఈపద్యము కందమేకాని చపలార్య కాదు. అయినను నిందు 1, 3 పాదములలో రెండవగణములు గురుమధ్యగజగణములుమాత్ర మగుచున్నవి. మిగిలిన నియమములు కానరావు.

వావిళ్ళవారి ముద్రితచ్ఛందోదర్పణమున నీక్రిందితీరున నీ పద్యము కానఁబడుచున్నది.

**క. వరుసను ద్వితీయ మంత్యము**
**స్ఫురణ న్మధ్యగజకారములును దగన్ రెం**
**డరయఁగఁ దనర్చునేనిన్**
**సరవి నదియ హరి! మురారి! చపలార్య యగున్.**

ఈపాఠమున నీక్రిందితీరున పద్యార్థ మూహింపనగును.

ద్వితీయము=రెండవపాదమునను; అంత్యము=నాల్గవపాదమునను; (ఇవి సప్తమ్యర్థప్రథమాంతములు) తగన్ రెండు మధ్యగజకారములు తనర్చునేనిన్=మధ్యగురువులగు (ఇది జగణస్వరూపమాత్ర కథనము) జగణములు (రెండుసమపాదములందును) రెండు ఒప్పునేని.

సమపాదములు రెండింటియందును పాఠమున కొకజగణము

చొప్పున రెండుజగణములు గూర్పఁబడినచోఁ జపలార్య యగును అని భావము. ఈలక్షణమున జగణము సమపాదములం దెన్నవస్థానమున నుండవలయునో వివరింపలేదు.

ఈలక్షణములు సంస్కృతఛందోగ్రంథములందలి లక్షణములకు భిన్నముగానున్నవి. సంస్కృతమున విషమపాదములందు రెండవగణమును సమపాదములందు మొదటిగణమును జగణములు కావలయును. ఆ జగణముల కుభయభాగములందును గురువు లుండవలయును. అట్టిది చపలార్య యగును. వావిళ్ళవారి యనంతునిలక్షణమున సమపాదముల నుండవలసినజగణములు పాదాది నుండవలయునని యూహించుకొనినను జగణములకు గురుమధ్యగతత్వమును విషమపాదద్వితీయగణములు జగణములు కావలయు నను నియమమును బరిత్యక్తములు. నేను పైని చూపిన చపలాలక్షణమునం దన్నిలోపములు లేకున్నను గురుమధ్యగతత్వనియమ మనుక్తము.

అప్పకవీయముననను నించుమించు ననంతునిలక్షణమునుబోలిన లక్షణమే కానవచ్చుచున్నది. సమపాదాదిని జగణ ముండుటయే యాతఁడును విధించెను. కాని యాతఁడాజగణము సమపాదాది నుండవలయు నని స్పష్టము గావించుటచే వావిళ్ళవారిఛందోదర్పణమునందలి యనంతునిలక్షణమువలె సంశయగ్రస్తము కాలేదు.

ఆర్య. సమపదములమొదలం జగ
ణముం గడయడుగునను ద్విగణలఘువుపై
సమకొనువిరతియు పదియేన్
లము లున్కుంద ! చపలకు నమరున్.

(అప్పకవీ. ౪ ఆ. ౨౬ ప)

ఇందు నాల్గవపాదమున మూఁడవగణ మగులఘువునకు పైని యతియు నాల్గవపాదమునను పదునేనుమాత్ర లుండుటయుఁ గూడ

విధింపఁబడెను. కాని యీరెండుగుణములును నార్యాపద్యమున కెట్లును సహజములే. కనుక వానిం జెప్పుట స్వరూపకథనము మాత్రమే కాని నూతన మగువిషయమును విధించుట కాదు. అప్ప కవిమాత్ర మీయార్యాభేదములలోఁ గొన్నింట నుత్తరార్ధమును నార్యోత్తరార్ధలక్షణముతో నిర్మింపక పూర్వార్ధలక్షణముతోడనే కూర్చెను. ఇది విచార్యము. అందుచేతనే చపలాలక్షణమున నీలక్ష ణము మరల నాతఁడు చెప్పవలసివచ్చెను. ఉత్తరార్ధార్యాలక్షణము చపలార్యయందుమాత్రమే యీతఁ డనుసరించుటచే ముఖచపలాప ద్యోత్తరార్ధ మార్యాలక్షణఘటితము కాలేదు. జఘనచపలయందు మాత్ర ముత్తరార్ధ మార్యాలక్షణఘటితముగా నున్నది.

సంస్కృతమున ముఖచపలాపద్యమున బేసిపాదములందలి సరి గణములుకూడ గమధ్యగజగణములు కావలయు నని నియమ మున్నను దెనుఁగున నానియమము లేక సరిపాదముల ప్రథమగణములు మాత్రమే గమధ్యగములు కావలయు నని యప్పకవి తలంచియుం డును. చిత్రకవిపెద్దనయు నట్లే తలంచెను.

సరిచరణాదుల జగణం
బు రాఁగ నిర్వంక గురువుఁ బొందింపక
బరగుఁ జపలార్య కృతులన్
మరుత్సుతా! రవిజమంత్రివరా!

ల. సా. సంగ్రహము ౨ ఆ. ౭౭ ప.

సమపాదములందుమాత్రమే జగణనియమము నితఁడు చెప్పి నను నాజగణము గమధ్యగము కావలయు నను నియమము నీతఁ డప్పకవివలెఁ జెప్పకపోలేదు. ఆతనియుదాహరణమునఁ జతుర్థ పాదాది జగణము గమధ్యగ మయినను ద్వితీయపాదాదిజగణము మాత్రము గమధ్యగము కాలేద

కాని నాకు లభించినపాఠమునుబట్టి యనంతుఁడు సంస్కృత చ్ఛందములందువలెనే నాల్గుపాదములందును గమధ్యగజగణము లుండవలయుననియే భావించె నని తెలియఁబడుచున్నది.

గిడుగువారీ క్రిందితీరునఁ బాఠమును సవరించిరి.

వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురద్గమాద్యగజకారములు దగ రెం
డరయఁగఁ దనర్చునేనిన్
హరీ మురారి చపలార్య యగున్.

(గిడుగువారి సవరణము.)

ఈపాఠమున "గమాద్యగ" యనుదాని కర్థ మేమో తెలియ రాదు. "స్ఫురద్గమధ్యగ" యని వారియభిప్రాయ మైనచో లక్ష్య పద్యమున ద్వితీయపాదాదిజగణమును బ్రథమతృతీయపాదములందలి జగణములును గమధ్యగములు కాలేదు. పద్యార్థమును సంగతముగా లేదు. ఈపద్యముమూలరూపమును నే నీక్రిందితీరున నూహించు చున్నాను.

చపలార్య. వరుసన్ ద్వితీయతుర్య
స్ఫురద్గమధ్యగజకారములు దగ రెం
డరలం దనర్చునేనిన్
హరీ! మురారి! చపలార్య యగున్.

ఈ లక్షణమును లక్ష్యమును సంస్కృతచపలార్యాలక్షణము నకు సరిపడుచున్నవి. సాధారణముగా ననంతునిలక్షణములు సంస్కృ తము ననుసరించినవియే యగుటచే నిందుఁగూడ నిట్టిలక్షణ ముండు టయే యుచితము.

ముఖచపలార్య

క. చపలాగణప్రకారం
బపారకారుణ్యసాగరా! ప్రథమార్ధం
బ, పరం బగునే నది ముఖ
చపలార్య యనంగఁ జనును జక్కఁగఁ గృతులన్.

చపలాగణప్రకారంబు = చపలార్యయొక్క-గణములరీతిగల; ప్రథమార్ధంబ=ఆర్యాపూర్వార్ధముమాత్రము; పరంబగునేని=ఉత్కృష్టమయ్యేనేని; అది=అట్టిది; ముఖచపలార్య యనంగఁజనును=ముఖచపలార్య యని చెప్పఁబడును.

ఆర్యాపద్యపూర్వార్ధముమాత్రము చపలార్యాలక్షణముతోఁ గూడి యుత్కృష్టముగానున్నచో ముఖచపల యనంబడు ననిభావము.

ఈపద్యమును సామాన్యకందముగానే యున్నది. ఇంచుక మార్చినచో ముఖచపలార్య యయి యుదాహరణముఁగూడ నగును.

చపలాగణప్రకారం
బపారకారుణ్యసాగరా! ప్రథమా
ర్ధపరం బగు నే నది ముఖ
చపలార్య యనంగం జను గృతులన్.

గిడుగువారిపాఠము నించుమించుగ నిదియే. ఇందు గిడుగువారి చపలార్యాలక్షణమేకాక సంస్కృతచపలార్యాలక్షణమును (ద్వితీయ చతుర్థ గణములు గురుమధ్యగతజగణము లగుట) సమగ్రముగా నున్నది.

జఘనచపలార్య

క. మొదలిసగము చపలార్యా
స్పదగణలక్షణము సొరక చరమార్ధంబు

దుదితప్రకారరేఖన్
గదాధరా చనుఁ గృతుల జఘనచపలార్యల్. ౧౦

గదాధరా=కౌమోదకీధారియగు నో శ్రీహరీ!; కృతులన్=కావ్యములందు; జఘనచపలార్యల్=జఘనచపల యనఁబడునార్యాభేదములు; మొదలిసగము=పూర్వార్ధమునందు; చపలార్యాస్పదగణలక్షణము=చపలార్యాపద్యము స్థానముగాఁగల గణములలక్షణము; చొరక=ప్రవేశింపక; పరమార్ధంబందు=ఉత్తరార్ధమునందు; ఉదితప్రకారరేఖన్=చపలార్యకుఁ జెప్పఁబడినవిధముగల పద్ధతిని, చను=ఒప్పును.

పూర్వార్ధమునఁ జపలార్యాలక్షణము లేక శుద్ధార్యాలక్షణము గలదై యుత్తరార్ధమునమాత్రము చపలార్యాలక్షణము గలదయ్యేనేని జఘనచపలార్యానామకపద్య మగును.

ఈపద్యమును నీక్రిందితీరునఁ గొలఁదిగా మార్చినచో నుదాహరణముగూడ నగును.

మొదలిసగము చపలార్యా
స్పదగణలక్షణము సొరక చరమార్ధం
బుదిత్ప్రకార రేఖ
గదాధరా ! చను జఘనచపలల్.

ఇంచుమించుగ గిడుగువారు నిట్టిపాఠమునే చెప్పిరి. ఇం దర్థాన్వయమును సరళముగా నున్నది. ఇందును సంస్కృతచ్ఛందఃప్రోక్త లక్షణము పూర్ణముగా నున్నది. ౧౦

గీతి

క. లసదార్య మొదలిసగమున
నెసఁగఁగఁ దెంతరలుఁ జెప్పిరే నదియే గీ

తిసమాహ్వాయ మగుఁ గృతులన్
వసుధాధర ! కృష్ణ ! యాదవస్వామి ! యనన్. ౧౧

ఆర్యాపూర్వార్ధలక్షణముతోడనే యుత్తరార్ధముంగూడఁ జెప్పినచో నది గీతి యనుపేరుగల పద్య మగును.

ఈకందమును నించుక యీక్రిందితీరున మార్చినచో కవ్యభిప్రేతగీత్యుదాహరణ మగును. గిడుగువారును నీపాఠమునేసూచించిరి.

గీతి. లసదార్య మొదలిసగమున,
నెసఁగఁగ రెండర్ధలు చెప్పిరే నది గీ,
తి సమాహ్వాయ మగుఁ గృతులన్.
వసుధాధర కృష్ణ ! యాదవస్వామీ ! ౧౧

## ఉపగీతి

క. ధర నార్యమీఁది సగమున
నిరుసగమును నట్ల చెప్పిరేని యదియ దాఁ
బరఁగు నుపగీతి యనఁగా
సరసిజదళనేత్ర ! కృష్ణ ! శార్ఙ్గధర ! హరీ ! ౧౨

ఆర్యమీఁదిసగమునన్ = ఆర్యాపద్యముయొక్క యుత్తరార్ధ లక్షణముతో; ఇరుసగమునన్ = రెండుభాగములును; అట్లచెప్పిరేని= అదేవిధముగాఁ జెప్పినచో; అదియ=అదియే; తాన్=తాను; ఉపగీతి యనఁగాఁ బరగున్=ఉపగీతి యని చెప్పఁబడును.

ఆర్యాపద్యోత్తరార్ధలక్షణముతోఁ బద్యము రెండుభాగములును జెప్పఁబడినచో నుపగీతి యనఁబడును.

ఈపద్యమును నుపగీత్యుదాహరణముగా నీక్రిందితీరున నుండుట కవిహృదయము.

ఉపగీతి. ధర నార్యమీఁదిసగమున
నిరుసగమును జెప్పిరే నది, దాఁ
బరగు నుపగీతి యనఁగా.
సరసిజదళనేత్ర ! శార్ఙ్గధరా.

"ఇరుసగమున" అని గిడుగువారి పాఠము.

మిగిలినదంతయు సమానమే. ౧౨

ఉద్గీతి

క. విదితార్యచరమదళముఁ
మొదలిసగము చేసి యందు మొదలింటిసగం
బది యపరార్ధముఁ జేసినఁ
బొదుపగు నుద్గీతి భుజగభుగ్వరగమనా ! ౧౩

భుజగభుగ్వరగమనా = గరుడవాహనా !; అపరార్ధముఁ = ఉత్తరార్ధమును; పొదుపు=వృద్ధి; అగుఁ=అగును.

ఆర్యాపూర్వార్ధము నుత్తరార్ధముగను నుత్తరార్ధమును బూర్వార్ధముగను మార్చినచో నుద్గీతి యనఁబడును.

ఉద్గీత్యుదాహరణపద్య మీక్రిందితీరున నుండియుండును.

ఉద్గీతి. విదితార్యచరమదళమున్,
మొదలిసగము చేసి, మొదలిసగం,
బది యపరార్ధముఁ, జేసినఁ,
బొదుపగు, నుద్గీతి భుజగభుగ్గమనా !

గిడుగువారును నీపాఠమునే చూపియున్నారు. ౧౩

ఆర్యాగీతి

క. కందములకుఁ గలనియమము
లందేమియుఁ గడమపడక యడరిన నది ఘం

పొందఁగ నార్యాగీతి య
నందగు నిట్లురగభూషణప్రణుతగుణా! ౧౪

తెనుఁగునఁగల కందపద్యలక్షణములతో నేమాత్రమును భేదము లేకయున్నచో నార్యాగీతి యగును.

ఆర్యాపద్యపూర్వార్ధము నంతమున నింకొకగురు వధికముగాఁ జేర్చి యట్లే రెండర్ధములం జెప్పినచో నది యార్యాగీతి యగును. అనఁగాఁ గందపద్యమును నిట్టిగణములతోడనే యుండు నని భావము.

సామాన్యదృష్టికిఁ గందమునకును నార్యాగీతికిని భేదము లేనట్లు తోఁచుచున్నది. కాని వృత్తరత్నాకరమున "ఆర్యాపూర్వార్ధం యదిగురుణైకేనాధికేన నిధనే యుక్తమ్, ఇతరత్తద్వన్నిఖిలం దలం యదీయముదితేయ మార్యాగీతిః" అని యార్యాగీతిలక్షణము చెప్పఁబడియున్నది. ఆర్యాపద్యపూర్వోత్తరభాగములయంతమున నొకగురువు నియతముగా నుండును. ఇపు డార్యాగీతి కావలయు నన్నచో మఱియొకగురువును జేర్పవలయును. అనఁగా నార్యాగీత్యర్ధములయంతమున రెండుగురువులు తప్పక యుండవలసియున్నది.

కందపద్యార్ధములయంతమున రెండుగురువు లుండవచ్చును గాని యవియేకాక సగణముగూడ నుండవచ్చును. ఆర్యాగీత్యర్ధాంతములందు సగణ ముండుట కవకాశము కానరాదు. లక్షణములును లక్ష్యములును నిందుకుఁ బ్రతికూలములు. లక్ష్యములందు గురుద్వయమే చూపట్టుచున్నది గాని సగణము గానరాలేదు. ఆర్యాగీతి లక్షణము ఉపలక్షణ మనుకొని సగణమునకును గురుద్వయ ముపలక్షక మని సరిపెట్టుకొనవలసియున్నది.

ఆంధ్రలక్షణకర్త లెవ్వరును నీసూక్ష్మాంశమును గుఱుతింపక కందమును నార్యాగీతియు సమలక్షణలక్షితము లని వ్రాసియున్నారు,

ఈపద్య మార్యాగీతి కుదాహరణమును గావచ్చును. కాని యర్ధాంతములందు గురుద్వయములు లేక సగణములే యున్నవి. ఇది యాలోచనీయము. ఇంతియకాక యార్యానియమములందుఁ గల యతినియమములును గందమునఁ బాటింపనక్కఱలేదు.

ఈపద్యము నించుక యిట్లు క్రిందితీరున మార్చినచో నార్యాగీత్యుదాహరణ మగును.

కందములకుఁ గలనియమము
లం దేమియుఁ గడమపడక యడరినచో నిం
పొందఁగ నార్యాగీతి య
నందగు నిట్లురగభూషణప్రణుతాత్మా!

ఇంకఁ దెనుఁగుగీతులవిషయము వివరించుచున్నాఁడు. ౧౪

## సమవిషమగీతులు

**క. అమర మఱి గీతులందు వి**
**షమగీతులు మూఁడు రెండు సమగీతులునై**
**సమము లగు, నవకలిప్రా**
**సముల యతుల, విషమములఁ బొసఁగు ప్రాపళ్లన్.**

సమములు=సమగీతులు (ఆటవెలఁది- తేటగీతి); అవకలిప్రాసములన్ = ప్రాసయతులతోడను; యతులన్ = యతులతోడను; అగున్=ఉండును. విషమములన్=విషమగీతులందు (ఎత్తుగీతి- పవడగీతి- మేలనగీతి); ప్రాపళ్ళన్ = ప్రాసలును, వడులునుకూడ; పొసఁగున్=ఉండును.

గీతులలో విషమగీతులు మూఁడు, సమగీతులు రెండు నుండును. సమగీతులందు ప్రాసయతులు [illegible]

యుండును. విషమగీతులందు ప్రాసములును, యతులునుగూడ నుండును. ౧౫

విషమగీతులం దెత్తుగీతి

(౧ ఇం. ౧ సూ. ౧ సూ.) యతి–౨ గ.

ఆదిప్రాసంబు, హరియు
నాదిత్యయుగము నగుచు
నీదెస యతుల నెత్తు
గీదియ నెగడుఁ, గృష్ణ ! ౧౬

ఆదిప్రాసంబు=ప్రతిపాదద్వితీయాక్షరైక్యరూప ప్రాసము; హరియును = ఒక యింద్రగణమును; ఆదిత్యయుగము=రెండు సూర్యగణములును; ఈదెసయతులన్ = ఈపద్యమునఁ జూపఁబడిన తీరుగల యతులతో (అనఁగా మూఁడవగణము మొదటియతితో); ఎత్తుగీదియ=ఎత్తుగీతి; నెగడున్=ఒప్పును.

తృతీయగణాద్యక్షరమున యతియుఁ బ్రాసమును గలిగి, ప్రతిపాదమునను నొకయింద్రగణమును రెండుసూర్యగణములును వరుసగా నుండినచో నెత్తుగీతి యగును. ఈపద్యమే యుదాహరణము. ఇం దాలక్షణము లన్నియుఁ గలవు, చూడఁదగును.

కవిజనాశ్రయమునం దెత్తుగీతియందు యతి చూపఁబడలేదు. కావ్యాలంకారచూడామణియం దిది చెప్పఁబడనేలేదు. లక్షణసారసంగ్రహమునను నప్పకవీయమునను దీనిలక్షణ మిట్లే చెప్పఁబడెను.

పవడగీతి

(సూ. ౩, ఇం. 2, సూ. 5.) యతి–౪ గ.

పవడగీతియందుఁ బ్రాసంబు నిలిచి మూఁ
డవగణంబుమీఁద నమరు విరతి

**రవులు, మువ్వురును బురందరు లిద్దఱు**
**నవుల, నేగు రినులు, నర్ధములకు, ౧౩**

పవడగీతియందుఁ గందమునకువలె నొకయర్ధమునకు లక్షణము చెప్పఁబడును. ఇందు వరుసగా మూఁడు సూర్యగణములును రెండింద్రగణములు మరల నయిదు సూర్యగణములుఁ నొక్క యర్ధమున నుండును. ప్రతిపాదమునందును నాల్గవగణముమొదట యతి యుండును. ప్రాస ముండును. ఇట్లే యుత్తరార్ధము నుండును. ఈలక్షణ పద్యమే యుదాహరణము. పవడగీతిని "ప్రగీతి" యని కవిజనాశ్రయమున వ్యవహరించెను. లక్షణమును జెప్పుటలో మూఁడు సూర్య గణములు తరువాత రెండింద్రగణము లనుటకుబదులు రెండు నలము లని చెప్పెను. తానుమాత్రము రెండు నలములను వాడక రెండింద్రగణములనే ప్రయోగించెను. దీనింబట్టి నలము లనఁగా నింద్రగణము లని సమన్వయించుకొనవలసియున్నది. అట్లే రెండవ పాదమున ౫ సూర్యగణము లనుటకు 3 సూర్యగణములును నగణ హగణములును నుండవలె ననియెను. ఉదాహరణపద్యమునను నట్లే గణము లున్నవి. అందుచే నేవియో మూఁడు సూర్యగణములును నాపిమ్మట యొక నగణమును హగణమును నుండవలయు నని యందలి యభిప్రాయముగాఁ దోఁచుచున్నది. ఆటవెలఁదికిని దీనికిని ప్రాస భేదమే కాక గణభేదమును గలదని దీనిఁబట్టి భావింపనగును. ఇతర లాక్షణికు లెవ్వరు నిట్టిగణభేదమును పాటింపలేదు. ౧౭

## మేలనగీతి

(౭ సూ.) యతి-౪ గణ.

**నగణ మొండె హగణ మొండె నగణహగణయుగము**
**తగిలి యొండె సప్తసంఖ్యఁ దత్పదంబు లమర**

దగఁ జతుర్థగణముపై నుదాత్తవిశ్రమంబు
నిగుడు మేలనాఖ్యగీతి నెరయుఁ బ్రాస మొదవి. ౧౮

నగణ మొండె=నగణము కాని; హగణము మొండె=హగణము కాని; నగణహగణయుగము = నగణహగణములు రెండును; తగిలియొండె=కూడిగాని; సప్తసంఖ్యన్ = ఏడుసంఖ్యగల సూర్యగణములతో; తత్పదంబు లమరన్ = దానిపాదము లొప్పుచుండఁగా; తగన్=తగినట్లు; చతుర్థగణముపై = నాల్గుగణంబులయనంతరమున; (అయిదవగణముమొదట నని భావము.) ఉదాత్తవిశ్రమంబు=యతి; నిగుడు=కలిగియుండెడి; మేలనాఖ్యగీతి=మేలన మనుపేరుగీతి; ప్రాస మొదవి=ప్రాసము గలిగి; నెరయున్=ప్రవర్తించును.

మేలనగీతికి సూర్యగణము లొక్కొక్క-పాదమున నేడేసి గణములు నయిదవగణముమొదట యతియుఁ బ్రాసమును గల్గియుండును. కా॥చూ॥మఃశి, కవిజనాశ్రయములందు నిది యిట్లే చెప్పఁబడెను. అప్పకవీయమునమాత్రము "కమలనగీతి" యని దీనిని వ్యవహరించెను.

ఈమూఁడును విషమగీతులు. ఇఁక సమగీతులను వివరించును.

ప్రాసములుగల గీతులు విషమగీతు లనియు నవి లేనివి సమగీతు లనియుఁ దెలియఁబడుచున్నది. సీసములందును బ్రాసనియమము గల యుత్సాహము విషమసీస మనియేకదా వ్యవహారము. (ఉత్సాహమునందు దీనికంటెఁ బాదాంతమున నొక్క-గురు వధికము.)

సమగీతులం దాటవెలఁది

ఇనులు ముగురు పాడ, నిద్ద ఱింద్రులు మృదం
గములు దాల్ప, వంశకాహళాదు

లేగు రర్కు లూద నిరుమేళములు నాట
వెలఁది యొప్పుచుండు విష్ణుసభల. ౧౯

ఇందు విష్ణుసభను వర్ణించుచున్నాఁడు. ఈవర్ణన మప్రస్తుత మగుచుఁ బ్రస్తుతమగు నాటవెలఁదిలక్షణమును నప్రస్తుతప్రశంసాపద్ధతిని ద్యోతనము గావించుచున్నది. విష్ణుసర్ణనముకూడ నిందు ప్రస్తుతమే యనుకొనినచో ప్రస్తుతాంకురపద్ధతి యగును.

ఇనులు=సూర్యులు; మృదంగములు=మద్దెలు: వంశకాహళాదులు=క్రోవి, కాహళ మున్నగుసుషిరవాద్యములను; ఏగురర్కులు=అయిదుగురుసూర్యులు; ఇరుమేళములు = రెండుమేళములును; ఆటవెలఁది=నటి; విష్ణుసభలన్=విష్ణునిసభలయందు.

విష్ణునిసభలలో విష్ణుసేవార్థమై మువ్వురుసూర్యులు గానము చేయుచుండఁగా నిద్దఱింద్రులు మృదంగములను ధరించి వాగించుచుండఁగా మఱి యయిదుగురుసూర్యులు వంశకాహళాదిసుషిరవాద్యముల నూఁదుచుండఁగా నొకనటి యిరుమేళముల నొప్పుచుండును- అను విష్ణుసభావర్ణన మాటవెలఁది యను గీతిపద్యముల లక్షణమును వ్యక్తము చేయుచున్నది.

మూఁడు సూర్యగణములు రెం డింద్రగణములు మరల నయిదు సూర్యగణములును వరుసగా నాటవెలఁది కొకయర్థమున నుండును. ఇట్లే రెండవయర్థమునను నుండును. పాదమున కయిదు గణము లనియు యతికిబదులు ప్రాసయతిని వాడవచ్చు ననియు నుదాహరణపద్యమునుబట్టి యూహింపవలయును. ఈపద్యమే యుదాహరణము నగుచున్నది. నాల్గవగణముమొదటియక్షరము యతిస్థానమనియుఁ బ్రాసయతినైనను వాఁడవచ్చు ననియు ౨౨వ పద్యమునం జెప్పుచున్నాఁడు. ౧౯

తే ట గీ తి

ఒక్కఁ డర్కుఁ డిద్దఱు జిష్ణు లొనర మఱియు
నిద్ద ఱర్కు లీచొప్పున నేగురేసి
నాల్గువంకలఁ గదిసి వర్ణన మొనర్పఁ
దేటగీతి విష్ణునిపేర్మిఁ దేటపఱుచు. ౨౦

అర్కుఁడు=సూర్యగణము; జిష్ణులు=ఇంద్రగణములు; ఏగు రేసి = అయిదేసిగణములు; నాల్గువంకలన్ = నాల్గుపాదములను; పేర్మిన్=గొప్పతనమును; తేటపఱుచున్=వివరించును.

ప్రతిపాదమునకు నొకసూర్యగణము రెండింద్రగణములు రెండు సూర్యగణములును వరుసగా నుండునట్లు నాల్గుపాదములును రచించి నచోఁ దేటగీతి యనఁబడును. అనంతరపద్యమునం దిందలియతి స్థానము చతుర్థగణాద్యక్షర మని చెప్పఁబడును.

ఇందు విష్ణునిసభావర్ణనము రెండవయర్థముగాఁ దోఁచు చున్నది. మహావిష్ణునిమహత్త్వ మపార మనియు నాతనినాల్గుప్రక్క లను ద్వాదశాదిత్యులును నష్టదిక్పాలకులును గలసి యొక్కొక్క దిక్కున నయిదుగు రేసి కూడి వర్ణనముఁ గావించినచోఁ గొంతవఱకుఁ దెలియఁబడుననియు నర్థాంతరము స్ఫురించుచున్నది. ఇందలిజిష్ణుపద మునకు జయశీలు రయినదిక్పాలకు లని యర్థాంతరమును గ్రహింప వలయును... నాల్గుపాదము లనుటకుబదులు నాల్గువంక లనుటయే యిట్టియర్థాంతరము కవిహృదయసమ్మత మనుటకు సూచకము. ఇట్లు ప్రతిసందర్భమునందును బ్రసంగమును గల్పించుకొని విష్ణునియందుఁ దనకుఁగల భక్తి నిక్కవి సూచించుచుండును.

గీత్యుపగీత్యుద్గీత్యార్యాగీతు లనఁబడునవి నాల్గును సంస్కృత చ్ఛందమునకు సంబంధించినవి. సమ విషమగీతు లనఁబడు నీయేదును

దెనుఁగుభాషకుమాత్రము సంబంధించునవి. కవిజనాశ్రయమున

"వెలయంగ దెనుఁగుబాసకు, దలమయ్యెడు సీసములును దర్వోజలు గీ
తులు నక్కరలును ద్విపదలు; పొలుపొందఁగ రేచఁ డిష్టమున
నొనరించున్."

అని యీగీతులు సంస్కృతగీతులుకంటె భిన్నములుగాఁ దెనుఁగునకుఁ జెందినవనియే చెప్పెను. అప్పకవిమాత్రము గీతులు నవవిధములనియు నందార్యాగీతులు నాలు గనియు సమగీతులు రెం డనియు విషమగీతులు మూఁ డనియుఁ జెప్పెను.

గీత్యుద్గీత్యాదులకును దెలుఁగుగీతులకును సంబంధము లేదు. నామసామ్యముమాత్రముచే వీని నొకజాతికిఁ జెందినవానివలె నొక్క ప్రకరణమునం జెప్పుటగాని యన్నింటినిం గలిపి గీతు లని పరిగణించుటగాని సముచితముగాఁ గన్పట్టదు.

ఈగీతులను సమగీతు లనియు విషమగీతు లనియు విభజించుటకుఁగూడ మూలకారణము దురూహముగా నున్నది. వీని సమవిషమత్వములు కిం మూలకములో గోచరింపలేదు. పాదములగణసామ్యమునుబట్టి యీసమవిషమత్వములను నిర్ణయించినచో నెత్తుగీతి, మేలనగీతి, తేటగీతి సమగీతులుగను, పవడగీతియు నాటవెలదియు విషమగీతులుగను విభజింపవలసియుండును. కాని యాలోచింపఁగాఁ బ్రాసముగలవి విషమగీతు లనియు నది లేనివి సమగీతు లనియు వీరి నిర్ణయముగాఁ దోఁచును. సీసములందును విషమసీసము ప్రాసముగల "యుత్సాహమే" గదా ! ప్రాస ముండుట విషమ మనియు నది లేకుండుట సమ మనియు నిట భావింపఁదగును. చూ. 3-౧౫ ప. ౨౦

పెనఁగి గణత్రితయము పై
నొనరఁగ వతీ యొందెఁ బ్రాస మొంతెను నిఱుపన్

జను నాటవెలఁది యందును
ననువొందిన తేటగీతియందు ముకుందా. ౨౧

గణత్రితయముపైన్ = మూఁడుగణములయనంతరమున; వడియొండెన్=యతిగాని; ప్రాసమొండెన్ =ప్రాసయతిగాని.

ఆటవెలఁదియందును దేటగీతియందును పాదమునందు ౩ గణములతర్వాతియక్షరమున యతి గాని, ప్రాస గాని యుండవలయును. వెనుక వీనికి గణములనుమాత్రమే లక్షణపద్యములం జెప్పి యిచట యతిప్రాసనియమములను వివరించెను. ౨౧

సీసంబులు

క. నలనగసలభరతలలో
పల నాఁటిటిమీఁద రెండుఁ బద్మాప్తగణం
బులఁ దగి నాలుగుపదములఁ
జెలువగు నొకగీతితోడ సీసము కృష్ణా! ౨౨

ఓకృష్ణా! సీసము=సీసపద్యము. నల...నాఁటిటిమీఁద=నల, నగ, సల, భ, ర, త అను నింద్రగణములలో నేవేని యాఱుగణముల తర్వాత; రెండుపద్మాప్తగణంబుల్=రెండుసూర్యగణములతోడను; ఒకగీతితోడన్=అంతమున సమగీతు లనఁబడు నాటవెలఁది తేటగీతులలో నొకగీతిపద్యముతోడను; చెలువగున్=ఒప్పుచుండును. ౨౨

క. సీసము రెండుగణంబులఁ
బ్రాసం బేఁటియును మఱి విరామం బైనన్
భాసిల్లుఁ బృథివిమీఁదన్
జేసిననియమములఁ బ్రాససీసాదు లజా! ౨౩

సీసపద్యపాదములందు రెండేసిగణంబులమీఁద యతి గాని, ప్రాసయతిగాని భాసిల్లును. అనఁగా మొదటిగణము మొదటియక్షర

మునకును మూఁడవగణము మొదటియక్షరమునకును యతి చెల్లును. అట్లే పంచమ సప్తమ గణాద్యక్షరములకును బరస్పరము యతి చెల్లును.

అజా=జన్మరహితా కృష్ణా !, చేసిననియమములన్=పూర్వోక్తలక్షణముతోఁగూడియును జేయఁబడిన మఱికొన్నినియమముల చేత (ఆనియమములు అనంతరపద్యమున నే వివరింపఁబడును.) ప్రాససీసాదులు=ప్రాససీసము, వృత్తప్రాససీసము మున్నగు సీసభేదములు సిద్ధించు నని భావము.

సీ. వృత్తంబులకుఁ బోలె వెలయు నాఱడుగులఁ
ప్రాసము ల్నిల్పి విరతులు నునుపఁ
బ్రాససీసము లగుఁ, బశ్చిమార్ధము లట్ల
భాసిల్ల నక్కలిప్రాససీస
మగు, మున్ను గైకొన్నయతి పాదమందెల్ల
నడరిన వడిసీస మనఁగఁ బరగు,
నర్ధమర్ధమునకు యతులు వేఱై చనఁ
జెప్ప నక్కలివడిసీస మయ్యె.
గీ. నవకలికి నిట్లు ప్రాసంబు లవతరిల్లు,
యతులు ప్రాసంబు లిష్టసంగతులనడవ
నది యసమసీసముత్సాహతుదనుగదిసి
పరఁగ విషమసీసం బగుఁ బద్మనాభ ! ౨౪

ఆఱడుగులన్=ఆఱుపాదములందును; (ఇట గీతమును రెండు పాదములుగా భావింపవలెను.) ఇట్లు=ప్రతియర్ధమునకును ప్రాసములు వేఱైచనన్; ఇష్టసంగతులన్=ఇచ్చవచ్చినతీరునన్; గీది=గీతి (తద్భవ పదము) చంపకమాలాదివృత్తములందువలెనే నాల్గుసీసపాదములం

దును రెండుగీతపాదములందును మొత్త మాఱుపాదములందు ద్వితీయాక్షరమునకుఁ ప్రాసనియమమును యతిస్థలములందెల్లెడల యతులు గూర్పఁబడినచోఁ బ్రాససీస మనఁబడును. (ఇందు సీసపాదముల నాల్గింటను గీతపద్యమున విషమపాదముల రెంటను మొత్త మాఱు పాదములందుఁ బ్రాసనియమ ముండును. ఉదాహరణము ౨౭ వ పద్యము.)

సీసపాదముల రెండుఖండములందును గీతపాదముల నాల్గింటి యందును మొత్తము ౧౨ స్థానములందును బ్రాసమును నిల్పి యతి స్థానము లన్నింటియందును యతులనే నిల్పినచో నది యక్కిలిప్రాస సీస మగును. (ఉదా : 30 ప.)

పాదమున నాల్గుస్థానములందును నొకేయతి యుండి సీసగీత పద్యములందలి యతిస్థానముల నన్నింటను యతినే కూర్చినచో నది వడిసీస మనఁబడును. (అనగాఁ బ్రాసయతి నెచ్చటను వేయరాదు.) ఇచటను గీతపద్యము రెండర్థములును రెండుపాదములుగా భావించి యతి వేయవలెను. (ఉదా : ప. 3౧)

సీసపాదములందు మొదటియర్థమున నొకయతియును రెండవ యర్థమున వేఱొకయతియును గూర్చుచుఁ బద్యమునందంతటను యతులేకూర్చినచో నక్కిలివడిసీస మగును. (ఉదా : 3౨ ప.)

పాదమునందు రెండుభాగములందును వేర్వేఱు ప్రాసములను (అక్కిలివడిసీసమునందు యతివలె) గూర్చినచో నవకలిప్రాససీస మగును. (ఉదా : 33 ప.)

ఒకనియమము లేక యతులును బ్రాసములును మిశ్రితములయి పద్యమునం దంతట వర్తించినచో సమసీస మనఁబడును.

(ఉదా : ౨౮ ప.)

ఉత్సాహామతుదను గీతిపద్యమును గూర్చినచో విషమసీస మనఁబడును. ఉదా : ౩౮. ౩౯ ప.) ౨౮

గీ అగు సమప్రాసస్స మాఱుకుగులందు
నాలుగింట వృత్తప్రాసనామసీస
మన్నిచోటులఁ బ్రాసంబు నందెనేని
సర్వతః ప్రాససీసంబు జగజనాథ ! ౨౯

సీసపాదములనాల్గింటను గీతమున బేసిపాదములరెంటను మొత్త మాఱుపాదములందుఁ బ్రాసముగలది ప్రాససీస మగును.

సీసపాదములనాల్గింటమాత్రమే ప్రాసముం గూర్చినచో (గీత పద్యమునందుఁ రెండుపాదములందునుగూడ ప్రాససీసమునకువలెనే ప్రాస ముండరాదు) వృత్తప్రాససీస మనఁబడును. (ఉదా : ౨౦ ప.)

అన్నిస్థానములందును సీసగీతములరెంటను బ్రాసమునేగూర్చి నచో సర్వతః ప్రాససీస మనఁబడును. (ఉదా : ౨౦ ప.)

దీన నిర్వదినాల్గుప్రాసము లుండును.

ఇటఁ జెప్పఁబడినసీసభేదములు తొమ్మిదిమాత్రమే కాక సర్వ లఘుసీసము, సీసమాలిక యనఁబడు మఱి రెండుభేదములు ౩౬; ౩౭ పద్యములందుఁ జెప్పఁబడును.

ఈ తొమ్మిదిభేదములలోఁ బ్రాసభేదమునుబట్టి ౫ విధముల సీసములును యతిభేదమునుబట్టి రెండుభేదములును విషమసీస, సమ సీసములు రెండును గలవు. ౨౫

## సమసీసము

ఇంద్రులు తమలోన నిద్దఱిద్దఱుఁ గూడి
యతులకు నాధారమై తనర్చి

ఘూఁడుచోటుల నుండ మొగి నిద్ద అర్కులు
గదియ నాక్రియ నొక్కపదము మెఱయ
నిటువంటిపదము లింపెసఁగంగ నాల్గింట
సమధర్మగతి నతిశయము నొందు
నట్టిధర్మమునకు నాస్పదంబై వేర్చి
యాతతచ్ఛందోవిభాతిఁ దనరి

ఆ. వె. యాటవెలఁది యొండెఁ దేటగీతియు నొండె
విమలభావ మమర విష్ణుదేవుఁ
డొప్పు ననుచుఁ బొసఁగఁ జెప్పిన సీసంబు
పసిఁడి యగు ధరిత్రిఁ బద్మనాభ! ౨౬

ఒక్కొక్కపాదమున వరుసగా నా ఱింద్రగణములును రెండు సూర్యగణములు నుండును. రెండేసిగణముల కొక్క యతిస్థానము. ఇట్టిపాదములు నాల్గును సమముగా నుండును. అంతమునఁ దేటగీతి గాని యాటవెలఁది గాని యుండును. ఇట్లు చెప్పినచో సీసము ప్రశస్తముగా నుండును.

సమధర్మగతిన్ = సమానధర్మముగలతీరున; (అనఁగా నన్ని పాదము లొక్కలక్షణము గలవియనుట) ఆతతచ్ఛందోవిభాతిన్ = ప్రసిద్ధమయిన ఛందోమార్గమునన్; సీసంబు పసిఁడియగున్ = "సీసము" అను నల్పలోహము బంగారముగా మాఱునట్లు సీస పద్యము ప్రకాశమాన మగును.

ఈపద్యమున యతులును ప్రాసములును నొకనియమము లేక యాయాస్థలములందు వికీర్ణము లయియుండుటచే నిది సమసీసమున కుదాహరణ మగును. ౨౬

## ప్రాససీసము

భామినిచే నున్న పట్టుతోరముఁ జూచి
ప్రల్లదంబున ద్రెంచి, పాఱవైచి
యాముని ద్రోహ మత్యంతమై తనుఁ బట్టి
యతిదరిద్రునిఁ జేయ నార్తి నొంది
భూమి వెల్వడిపోయి పురపురఁ బొక్కుచుఁ
బుండరీకాక్ష ! యోభువనవంద్య !
స్వామి ! నాయపరాధశతసహస్రంబులు
సైరింపవే కృపాజలధి ! యనుచుఁ
గీ. ప్రేముడించు కౌండిన్యునిభీతిఁ బాపి
పృథులసౌఖ్యంబు లొసఁగి గాంభీర్య మమరఁ
బాముపైఁ బవ్వళించినప్రభుఁడ వనినఁ
బ్రాససీసంబు విలసిల్లుఁ బద్మనాభ ! ౨౨

పట్టుతోరము=పట్టువ్రతసూత్రము; ప్రల్లదమ్మునన్=పారుష్యమునన్.

ఇందు సీసపాదములనాల్గింట మొదటియర్ధమునమాత్రమును గీతపద్యమున విషమపాదములందును మకారము ప్రాసముగా నున్నది. కనుక నిది ప్రాససీసమున కుదాహరణము. ఇందుఁ బాద మంతయు నొక్కయక్షరమే యతిస్థానముల నన్నింట గ్రహింపఁ బడును. ఎచ్చటను ప్రాసయతి యుండదు.

## వృత్తప్రాససీసము

శ్రీశ్రితవత్సుండు సింధురవరదుండు
చింతితఫలదానశీలుఁ డీతఁ

డాశ్రితావనలోలుఁ డాభీరకాంతాకు
చాగ్రకుంకుమభూషితాంగుఁ డీతఁ
డశ్రాంతజయధాముఁ డాశాంతవిశ్రాంత
యశుఁడు ధారాధరశ్యాముఁ డితఁడు
విశ్రుతవిభవుండు విపులబలాఢ్యుండు
వికసితవదనారవిందుఁ డీతఁ
గీ. డనుచు మునులును దివిజులు నభినుతింపఁ
జూపుచెవులపాన్పున వెన్ను మోపియుండు
నంబుజోదరుఁ డంచు నిట్లాంధ్రకృతులఁ
జెప్పిరేని వృత్తప్రాససీస మగును, ౨౮౦

సింధుర=గజేంద్రునికి. ఆభీరకాంతా = గోపస్త్రీలయొక్క.
చూపుచెవులపాన్పునఁ=సర్పశయ్యయందు.

ఇందు నాల్గుసీసపాదములందును "శ్ర" అనునది ప్రాసమగు
టచే నిది వృత్తప్రాససీసమున కుదాహరణము. ఇందును పాదమం
తయు నొకేయక్షరము యతి. ప్రాసయతి సీసపాదములందుండదు.

## సర్వతః ప్రాససీసము

నీరదవర్ణుండు నీరేరుహాక్షుండు
నీరధిబంధనోద్దారబలుఁడు
కారుణ్యరసరాశి గౌరీరసజ్ఞావి
హారిశోభితనామగౌరవుండు
ధీరుండు త్రిభువనాధారుండు దశరథ
క్ష్మారమణేంద్రకుమారవరుఁడు

మారీచదమనుండు నారాచవిద్యావి
శారదుం డసురవిదారణుండు
గీ. ధారుణీసుతానయనచకోరసరసి
జారి యన సర్వతఃప్రాసధారుసీస
మారయఁగ సత్కవిజనవిస్ఫారనుతులఁ
దేరు శ్రీపద్మనాభ శృంగారసార ! ౨౯

గౌరీరసజ్ఞావిహారి=పార్వతీదేవినాలుకయందు విహరించునట్టి; శోభితనామగౌరవుండు=ప్రకాశించు నామధేయగౌరవము గలవాఁడు. పార్వతీదేవి సర్వకాలములందును రామనామోచ్చారణముం జేయుచుండును. కావున నట్లనఁబడెను. సరసిజారి=చంద్రుఁడు; విస్ఫార=విశాలమైన.

ఇందు సీసపాదముల రెండుభాగములందును గీతపద్యమునందునుగూడ నొకేయక్షరము (రేఫము) ప్రాసముగాఁ గూర్పబడినందున సర్వతఃప్రాససీసోదాహరణ మయ్యెను.

ఈపద్య మంతయు రామస్తుతిపరము. ౨౯

అక్కలిప్రాససీసము

ఉరగతల్పునిగాని యుల్లంబులో నిల్ప
శరధితల్పునిగాని సన్నుతింప
మురసంహరునిగాని మ్రొక్కుకొలఁ గయిసేయ
నరమృగేంద్రులఁగాని నమ్మికొలువ
గరుడవాహను పేరుఁగ్గాని వీనులఁ జొన్పఁ
బురుషోత్తమునిగాని పూజ సేయ
హరిప్రసాదముగాని యర్థిమైఁ గొనవొల్లఁ
బరమాత్మువసిగాని భక్తిఁ బూన

గీ. ధరణి నివి నాదు నిత్యవర్తనము లనుచుఁ
బరగువ్రతిఁగాని నీవు చేపట్ట వనిన
జరుగు నక్కిలిప్రాససీసంబు కృతులఁ
బరిభృతాతసీపుష్పాభ! పద్మనాభ! 30

వ్రతిక్=వ్రతముగలవానిని, పరి...పుష్పాభ=వహింపబడిన యగిసెపూవులకాంతిగలవాఁడా—అగిసెపూవులవంటి నల్లనికాంతి గలవాఁడని భావము.

౧౨ స్థలములందుఁ బ్రాసమును మిగిలిన ౧౨ చోట్ల యతియు నిందుఁ గలవు. ఇది యక్కిలిప్రాససీసమున కుదాహరణము. 30

వ డి సీ స ము

కరుణాసముద్రుండు గజరాజవరదుండు
గర్వితాసురశిరఃఖండనుండు
విహగేంద్రవాహుండు విబుధేంద్రవంద్యుండు
విశ్వరక్షాచణవీక్షణుండు
రతిరాజజనకుండు రఘువంశతిలకుండు
రణబలోదగ్రుండు రమ్యగుణుఁడు
గోకులాధీశుండు గోపికారమణుండు
గోవిందుఁ డురుకళాకోవిదుండు

గీ. ననుచు వడిసీసముల నిన్ను నభినుతింతు
రఖిలవిద్యావిశారదు లైనమునులు
పన్నగాధీశతల్ప! నాపాలివేల్ప!
భక్తజనకామ్యలాభ! శ్రీపద్మనాభ! 31

విశ్వరక్షాచణవీక్షణుండు = జగద్రక్షణప్రసిద్ధమైన చూపులుగల

వాఁడు; భక్త...లాభ=భక్తులకామితలాభమును గల్గించువాఁడా !

ఇందుఁ బ్రతిపాదమునందును నొకేయక్షరము నాల్గుయతిస్థానములందును యతిమైత్రికి గ్రహింపఁబడెను. అన్నిస్థానములందును యతి కూర్పఁబడెను. గీతమునను బూర్వార్ధమునందంతట నొకయక్షరమును రెండవయర్ధమునందంతట నొకయక్షరమును యతికి గృహీతములు. ఇది వడిసీసమున కుదాహరణము. ఇందంతట వడియే గృహీతమగుటచే నిది వడిసీస మయ్యెను.

### అక్కిలివడిసీసము

పద్మాక్షి ! యీతఁడే బలి రసాతల మేలు
మని పంపనేర్చిన యధికబలుడు
హరిణాక్షి ! యీతఁడే యలవిభీషణు లంకఁ
బట్టంబు గట్టినబల్లిదుండు
తొయ్యలి యీతఁడే ధ్రువుని నున్నతపదం
బునఁ బ్రతిష్ఠించిన భూరియశుఁడు
ధవళాక్షి ! యీతఁడే ధనువు ద్రుంచినయట్టి
రఘువంశతిలకుండు రాఘవుండు

గీ. బాణబాహావిఖండనప్రౌఢుఁ డితఁడు
నీలగళసుప్తికరబాణనిపుణుఁ డితఁడు
వనుచు నక్కిలివడిసీస మమర, వేల్పుఁ
బడఁతు లభినుతింతురు నిన్నుఁ బద్మనాభ ! ౩౨

నీలగళసుప్తికరబాణనిపుణుఁడు = శివుని నిద్రింపఁజేయుబాణమును ప్రయోగించుటయందు నేర్పరి. బాణాసురుని యుద్ధమున సహాయుడుగా వచ్చినశివునిపై సమ్మోహనాస్త్రమును గృష్ణుఁడు

ప్రయోగించుట యిట ననుసంధేయము. వేల్పుపడతులు = దేవతా యువతులు.

ఇందు సీసపాదములందు రెండుభాగములందును యతులు వేర్వేఱుగా నున్నవి. గీతమునందును నట్లే యేపాదమునకాపాదము యతి వేఱుగా నున్నది. కావున నిది యక్కలివడిసీసమున కుదాహరణము. 32

అవకలిప్రాససీసము

వరదుఁ డుద్యద్గుణాకరుఁడు వియన్నదీ
పాదుఁడు భక్తిప్రమోదకరుఁడు
సింధుబంధనుఁ డబ్జబంధుతారాధీశ
నేత్రుఁడు కాశ్యపగోత్రజుండు
సుగ్రీవవిభుఁడు దశగ్రీవదమనుండు
లలితకంబుగ్రీవవిలసితుండు
పూతనాజీవితనూత్నవస్త్న్యపా
నాభిలోలుఁడు నిత్యశోభనుండు
ఆ. వె. భువనవంద్యుఁ డనుచు నవకలిప్రాససీ
సముల నిన్నుఁ బొగడు నమరసమితి
శరణభరణనిపుణ! వరయోగివిమలహృ
త్పద్మసద్మ! దేవ! పద్మనాభ! 33

లలితకంబుగ్రీవ = లలితమైనశంఖమువంటికంఠముతో, విలసితుండు = ప్రకాశించుచున్నవాఁడు (వర్తమానార్థకక్తప్రత్యయాంతము) సమాసము చేసినచో గ్రీవాశబ్దము స్త్రీలింగము గనుక "గ్రీవా విలసితుఁడని యుండవలసివచ్చును. కావున గ్రీవ+విలసితుండు అని

భిన్నపదములు. స్థిరపరమగుటచే గ్రీవక్ అనుచోట నకారమునకు లోపము "అమరసమితి నిన్నుఁ బొగడు" నని యన్వయము. శరణ= రక్షణమునందును; భరణ=పోషించుటయందును; నిపుణ=నేర్పరి యైనవాఁడా !; హృత్పద్మసద్మ=హృదయపద్మనివాసా !

ఇందుఁ బ్రతిపాదభాగమునందును వేర్వేఱుప్రాసములు ప్రాస యతులు గలవు. ఇది యవకలిప్రాససీసమున కుదాహరణము. ౨౪ స్థలములందును బ్రాసయతులు కలవు. ఇవి భిన్నాక్షరములగుటచే నంతట నేకాక్షరముగల సర్వతః ప్రాససీసముకంటె నిదిభిన్నము. 33

విషమసీసము (ఉత్సాహము)

స్వాహ్వచర్య మమర సప్తసవితృవర్గమును స్వము
త్సాహ మెక్క నొక్క గురుఁడు చరణములు భజింపఁగా
నీహితప్రదానలీల లెసఁగుకమఠమూర్తి ను
త్సాహరీతు లుల్లసిల్ల సంస్తుతింతు రచ్యుతున్. 34

ప్రాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాటవెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహ మది నిల్పు
విషమసీస మమరు విషధిశయన !

సప్తసవితృవర్గము=ఏడు సూర్యగణములును; ఒక్క గురుఁడు= ఒక్కగురువును; ఈహితప్రదానలీలలు=కామితముల నిచ్చుటయనెడు లీలలు; కమఠమూర్తిన్=కూర్మరూపుఁ డగుశ్రీహరిని; ఉత్సాహ రీతులు=ఉత్సాహ మను సీసవిశేషముయొక్క తీరులు; ఉల్లసిల్లన్= ప్రకాశించునట్లు; ఇట్లు = ఈయుత్సాహపద్యమునఁ జెప్పఁబడినవిధ ముగా; ప్రాసములును వడులును = యతిప్రాసములు; విలసితంబు గన్=ప్రకాశింపఁగా; అందుక్ = అచ్చట; ఉత్సాహాంతమునం దని

భావము. ఆటవెలఁది=ఆటవెలఁది యనుపద్యమును; ఒనర్చి=రచించి; ఉత్సాహము నిల్పన్=ఉత్సాహపద్యమును గూర్పఁగాన్; విషమసీసము=విషమసీసనామకసీసవిశేషము; అమరున్=ఒప్పును. విషధిశయన!=జలనిశయనా! (విషము=జలము.)

ఏడుసూర్యగణములును నొక్కగురువును గూడి ప్రతిపాదమునందు నుండి యీయుత్సాహపద్యమునం గూర్పఁబడినతీరున నయిదవగణము మొదటియక్షరమున యతియుఁ బ్రాసమును గూర్చి యుత్సాహాంతమున నాటవెలఁదిని గూర్చినచో విషమసీస మగును. లక్షణపద్యమే యుదాహరణమును.

ఇందు రెండవయర్థమును నీక్రిందితీరున స్ఫురించుచున్నది. ఏడుగురుసూర్యులును నొకబృహస్పతియు నుత్సాహ మధికముగాఁగా నొక్కచోఁ గూడి కామితార్థముల నిచ్చుకమఠరూపుఁ డగునచ్యుతునిచరణములు భజింపఁగా నుత్సాహపద్ధతులతో స్తోత్రము కావింతురు. ఇట్టిరెండవయర్థ మీకవియొక్క భగవద్భక్తిని సూచించుచున్నది.

ఉత్సాహాంతమున నొకగీతి యుండవలయు నని "ఉత్సాహమయ్యె గీతియును బ్రశస్తముగ నొనర్ప" నని కవిజనాశ్రయమునను "గీర్తితాతిమధురగీతియుఁ బైఁ గల్గ" నని కావ్యాలంకారచూడామణియందును "ఉత్సాహమీఁద గీత మొకఁడు మేలవింప" నని యప్పకవీయమునను జెప్పఁబడియున్నది. కాని యనంతామాత్యుఁడు స్పష్టముగా నాటవెలఁదియే యుత్సాహాంతమున నుండవలయు నని శాసించెను. లక్షణసారసంగ్రహమునను "దీన నాటవెలఁది దీకొనఁ గొన నుంచి" యని యాటవెలఁదియే విధింపఁబడెను. అట్లే కవిజనాశ్రయాదు లగుపైగ్రంథముల నన్నింట నుత్సాహాంతమున నాటవెలఁదియే యుదాహరింపఁబడెను. దీనిఁబట్టి గీతి యని విధింపఁబడినను గీతి

భిన్నపదములు. స్థిరపరమగుటచే గ్రీవక్ అనుచోట నకారమునకు లోపము "అమరసమితి నిన్నుఁ బొగడు" నని యన్వయము. శరణ=రక్షణమునందును; భరణ=పోషించుటయందును; నిపుణా=నేర్పరియైనవాఁడా !; హృత్పద్మసద్మ=హృదయపద్మనివాసా !

ఇందుఁ బ్రతిపాదభాగమునందును వేర్వేఱుప్రాసములు ప్రాసయతులు గలవు. ఇది యవకలిప్రాససీసమున కుదాహరణము. ౨౪ స్థలములందును ప్రాసయతులు కలవు. ఇవి భిన్నాక్షరములగుటచే నంతట నేకాక్షరముగల సర్వతః ప్రాససీసముకంటె నిదిభిన్నము. 33

## విషమసీసము (ఉత్సాహము)

సాహచర్య మమర సప్తసవితృవర్గమును సము
త్సాహ మెక్క నొక్కగురుఁడు చరణములు భజింపఁగా
నీహితప్రదానలీల లెసఁగుకమఠమూర్తి ను
త్సాహరీతు లుల్లసిల్ల సంస్తుతింతు రచ్యుతున్. 34

ప్రాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాట వెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహ మది నిల్ప
విషమసీస మమరు విషధిశయన !

సప్తసవితృవర్గము=ఏడు సూర్యగణములును; ఒక్కగురుఁడు=ఒక్కగురువును; ఈహితప్రదానలీలలు=కామితముల నిచ్చుటయనెడు లీలలు; కమఠమూర్తిన్=కూర్మరూపుఁ డగుశ్రీహరిని; ఉత్సాహరీతులు=ఉత్సాహ మను సీసవిశేషముయొక్క తీరులు; ఉల్లసిల్లన్=ప్రకాశించునట్లు; ఇట్లు = ఈయుత్సాహపద్యమునఁ జెప్పఁబడినవిధముగా; ప్రాసములును వడులును = యతిప్రాసములు; విలసితంబుగన్=ప్రకాశింపఁగా: అందున్ = అచ్చట; ఉత్సాహాంతమునం దని

తిక్=సీసలక్షణమును; నిలుపవలయును = అందు సీసపద్యలక్షణముతే యుండవలయు నని భావము.

ఇందు సీసమాలికయందుఁ గడపటిగీతముతోఁ గలిపికొని ౧౨ గాని ౧౮ గాని పాదము లుండవలయు నని చెప్పఁబడుచున్నది. కాని యానియమము కవులు పాటించుచున్నట్లు లేదు. అప్పకవి యనేక సీసమాలికలను వ్రాసెను. బహువిధసంఖ్యాకములైన పాదము లాసీస మాలికలయందుఁ గలవు. అందుచే నిందలి ౧౨, ౧౮ యనుసంఖ్యలు చతురధికబహుత్వసంఖ్య కుపలక్షణముగఁ దెలిసికొనవలయును. ఇతఁడు సీసమాలిక కుదాహరణ మీయలేదు. ౩౬

క. సర్వలఘుసీసమునకు న
ఖర్వాంఘ్రులనడుమ నింద్రగణములమాత్రై
యార్వంచలఘుగణంబులు
నుర్వీధర ! త్రిలఘుయుగము నొకగీతి·తుదన్. ౩౭

అఖర్వాంఘ్రులనడుమన్ = పొడవయిన సీసపాదములందు; ఇంద్రగణములమాత్రై=ఇంద్రగణము లగు నల, నగ, సల, భ, ర, త లకు బదులుగా; ఆర్వంచలఘుగణంబులును=ఆఱుపంచలఘుగణము లును; త్రిలఘుయుగము=మూఁడులఘువుల జత— రెండు నగణము లని భావము. తుదన్=అంతమున ఒకగీతి= ఒకసమగీతిపద్యమును.

సర్వలఘుసీసమునకుఁ బెద్దవియగు నాలుగుపాదములందును నింద్రగణములకుబదులుగా నాఱు పంచలఘుగణములును రెండు నగణములు నుండును. తుద నొకగీతిపద్యమును నుండు నని భావము. గీతమున లఘువులనియమము లేదు.

ఆఱు+పంచలఘుగణములు=ఆర్వంచలఘుగణంబులు— పకార మునకు వకారాదేశము. "కాకా సంబోధనేచాపి హ్యావ్యయే కర్మ

ధారయే" అను నాథర్వణమునుబట్టి వైకల్పికవకారాదేశము. శకట రేఫము "అలఘురేఫము లుప్తాచ్క మగుచో లఘురేఫం బగు. (ప్రౌ. వ్యా. ము. వి. ౨ సూ.) అనురీతిని లఘురేఫ మయ్యెను.

(చూ. అగునయ్య పదాజవపాలు ౧ ఆ. ౬౦ ప.)

"ఇంద్రగణములు మూఁడైె" అనుచోట "మూఁడై" అనుపాఠ మర్థానుగుణముగా నున్నందుప గ్రహింపఁబడెను.

సామాన్యసీసపద్యమునకును దీనికిని లక్షణభేదము గలదు. సామాన్యసీసములందు ౬ ఇంద్రగణములును, ౨ సూర్యగణములును నొక పాదమున నుండును. ఆ యింద్రగణములలో నల, నగము లుండవచ్చును, గాని "నలల" అనుగణ ముండరాదు. నగమునం తమునంగల గురువును రెండులఘువులుగా విభజించి యట్టిగణము లను నాఱింటిని సర్వలఘుసీసమునం గూర్చిరి. కాని సామాన్యసీస మున నిట్టిపంచలఘుగణములు ప్రయోగింపఁబడవు. ఇందుమాత్రమే యిట్టిగణము లంగీకృతములు. 38

## సర్వలఘుసీసము

మృగమదమును, తిలకమును, నగుమొగము, చెలువమును
నలఁతిపవడముఁ దెగడునధరపుటము
వలుదజఘనములుఁ బొలుపలరుకనకపువలువ
కలితకరచరణమణికటకములును
విరులతురుమును నమలిపురినొఱగుమకరికము
రచన నెసఁగినచెవులరవణములును
గలకమలయుగళధృతిమురిళియును ద్రివిధ మగు
వళులకదయు నిటలతటి నెఱిముంగురులు

గీ. చెల్లపమిన్నరేఖభంగి నుల్లసిల్లు
వెడఁదకన్నులఁ గలగోపవేషశౌరి
నాశ్రయించెద ననుచు నిట్లనుర జెప్ప
సర్వలఘుసీసమగు సద్రు జలజనాథ! ౩౮

మృగమదముతిలకముగల గోపవేషశౌరి, నగుమొగముచెలువ ముగల గోపవేషశౌరి అనురీతిగా నఖరపుటమును, జఘనము మున్నగు పదములు "కల" యనుధాతుజవిశేషణముతో నన్వయించును.

మృగమదము=కస్తూరి; చెలువము=సౌందర్యము; తెగడు= నిందించెడి; కలిత...లును=పొందఁబడిన కరములును పాదములును గల మణిమయవలయములు (కరచరణభూషణము లగుకంకణములు నందెలు నని భావము.) విలులితకచము = పూవులతోడి కేశపాశము; మకరికముంచనవెసఁగిన=మొసలియాకారముతోనున్న; చెవులరవణ ములును=కర్ణభూషణములు; మకరకుండలము లని భావము. త్రివిధ మగు నిలుకడ=త్రిభంగియను నొకనాట్యస్థితి; నెఱయు=వ్యాపించుచున్న; వెడద=విశాలము.

ఇందు గోపాలవేషధారియగు హరి వర్ణింపఁబడెను. ఇందుఁ బ్రతిపాదమునందును ౩౨ లఘువులు గలవు. ప్రతిపదమునొకండవ యక్షరమును యతిస్థానము. ౧-౧౧ అక్షరములకును ౨౨-౩౧ అక్షరములకును బరస్పరమైత్రి యని భావము.

సామాన్యసీసము సంబంధించి నిందును ౧-౩ గణములయొక్కయు ౫-౭ గణములయొక్కయు నాద్యక్షరములు యతిస్థానములు. ఇందు మొదటిగీతమును బంచలఘువులగు చంద్రగణములు. తర్వాత రెండు సగణములు. ౩౯

## తరువోజ

(3 ఇం. 1 సూ. 3 ఇం. 1 సూ.)

ముగురు జిష్ణులు త్రయీమూర్తియు మఱియు
ముగురు జిష్ణులు త్రయీమూర్తియుఁ గూడి
యొగి నుండఁ గరయతి నొక్కొక్కచరణ
ముడుగక సేవింప నుజ్జ్వలం బగుచుఁ
దగనుల్లసిల్లు పాదములు నాల్గింటఁ
దనరు వరాహావతారోదయునకు
నిగురొత్తు భావంబు లెసఁగఁ దర్వోజ
నీయోజ నొనరింతు రెల్లసత్కవులు. 38

జిష్ణులు=ఇంద్రగణములు; త్రయీమూర్తి=సూర్యగణము; కరయతి=రెండుగణములకు యతి; అనగా 3-5-2 గణములయాద్యక్షరమున యతి యని భావము. (కరయతి యనుపాఠ మించుకమార్పు గల పాఠమగుటచే గ్రహింపఁబడెను. కరియతి యనుపాఠమున నర్థము కుదురదు.) ఈయోజన్=ఈతీరున; ఇగురొత్తు=అనురక్తములగు.

మూఁడింద్రగణములు నొక సూర్యగణము మరల మూఁడింద్రగణములు నొక సూర్యగణమును వరుసగాఁ బ్రతిపాదమున నుండవలయును. 3- 5- 2 గణముల యాద్యక్షరములు యతిస్థానములు. ఇట్టిపాదములు నాల్గు తరువోజయం దుండును.

ఆదివరాహావతారుఁ డగుహరి నాల్గుపాదములందును నార్వురేసి యింద్రులును నిద్దఱేసి సూర్యులును సేవించుచున్నా రనునర్థాంతరము వ్యంగ్యము.

ఇందు సీసమునందువలెఁ గాక పాదమునంగల యతిస్థానముల నన్నింట నేకాక్షరయతియే యుండును. ప్రాసమును నుండును. 39

## మహాక్కర

(౧ సూ. ౫ ఇం. ౧ చం.)

ఆదివార మాదిగ ననుక్రమమున
నన్నివాసరముల నొక్కినుండు
నాదితేయాధినాథు లేగురు నల
రారంగ నొక్కసుధాకరుండు
నాది హరిఁ గొల్వ రెండును నాలుగు
నగువాసరంబున నర్కుఁ డైన
నాదరంబున నెడనొచ్చు నని మ
హాక్కరం బలుకుదు రార్యు లెల్ల, ౪౦

ఆదివారము = మొదటిపర్యాయము= మొదటిగణ మని భావము. ఇక్లేవాసరశబ్దమునకును పర్యాయ మని యర్థము గ్రాహ్యము. ఒక్క + ఇనుండు = ఒకసూర్యగణము; ఆది తేయాధి నాథులు=ఇంద్రగణములు; సుధాకరుండు=చంద్రగణము.

మహాక్కర యను తెలుఁగుపద్యమునకుఁ బ్రతిపాదంబునను వరుసగా నొకసూర్యగణము నైదింద్రగణములు నొకచంద్రగణము నుండును. ద్వితీయచతుర్థగణము లింద్రగణమునకుబదులు సూర్య గణములైన నుండవచ్చును.

అయిదవగణముమొదటియక్షరము యతిస్థాన మని యుదా హరణపద్యమునుబట్టి తెలియవలయును. ప్రాస ముండును.

ఈపద్యమే యుదాహరణము. ఇందలి మొదటిమూఁడుపాద ములు నొకసూర్యగణమును నయిదింద్రగణములు నొకచంద్రగణ ముతో నున్నవి. నాల్గవపాదమున నాల్గవగణము "ననిమ" యని సూర్యగణమయిన నగణముగా నున్నది. రెండవగణమును నాల్గవ

గణమును సూర్యగణమయినను నుండవచ్చు ననుట కుదాహరణ మీపాదము.

ఈ యక్కరలను కా॥ చూ॥ మాత్రలో వతురము లనియే వ్యవహరించెను. తద్భవముగు నక్కరపద్యములలో మిగిలినవానిని వ్యవహరించిరి.

## మధ్యాక్కరము

(౨ ఇం. ౧ సూ. ౨ ఇం. ౧ సూ.)

ఓజతో నిద్ద ఱింద్రులను నొక్క యాదిత్యుండు మఱియు
రాజితంబుగ నిద్ద అమరరాజులు నొక్కసూర్యుండుఁ
బూజింతు రత్యంతభక్తిఁ బుండరీకాక్షుని నంచు
భ్రాజిల్లుబుధులు మధ్యాక్కరంబు నొప్పారఁ బల్కుగురు ౪౧
ఓజతోఁ గ్రమముతో.

రెండింద్రగణములు నొకసూర్యగణము మరల రెండింద్రగణములు నొకసూర్యగణమును బ్రతిపాదమున నుండును. నాల్గవగణము మొదటియక్షరమున యతియుఁ బ్రాసమును మధ్యాక్కరకునుండును. కవిజనాశ్రయాదులన్నింటను మధ్యాక్కరకు నాల్గవగణముమొదటి యక్షరమే యతి చెప్పఁబడెను. ఎఱ్ఱాప్రెగడయు నట్లే వ్రాసెను. నన్నయ్యమాత్రము ౫ వ గణాద్యక్షరమున యతిని వేసెను. ప్రాచీన శాసనములందును నట్లేయున్నది. దీనినిబట్టి నన్నయానంతరకవులు దీనియతిస్థానమును మార్చి రని యూహింపఁదగును. ఈపద్యమే యీ యక్కర కుదాహరణము. ౪౧

## మధురాక్కరము

(౧ సూ. ౩ ఇం. ౧ చం.)

రవియు నింద్రులు మువ్వురు రాజొకండును గలసి
రవిసుధాకరలోచను రాజితాననసరోజు

రవికులేశుఁ గొలుతు రని ప్రస్తుతింతురు ధరిత్రి
నవిరళం బగు మధురాక్కరాఖ్యచే సత్కవులు. ౪౨

ఒక సూర్యగణము మూఁడింద్రగణములు నొక చంద్రగణమును బ్రతిపాదమున నుండి నాల్గవగణమునాద్యక్షరము యతిస్థానమై ప్రాసముతోఁ గూడియున్నచో మధురాక్కర మగును. ఉదాహరణ మీపద్యమే యగును. ౪౨

### అంతరాక్కర

(౧ సూ. ౨ ఇం. ౧ చం.)

ఇనుఁ డొకండును నింద్రు లిద్దఱును నొక్క
వనజవైరియుఁ గూడి వైభవ మొనర్ప
గనకవస్త్రుని, గృత్తకైటభుని గొల్తు
రనుచుఁ జెప్పుదు రంతరాక్కర బుధులు. ౪౩

కృత్త=ఛేదింపఁబడిన; కైటభుఁడు=కైటభాసురుఁడుగలవాఁడు;

అంతరాక్కరకు సూర్యగణ మొకటియు నింద్రగణములు రెండును నొక చంద్రగణమును బ్రతిపాదమున నుండును. ప్రాస ముండును. మూఁడవగణము తుదియక్షరము యతిస్థానము.

కవిజనాశ్రయ, కావ్యాలంకారచూడామణులయందు నాల్గవ గణము మొదటియక్షరము యతిస్థానముగ నున్నది. కాని యనంతుఁడు నప్పకవియు యతిస్థానము నిట్లు మార్చినట్లున్నది. ౪౩

### అల్పాక్కర

(౨ ఇం. ౧ చం.)

ఒగి నిద్ద, ఱింద్రులు, నొక విధుండు
జగతీధరునిపదాబ్జములు గొల్తు

రగణితభక్తి నం చభినుతింప
నెగడు నల్పాక్కర నియతితోడ. ౪౪

అల్పాక్కరకు రెం డింద్రగణములు నొక చంద్రగణమును బ్రతిపాదమున నుండును. ప్రాస ముండును. మూఁడవగణము మొదట యతి యుండును. ౫౭

## అక్కరల యతినిర్ణయము

విరతిచతుర్గణము మహో
క్కర కేకోనాక్షరత్రిగణ మంతరకుఁ
వరగణయుగయతి నల్పా
క్కర, మధ్యయు మధురయుం ద్రిగణయతుల, హరీ!

అక్కర లయిదింటికిని పనుక గణములనుమాత్రము చెప్పి యతిస్థానములం జెప్పలేదు. అందుచే నీపద్యమున నక్కర లయిదింటి కిని యతిస్థానములం జెప్పుచున్నాఁడు.

మహాక్కరకు, విరతిచతుర్గణము = మహాక్కరకు నాల్గవ గణము యతిస్థానము; అనఁగా నయిదవగణముమొదటియక్షరము యతిమైత్రీస్థాన మని భావము. అంతరకుఁ, ఏకోనాక్షరత్రిగణము= అంతరాక్కర కొకయక్షరము తక్కువ మూఁడుగణములకు యతి; అనఁగా మూఁడవగణము తుదియక్షరము యతిస్థాన మని భావము.

అల్పాక్కర, వరగణయుగయతిన్ = అల్పాక్కర రెండుగణ ములయంతమున యతితో నొప్పును; అనఁగాఁ దృతీయగణాద్యక్ష రము యతిస్థానము.

మధ్యయున్, మధురయుఁ=మధ్యాక్కరయును, మధురాక్క రయును; త్రిగణయతులన్=మూఁడుగణములకు యతులతో నొప్పును; అనఁగా నాల్గవగణము మొదటియక్షరము యతిస్థానము. ౫౮

## షట్పద

మెఱయంగ నిద్దఱి
ద్దఱు సురేంద్రులు మూఁడు
తెఱఁగులన్ శశిఁ గూడ వర్ధంబులన్
నెఱిఁ గ్రాలఁగా వళ్ళు
దొఱుఁగ షట్పదరీతి
వఱలుఁ జక్రిపదాబ్జవర్ణనంబు. ౪౬

ఇద్దఱిద్దఱు సురేంద్రులు మూఁడు తెఱఁగులన్ = రెండేసి యింద్రగణములు మూఁడుపర్యాయములుగాన్—అనఁగా నా ఱింద్ర గణము లని భావము. శశిఁగూడన్=చంద్రగణముతోఁ గూడఁగా; వళ్ళుదొఱుఁగన్=యతులు లేకయుండఁగా; షట్పదరీతిన్=షట్పద పద్ధతితో; చక్రిపదాబ్జవర్ణనంబు=విష్ణునిపాదపద్మవర్ణనము; వఱలున్= ఒప్పును.

షట్పదయం దొక్కొక్కయర్ధమున నా ఱింద్రగణములును నొక చంద్రగణమును నుండును. ప్రథమ ద్వితీయపాదములు వానిలో వరుసగా రెండేసిగణములును తృతీయపాదము మూఁడుగణములును. ప్రాస ముండును. యతి యుండదు. ఒకషట్పదయం దిట్టి యర్ధములు రెండుండును. రెండింటియందును నాఱుపాదము లగుటచే దీనిని షట్పద యందురు. ౪౭

## త్రిపద

సరవిఁ బ్రాసము నొంది సురపతుల్ నల్వురు
హరియుగ్రైకార్కులు, నవల,
జరగ నిప్పగిది నొఁ త్రిపద.

త్రిపదకు మొదటిపాదమున నాలు గింద్రగణములు రెండు మూఁడుపాదములందు రెం డింద్రగణములు నొక సూర్యగణము చొప్పున నుండును. యతి యుండదు. ప్రాస ముండును.

మూఁడుపాదములు కలదగుటచేఁ ద్రిపద యనునామము వచ్చెను. ఇందలి మూఁడవపాదము "జరగ నిప్పగిది నోఁ ద్రిపద"యని సాధుపాఠము గృహీతము. ఇదియే పూర్వముద్రితపాఠమునకు సన్నిహితము. పూర్వముద్రణమున "జరగ నిప్పగిది నొప్పుఁ ద్రిపద"యని యుండెను. అందు గణభంగము గలదు. అందుచే వ్రాఁతప్రతిలోని సరియగుపాఠము గృహీతము.

## ద్వి ప ద

(3 ఇం. ౧ సూ.) యతి- ౩ గ.

ఇంద్రులు, మువ్వురు, నినుఁ డొక్కరుండు
సాంద్రమై, యొక్కొక్కచరణంబుఁ, గొలువ
నలరుఁ బద్మోదరుఁ, డంచు ధీరోత్త
ములు వి స్తరింతురు, ముదముతో, ద్విపద. ౪౮

ద్విపదయందుఁ బ్రతిపాదమునను మూఁ డింద్రగణములును, నొక సూర్యగణమును నుండును. ప్రాస ముండును. మూఁడవగణము మొదటియక్షరము యతిస్థానము. రెండుపాదములు గలదగుటచే ద్విపద యనఁబడును.

"తన యొక్కొకపాదమును మువ్వు రింద్రులు నొక్కసూర్యుఁ డును సేవించుచుండఁగా విష్ణుదేవుఁడు ప్రకాశించుచుండును" అని యర్థాంతరము. ౪౯

## మంజరీ ద్విపద

(౩ ఇం. ౧ సూ.)

శ్రీమందిరాకారు జితదైత్యవీరుఁ
గీర్తించుచోఁ బుణ్యవర్తనుం డనుచు
యతిమాఱు ప్రాస మిట్లచ్చోట నిడక
సరసిజనాభాయ సముదగ్రసాహ-
సాయ నమో యంచు శబ్ద మొక్కటియు
రెండుపాదముల నీక్రియఁ బంచి యిడక
వెలయు ప్రాసములేని ద్విపదమై పరగఁ
బూజింపవలయు వాక్పుష్పమంజరుల. ౪౭

శ్రీమందిరాకారున్ = లక్ష్మికి నివాసమయినరూపము గలవానిన్; జితదైత్యవీరున్=జయింపఁబడిన రాక్షసవీరులు గలవానిని.

మున్ను చెప్పినసామాన్యద్విపదకంటె భిన్నమగు మంజరీద్విపద యనఁబడు వేఱొకద్విపద కింపు లక్షణముం జెప్పుచున్నాఁడు.

దీనికిఁ బాదమునకు మూఁడింద్రగణములును నొక సూర్యగణమును నుండును. మూఁడవగణము మొదటియక్షరము యతిస్థానము. ఇందు యతికిబదులుగాఁ బ్రాసయతి వేయరాదు. ప్రతిపాదాంతమునకును బద మంతయుం బొందవలయును. అనఁగా నొక్కపదము రెండుపాదములందును బ్రవేశించియుండ రాదు. పాదద్వితీయాక్షరమునఁగూడఁ బ్రాస మక్కఱలేదు. ఇట్టిదానిని మంజరీద్విపద యందురు.

"కీర్తించుచోఁ బుణ్యవర్తనుం డనుచు" ఇందు యతి లేదు. ప్రాసయతి గలదు. ఇది చెల్లు నిట్లుండరాదని ప్రత్యుదాహరణముతో విశదీకరించెను.

"సముద్రగసాహ— సాయ" ఇందు "సాహసాయ" అను పదములో మొదటిరెండక్షరములు పూర్వపాదమునను దర్వాతిరెండక్షరములు ననంతరపాదమునను నున్నవి. ఇట్లుండరాదని ప్రత్యుదాహరణమే యిటను జూపెను.

లక్షణమును విశదీకరించుట కుదాహరణప్రత్యుదాహరణములలో నెద్దానినయినం జూపవచ్చును గదా! కావునఁ బ్రత్యుదాహరణము లిందుఁ జూపఁబడెను. ఇందు "ఘను" అనుటకుబదులు "ఘను" అనుపాఠము వ్రాఁతప్రతిలోనిది గ్రహింపఁబడెను.

ఇట్టిద్విపద కవిజనాశ్రయమునఁ జెప్పఁబడలేదు. కావ్యాలంకారచూడామణియందు "వలదు ప్రాసం బంత్రు వరుస మంజరికి" అని ప్రాసరహితద్విపదను మంజరి యని పేర్కొనెను. తర్వాత నప్పకవ్యాదులు దీనిం జెప్పిరి. దీని కంత్యప్రాస ముండిన బాగుగానుండు నని యప్పకవి చెప్పెను. ఉండవలయు నను నియమముఁ జేయలేదు. కనుకనే యాతని మంజరీద్విపదోదాహరణలక్షణపద్యమునఁ గొంతభాగము మాత్రమే యంత్యప్రాసముఁ గూర్చెను. ౭౮

## చౌపదము

క్రలసి చతుర్లఘుగణములయందు
నలిఁ ద్రిగణంబుల నగణము పొందు
నలరు గణద్వయయతి గోవిందుఁ
బలుకఁ గృతులఁ జౌపద చెలువందు. ౭౯

నాల్గుమాత్రలగణములయిన "గా భ జ స నలముల" లో మూఁడుగణములును బిమ్మట నొకసూర్యగణమును బ్రతిపాదమున నుండి మూఁడవగణముమొదట యతి యుండినఁ జౌపద యగును. దీనికి నాల్గుపాదము లుండునుకనుక చౌపద యనఁబడెను. ప్రాస ముండును.

ఇందు నాల్గవగణము నగణ ముండవలయు నని లక్షణమున నున్నది. నగణము సూర్యగణోపలక్షక మని భావింపఁబడెను. నగణములు లేక గలములు (గురులఘువులు) నుదాహరణపద్యమున నుండుటచే నట్లూహింపఁబడెను.

లక్షణానుసారముగా నగణముమాత్రమే యుండవలయు నని తోఁచుచున్నది. అనంతుని కట్టిదే సమ్మతమేమో. మఱెచ్చటను నితఁ డిట్లు నగణ మనఁగా సూర్యగణ మనునభిప్రాయముతో సాధారణముగాఁ బ్రయోగింపఁడు. కాని యీతనియుదాహరణము విరుద్ధముగా నున్నది.

ఇందు నాల్గవగణముకూడఁ జతుర్లఘుగణమే యని యప్పకవి లక్షణము. ఆతని కీయనంతునిపద్యమునందును నట్టిలక్షణముతోడనే "అందును. ఒందును. గోవిందుని, చెలువందును" అని పాదాంతములు కానవచ్చియుండును. లేదా "అందుఁ, ఒందుఁ, గోవిందుఁ, చెలువందున్" అనియయినఁ ఁకారము కానవచ్చియుండును. అనంతునభిప్రాయమునట్లే నాల్గుచతుర్లఘుగణములే యనుటకుఁ "ద్రిగణంబుల నగణము ప్రాంగు" ననులక్షణవాక్యము విరోధించుచున్నది. అనంతుఁడు లక్షణమునఁ జెప్పకున్నను జౌపదయందును వితాళచౌపదయందునుగూడ నంత్యప్రాసముం గూర్చెను. అప్పకవి యట్లంత్యప్రాసముఁ గూర్పలేదు. అప్పకవి కర్ణాటచతుష్పద యని వేఱొకవిధముం జూపెను.

ఈ చౌపద షట్పదత్రిపదలకు మధ్యభాగమున నుండుట యుచితము. లేఖకదోషమున ద్విపదయనంతరమునఁ బడినదేమో. ఈ షట్పదాదులలోఁ బాదసంఖ్యనుబట్టి యారోహణక్రమము గాని యవరోహణక్రమము గాని యితరలాక్షణికు లవలంబించియున్నారు.

ఇందు నవరోహణక్రమ ముండఁగాఁ బ్రమాదమునఁ జౌపద స్థాన భ్రంశము నొందియుండును. కావ్యాలంకారచూడామణియం దట్టి క్రమమే పాటింపఁబడెను. (షట్ప్రాసములకంటె నంత్యప్రాసముండుట చౌపదలకు విలక్షణము. అందుచేతనే కాఁగోలును దీనిని అంతమునం బెట్టెను.)

సూక్ష్మదృష్టి నాలోచింపఁగాఁ జౌపదకుఁ బాదాంతమున గగ ముండవలసియున్నది. కావుననే యప్పకవి నాల్గవదికూడఁ జతుర్లఘుగణమే యగుటచేఁ బాదమునకు ౧౬ మాత్ర లని చెప్పెను. కా॥ చూ॥ యందును బాదాంతమున గగమే ప్రయుక్తము. అనంతుఁడు చాలవఱకు కా॥ చూ॥ నే యనుసరించుచుండును. అనంతుని పద్యమునందును "అందుఁ, ఒందున్, గోవిందుఁ, చెలువందుఁ" అని సరియగుపాఠ మయియుండును. లక్షణమును దదనుసారముగనే యుండియుండును. ("నలిఁ ద్రిగణంబు న్గగమును నొందుఁ" అని యుండెనేమో.) ఎట్లయినను ననంతునిచౌపదలో లేఖకదోషములు చాలవఱకు భ్రాంతికరము లగుట నిశ్చయము.

కవిజనాశ్రయమునను జతుర్లఘుగణములు నాల్గుండుటయే విహిత మయ్యెను. కావున ననంతునిపద్యమునను నాల్గవది గగ మనుటయే యుచితము.

షట్పద, త్రిపద. ద్విపద యని తత్సమపదములుగనే మిగిలినవి యుండ దీనినిమాత్రము "చౌపద" యని తద్భవపదముతో నేల వ్యవహరించిరో. వానికిఁ దద్భవము లంతఁగాఁ బ్రచారమున లేకుండుటచే మానియుందురు. కా॥ చూ॥ యందు దీనిం గూడఁ జతుష్పద యనియే పేర్కొనెను. పూర్వలాక్షణికు లందఱును దీని కంత్యప్రాసముం గూర్చియేయున్నారు. కావున నంత్యప్రాసముకూడ నిం దుండ

వలయుననియే నిశ్చయింపనగును. ఇందలియుదాహరణము నట్లే యున్నదికదా. కానిచో నింద ట్లంత్యప్రాసముం గూర్చియుండఁడు. "నలి నేవైనను నాలుగు వొందుౘ" అని యిందలి ద్వితీయపాద ముండుటయు నుచితము. (అర్థము : అలరు=ఒప్పుచున్న; గణద్వయ యతిౘ=ద్విగణయతితో; గోవిందుౘ=విష్ణుని; పలుకౘ=నుతింపఁగా; కృతులం జౌపద చెలువొందుౘ.) ౫౦

అందు "వితాళ" మను చౌపదము : (౨ సూ. ౨ చతుర్మాత్ర గణములు ౧ లఘువు) యతి ౮ మా. లకు.

> అర్కనామగణ మనువుగ రెండు
> దార్కొని, లఘు, వొందఁగ, నిట్లుండు
> దర్కము గొనఁగ, వితాళము నొండు
> పేర్కొనఁదగు, హరిబిరుదులపిండు. ౫౧

అర్కనామగణము=సూర్యగణములు; (జాత్యేకవచనము) అనువుగా=యుక్తముగా; రెండు=రెండుసంఖ్యను; తార్కొన=కూడి; ఇట్టు=ఇట్లు; లఘువొందఁగౘ = లఘువులుపొందఁగా; ఈలక్షణపద్య మునయున్నట్లు తొమ్మిదిలఘువు లుండఁగా నని యర్థము. తర్కము గొనఁగన్=ఆలోచింపఁగా; వితాళము=వితాళ మనఁబడు; ఒండు= మఱియొక చౌపద; ఉండున్=ఉండును. హరి...పిండు=విష్ణునిబిరుద సమూహమును; పేర్కొనఁదగుౘ= (ఈచౌపదయందు) పేర్కొనఁ దగును.

వితాళచౌపదకుఁ బాదమున రెండుసూర్యగణములును దర్వాతఁ దొమ్మిదిమాత్రలును నుండవలయు నని యప్పకవియుఁ జిత్రకవి పెద్దన రెండుసూర్యగణముల పిమ్మట రెండుచతుర్లఘుగణములును నొకలఘువును నుండవలయు ననియుఁ జెప్పిరి. అనంతునిలక్షణమున

స్పష్టముగా లఘువులసంఖ్య కానరాలేదు. కాని యీరెండులక్షణములు నీపద్యమునఁ బట్టుచున్నవి. మూఁడవపాదమున్మాత్రము "తర్కింపఁగను వితాళమునందు" అని వావిళ్ళవారిముద్రణమున నున్నది. అందు మొదట సూర్యగణము కానరాదు. "వితాళమునందు" అను చోట నర్థమును సరిపడదు. అందుచే "దర్కము గొనఁగ వితాళము నొందు" అని యించుక మార్చితిని. ఇందుఁ దొమ్మిదవమాత్ర యతిస్థానము. ప్రాస ముండును. ఇం దంత్యప్రాసము కూర్పఁబడెను. లక్షణసారసంగ్రహమునను నంత్యప్రాసము కలదు. అప్పకవీయమునమాత్రము నంత్యప్రాసము లేదు. అప్పకవీయము ననుసరించి దీనికిఁ బాదాంతమున గురు వుండవచ్చును. లక్షణసారసంగ్రహమునుబట్టిమాత్రము లఘువే యుండవలయును.

ఈపద్యమున లేఖకదోషము లధికముగాఁ గలిగియుండును. పద్యము సరళముగను సమగ్రలక్షణబోధకముగను లేదు. సరియగు పాఠము లభింపవలసియున్నది,

"వితాళమునందు" ననుపాఠమున దడల కంత్యప్రాసముఁ గూర్చె నని తలంపసగును. కాని యట్టిప్రాసము నీతఁడు చెప్పలేదు.

## రగడలు

క. ఆద్యంతప్రాసంబులు
హృద్యంబుగ రెంట రెంట నిడి పాదములు
ద్యద్యతులఁ గూర్పఁ దగు నన
వద్యం బగు రగడలందు వారిజనాభా ! ౫౨

ఆద్యంతప్రాసంబులు = పాదద్వితీయవర్ణప్రాసము; పాదాంత్యప్రాసము అనునవి రెండును; రెంటరెంటను = రెండేసిపాదములందు; ఇడి=కూర్చి,

నవవిధములగు రగడలయందును రెండేసిపాదముల కాద్యంత ప్రాసములను బ్రతిపాదమునందును (నియతస్థానములందు) యతులను గూర్పవలయును.

అందు "హయప్రచార" రగడ : (౪ సూ.)

హానచతుష్టయంబు, బుతుల.
జనితయతులఁ, జరగుఁ గృతులఁ,
జను హయప్రచారరగడ
వినుతశాస్త్రవిదులు, వొగడ.

హానచతుష్టయంబు=హగణనగణములలో నేవేని నాల్గుగణములు; బుతులన్=ఆఋలఘువులచే; జనితయతులన్=కలిగింపఁబడిన యతులతో; వినుతశాస్త్రవిదులు=కొనియాడఁదగినశాస్త్రవేత్తలు.

హయప్రచారరగడకుఁ బాదమునకు నాల్గుసూర్యగణములుండును. ౭ వ లఘువు యతిస్థానము. ఆద్యంతప్రాసము లుండఁదగునని యుక్తపూర్వమే. ఈలక్షణపద్యమే యుదాహరణము. ఇందుఁ బ్రాసము నాల్గుపాదములందును నొక్కనకారమే యుండుట యాను షంగికము. రెండేసిపాదములకుఁ బ్రాస ముండినఁ జాలును. ౫౩

అందుఁ "దురగవల్గన" మను రగడ : (౮ సూ.)

శ్రీపతీశుఁ, బరమపురుషుఁ జిత్తమునఁ దలంచువారు
వాసవాదినిఖిలదివిజవంద్యు, నాశ్రయించువారు
నిట జనింప, రనఁగ నన్వయించుఁ, దురగవల్గనంబు
పటుదినేశలఘువిరామ, భానుమద్గణాష్టకంబు. ౫౪

ఇటన్=ఈలోకమున; జనింపరు=పుట్టరు; పునర్జన్మము లేదని భావము. పటుదినేశలఘువిరామ=పండ్రెండులఘువులపైని యతిస్ఫూర్తి గల భానుమద్గణాష్టకంబు=ఎనిమిది సూర్యగణములు గలది.

తురగవల్గనరగడయందుఁ బాదమున నెనిమిది సూర్యగణములును బదుమూఁడవలఘువు యతిస్థానముగాను నుండును. హయప్రచారమును రెట్టింపఁగాఁ దురగవల్గన మగును. ౫౪

అందు "విజయమంగళ" మను రగడ : (౧౬ సూ.)

**శ్రీధరాయ శిష్టజననిషేవితాయ భక్తలోక**
**జీవితాయ గర్వితోరుసింధురాజబంధనాయ**
**గాధిపుత్రయజ్ఞవిఘ్నకర మహాసురీమహోగ్ర**
**కాయశైలదళననిపుణ ఘనసురాధిపాయుధాయ**
**కేశవాయతే నమోస్తు కృష్ణ పాహి పాహి యనుచుఁ**
**గేలు మొగిచి మౌళినునిచి కృష్ణుఁ బలికె ననుచు నిట్లు**
**దేసభాషణములఁ జెప్ప ద్విగుణతురగవల్గనమునఁ**
**దేరు విజయమంగళంబు తీయచెఱకురసమునట్లు.** ౫౫

గర్వి...నాయ=గర్వించినమహాసముద్రమును బంధించినవానికొఱకు; గాధిపుత్ర=విశ్వామిత్రునియొక్క; యజ్ఞవిఘ్నకర=యజ్ఞమునకు విఘ్నములను గలిగించుచున్న; మహాసురీ=మహారాక్షసి యగు తాటకయొక్క; మహోగ్రకాయశైల = మహాభయంకరశరీర మను పర్వతముయొక్క; దళన = భేదించుటయందు; నిపుణ=నేర్పుగల; ఘనసురాధిపాయుధాయ=గొప్పది యగువజ్రాయుధ మయినవానికొఱకు.

విజయమంగళరగడకుఁ బాదమున ౧౬ సూర్యగణము లుండును. నాలుగేసిగణముల కొక్కొక యతిచొప్పున నాల్గు యతిస్థానము లుండును. తురగవల్గనరగడను రెట్టించిన విజయమంగళరగడ యగును. ౫౬

అందు "ద్విరదగతి" యను రగడ : (ర పం. మా. గణ.)

శ్రీయువతి నిజయువతిఁ జేసి యెంతయు మించి
కాయజునిఁ దనతనయుఁగా నెలమిఁ బాటించి
సకలదేవతలఁ బరిజనులుగా మన్నించి
ప్రకటగతిశ్రుతుల నుతిపాఠకులఁ గావించి
హరి యొప్పు నన నొప్పు నవతారలఘువిరతి
శరధి, నగ, నలల, భల, సల, త, ర, ల ద్విరదగతి. ౨౬

శ్రుతులన్=వేదములను; అవతారలఘువిరతిన్= పదిలఘువులకు యతితో; శరధి=నాల్గయిన; నగ ... రలన్=నగము మున్నగు పంచమాత్రగణములచేత.

ద్విరదగతిరగడకుఁ బాదమునకుఁ బంచమాత్రగణము లయిన నగ, నలల, భల, సల, త, ర గణములలో నేవేని నాల్గుగణములం గూర్పవలయును. పదునొకండవలఘువు యతిస్థానము. యగణము పంచమాత్రక మయినను నిం దుపయోగింపరాదని గ్రాహ్యము. ౨౬

అందు "జయభద్ర" రగడ : (చ పం. మా. గ.)

శ్రీకి నాథయుం డనఁగఁ జిత్తజుని గురుఁ డనఁగ
శేషశయనుం డనఁగఁ జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసుల నేలు నముచిసూదనుపూజ
నడుమఁ దాఁ గైకొన్న నందగోపాత్మజుఁడు
ఇతనిఁ గొల్చినఁగాని యిహపరంబులు గలుగ
వితరసేవల ననఁగ నెసఁగు నివ్విభుఁ డంచుఁ
జతురమతు లొనరింప జయభద్రరగడ లిటు
చద్విరదగతి వెంటఁ జాటింపులం బెంచు.

నముచిసూదనుపూజన్ = దేవేంద్రునిపూజను; నందగోపాత్మజుఁడు=కృష్ణుఁడు. ద్విరదగతి రెంటఁజాటింపులన్ = ద్విరదగతిరగడను ద్విగుణీకరించుటచే.

జయభద్రరగడకుఁ బాదమున నెనిమిదిపంచమాత్రగణము లుండును. పదేసిమాత్రల కొక్కొకయతి చొప్పున నాల్గుయతిస్థానము లుండును. ద్విరదగతిరగడను రెట్టించిన జయభద్రరగడ యగురు.

నందగోపాత్మజుఁడు+ఇతనిన్; అనుపదములకు సంధి చేయలేదు. పాదాంతవాక్యాంత మగుటచేత సంధి చేయలేదనవచ్చును. "నడుమ" అనుచోటఁ బూర్వముద్రణమున నతఁడు అని యున్నది. అందు యతి చెడుటచే నీపాఠము గ్రహింపఁబడెను. ఇది వ్రాఁత ప్రతులందుఁ గలదు. ౫౭

అందు "మధురగతి" రగడ : (ర చ. మా. గ.)

**శ్రీవనితాధిపుఁ, జేరి భజింపుఁడు**
**భావజజనకుని, భక్తిఁ దలంపుఁడు**
**అని గగనలభసల్లను న్నల్గిటఁ గృతి**
**జను గజలఘువిశ్రమము మదురగతి.** ౫౮

ఈరగడకు జతుర్మాత్రగణము లగు గాభసనలములలో నాల్గుగణము లొక్కొకపాదమున నుండును. ఎన్మిదిలఘువులకు విశ్రమము. అనఁగాఁ దొమ్మిదవలఘువు యతిస్థానము. (చతుర్మాత్రగణ మయినను జగణ మిం దుండరాదు.) పాదాంతవాక్యాంత మగుటచే "తలంపుఁడు" అనుపదమునకు "అని" అనుపదముతో సంధి చేయఁబడలేదు.

అందు "హరిగతి" యను రగడ ; (౮ చ. మా. గ.)

శ్రీరామాకుచకుంకుమపంకము
చేఁ బొలుపగు విపులోరఃఫలకము
తారతుషారపటీరసమానో
దకవాహిని యొదవిన పదకమలము
నతిశయమై యలవడు నేదేవుని
ననవరతోదారత నా హరిగతి
యితరుల కలవడ దని నృపలఘుయతి
నిభ నల గగ భ స ల నగును హరిగతి. ౫౯౯

నృపలఘుయతిన్ = పదునాఱులఘువులకుయతితో; ౧౭ వ లఘువు యతిస్థాన మని భావము. ఇభ = ఎనిమిదిసంఖ్యగల; నల, గగ, భ, సలన్ = నల, గగ, భ, స, గణములతో.

హరిగతిరగడకుఁ జతుర్మాత్రగణము లగు భ, స, నల, గగము లలో నెనిమిదిగణము లొక్కొకపాదమున నుండును. ౧౬ లఘువులకు విశ్రమము. అనఁగాఁ బదునేడవలఘువు యతిస్థానము. ఇందుఁ జతుర్మాత్రగణమయినను జగణ ముపయోగింపరాదు. మధురగతిరగడను రెట్టింపఁగా హరిగతి యయ్యె నని తెలియనగును. ౬౦౦

అందు "హరిణగతి" యను రగడ : (౧ సూ. ౧ చ. మా. ౧ సూ. ౧ చ. మా.)

శ్రీనివాసు భజింతు నే నని
పూని కుజనులపొంతఁ బో నని
భానుయుత నలభసగగంబుల
(లోన నిరుదోలు ననలింబుల

విరవు గాఁగను నేడులఘువుల
నురువు మీఱఁగ నొప్పునెలవుల)
విరతులను గావింప నిమ్మల
హరిణగతి చెలువగు జగమ్ముల, ౬౦

భానుయుత=సూర్యగణములతోఁగూడిన, నల, భ, స, గగం బులలోనఁ=నలము, భగణము, సగణము, గగము అను చతుర్మాత్ర గణములలో, ఇరుదోలు = రెండుజతలు— అనఁగా నాల్గు నలంబు బులన్=సూర్యగణముతోఁగూడిన చతుర్మాత్రగణములతోన్, నగ ణము సూర్యగణములకును నలము చతుర్మాత్రగణములకును బోధకము.

సూర్యగణము, చతుర్మాత్రగణము, సూర్యగణము, చతు ర్మాత్రగణము నను క్రమమునఁ బాదమునకు నాల్గుగణములు కలిగి యేడులఘువుల కనఁగా నెన్మిదవమాత్రయందు యతిని వేయఁగా హరిణగతిరగడ యగును. ఇదియ యుదాహరణము.

ఇందు రెండేసిపాదములకుమాత్రమే ప్రాసముండును.

ఇందు నాల్గేసిపాదములకుఁ బ్రాసము ఘుణాక్షరన్యాయమునఁ బడెనేకాని నియత మని తలంపరాదు.

ఒకగణములజతయం దేడుమాత్ర లుండును. అట్టివి రెండు జత లిందుండును. ౬౧

అందు "వృషభగతి" యను రగడ (౧ సూ. ౧ చ. ౧ సూ. ౧ చ. ౧ సూ. ౧ చ.)

శ్రీమనోహరు నంబుజోదరుఁ
జిత్తజాతగురుం దలంచెదఁ
గామితార్థవిధాయి నిర్జిత
కాళియాహిని నాశ్రయించెద

వనువుగా భసనల్గలు భానుస
మన్వితద్వితయములు నాలుగు
ననిమిషాధిపలఘు యతి నిడఁగ
నలరు వృషభగమనము మేలగు. ౬౧

భానుసమన్వితద్వితయములు=సూర్యగణముతోఁ గూడిన భసనలముల జంటలు; నాలుగున్=నాలుగుసంఖ్య గలవియు, అనిమిషాధిపలఘుయతిని=పదునాల్గులఘువులకు యతితో; మేలు=శ్రేష్ఠము; అనువుగా=ఉచితముగా; భసనలలు=భ, స, నలము లను గణములు.

ఒకసూర్యగణమును "భసనల" అనుగణములలో నొకగణమును గూర్చినజంటలు పాదమునకు నాల్గేసి వృషభగతియందుండును. అనఁగా నొక్కొకజతయందు పదేసిమాత్ర లుండును. అట్టి జతలు పాదమున నాల్గు ఉండునుకావునఁ బాదము ౪౦ మాత్రలు గలిగియుండును. పదునాలుగేసి మాత్రలకు యతి యుండును. నాల్గు యతిస్థానము లుండును. చతుర్మాత్రగణములలో "గా" కూడఁ జేర్పనగునన్నచో; వనువు=అనువయిన; గాభసనలలు=గాభసనలగణములు–అని యర్థము చేయనగును. హరిణగతిరగడను రెట్టింపఁగా వృషభగతి యగును. ఈ రగడ హరిగతి హరిణగతులకు నడుమఁ బూర్వమున ముద్రితము. కాని హరిణగతికి ద్విగుణత నేర్పడు వృషభగతి దానియనంతరమున నుండుట యుచిత మని యట్లు సరిచేసితిని.

## చాటుప్రబంధలక్షణము.

సీ. ఒకపద్యమైన ముక్తకము, రెండును మూఁడు
ద్వికమును త్రికమునై విస్తరిల్లు,

బంచరత్నము లైదు, పరగ నెన్మిది గజా
　　వళికి, నామావళి ద్వాదశంబు,
నెన్నంగ నిరువదియేడు తారావళి,
　　యెనయు ముప్పదిరెండు నేఁబదియును
నూఱు నూటెనిమిది నతి కెక్కు ద్వాత్రింశ
　　దభిదాన, పంచాశదాఖ్య, నాఁగ
ఆ. వె. వెలయు శతక మనఁగ వెండి యష్టోత్తర
　　శతక మనఁగ నిట్లు సకలసుకవి
　　సమ్మతముగ నెగడుఁ జాటుప్రబంధము
　　లభిమతార్థరచన నబ్జనాభ! ౬౨

చాటు వనఁగాఁ బ్రియము. ఎవ్వరినేనిఁ బ్రీతి కలుగునట్లు నుతియించుగ్రంథములు కావున వీనిని జాటుప్రబంధము లందురు. ఇవి మహాప్రబంధములు కాక యల్పప్రబంధములు. ఇవి పలువిధములుగా నుండును. వీనిపేర్లు పద్యసంఖ్యనుబట్టి బహువిధములు. అట్టి వీపద్యమునఁ జెప్పఁబడెను.

| పద్యసంఖ్య. | గ్రంథనామము |
|---|---|
| ౧ | ముక్తకము |
| ౨ | ద్వికము |
| ౩ | త్రికము |
| ౫ | పంచరత్నములు |
| ౮ | గజావళి |
| ౧౨ | నామావళి |
| ౨౭ | తారావళి |

| | |
|---|---|
| ౩౨ | ద్వాత్రింశత్తు |
| ౫౦ | పంచాశత్తు |
| ౧౦౦ | శతకము |
| ౧౦౮ | అష్టోత్తరశతకము |

గజావళికి=గజావళి యను ప్రబంధమునకు, ఎన్మిది=ఎనిమిది పద్యము లుండును. ఈవిధముగాఁ బదునొకండుచాటుప్రబంధములను విశదీకరించెను. ౬౨

## ఉదాహరణలక్షణము

భాసిల్లు సప్తవిభక్తులందును మఱి
సంబోధనంబున సరవి గాఁగఁ
బ్రభునామయుతముగాఁ బద్య మొక్కటియును
దగఁ జెప్పి రగడ భేదమ్ములందుఁ
గళికలు ప్రత్యేకదళము లెన్మిది చేసి
తత్పరార్ధముల నుత్కళిక లనఁగ
నేకసమాసమై యేడుదళంబులు
తుద విభక్త్యర్థంబు దోఁపఁ బలుక
గీ. దాని కెనఁగాఁగఁ జిక్కనదళ మమర్చి
ఫణితు లొడఁగూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టకడపటిపద్య మొక్కటి రచింప
నది యుదాహరణం బగు నబ్జనాభ!

ఉదాహరణ మనుచాటుప్రబంధమునకు స్వరూపమును వివరించుచున్నాఁడు.

ప్రథమావిభక్త్యంతప్రభునామయుక్తమగు ........ ట్లొకపద్య

మును ముందుగాఁ జెప్పి దానియనంతరమున నెనిమిదిపాదములతోఁ రగడభేదమును కళికయనుదానిం గూర్చి పిమ్మట నాల్గుపాదములతో నుత్కళిక యనుదాని నొకరగడం గూర్పవలయును. కళికోత్కళికల యందును బ్రథమావిభక్త్యంతకర్తృపదమే యుండును.

ఈవిధముగా ద్వితీయాదివిభక్తులందును నొకపద్యమును గళికోత్కళికలును ననఁబడు మూఁడేసిపద్యభేదము లుండును. సప్తవిభక్తులును సంబోధనవిభక్తియుం గలసి యీ విభక్తులందును నెనిమిది పద్యములును నంతమున సర్వవిభక్తియుతపద్య మొక్కటియు నుండును. (దానియంతమున నుపసంహారమును నుండును) అని యప్పకవియభిప్రాయము.

అనంతునిపద్యమునంగల భావ మీక్రిందివిధమున నున్నది.

సప్తవిభక్తులయందును సంబోధనవిభక్తియందును బ్రథమనామయుతముగా నొక్కొక్కపద్యమును ముందుగాఁ గూర్పవలయును. దానియనంతరమున రగడభేదములచే నెన్మిదిపాదములతోఁ గళికలను రచించి వానియుత్తరభాగమున నెన్మిదిపాదములతో నుత్కళికలను గూడ రచింపవలయును. ఈ యుత్కళికలం దేడుపాదములు లేకసమాసములుగా నుండవలయును. పాదాంతమునం దాయావిభక్త్యంతము లగుపదములం గూర్చి యెన్మిదవపాదమును బూర్వభాగమునకు సరిపడునట్లు లతుకవలయును. ఇట్లెనిమిదివిభక్తులందును వృత్తము, కళిక, ఉత్కళిక అనువీనిని రచించి తుదను సర్వవిభక్తికపద్యమును గూర్పవలయును. అట్టిది యుదాహరణప్రబంధ మగును.

అప్పకవీయమునందును దీనికిని గొంతభేదము గలదు. ఉత్కళికలం దెన్మిదిపాదము లనియు నవి యేకసమాసములుగా నేడు పాదములఁ గలవనియుఁ జెప్పఁబడెను. అప్పకవీయమున నుత్కళికలు నాల్గుపాదము లని చెప్పఁబడెను. ఏకసమాసనియమమును జెప్పలేదు.

అంతమున బాగ్వా భక్తినిపద్యము కాక వేఱొకపద్య ముండవలసిన ట్లప్పకవి మనముగట్టి తెలిపియున్నది. ఇం దట్టివిషయము కానరాదు. ౮×౩+౧=౨౫ పద్యములే యనంతునిపద్ధతి. అప్పకవి ౨౬ పద్యము లనెను.

గ్రంథాంతమున షష్ఠ్యంతములు... సుదాహరణప్రబంధోదాహరణ ప్రబంధము లెవ్వియు చూపలేదు. దీనికేకాక ముక్తకాదిచాటుకావ్యములకు పేరుకొని సుదాహరణముఁ జూపలేదు. ౬౩

సీ. ప్రథమవిభక్తికిఁ బరఁగు వీరావళి
మఱి ద్వితీయకుఁ గీర్తిమతి దలంప
సుభగాభిధాన మచ్చుగఁ దృతీయకుఁ జతు
ర్థికి భోగమాలిని దృఢము గాఁగ
క్షితిఁ బంచమికిఁ గళావతి కాంతిమతి షష్ఠి
కమరు నుదాత్తసప్తమికిఁ గమల
సంబోధనమునకు జయవతి యీగతిఁ
దగు విభక్త్యధిదేవతాచయంబు
గీ. నెలమి నయ్యావిభక్తుల నెసఁగఁ జెప్పఁ
గావ్యములను సంతోషించి కరుణతోడ
నాత్మనామానురూపఫలాభివృద్ధి
భర్తలకుఁ గర్తలకుఁ జేయుఁ బద్మనాభ! ౬౪

ఉదాత్తసప్తమికి=గొప్పదియగు సప్తమీవిభక్తికి; ఆత్మనామ=తమపేరుకు; అనురూప=అనుగుణమగు; ఫలాభివృద్ధిని=ఫలాభివృద్ధిని; భర్తలకును=కృతిపతులకును; కర్తలకును=కవులకును.

ఉదాహరణప్రబంధము లందు ప్రయుక్తము లగు నష్టవిభక్తులకు నధిదేవతలను చెప్పుచున్నాఁడు. ఆయావిభక్తుల నుపయోగించి

సత్కావ్యములను రచించినచో నాయావిభక్త్యధిదేవతలు వానినామములకుఁ దగినఫలములను గృతికర్తలకును గృతిపతులకును గలిగింతురు. ఆయధిదేవతల నామములవలన ఫలముల నూహింపవలయును గాన వానినామములం జెప్పుచున్నాఁడు.

| విభక్తి. | అధిదేవత. | విభక్తి. | అధిదేవత |
|---|---|---|---|
| ప్రథమకు : | వీరావళి | పంచమికి : | కళావతి |
| ద్వితీయకు : | కీర్తిమతి | షష్ఠికి : | కాంతిమతి |
| తృతీయకు : | సుభగ | సప్తమికి : | కమల |
| చతుర్థికి : | భోగమాలిని | సంబోధనమునకు: | జయవతియు |

నధిదేవత లగుదురు.

"ప్రథమవిభక్తికి" అనుపాఠమున సమాసమునఁ బ్రథమాపదమునకుఁ బుంవద్భావము వచ్చె నని తెలియఁదగును. "ప్రథమా చాసౌ విభక్తిశ్చేతి ప్రథమవిభక్తిః" అని కర్మధారయసమాసముగా భావింపనగును. "మొదటిదియగు విభక్తి" అని సమాసార్థము. "ప్రథమావిభక్తి" యనుపాఠమును నిట నుండవచ్చును. అపుడు ప్రథమ యనునది విభక్తికి సంజ్ఞ కావునఁ బుంవద్భావము రాలేదు. ప్రథమ యను సంజ్ఞగల విభక్తి యని యర్థము.

## షట్ప్రత్యయములు

౧. క్రమమునఁ బ్రస్తారము న
ష్టము నుద్దిష్టమును వృత్తసంఖ్యయు
నమరు లగక్రియయును న
ధ్వము నన షట్ప్రత్యయములు దనరు ముకుందా! ౼౼
బహువిధపద్యలక్షణములను జెప్పి, వృత్తములసంఖ్యాదులను

వివిధపద్ధతులలోఁ దెలిసికొనుటకు సాధనవిశేషములగు షట్ప్రత్యయముల నిందు వివరించుచున్నాఁడు.

ప్రత్యయ మనఁగా జ్ఞానము. (ప్రతీయన్తే అర్థా ఏభిరితి ప్రత్యయాః) వీనివలనఁ బదార్థములు తెలియఁబడును గాన జ్ఞానములు ప్రత్యయము లనఁబడును. వీని నింపఁ గ్రమముగాఁ బ్రస్తారము, నష్టము, ఉద్దిష్టము, వృత్తసంఖ్య, లగక్రియ, అధ్వము అను నామధేయములతో నాఱింటిని నిర్దేశించెను. వాని ప్రక్రియ యానంతరపద్యములందుఁ గ్రమముగాఁ జెప్పఁబడుచున్నది. ౬౨

## ప్రస్తారము

క. చాలుగ సర్వగురువు లిడి
లాలితముగ గురువుక్రింద లఘువును వలప
ట్లోలి సమంబులు, డాపలి
వ్రాలకు గురువులను, నిలుపఁ బ్రస్తార మగున్, ౬౩

చాలుగ=వరుసగా=పంక్తిగా; సర్వగురువులు = అన్నియుఁ గురువులుగా; గురువుక్రిందన్=పంక్తిగా మొదట వ్రాయఁబడినగురువులలో మొదటిగురువుక్రిందను; లఘువును=లఘ్వక్షరమును (లఘ్వక్షరచిహ్నమును); వలపట్లు=కుడిభాగమున (ఉత్తరభాగమున) నున్న స్థానములు; ఓలిన్=వరుసగా; సమంబులు=మీఁదియక్షరచిహ్నములతో సమానచిహ్నములును; డాపలి వ్రాలకు=ఎడమభాగమునఁ గల యక్షరములకు; అనఁగా మొదటిగుర్వక్షరమునకుఁ బూర్వమున నున్న యక్షరములకు. వలపట్లు- ఇది వలకన్ను, వలకేలు మున్నగువానివంటిది. పట్టు=స్థానము. పట్లు=స్థానములు.

ఏఛందమునందలివృత్తమునకుఁ బ్రస్తారము కావలయునో యాఛందమునందలి సర్వగురువృత్తమును ముందుగాఁ బంక్తిగా

లిఖింపవలయును. అనఁగా నెన్నవఛందమో యన్నిగురువులను బంక్తిగా వ్రాయవలయును. వాని క్రింద మొదటిగురువు క్రింద లఘువును వ్రాసి దానితర్వాతియక్షరములను మీఁదిపంక్తితో సమానముగను దానిపూర్వాక్షరములను గురువులుగను వ్రాయవలెను. ఇట్లు సర్వలఘువృత్తము లభించువఱకును ప్రస్తరింపవలయును. అప్పుడాఛందమునం బుట్టిన సర్వవృత్తములందలి గురులఘువివేకములుం దెలియఁబడును.

మూఁడవఛందమునకుఁ బ్రస్తార మిం దుదాహరణముగాఁ జూపఁబడుచున్నది.

U U U (చాలుగ సర్వగురువు లిడి) వరుసగా సర్వగురుచిహ్నములను వ్రాసితిమి.

| U U (లాలితముగ గురువు క్రింద లఘువును) మొదటిగురువు క్రింద లఘువుం జేర్చితిమి. (వలపల నోలి సముంబులు) దానితర్వాతివి యనఁగా 2, 3, స్థానములందు మీఁదిపంక్తితో సమానముగా గురువులను వ్రాసితిమి.

U | U ఇట్లే మూఁడవపంక్తియందును మొదటిగురువు క్రింద (2వ స్థానమున నున్నది) లఘువును దర్వాతి యక్షరమును (3 స్థానముననున్నది) మీఁదిదానివలె గురువును జేసినారము. పూర్వాక్షరము (౧ స్థానమున) ను "డాపలి వ్రాలకు గురువులు" అనుటచే గురువుగా నొనర్చితిమి.

| | U ఇట్లే మిగిలినస్థానములును సర్వలఘువృత్తమువఱకును
U U | ప్రస్తరింపఁగా 3వ ఛందమున ౮ వృత్తములు పుట్టెను.
| U | ఇం దేవృత్తముతోడనయినను బద్యమును రచింపవచ్చును
U | | ఇవియే వరుసగా మ, భ, ర, స, త, భ, జ, న, గణము
| | | లయ్యెను.

ప్రస్తరించుట కొక సూక్ష్మమార్గాంతరమును గలదు. ఎట్లన? మొదటివరుస నొకదానిక్రింద నొకటిగా నొకగురువు నొకలఘువు నను రీతిని వ్రాయవలెను. రెండవవరుసలో ౨ గురువులు ౨ లఘువులు ననురీతి నొకదానిక్రింద నొకటిగా వ్రాయవలయును. మూఁడవవరుసలో ౪ గురువులు నాల్గు లఘువులు ననువరుసను వ్రాయవలయును. ౪వ వరుసలో మూఁడవవరుసకు ద్విగుణముగా ౮ గురువులు ౮ లఘువులును వ్రాయవలయును. ఈరీతి నెన్నవఛందమునకుఁ గావలసిన నన్నివరుసలు క్రిందికి వేయవలయును. వృత్తసంఖ్యంబట్టి యాఛందమున నెన్నివృత్తములు పుట్టునో తెలిసికొని యన్నివరుసలుగాఁ గ్రిందికి గుఱుతులను వేయుచుఁ బ్రస్తరింపనగును. అప్పుడు సర్వలఘు వృత్త మంతమున సిద్ధించును. పూర్వోదాహరణముననే యీతీరు చూచుకొనవచ్చును. ౬౨

## న ష్ట ల బ్ధి

క, సరు లర్ధించినచోటుల
నరయఁగ లఘువులను బేసులం దొక టిడి చె
చ్చెర నర్ధించినచోట్లన్
గురువుల నిడ నష్టలబ్ధి కుంజరవరదా! ౬౩

నష్టలబ్ధి యనునది యేదేనొక్క ఛందమున నేదేనొక్క సంఖ్య గల వృత్తమునకు గణము లెట్లుండునో తెలిసికొనుటకు సాధనమగు ప్రత్యయము.

గణములను మఱచినందున నష్ట మయినవృత్తమును లభింపఁజేయు దీనిచే నగును గావున నిది నష్టలబ్ధి యనఁబడెను.

అర్థము : సరులు = సమసంఖ్యలు; అర్థించినచోటులన్ = సగముగా విభజించినపట్లను; లఘువులను = లఘ్వక్షరములను; బేసులందు = విషమసంఖ్య నర్థించుటకు వలనుపడదు కావున మఱియొక్కటి కూడి యర్థింతురు, అట్టిచోట్లను; గురువులను = గుర్వక్షరములను.

ఎన్నవవృత్తమునకు గణములు కావలెనో యాసంఖ్యను సగము చేయవలయును. అట్లు సమభాగము చేయునప్పుడు విభాగింపఁబడినసంఖ్య సరిసంఖ్య యయినచో లఘువు నొకచోట వ్రాసికొనవలయును. విభాజ్యసంఖ్య బేసిసంఖ్య యయినచో సమవిభాగము కుదురదు కావున నొక్కటి కలిపి దానిని సమవిభాగము చేయవలయును. అట్టిచోట్ల సగముగా నొకటి కలిపి విభజించినచోట్ల గురువులను వ్రాసికొనవలయును. ఈలీలను లఘుగురువులను చిహ్నించుచు నెన్నవఛందమునందలివృత్తమో యన్నియక్షరములు సమకూర్చునంతవఱకును నడుపఁగా నందలిగణములు తెలియును.

## ఉదాహరణము

మూఁడవఛందమున నయిదవవృత్త మెట్లుండునో తెలియుటకయిదుసంఖ్య నర్థింపవలయును. కాని యది బేసిసంఖ్య యగుటచే నొక్కటి కలిపి యాఱుసంఖ్య కాఁగా దాని నర్థించి యొకగురువును గుర్తింపవలయును. ఆ యర్థించినసంఖ్య మూఁడు కావున మరల నొకటి చేర్చి నాల్గు కాఁగా దాని నర్థింపవలయును. ఇప్పుడును బేసిసంఖ్య నర్థించితిమి కావున మరల నొకగురువును గుర్తించితిమి. అర్థింపఁగా వచ్చినసంఖ్య రెండు కావున మరల దీని నర్థింపవచ్చును. ఇది సరిసంఖ్య యగుటచే లఘువును గుర్తింపవలయును. ఇట్లు గుర్తింపఁగాఁ దగణ మేర్పడెను. ఇది మూఁడవఛందమునందలి యైదవ వృత్త మగును.

ఇట్లే యితరవృత్తములను దెలిసికొనునది. ౬౭

## ఉద్దిష్టము

క. ఒక్కటి మొదలుగ నినుమ
డ్లెక్కినచో లఘుయుతంబు లిన్నియుఁ బ్రోగై
యొక్కటి కలియఁగఁ దోఁచును
గ్రక్కున నుద్దిష్ట మిభముఖాశ్యమకజనకా! ౬౮

ఉద్దిష్ట మనఁగా నేదేనియొక వృత్తపాదమును జూపి యిది యెన్నవఛందమున నెన్నవవృత్తమో చెప్పు మన్నఁ దెలిసికొనుటకు సాధనము. ఉద్దేశింపినవృత్తముయొక్క సంఖ్యను దెలియఁజేయునది కావున నుద్దిష్ట మనువ్యవహారము నొందెను. ఉద్దిష్ట మనఁగా "ప్రశ్నింపఁబడినట్టిది" యనునర్థమును గొందఱు వ్రాసిరి.

అర్థము: ఒక్కటిమొదలుగన్ = వృత్తపాదాద్యక్షరమునం దొకటి యనునంకెను జూపి యది మొదలగునట్లుగాన్; ఇనుమడ్లు= ద్విగుణములు; ఎక్కినచోన్ = పొందినచోన్; లఘుయుతంబులు= లఘ్వక్షరములతోఁ గూడిన యంకెలు; ఇన్నియున్=ఇవియన్నియును; ప్రోగై=కూడి; ఒక్కటికలియఁగన్ = ఒకటిసంఖ్య కూడఁగా; ఉద్దిష్టము=ఉద్దిష్టవృత్తసంఖ్యాజ్ఞానము; తోఁచున్=కలుగును.

ఏవృత్తపాదమునకు వృత్తసంఖ్య తెలియవలయునో యావృత్తపాదము నొకచోట వ్రాసి యావృత్తాక్షరములపై వరుసగా ౧, ౨, ౪, ౮, ౧౬ అనురీతి నొకటిసంఖ్యమొదలు రెట్టించుకొనిపోవలయును. తర్వాత లఘ్వక్షరములందలి యంకెల నన్నింటినిఁ గూడి మఱి యొక్కటి కలిపినచో నావృత్తసంఖ్య వచ్చును.

## ఉదాహరణము

రమాపతీ. ఇది నాల్గవఛందమునందలి వృత్తము. ఈఛందమున నిది యెన్నవవృత్తమో తెలిసికొనుటకు ముందుగా నీ యక్షరములపై ౧, ౨, ౪, ౮ అనునంకెలను వేసి నారము.

౧+౪+౧=౬ తర్వాత నిందలిలఘ్వక్షరములగు ప్రథమ తృతీయాక్ష రములందలి యొకటి నాల్గులను గలుపఁగా నయి దయ్యెను. వాని కొక్కటి కలుపఁగా నా అయ్యెను. ఇది నాల్గవఛందమున నాఱవవృత్త మని తెలియఁబడు చున్నది.

## వృత్తసంఖ్య

క. చేకొని ఛందోవర్ణము
లేకాది ద్విగుణితముగ నిడి కడలెక్కం
బ్రాకటముగ రెట్టించిన
శ్రీకరముగ వృత్తసంఖ్య శ్రీనరసింహా! ౬౫

ఛందోవర్ణములు=ఛందస్సునకుఁ గలయక్షరములను; ఏకాది ద్విగుణితముగన్=ఒకటిమొదలుకొని ద్విగుణమగునట్లుగ; ఇడి=వ్రాసి; కడలెక్కన్=తుదియక్షరమునఁ గలయంకెను, రెట్టించినన్=ద్విగుణి తము చేయఁగా; వృత్తసంఖ్య=ఛందములం[illegible] వృత్తములసంఖ్యను తెలియఁజేయు "వృత్తసంఖ్య" యనఁబడుప్రత్యయము.

ఏఛందమున నెన్నివృత్తములు పుట్టునో తెలిసికొనుట కీప్ర త్యయ ముపయోగించును. ఎట్లన, ఎన్నవఛందమునకు వృత్తసంఖ్య కనుఁగొనవలయునో యాఛందోవర్ణములపై వరుసగా ౧, ౨, ౪,

౮, ౧౬ అనుసీతిని నొక్కటి మొదలుగా నంకెలను రెట్టించి తుదివర్ణ మునందలి యంకెను రెట్టింపఁగా వచ్చినసంఖ్య యాఛందమునందలి వృత్తములసంఖ్యయగును.

## ఉదాహరణము

౧; ౨; ౪; ౮

సీతారామా. నాల్గనఛందమున నెన్నివృత్తములు పుట్టెనో తెలియుట కాఛందమునందలి వర్ణములు నాల్గు కనుక వరుసగా నా వర్ణములయందు ౧, ౨, ౪, ౮ అని యంకెలను వేసితిమి. ఇందలి తుదియంకెయగు నెన్మిదిని రెట్టింపఁగాఁ బదునా ఱయ్యెను. ౮×౨= ౧౬ కావున నాల్గవఛందమునఁ బదునాఱువృత్తములు పుట్టెనని తెలియఁబడెను.

## లగక్రియ

క. ఒక్కటి గలసిన ఛందపు
టక్కఱములదొంతి యిడి యుపాంతములతుదఁ
జక్కఁగ నొక్కొక్కటిలోఁ
గ్రక్కున నొడఁగూర్పనగు లగక్రియ కృష్ణా! ౭౦

ఏ ఛందమునయినను నెన్నెసిలఘువులుగలవృత్తములును ఎన్నెసి గురువులుగలవృత్తములును ఎన్నెన్నిపుట్టెనో తెలియుట కీలగక్రియ సాధనము.

ఇందు కొకచక్రమును వేయుపద్ధతిఁ జూపుచున్నాఁడు.

ఏఛందమునకు లగక్రియ కావలయునో యాఛందమునకు గలుగునక్షరములసంఖ్య కొకటి యధికముగాఁ గూర్చి వరుసగా గళ్ళు

లలో నొక్కొకయంకమును వేయువలయును. తర్వాత నావరుసలోఁ మొదిగడికిఁ బూర్వపుగడియంతమువఱకును మీఁదిగడులలోని యంకెల నొకదానిలో నొకటిఁ గూర్చి యామొత్తమును క్రిందివరుసలో వేయుచు గడులను బూర్తి చేయువలయును. అపుడు "లగక్రియ" యేర్పడును.

(ఉపాంతము = అంతమునకు సమీపమున నున్నది. తుదకుఁ బూర్వమున నుండునది యని భావము.)

## ఉదాహరణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౧ | ౧ | ౧ | ౧ | ౧ |
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | |
| ౧ | ౩ | ౬ | ౧౦ | | |
| ౧ | ౪ | ౧౦ | | | |
| ౧ | ౫ | | | | |
| ౧ | | | | | |

= మొదటి వరుసలో నయిదవ ఛందము నక్షరములకొకటిగలిపి యాఱంకెలను వరుసగాఁ (దొంతిగా) వ్రాసితిమి.

= ఉపాంతమగు నయిదవగడి తుదవఱకును మీఁది గడులలోని యంకెలను గూడి రెండవవరుస గడులలో నంకెలను వేసితిమి.

= మూఁడవ గడుల వరుసలోఁగూడ నుపాంతమువఱకును మీఁదవిధముగా మీఁదిగడుల యంకెలనుగూడి వేసితిమి.

= నాల్గవవరుసలో నుపాంతము మూఁడవగడి యగును. కావున నందును మీఁదివిధముగా మీఁదిగడుల కూడికతో గడులను నింపితిమి.

=అయిదవవరుసలో నుపాంతము రెండవది కనుక రెండుగడు లను మీఁదివిధముగా నింపితిమి.

=ఆఱవవరుసలో నుపాంతము మొదటిగడియే యగును. కనుక నందు మీఁదిపద్ధతిని నొకయంకెతోఁ బూర్తి చేసితిమి.

ఇది లగక్రియాచక్రము. ఇందు వరుసలలోని తుదియంకెలు వృత్తములసంఖ్యను దెలియఁజేయును. అనఁగా మొదటివరుసలోని తుదియంకె (౧) సర్వగురువృత్త మిం దొక్కటి యని తెల్పును. రెండవవరుసలోని తుదియంకె (౫) ఏకలఘువృత్తము లయి దని తెల్పును. మూఁడవవరుసలోని తుదియంకె (౧౦) ద్విలఘువృత్తములు పది యని తెల్పును. అట్లే త్రిలఘు చతుర్లఘు పంచలఘు వృత్తముల సంఖ్యలను వరుసగా "పది, అయిదు, ఒకటి" అని తెలుపును.

ఇట్లే సర్వలఘు (నిగ్గురు) ఏకగురు, ద్విగురు, చతుర్గురు, పంచ గురు వృత్తములసంఖ్యలను వరుసగా ౧, ౫, ౧౦, ౧౦, ౫, ౧ అనియుఁ దెలిసికొనవచ్చును. ఈ తెలిసికొనుమార్గ మనంతరపద్యము నం దెప్పఁబడును.

ఈచక్రమును నిలువుగాఁగూడ వేయవచ్చును. అప్పుడు మీఁదివరుసలసంఖ్యలనుబట్టి క్రిందివరుస లేర్పడుటకుబదులు ఎడమ వరుసనుబట్టి కుడివరుస లేర్పడును. అపుడు క్రిందినుండి మీఁదికిఁ గ్రమము కనుక ఉపాంతమనఁగామీఁదిగడికి క్రిందిగడి యగును. అట్లే యొక్కొకవరుసలో నొక్కొకగడి క్రిందికిఁ దగ్గుచుండును.

## ఉదాహరణము

(2)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౧ | ౧ | ౧ | ౧ | ౧ |
| | ౫ | ౪ | ౩ | ౨ | ౧ |
| | | ౧౦ | ౬ | ౩ | ౧ |
| | | | ౧౦ | ౪ | ౧ |
| | | | | ౫ | ౧ |
| | | | | | ౧ |

ఇట్టి చక్రములు నాల్గువిధములుగా నుండవచ్చును.

(3)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | | | | | |
| ౧ | ౫ | | | | |
| ౧ | ౪ | ౧౦ | | | |
| ౧ | ౩ | ౪ | ౧౦ | | |
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | |
| ౧ | ౧ | ౧ | ౧ | ౧ | ౧ |

(4)

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | | | ౧ |
| | | | | ౫ | ౧ |
| | | | ౧౦ | ౪ | ౧ |
| | | ౧౦ | ౬ | ౩ | ౧ |
| | ౫ | ౪ | ౩ | ౨ | ౧ |
| ౧ | ౧ | ౧ | ౧ | ౧ | ౧ |

ఈచక్రములు నాల్గును గలిపి నాల్గుపార్శ్వములుగా నుండునట్లు ఏకచక్రముగాఁగూడ నిర్మింపవచ్చును. అది యీక్రింద వ్రాయఁబడెను. చూచునది.

(౫) చక్రము.




ఇది సర్వతశ్చక్రము. ఇం దంతములందలియంకెలనుబట్టి లగ క్రియఁ దెలిసికొనవచ్చును. ఈచక్రముల నన్నింటను వరుసగాఁ దుది యంకములు ౧, ౫, ౧౦, ౧౦, ౫, ౧ అయియున్నవి. అవి క్రమ

ముగా నిర్లఘు, ఏకలఘు, ద్విలఘు, త్రిలఘు, చతుర్లఘు, పంచలఘు వృత్తములసంఖ్యను దెల్పుచున్నవి. అవియె వ్యుత్క్రమముగా గణించిన నిర్గురు, ఏకగురు, ద్విగురు, త్రిగురు, చతుర్గురు, పంచగురు వృత్తములను దెలుపును.

క. తొలుతఁ బ్రతి సర్వగురు వగు
లలి నేకద్విత్రికాదిలఘుయుతవృత్తం
బులు మఱి ప్రతులగుఁ జక్రా
కలితము లౌనెలవు లగు లగక్రియ గృష్ణా! ౨౧

ఈపద్యమునఁ బూర్వపద్యమున నిర్మింపఁబడినచక్రమునందుఁ దెలిసికొనవలసిన వృత్తములఁ దెలుపుమార్గము నుపదేశించుచున్నాఁడు.

అర్థము: తొలుతఁ బ్రతి = మొదటిగడిలోనియంకె. (సమాన వస్తువులలో నొకవస్తువును "ప్రతి" యని వ్యవహరింతురు.) సర్వగురువగున్=సర్వగురువృత్తములసంఖ్యను దెల్పును. మఱి ప్రతులు= తరువాతిగడులలోని యంకెలు; ఏక.....బులు=ఏకలఘు, ద్విలఘు, త్రిలఘు, చతుర్లఘు, పంచలఘు- ఇత్యాది క్రమముగల వృత్తంబులసంఖ్యలను దెలుపును. చక్రాకలితములౌనెలవులు = చక్రమునందుఁ గూర్పఁబడిన నగుస్థానములు=గడులు=వానియందలి సంఖ్యలు; లగక్రియ=వృత్తములందలి లఘువులను గురువులను దెల్పెడి లగక్రియ యనఁబడుప్రత్యయవిశేషము; అగున్=అగును.

మీఁదిచక్రమునందలి తొలిగడి (తొలివరుసలోనిది) లఘువులులేని వృత్తములసంఖ్యను, రెండవప్రతి యేకలఘువృత్తముల సంఖ్యను, మూఁడవప్రతి ద్విలఘువృత్తసంఖ్యను నీక్రమముగా వృత్తములసంఖ్యను దెల్పును.

ఈచక్రమునం దొక్క-ఛందమునకు సంబంధించిన లగక్రియయే కాక యెన్నవఛందమునకు లగక్రియాచక్రమును రచించితిమో యంతకుఁబూర్వపుఛందముల లగక్రియలుకూడ నందిమిడియుండును. ఉదాహరణకుఁ బూర్వపద్యవ్యాఖ్యయం దయిదవఛంగమునకు లగక్రియ చూపఁబడెను. అందుఁ దుదిస్థానములలోని ౧, ౫, ౧౦, ౧౦, ౫, ౧ అనునవి యయిదవఛందమునకు లగక్రియాఫలితములు. అట్లే నాల్గవఛందమున కుపాంత్యస్థానములందలి ౧, ౪, ౬, ౪, ౧ అనునవి ఫలితములు. అట్లే మూఁడవఛందమునకుఁ దత్పూర్వస్థానములందలి ౧, ౩, ౩, ౧ అనునవియును, రెండవఛందమునకుఁ దత్పూర్వస్థానములందలి ౧, ౨, ౧ అనునవియును ఫలితము లగును.

"పరప్రతులు" అను సమాసము ప్రాణగొడ్డమువంటిదిగా గ్రాహ్యము. ఇట "ప్ర" అనుసంయోగమువలనఁ బూర్వాక్షరము గురువు కాలేదు. సమాసమున సంయుక్తపూర్వాక్షరము గురువు కాకుండుట చాల నరుదు. ఇట్టిప్రయోగ మనంతున కభ్యాసమునను లేదు. కాన "మఱుప్రతులు" అనుపాఠము కవ్యభిప్రేత మనఁదగును. ఈపాఠమునఁ బూర్వోక్తదోషములు వర్తింపవు. సుధీజనులు విచారింపఁ గోరెద. ౭౧

## సగణలగక్రియాంక మగు చక్రము

చ. సగణలగక్రియాంక మగుచక్రమునం దొకఁ డాదిగాఁగఁ ద
ద్ద్విగుణము లడ్డపేఙ్క్తి నొదవింపఁగ వామగృహాంకసంఖ్యతో
నొగిఁ దరువాతి యింట్ల బ్రతులొంద నధోంకముల న్సమాధికం
బగుప్రతిమానుచుం గడమ కొలప్రతుల్ దొరలించి నిల్పఁగాన్.

పూర్వోక్తలగక్రియాచక్రమున నెన్నెనిసి లఘుగురువులు గల వృత్తము లెన్నెన్ని యొక్కొక్క-ఛందమున నుండునో మాత్రమే

తెలియును. ఆవృత్తము లాఛందమున నెన్నవవృత్తము లగునో సగణ లగ్రక్రియాచక్రము తెలియఁజేయును.

గణ మనఁగా గణనము. అనఁగా సంఖ్య. అట్టిగణనముతోఁ గూడినది కావున సగణ మనఁబడును. సగణమగు లగ్రక్రియ యనఁగా వృత్తసంఖ్యతోఁ గూడిన లగ్రక్రియ యని భావము.

అట్టిచక్రనిర్మాణక్రమ మిందుఁ జెప్పఁబడెను.

అర్థము : సగణలగ......నందు=సగణలగ్రక్రియాచక్ర మనఁబడుచక్రమునందు; ఒకఁ డాదిగాఁగన్=ఒకటిమొదలుఁగా; తద్ద్విగుణములు=వాని రెట్టించినయంకములు; అడ్డపీఠిన్=ఎడమనుండికుడికి, అడ్డముగా వ్రాసినవరుసలో; ఒదవింపఁగన్ = నిర్మింపఁగా; వామగృహాంకసంఖ్యతో = ఎడమగడిలోని యంకెతో; తరువాతియిండ్ల ప్రతులు = తరువాతనున్న యడ్డవరుసలోని గడులలోనియంకెలు; ఒందన్=కలియఁగా, అధోంకములన్=క్రిందియంకెలలో; సమాధికంబగుప్రతి=వెనుకవ్రాయఁబడినయంకెలతో సమమగునంకెయు, ఛందోవృత్తసంఖ్యకంటె నధికమగుసంఖ్యయు; మానుచున్=వ్రాయక విడచుచు; కడమకు=శేషించినగడులకు; ఔలప్రతుల్ దొరలించి=ఎడమకుడిగడులయందలి యంకెలను గలిపి వ్రాసినయంకెలకుఁ దరువాతి ప్రతులు; (రెండవ యడ్డవరుసలోని యంకెలకుఁ దరువాత నేర్పడు నిలువువరుసలోనియంకె లని భావము) దొరలించి=మీఁదివానితోఁ గలుపుచు; నిల్పఁగాన్=వ్రాయఁగా.

సగణలగ్రక్రియాచక్రమునందు వరుసగా నొకటిమొదలు రెట్టించుచు నంకెల నెడమనుండికుడికి వ్రాసి పిమ్మట నెడమయంకెను గుడియంకెతోఁ గూడి దానిక్రింద వ్రాయవలెను. తర్వాత నాయంకమును అడ్డవరుసలోనియంకములతోఁ గలుపుచు క్రిందిగడుల నేర్పఱుపవలయును. ఇట్లు నిలువువరుసల నేర్పఱచునపుడు వెనుకటియంకె

లతో సమానమగు నంకెయు, ఛందోవృత్తసంఖ్యకధికమగుసంఖ్యయు వేయరాదు. అట్లే యావలిగడులనన్నింటిని నిర్మింపవలయును.

(1)

| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
|---|---|---|---|---|---|
| | ౩ | | | | |
| | ౫ | | | | |
| | ౯ | | | | |
| | ౧౭ | | | | |

నిర్లఘు (సర్వగురు) వృత్తము

ఏకలఘు వృత్తములు-

అడ్డవరుసలో ౧, ౨, ౪, ౮, ౧౬, ౩౨ అనిద్విగుణాంకములను వేసితిమి.

తర్వాత నెడమకుడియంకెలకు ౧, ౨ అనువానిని కలిపి "౩"అను నంకెను రెండుక్రింద వేసితిమి. ఆ మూఁడిటిని మీఁది రెండిటితోఁ గలిపి యయిదు వ్రాసితిమి.

దానిని నాల్గులోఁ గలిపి తొమ్మిదిని వ్రాసితిమి. దాని నెనిమిదిలోఁ గలిపి ౧౭ వ్రాసితిమి. దానిని ౧౬ తోఁ గలిపినచో ౩౩ అగును. సంఖ్య అది వృత్తసంఖ్యయగు ౩౨ కంటె నధికము కావున వ్రాయక విడచితిమి. ఇంతటితో నీవరుస పూర్తి యయ్యెను.

## సుప్రతిష్ఠాఛందోలగక్రియాచక్రము.

(2)

| | ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
|---|---|---|---|---|---|---|
| నిర్లఘు (సర్వగురు) వృత్తము | | | | | | |
| ఏకలఘు (చతుర్గురు) వృత్తములు | | ౩ | ౬ | | | |
| | | ౫ | ౧౦ | | | |
| | | ౯ | ౧౮ | | | |
| | | ౧౭ | ౭ | | | |
| ద్విలఘు (త్రిగురు) వృత్తములు. | | | ౧౧ | | | |
| | | | ౧౯ | | | |
| | | | ౧౩ | | | |
| | | | ౨౧ | | | |
| | | | ౨౫ | | | |

అడ్డవరుసలోని ౨, ౪ లను గలిపి ౪ క్రింద ౬ వేసితిమి. ఈ ౬ ను ౪ తోఁ గలిపి దాని క్రింద ౧౦ వేసితిమి. ౧౦ యు ౮ యుఁ గలిపి దాని క్రింద ౧౮ వేసితిమి. ఈ ౧౮ ని ౧౬ తోఁ గలిపినను నామొత్తమును ౩౨ తోఁ గలిపినను వృత్తసంఖ్యాధికసంఖ్య లగుటచే విడిచితిమి.

మరల నెడమవరుసలోని ౩ ను ౪ తోఁ గలిపి ౧౮ క్రింద ౭ వేసితిమి. ఈ ౭ ను ౪ తోఁ గలిపి దాని క్రింద ౧౧ వేసితిమి. ఆ ౧౧ ను ౮ తోఁ గలిపి ఆ ౧౧ క్రింద ౧౯ వేసితిమి. ఆ ౧౯ ని ౧౬ తోఁ గాని, ఆమొత్తమును ౩౨ తోఁ గాని కలిపిన నధికసంఖ్యలగుటను గాన విడిచితిమి.

మరల నెడమవరుసలోని ౫ ను ౪ తోఁ గలిపిన ౯ అగును. అది పూర్వసమమగుటచే విడచితిమి. ఆ ౯ ని ౪ తోఁ గలిపి ౧౯ క్రింద ౧౩ వేసితిమి. ఆ ౧౩ ను ౮ తోఁగలిపి ౧౩ క్రింద ౨౧ వేసితిమి. ఈ ౨౧ ని ౧౯ తోఁ గాని ఆమొత్తమును ౩౨ తోఁ గాని కలిపిన నధికసంఖ్యలగుటచే విడిచితిమి.

మరల నెడమవరుసలోని ౯ ని గ్రహించి ౪ తోఁ గలుపఁగా ౧౩ అగును. అది పూర్వసమము. దానిని ౪ తోఁ గలుపఁగా ౧౭ అగును. అదియుఁ బూర్వసమము కావున నా రెండుసంఖ్యలను విడిచితిమి. ఆ ౧౭ ను ౮ తోఁ గలిపి ౨౫ ను ౨౧ క్రింద వేసితిమి. తరువాత నధికసంఖ్యలు గాన విడిచితిమి.

మరల నెడమవరుసలోని ౧౭ ను గ్రహించి ౪ తోఁ గలుఁపగా ౨౧ అగును. అది పూర్వసమమగుటచే విడిచితిమి. ఆ ౨౧ ని ౪ తో కలుపఁగా ౨౫ అగును. అదియుఁ బూర్వసమము కాన విడిచితిమి. ఆ ౨౫ ను ౮ తోఁ గాని, ఆ మొత్తమును తర్వాతియంకెలతోఁ గాని కూడినచో నధికసంఖ్య లగునుగాన విడిచితిమి. ఇంతటితో నా నిలువువరుస పూర్తి యయ్యెను.

**ఉదాహరణము :**

౨. ౨+౪=౬
౬+౪=౧౦
౧౦+౮=౧౮
౧౮+౧౬=౩౪ } అధికములు
౩౪+౩౨=౬౬ }

౯. ౯+౪=౧౩ పూర్వసమము.
౧౩+౪=౧౭ పూర్వసమము.
౧౭+౮=౨౫
౨౫+౧౬=౪౧ } అధికములు.
౪౧+౩౨=౭౩ }

౩. ౩+౪=౭
౭+౪=౧౧
౧౧+౮=౧౯
౧౯+౧౬=౩౫ } అధికములు.
౩౫+౩౨=౬౭ }

౧౭. ౧౭+౪=౨౧ పూర్వసమము.
౨౧+౪=౨౫ పూర్వసమము.
౨౫+౮=౩౩ }
౩౩+౧౬=౪౯ } అధికములు.
౪౯+౩౨=౮౧ }

౫. ౫+౪=౯
౯+౪=౧౩
౧౩+౮=౨౧
౨౧+౧౬=౩౭ } అధికములు
౩౭+౩౨=౬౯

సుప్రతిష్ఠాఛందోలగక్రియాచక్రము.
(౩)

| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| --- | --- | --- | --- | --- | --- |
| | | | ౧౨ | ౨౪ | |
| | | | ౨౦ | ౨౮ | |
| | | | ౧౪ | ౩౦ | |
| | | | ౨౨ | ౩౧ | |
| | | | ౨౬ | | |
| | | | ౧౫ | | |
| | | | ౨౩ | | |
| | | | ౨౭ | | |
| | | | ౨౯ | | |
| | | | ద్విలఘు (త్రిగురు) వృత్తములు | చతుర్లఘు (ఏకగురు) వృత్తములు | పంచలఘు (అగురు) వృత్తము |

ఈమూఁడవ నిలువువరుస వెనుకటిరీతినే నిర్మింపవలయును.

పద్ధతి

౪. ౪+౮=౧౨
౧౨+౮=౨౦

౨౦+౧౬=౩౬ } అధికములు.
౩౬+౩౨=౬౮ }

౬. ౬+౮=౧౪
౧౪+౮=౨౨

౨౨+౧౬=౩౮ } అధికములు
౩౮+౩౨=౭౦ }

౧౦. ౧౦+౮=౧౮  పూర్వసమము
౧౮+౮=౨౬

౨౬+౧౬=౪౨ } అధికములు
౪౨+౩౨+౭౪ }

౧౮. ౧౮+౮=౨౬  పూర్వసమము
౨౬+ ౮=౩౪ }
౩౪+౧౬=౫౦ } అధికములు
౫౦+౩౨=౮౨ }

౭. ౭+౮=౧౫
౧౫+౮=౨౩

౨౩+౧౬=౩౯ } అధికములు
౩౯+౩౨=౭౧ }

౧౧. ౧౧+౮=౧౯  పూర్వసమము
౧౯+౮=౨౭

౨౭+౧౬=౪౩ } అధికములు
౪౩+౩౨=౭౫ }

౧౯. ౧౯+౮=౨౭ పూర్వసమము

౨౭+ ౮=౩౫
౩౫+౧౬=౫౧
౫౧+౩౨=౮౩ } అధికములు

౧౩. ౧౩+౮=౨౧ పూర్వసమము
౨౧+ ౮=౨౯

౨౯+౧౬=౪౫
౪౫+౩౨=౭౭ } అధికములు

౨౧. ౨౧+౮=౨౯ పూర్వసమము

౨౯+ ౮=౩౭
౩౭+౧౬=౫౩
౫౩+౩౨=౮౫ } అధికములు

౨౫. ౨౫+ ౮ =౩౩
౩౩+ ౮ =౪౧
౪౧+ ౧౬=౫౭
౫౭+౩౨=౮౯ } అధికములు

ఇట్లే నాల్గవవరుసయు ౨౪, ౨౮, ౩౦, ౩౧ అనుసంఖ్యలతోఁ బూర్తియగును. ఇట్టిపద్ధతిలగక్రియయే గ్రంథకర్త్రభిప్రేత మని ౭౫వ పద్యమున సుప్రతిష్ఠాఛందస్సగణలగక్రియాచక్రోదాహరణమునుఁబట్టి నిశ్చిత మగుచున్నది.

౪. సుప్రతిష్ఠాఛందోలగక్రియాచక్రము.

| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
|---|---|---|---|---|---|
| | ౩ | ౬ | ౧౨ | ౨౪ | |
| | ౫ | ౧౦ | ౨౦ | ౨౮ | |
| | ౯ | ౧౮ | ౧౪ | ౩౦ | |
| | ౧౭ | ౭ | ౨౨ | ౩౧ | |
| | | ౧౧ | ౨౬ | | |
| | | ౧౯ | ౧౫ | | |
| | | ౧౩ | ౨౩ | | |
| | | ౨౧ | ౨౭ | | |
| | | ౨౫ | ౨౯ | | |
| సర్వగురు (నిర్లఘు) వృత్తము | ఏకలఘు (చతుర్గురు) వృత్తములు | ద్విలఘు (త్రిగురు) వృత్తములు | త్రిలఘు (ద్విగురు) వృత్తములు | చతుర్లఘు (ఏకగురు) వృత్తములు | సర్వలఘు (నిర్గురు) వృత్తము |

ఇది సుప్రతిష్ఠానామకఛందమునకు లగక్రియాపూర్ణచక్రము. ఇందెడమనుండి కుడికి వరుసగా నిర్లఘు, ఏకలఘు, ద్విలఘు, త్రిలఘు, చతుర్లఘు, పంచలఘు వృత్తముల సంఖ్యలు తెలియనగును.

అట్లే కుడినుండి యెడమకు వరుసగా నిర్గురు, ఏకగురు, ద్విగురు, త్రిగురు, చతుర్గురు, పంచగురు వృత్తముల సంఖ్యలు తెలియనగును.

ఆఛందమునందా యా సంఖ్యలవృత్తముల లఘు, గురు సంఖ్య లీచక్రముచేఁ దెలుపఁబడును.

## లగక్రియాచక్రనిర్మాణక్రమము

అడ్డువరుసలో ౧, ౨, ౪ అనురీతిని ద్విగుణాంకములు ముందుగా వేయవలెను. క్రిందవేసిన యంకెను మరల మీఁదియంకెతోఁ గలిపి దాని క్రింద వేయవలెను. ఆయంకె మొదలుకొని వరుసగా లబ్ధముల నడ్డువరుసలోనియంకెలతోఁ గలుపుచు నాయంకెలను గ్రింద (నిలువువరుసలో) వేయవలెను. అట్లుకలుపునపు డాయంకములు పూర్వసమము లయినను, వృత్తసంఖ్యాధికము లయినను మాని వేయుచు మరల వెనుకటి నిలువువరుసలోని తరువాతియంకెలను గ్రహించి యిదేతీరున ముందుగా నడ్డువరుసలోనియంకెనుగూడి దాని క్రిందనున్ననిలువువరుసలో నంకెను వేసి, దానితో నడ్డువరుసలోని తర్వాతియంకెను గూడి క్రింది యంకెను వేయుచుండవలెను. ఈవిధముగా నిలువువరుసలోని యంకెల నడ్డువరుసలోని యంకెలతో గలుపుచుఁ దర్వాతినిలువువరుస నేర్పఱుపవలయును. పూర్వసమమును, వృత్తసంఖ్యాధికమును మీఁదితీరున విడచుచుండవలయును.

పైచక్రమునందలి గడులలో నంకెలను వేఱొకవిధముగను నింపవచ్చును. భేద మత్యల్పము. ఆపద్ధతి యిటఁ జూపబడును.

ఈ సగణలగక్రియాచక్రమున నొకటి మొదలుగా ద్విగుణసంఖ్యల నడ్డువరుసగడులలో వేసినపిమ్మట నెడమగడిలోనియంకెతోఁ దరువాతనున్నగడులలోని యంకెలను గూడి క్రిందివరుసలను నిర్మింపవలయును. అట్టి యథఃస్థితాంకములందు (క్రింది వరుసలయందు) వెనుకటిపంక్తులలోని యంకెలతో సమానమగు నంకెని వ్రాయరాదు. అట్లే యాఛందమునందలి వృత్తసంఖ్య కధికసంఖ్యగలవానినిగూడ వేయరాదు. అట్లు వేయనపుడు శేషించినపంక్తులను వరుసగాఁ బూర్వపద్ధతిని వ్రాయవలయును. అట్లు వ్రాసినచో సగణలగక్రియ యేర్పడును.

## ఉదాహరణములు

౧. మొదటి వరుస

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| | ౩ | | | | |
| | ౫ | | | | |
| | ౯ | | | | |
| | ౧౭ | | | | |

ఒకటి మొదలుగ ద్విగుణము లగు నంకెల నడ్డువీధిని వ్రాసితిమి. ఎడమసంఖ్య యగు ౧ తోఁ దరువాతి సంఖ్య లగు ౨, ౪, ౮, ౧౬, ౩౨ అను సంఖ్యలను గలుపఁగా ౩, ౫, ౯, ౧౭ సంఖ్య లగును. అవి వరుసగాఁ గ్రింద గడులలో వ్రాయఁబడెను.

౨. రెండవ వరుస

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| | ౩ | ౬ | | | |
| | ౫ | ౭ | | | |
| | ౯ | ౧౩ | | | |
| | ౧౭ | ౨౧ | | | |
| | | ౧౦ | | | |
| | | ౧౧ | | | |
| | | ౨౫ | | | |
| | | ౧౮ | | | |
| | | ౧౯ | | | |

అట్లే ౨ మొదలయిన సంఖ్యలతో ననఁగా ౨, ౩, ౫, ౯, ౧౭ అనువానితో వరుసఁగా ముందుగా ౪ ను గూడి ౬, ౭ అను వానిని వ్రాసితిమి. అట్లే ౫ ను ౪ తోఁ గూడినచో ౯ అగును. ౯ వెనుకటివరుసలో నుండుటచే నది పూర్వప్రతితో సమమయ్యె నని విడిచితిమి. తరువాతిదగు ౯ అంకెను ౪ తోఁ గలిపి తరువాతిస్థానమున ౧౩ వేసితిమి. తరువాతిదగు ౧౭ సంఖ్య ౪ తోఁ గలసి ౨౧ అయ్యెను. ఇది తరువాతి ప్రతిలో వేసితిమి. ఇంతటితోఁ గ్రిందివరుసనుండి కలుపుట పూర్తియయ్యెను.

తరువాత నట్లే ౮ సంఖ్యతో నీసంఖ్యలు కూడఁగా ౨+౮=౧౦, ౩+౮=౧౧ అయ్యెను. అవి వరుసగా ౨౧ క్రింద వ్రాసితిమి. ౫ తో ౮ కలుపఁగా ౧౩ అయ్యెను. అది పూర్వసమము కావున విడువఁబడెను. అట్లే ౯+౮=౧౭. ఇదికూడఁ బూర్వసమము కావున విడువఁబడెను. ౧౩+౮=౨౫. ఇది వ్రాసితిమి.

తరువాత నడ్డవీధిలోని ౧౬ తో ౨ మొదలగునవి కలుపఁగా ౨+౧౬=౧౮, ౩+౧౬=౧౯ అయ్యెను. అదియును వ్రాసితిమి. తరువాత ౫+౧౬=౨౧, ౯+౧౬=౨౫ అగును. ఇది పూర్వసమము లగుటచే విడిచితిమి. ౧౭+౧౬=౩౩. ఇది యిందలివృత్తసంఖ్యకు (౩౨) అధికమగుటచే విడచితిమి. ఇంతటితో రెండవరుస పూర్తి యయ్యెను.

౩. మూఁడవవరుస

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| | | | ౧౨ | | |
| | | | ౧౪ | | |
| | | | ౧౫ | | |
| | | | ౨౯ | | |
| | | | ౨౬ | | |
| | | | ౨౭ | | |
| | | | ౨౦ | | |
| | | | ౨౨ | | |
| | | | ౨౩ | | |

ఇట్లే మూఁడవనిలువువరుసతో (౪, ౬ మొదలయినవి) అడ్డ వరుసలోని ౮, ౧౬ అంకెలను గలుపుచుఁ గ్రిందివరుసలలో నాల్గవ వరుస నిర్మింపవలెను. అట్లే నాల్గవనిలువువరుసలోని యంకెలతో నడ్డ వరుసలోని ౧౬ కలుపఁగా నయిదవక్రిందివరుస యేర్పడును.

## ౪. నాల్గవ వరుస

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| | | | | ౨౪ | |
| | | | | ౨౮ | |
| | | | | ౩౦ | |
| | | | | ౩౧ | |

## ౫. సుప్రతిష్ఠ

| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| --- | --- | --- | --- | --- | --- |
| | ౩ | ౬ | ౧౨ | ౨౪ | |
| | ౫ | ౭ | ౧౪ | ౨౮ | |
| | ౯ | ౧౩ | ౧౫ | ౩౦ | |
| | ౧౭ | ౨౧ | ౨౯ | ౩౧ | |
| | | ౧౧ | ౨౬ | | |
| | | ౧౧ | ౨౭ | | |
| | | ౨౫ | ౨౦ | | |
| | | ౧౮ | ౨౨ | | |
| | | ౨౯ | ౨౩ | | |
| నిర్లఘు (సర్వగురు, లేక పంచగురు) వృత్తము | ఏకలఘు (చతుర్గురు) వృత్తములు | ద్విలఘు (త్రిగురు) వృత్తములు | త్రిలఘు (ద్విగురు) వృత్తములు | చతుర్లఘు (ఏకగురు) వృత్తములు | సర్వలఘు (నిర్గురు) వృత్తము |

ఈచక్రము సుప్రతిష్ఠాఛందమునఁ బూర్ణచక్రము. ఇందు మొదటిది లఘువులు లేని వృత్తము. ఇట్లే మిగిలినవరుసలు ఏక, ద్వి, త్రి, చతుః, పంచ లఘు వృత్తములు.

ఇవియే వ్యుత్క్రమముగా నిర్గురు, ఏక, ద్వి, త్రి, చతుః, పంచ గురువృత్తములను దెల్పును.

ఈచక్రములయందలి యంకెలాఖండమునందలి యాయా సంఖ్యగల వృత్తములను దెలుపును.

ఈ సగణలగక్రియాచక్రమునందలి యంకెల నింకొకపద్ధతి ననుసరించియుఁ బూరింపవచ్చును. ఎట్లన, ౧ మొదలుగా ద్విగుణాంకముల నడ్డవీధిలో వేయవలయును. పిమ్మట నొకటిని ౨, ౪, ౮, ౧౬ లతోఁ గూడి 3, ౫, ౯, ౧౭ అనునంకెములను వరుసగాఁ గ్రిందికి రెండుక్రింద వేయవలయును. అట్లే ౨ ను ౪, ౮, ౧౬ లలోఁ గలిపి ౬, ౧౦, ౧౮ అని వేసి తర్వాత నావరుసలోని ౨ క్రింద నున్న యంకెలను నట్లే కలిపి యీవరుసను బూర్తి చేయవలయును. అనఁగా 3 ను ౪, ౮, ౧౬ లలోఁ గలిపి ౭, ౧౧, ౧౯ అని వేయవలయును. పిమ్మట ౫ ను నట్లే ౪, ౮, ౧౬ లలోఁ గలిపి వేయవలయును. అపుడు పూర్వసమము నధికమును విడువవలయును. కనుక ౫ ను ౪ తోఁ గలిపినఁ బూర్వసమమగుటచే విడిచి ౮ తోఁ గలిపి ౧3 ను ౧౬ తోఁ గలిపి ౨౧ యు వేయుదుము. పిమ్మట ౯ ని ౪, ౮ లతోఁ గలిపినఁ బూర్వసమము లగుటచే విడిచి ౧౬ తోఁ గలిపి ౨౫ ను వేయవలయును. తర్వాత ౧౭ ను ౪, ౮, ౧౬ లతోఁ గలిపినఁ బూర్వసమాధికములే యగుటచే బరిత్యక్తములు- ఇట్లే తరువాతివరుసలను నింపవలయును. అనఁగా నిలువువరుసలోని యొక్కొకయంకము నడ్డవరుసలోనియంకములతోఁ గలుపుచుఁ గ్రిందివరుసలను నిర్మింపవలయును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| | ౩ | ౬ | ౧౨ | ౨౪ | |
| | ౯ | ౧౦ | ౨౦ | ౨౮ | |
| | ౭ | ౧౮ | ౧౪ | ౩౦ | |
| | ౧౫ | ౫ | ౨౨ | ౩౧ | |
| | | ౧౧ | ౨౬ | | |
| | | ౧౭ | ౧౯ | | |
| | | ౧౩ | ౨౩ | | |
| | | ౨౧ | ౨౫ | | |
| | | ౨౯ | ౨౫ | | |

అట్లు వ్రాయఁగా నిట్లే చక్రమునందలి యంకములవరుస లేర్పడును.

గీ. ఇందు సమమగునది తొల్త యిండ్ల వ్రాయఁ
బడినసంఖ్యతో సమమైనప్రతికిఁ జేరు
నధిక మగునది వృత్తసంఖ్యాధికంబు
వ్రాయ రివి రెండుప్రతులు చక్రములయందు. ౨౩

పూర్వపద్యమున సమాధికం బగుప్రతి మానవలయు నని చెప్పెను. దానినే యీపద్యమున వివరించుచున్నాఁడు.

సమమగు ప్రతి యనఁగాఁ బూర్వప్రగణముల తో నన్నియంకెలతో సమమయిన దని యర్థము. అట్టి దీనికే చెప్పఁబడినయట్లుగ మరల నట్టివృత్త ముండరాదుకనుక అట్టియంకెను మరల వేయరాదు. అప్లు అధిక మనఁగా నాఛందమున నుండువృత్తములసంఖ్యకంటె నధిక సంఖ్య. అట్టివృత్త ముండుట యసంభవము కావున నట్టిసంఖ్యను గూడ మానవలయును. ఇవి రెండు ప్రకృతులును లగక్రియాచక్రమున వ్రాయరాదని భావము. ౮౩

**సుప్రతిష్ఠకు లగక్రియాచక్రోద్ధారం బెట్టిదనిన.** ౭౪

సుప్రతిష్ఠకు=అయిదవఛందమునకు. ౭౪

**చ. మును గల యొండు రెండు నిట**
**మూఁడుగ మూఁడును రెండు నైదు నై**
**దును నట నాల్గు తొమ్మి దగుఁ**
**దొమ్మిది నెన్మిదియుం బదేడుగా**
**నను వగుపంక్తి రెండు మొద**
**లైనవి నాల్గిట నాలు గాదిగా**
**నెనిమిదిటన్ దదాదికము**
**లెల్లఁ బదాఱిటఁ గూడఁగా నగున్.**

మునుగల=ముందుగానున్న; ఒండు రెండు నిట మూఁడుగ=ఇక్కడి యొక్కటి రెండు అనుసంఖ్యలు కూడఁగా మూఁడుసంఖ్య కాఁగా; (ఇది రెండంకెలకుఁ గ్రింద వ్రాయఁబడెను.)

మూఁడును రెండు నైదును= 3+2=5 కాఁగా (ఇది మీఁదనున్న రెండుతోఁ గ్రిందనున్న మూఁడు కలుపఁగా నేర్పడి యా మూఁడుక్రింద వ్రాయఁబడెను.

అయిదును నట నాల్గు తొమ్మి దగు=మీఁదవ్రాసిన యయి

దును నక్షత్రములలోని నాల్గును గలుపఁగాఁ దొమ్మి దగును. (ఇది యయిదు క్రింద వేయఁబడెను.)

తొమ్మిది నెన్మిదియుఁ బదేను గాక = నిలువువరుసలోని తొమ్మిదియు నక్షత్రములలోని యెన్మిదియుఁ గలిసి ౧౭ అగును. (ఇది తొమ్మిది క్రింద వ్రాయఁబడెను.

పంక్తిక = అడ్డువరుసలో; రెండు మొదలయినవి నాల్గిటఁ గూడఁగాన్ = ౨, ౩ మున్నగునవి నాల్గులోఁ గలిపి ౬, ౭ మున్నగుతీరున వ్రాయవలయును.

నాలు గాదిగా నెన్మిదిటన్ = ౪, ౬ మున్నగునవి యెన్మిదింటఁగలిపి ౧౨, ౧౪ మున్నగుతీరున వ్రాయవలెను. తదాదికము లెల్లఁ బదాఱిటఁ గూడఁగాక అగున్ = ఆ ౮, ౧౨ మున్నగునవి ౧౬ లోఁ గలుపఁగా ౨౪; ౨౮ మున్నగుతీరున నగును.

ఇది సుప్రతిష్ఠా ఛందమునకు లగక్రియాచక్రనిర్మాణపద్ధతిగా నుదాహరింపఁబడెను.

సుప్రతిష్ఠ

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౪ | ౮ | ౧౬ | ౩౨ |
| | ౩ | ౬ | ౧౨ | ౨౪ | |
| | ౫ | ౧౦ | ౨౦ | ౨౮ | |
| | ౯ | ౧౮ | ౧౪ | ౩౦ | |
| | ౧౭ | ౭ | ౨౨ | ౩౧ | |
| | | ౧౧ | ౨౬ | | |
| | | ౧౯ | ౧౫ | | |
| | | ౧౩ | ౨౩ | | |
| | | ౨౧ | ౨౭ | | |
| | | ౨౫ | ౨౯ | | |

ఇది యుదాహరణార్థ చక్రము. ఇందు పలురీతి చూచునది.

ఈ లగ్నక్రియకు శకటచక్ర మని వేఱొక రీతియం కెలుగల యీ చక్రమే యప్పకవి యుదాహరించెను. కాని యందలియంకముల లేఖన పద్ధతి యిందలిపద్యములందుఁ జూపినపద్ధతి కనుగుణము కాదు. కావున నట్టిచక్ర మీగ్రంథమున వ్రాయఁబడిన లక్షణపద్యముల కుదాహరణము కాఁజాలదు. అందుచే నిందలిపద్యమున కనుగుణ మగు లగ్నక్రియాచక్ర ముదాహరింపఁబడెను. ఈచక్రమును శకటచక్ర మనియే వ్యవహరింపవచ్చును. దీనిని గొందఱు పతాకాచక్రమనియు వ్యవహరింతురు.

లీలావతీగణితమున వేఱొకపద్ధతి చూపఁబడెను. లగ్నక్రియా చక్రనిర్మాణమున నింకను బలురీతు లుండవచ్చును. అవి యూహ్యములు.

గిడుగువారు ఛందోదర్పణపీఠికయం దుదాహరించిన లగ్నక్రియాచక్ర మప్పకవి చూపినదే. అది యనంతునిపద్ధతి కనుగుణము కాదు. 259

## అధ్వప్రక్రియ

క. తిరముగ ఛందోక్షరముల
నురుతరముగ వృత్తసంఖ్యయును ద్విగుణములై
పొరి నొక్కొక్కఁడు తొలఁగఁగఁ
బరిశిష్టాంగుళము లధ్వభాగ ముపేంద్రా ! 260

తిరముగన్=స్థిరముగా. ఛందోక్షరములున్=ఛందమునకుఁగల యక్షరములసంఖ్యయు; వృత్తసంఖ్యయును = ఈ వ పద్యమునఁ జెప్పఁబడినతీరున నేర్పడినఛందమునందలి వృత్తసంఖ్యయును; ద్విగుణములై=రెట్టింపఁబడినవై; ఒక్కొక్కఁడు తొలఁగఁగన్=ఒక్కొక్కటి తీసి వేయఁగా; పరిశిష్టాంగుళములు=మిగిలినసంఖ్యగల యంగుళములు;

అధ్వభాగము=ఛందఃప్రస్తారమునకు సరిపడునట్టి భూభాగము అగు నని భావము.

ఏఛందమునైనను బ్రస్తరింపవలయు నన్నచో నెంత వెడల్పు పొడవులు గలభూభాగ మావశ్యకమో తెలియఁజేయుపద్ధతి నధ్వభాగ మని యందురు. ఆపద్ధతి యిందు వివరింపఁబడెను.

ఛందములందలియక్షరముల సంఖ్యను రెట్టించి యాలబ్ధము నుండి యొక్కొక్కటి తీసివేయఁగా మిగిలినసంఖ్యగలయంగుళముల పరిమితి వెడల్పుండవలయును. కుడియెడమల కంతభూభాగ ముండవలయునని భావము.

అట్లే యాఛందమునం దెన్నివృత్తములు పుట్టెనో యాసంఖ్యను రెట్టించి యొక్కటి తీసివేయఁగా మిగిలినసంఖ్యయొక్క పరిమితి గల యంగుళములపొడవుగల భూభాగమును నావశ్యకము. అనఁగా మీఁదినుండి క్రింది కిట్టిపరిమితిగల భూమి యుండవలయు నని భావము.

## ఉదాహరణము

వెడల్పు- ౯ అంగుళములు.

పొడవు- ౬౩ అంగుళములు

సుప్రతిష్ఠకు
అధ్వభాగము.

అయిదవఛందమున నయిదక్షరములుండును గావున నాయయిదును రెట్టింపఁగాఁ బది యగును. అం దొక్కటి తీసి వేయఁగాఁ దొమ్మిది యగును. తొమ్మిదంగుళముల వెడల్పు గల భూమి యీఛందమును బ్రస్తరించుటకుఁ గావలయు నని భావము.

ప్రస్తారమునం దయిదుగురువులు వ్రాయుట కయిదంగుళము లును వానియయిదింటి నడుమనున్న నాలు గంతరభాగములకు నాలు గంగుళములును వెరసి తొమ్మిదంగుళముల పెడల్పుభూమి కావలసి యున్న దని యూహ్యము.

ఇట్లే యిందు ౩౨ వృత్తములు పుట్టును గావున నాయంకెను రెట్టించి యొకటి తీసివేయఁగా ౬౩ అగును. ౬౩ అంగుళములపొడ వుగల భూమి ప్రస్తారమునకుఁ గావలయు నని భావము.

౩౨ వృత్తములకును ౩౨ అంగుళములును ఆ ౩౨ వృత్తముల నడుమనున్న యంతరములు ౩౧ కావున ఆ యంతరాళభాగములకు ౩౧ అంగుళములును వెరసి ౬౩ అంగుళములపొడవుగల భూమియుఁ బ్రస్తారమునకుఁ గావలయు నని భావము.

ఇం దంగుళము లనుమాట యుపలక్షణము. ఒకయక్షరమును వ్రాయుటకుఁ గావలసినభాగ మంగుళశబ్దార్థముగా గ్రహింపవలయును. ఒకయక్షరమునకు లేఖనమున నర్ధాంగుళమే యుపయోగించిరేని పూర్వోక్తభూమిలో నర్ధభాగమే సరిపడును. అట్లే యక్షరమున కంగు ళద్వయ ముపయోగించిరేని పూర్వోక్తభూమికి ద్విగుణభూమి యావ శ్యక మగును. కావున నంగుళశబ్దార్థమును సందర్భానుగుణముగా గ్రహింపవలయును. ౭౬

## సమవృత్తంబుల వెలసు

క, కడపటివృత్తంబుల యిను
మడి లోపలఁ బ్రథమవృత్తమండలిఁ దీర్పన్
వడి నిష్టచ్ఛందంబులఁ
బొడమినవృత్తముల వెలసు పొలుపగుఁ గృష్ణా

ఒకఛందమువఱకునుగల పూర్వఛందము లన్నిటిలో మొత్త మెన్నివృత్తములు పుట్టెనో తెలిసికొనుమార్గము నిట నుపదేశించుచున్నాఁడు.

కావలసినఛందములలోఁ గడపటిఛందమునఁ బుట్టినవృత్తములసంఖ్యను రెట్టించి వానిలో మొదటిఛందమునం బుట్టినవృత్తములసంఖ్యను (రెండు) దీసివేయఁగా మిగిలినసంఖ్య యాఛందములం బుట్టినవృత్తముల వెఱసుసంఖ్య యగు నని గ్రహింపఁదగును.

ఇట్టి ప్రత్యయవిశేషము ననంతుఁడు సప్తమప్రత్యయముగా వివరించెను. ఇట్టిది వృత్తరత్నాకరాదులందుఁ జెప్పఁబడలేదు.

ఉదా: అయిదవఛందమువఱకునుగల ఛందములం దెన్ని వృత్తములు పుట్టెనో తెలిసికొంద మన్నచోఁ బద్ధతి :—

అయిదవఛందమున ౩౨ వృత్తములు పుట్టినట్లు వృత్తసంఖ్యాప్రత్యయముచే నెఱింగితిమి. కాన నా ౩౨ ను రెట్టించి ౬౪ కాఁగా వానిలోఁ బ్రథమఛందమునఁ బుట్టినవృత్తములు రెండు కావున నా సంఖ్య తీసివేయఁగా ౬౨ అయ్యెనుకనుక ౧, ౨, ౩, ౪, ౫, ఛందములం బుట్టినవృత్తము లన్నియుం గలిసి ౬౨ అని తెలియఁబడుచున్నది.

| | | | |
|---|---|---|---|
| ౧ వ | ఛందమునఁ | బుట్టిన వృత్తములు- | ౨ |
| ౨ వ | ,, | ,, | ౪ |
| ౩ వ | ,, | ,, | ౮ |
| ౪ వ | ,, | ,, | ౧౬ |
| ౫ వ | ,, | ,, | ౩౨ |
| | | అన్నియుఁ గలిసినసంఖ్య= | ౬౨ |

మఱియు ఛందోవృత్తముల వెఱసు:—

చ. ఒగిఁ బదుమూఁడుకోటులును
నొప్పుగ నల్వదిరెండులక్షలుఁ
దగఁ బదునేడువేలు నుది
తంబుగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా! యిరువ
దాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ
బంచిన ఛందము లిర్వదాఱిటన్. ౭౮

అన్నిఛందములందును బుట్టినవృత్తము లన్నిటిసంఖ్య నిందు స్పష్టముగాఁ జెప్పెను. అది ౧౩౪౨౧౭౭౨౬ సంఖ్య యయ్యె నని భావము.

గద్యము: ఇది శ్రీవాణీచరణప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యతనుసంభవ సుకవిజనవిధే యానంతనామధేయ ప్రణీతం బయిన ఛందోదర్పణంబునందు జాతిలక్షణలక్షితంబు లగు కందంబులును మాత్రాలక్షణయుక్తంబు లగు గీతులును సీసంబులు నుత్సాహము దరువోజయు నక్కరలు షట్పదయుఁ ద్రిపదయు ద్విపదయు మంజరియుఁ జౌపదయు రగడలును జాటుకావ్యప్రమాణంబులును నుదాహరణంబులును షట్ప్రత్యయంబులును సప్తమప్రత్యయం బైన సమవృత్తముల వెఱసు తెలుఁగు నన్నది తృతీయాశ్వాసము.

శ్రీ:

# ఛందోదర్పణము

## చతుర్థాశ్వాసము

శ్రీధర ! తనురుచివిజితప
యోధర ! యనవరతఘోషయోషిత్పరిపీ
తాధర ! తల్పీకృతవసు
ధాధర ! రిపుభయదఘనగదాధర ! కృష్ణా ! ౧

శ్రీధర=లక్ష్మిని (వక్షస్థలమున) ధరించువాఁడా ! తను......ధర=శరీరకాంతిచే జయింపఁబడినమేఘముగలవాఁడా ! అనవరత=ఎల్లప్పుడును, ఘోషయోషిత్ = వ్రేపల్లెయందలిపడతులచే, పరి...ధర = పానముచేయఁబడు నధరోష్ఠముగలవాఁడా! తల్పీ......ధర= శయ్యగాఁజేయఁబడిన శేషుఁడు గలవాఁడా ! రిపు...ధర=శత్రువులకు భయంకరమయిన కౌమోదకి యనుగదను ధరించువాఁడా !

క. జగమున దోషవివర్జిత
ముగఁ జెప్పఁగవలయుఁ గావ్యములు సత్కవు ల
ట్లగుటన్ దశదోషమ్ములు
తగఁ జెప్పెదఁ బూర్వకవిమతంబుగఁ గృష్ణా ! ౨

"అదోషౌ సగుణౌ సాలంకారౌ కావ్యమ్" అని కావ్యలక్షణ మగుటచే సత్కవులు కావ్యములను దోషరహితములనుగా రచింపవల యును. దోషములను విసర్జించుటకై వానిస్వరూపము తెలిసికొన

వలసియున్నది. కావునఁ బూర్వకవులమతము ననుసరించి ప్రసిద్ధములును ముఖ్యములు నగు దశదోషములను వివరించెదను.

మమ్మటాది సంస్కృతాలంకారికులు బహువిధములగు శబ్దార్థదోషములను నిరూపించిరి. వానిలో నీపదిదోషములు నత్యంతముఖ్యములగుటచే నివి కావ్యములం దవశ్యముగా పరిత్యాజ్యము లగుటచే వివరించెను. కవిజనాశ్రయాదులం దీ మార్గ మవలంబింపఁబడినందున నీతఁడును జెప్పెను. అప్పకవ్యాదు లీదోషవివరణమును గావింపలేదు. "ఏకోహి దోషో గుణసన్నిపాతే" అనున్యాయమున నితరదోషములు క్వాచిత్కముగ సహ్యము లయినను నీ దశదోషములుమాత్ర మెచ్చటను నొక్కటయినను సహింపరానివగుటచేఁ బ్రత్యేకముగాఁ జెప్పఁబడెను.

## దశదోషములు

గీ. పదియుఁ గీడు ఛందోయతిభంగములు వి
సంధికము, పునరుక్తి, సంశయ, మపక్ర
మంబు, వ్యర్థ, మపార్థము మఱి విరూపి
తాపశబ్దవిరోధంబు లనఁగఁ గృష్ణ! 3

'కృష్ణ! ఛందోయతిభంగములు......విరోధంబులు అనఁగఁ బదియుఁ గీడు' అనియన్వయము. ఛందోభంగాదులు పదియును దోషములని భావము. కీడు=దోషములు. కీడుప్రభృతులు నిత్యైకవచనాంతము లగుటచే నుద్దేశ్యము (పదియు) బహువచనాంతమైనను నేకవచనాంతముగాఁ గీడుశబ్దము (విధేయము) ప్రయోగింపఁబడెను.

ఛందోయతిభంగములు=ఛందోభంగయతిభంగములు. విరూపితాపశబ్దవిరోధంబులు=విరూపితములగు నపశబ్దములును, విరోధములును.

## ౧. ఛందోభంగము

క. ఛందోభంగం బగు గురు
వొందెడునెడ లఘువుఁదాఁ బ్రయోగించుట గో
విందా యని పలుకుచోట ము
కుందా యనుచుఁ బలుక నిట్లు కుంజరవరదా! ౪

'గోవింద'! యని పలుకవలసినచోట 'గో' యను గుర్వక్షరమునకు మాఱుగా లఘ్వక్షరము గల 'ముకుంద' యని పలికినచో నది ఛందోభంగమగును. గురుస్థానమున లఘువుం బ్రయోగించుట ఛందోభంగ మని యిందుఁ జెప్పినను నిది యుపలక్షణమగుటచే లఘుస్థానమున గురువుం గూర్చుటయు ఛందోభంగమే యని తెలియ నగును.

"లఘువుగా" ననుపాఠముకంటె "లఘువుఁగా" నను పాఠము సముచితమగుటచే నదియే కృతికర్త్రభిప్రేత మని మార్పఁబడెను.

'గురు వొందెడునెడ లఘువుం బ్రయోగించుట లేదా గురువును లఘువుగాఁ బ్రయోగించుట' అనురీతిగా వాక్యములుండుట సరళము. సహృదయులు గ్రహింతురు.

## ౨. యతిభంగము

ఆ. వె. విమలకమలనేత్ర విశ్వలోకస్తోత్ర
విమలదైత్యకులవినాశ యనుచు
వలయుచోట లేక వడి యొండుచో నుండఁ
బలికిరే నది యతి భంగ మండ్రు. ౫

విమలకమల=పుండరీకమువంటి; విశ్వలోకస్తోత్ర = సమస్తలోకులయొక్క స్తోత్రములుగలవాఁడా! విమల=నిర్మలుఁడా! యతిభంగము=యతిభంగదోషము.

యతి, యుండవలసినస్థలమున నుండక మఱియొకస్థానమున వేయఁబడినచో నది యతిభంగదోషమగును. ఇందు రెండవపాదమున నాల్గవగణము మొదటనుండవలసినయతిమైత్రి మూఁడవగణము తుది యక్షరమునఁ బడుటచే నిది దోషమయ్యెను.

ఈపద్యమున రెండుస్థలములందు పాఠము తప్పుపడియుండును. 2వ పాదముమొదట 'విమల' యనియున్నది. ఇది ప్రథమపాదమునం గూడ నున్నది. ఈపదము తరువాతిపదముతో నన్వయింపవలను పడదు. బహుశః ఇది 'విపుల' అని సాధుపాఠమయి యుండును. అపుడు విపులశబ్దము దైత్యవిశేషణమగును. సకలదైత్యవినాశా యని యర్థమగును. అట్లే నాల్గవపాదమున 'నియతి' యనుపదమును సరి కాదు. నియతిశబ్దము యతిపర్యాయపదములలో నీతఁడు చెప్పలేదు. నియతిశబ్దము నియమదైవాద్యర్థములందుఁ బ్రసిద్ధ మగుటచే నిట "నిహతార్థ" దోషయుక్త మగును. సహృదయు లాలోచింపఁదగును. కావున వ్రాఁతప్రతిలోని "పలికిరే నదియతి" యనుసాధుపాఠము గృహీతము.

౩. విసంధికము

ఆ. వె. అమృత ఉదధిశయన అమర ఈశానుజ
అబ్జమందిరాస్య అబ్జమిత్ర
అనుచు నిట్లు సంధి నెనయనిశబ్దముల్
దొరయుటయ విసంధిదోష మండ్రు. ౬

అమృతోదధిశయన=పాలసంద్రమున పవళించువాఁడా! అబ్జ...మిత్ర=లక్ష్మీముఖపద్మసూర్యుఁడా! సంధి=సంహితను, ఎనయని=పొందని; దొరయుటయ=ఉండుటయే!

అమృత+ఉదధి; అమర+ఈశ; ఆస్య+అబ్జ అనుపదములు సమాసగతము లగుటచే నిత్యముగా సంధికార్యములు చేయవలసి యున్నది. అట్టు లిందు చేయఁబడనందున విసంధిదోష మయ్యెను. "నిత్యా సమాసే" యనుటచే సమాసమునందు సంహిత నిత్యము. ఇట నట్టిసంహిత లేనందున దోషము లయ్యెను.

౪. పునరుక్తము

గీ. తొలుతఁ దా నెద్దియైనను బలికి మఱియు
నదియ పలికినఁ బునరుక్తి యండ్రు బుధులు
శబ్దపునరుక్తి పూర్వోక్తశబ్ద మైన
నర్థపునరుక్తి యేకార్థ మైనఁ గృష్ణ! ౭

తొలుతఁ బలుకఁబడిన శబ్దమునే మరలఁ బల్కినచో శబ్ద పునరుక్తియుఁ దొలుతఁబల్కినయర్థమునే మరలఁ బల్కినచో నర్థపునరుక్తియు నని పునరుక్తిదోషము రెండువిధములు.

గీ. శబ్దపునరుక్తి యగుఁ గాంతిచంద్రుఁ డని వ
చించి మఱి కీర్తిచంద్రుం డటంచుఁ బలుక
నర్థపునరుక్తి యగుఁ గాంతి నమృతకిరణుఁ
డని యశోమృగాంకుం డన నబ్జనాభ! ౮

కాంతిచంద్రుఁడు=కాంతియందుఁ జంద్రునివంటివాఁడు; యశోమృగాంకుఁడు=కీర్తిచంద్రుఁడు; ఇందుఁ బూర్వార్థమునఁ జంద్రుఁడను పదము రెండుసార్లు పలుకఁబడుటచే శబ్దపునరుక్తము, ఉత్తరార్థమున "అమృతకిరణుఁడు, మృగాంకుఁడు" అను పదములు రెండును జంద్రార్థకములే యగుటచే నర్థపునరుక్తము. శబ్దపునరుక్తమునఁ గొన్నిచోట్ల నర్థపునరుక్తియు సంభవించును. అట్టిచోట శబ్దార్థపునరుక్తి

యగును. ఈ పునరుక్తిదోష మనిత్యదోష మగుటచేఁ గొన్నిస్థలముల యందు దోషము గాదు. అట్టిస్థలము లనంతరపద్యమునఁ దెలియ జేయఁబడును.

ఇది పూర్వముద్రణమున నీక్రింది పాఠముతో నున్నది.

గీ. శబ్దపునరుక్తి యగుఁ గాంతిచంద్రుఁ డని వ
చించి మఱి కాంతిచంద్రుఁ డటంచుఁ బలుక
నర్థపునరుక్తి యగుఁ గీర్తి నమృతకిరణుఁ
డని యశోమృగాంకుం డన నబ్జనాభ!

ఇటఁ బూర్వపాఠముకంటె వ్రాఁతప్రతిపాఠము సమంజసముగా నుండుటచే నిదియే గ్రహింపఁబడెను.

పూర్వపాఠమున నర్థము పొందుపడకుండుటచే నట్టి ప్రయోగము సంభవింపదు. ఒకేస్థలమునఁ గాంతిచంద్రుఁడు, కాంతిచంద్రుఁ డని రెండుసార్లు కవి ప్రయోగించియుండఁడు. ఒకపురుషుని వర్ణించు సందర్భమున నొక్కసారియే కాంతి చంద్రుఁ డనుట సంభవించునుగాని రెండుసార్లు కాంతిచంద్రుఁ డనుట సంభవింపదు. ఇట్లే కీర్తినమృతకిరణుఁడు యశోమృగాంకుఁడనుటయు సంభవింపదు. ఒక్కవిషయమును రెండుసార్లు చెప్పరుగదా! ఇది వీప్సాద్యర్థములందే కుదురుపడును. అట్టియసంభవ మీపాఠమున లేదు. ఒక్కపురుషుని కీర్తికాంతులను వర్ణించుచు రెండిటికిని ధావళ్యగుణమునుబట్టి చంద్రునే యుపమానముగాఁ జెప్పుట సంభవించును. అట్టితఱి చంద్రపదము పునరుక్తమయి యర్థపునరుక్తియు సంభవించును. అట్టివి దోషము లని యిటఁ జెప్పఁబడెను.

**క. పునరుక్తిదోష మొందదు**
**దనరుపదావృత్తి నభిమతంబుగ వీప్సన్**

జను వినుతాభీక్ష్ణ్యంబునఁ
బొనరు క్రియాసమభిహారమున నంద్రుడు హరీ! ౮౭

విశేషే.ణాప్తుమిచ్ఛ వీప్స. ప్రత్యేకముగా నొక్కొక్క వస్తువును మరల మరల పొందఁదలంచుట. ఇంటింటన్, ఏటేటన్ మున్నగునవి. ప్రతియింటను, ప్రతియేటను అనుతీరు నర్థముగలవి.

ఆభీక్ష్ణ్య మనఁగా మాటిమాటికి నని యర్థము. ఒకపనిని పలుసార్లు చేయుట. క్రియాసమభిహార మనఁగా నొకక్రియ పలుసార్లు చేయుట. ఆభీక్ష్ణ్యమున సమాపకక్రియ కావృత్తి యుండదు. క్రియాసమభిహారమున సమాపకక్రియ కావృత్తి యుండును. ఇదియే యీ రెండింటి భేదము. వీప్సయందు నామవాచకముల కావృత్తి గల్గును.

"ఓహరీ! చను (నట్టి) వినుతాభీక్ష్ణ్యంబునన్; పొనరు (నట్టి) క్రియాసమభిహారమునన్, వీప్సన్=(వీప్సయందును) అభిమతంబుగఁ, దనరునట్టి పదావృత్తిచేఁ బునరుక్తిదోషము జెందదు" అని యన్వయము. వీప్సాదిత్రయమునఁగల్గు పదావృత్తిచేఁ బునరుక్తిదోషము కలుగదని భావము.

సీ. ఈవెన్నముచ్చు దా నిల్లిల్లు దప్పక
చొచ్చుఁ బొమ్మన వీప్స సొంపుమిగుల
నిటు వచ్చివచ్చి నీ వేలనిల్చితి కృష్ణ
యనిన నాభీక్ష్ణ్యంబు పొనరియుండు
నిమ్మిమ్ము శౌరికి నిమ్మపం డనఁ గ్రియా
సమభిహారంబు ప్రశంస కెక్కు
నీచక్కఁదనమును నీమంచితనమును
బ్రీతిఁ గన్గొని ధాత్రి బ్రేత లైరి

ఆ. వె. దండకావనంబుతాపసు లనఁ బదా
వృత్తి యుల్లసిల్లు విమలకృతుల
భూరిపుణ్యశీల ! పునరుక్తిలాలన
ప్రకటబాల్యశోభ ! పద్మనాథ ! ౧౦

పూర్వపద్యోక్తము నుదాహరణములచే నిందు విశదీకరించుచున్నాఁడు.

వెన్నముచ్చు=వెన్నదొంగ- కృష్ణుఁడు; ఇల్లిల్లు=ప్రతియింటిని; పొమ్మి=నిశ్చయము; పొనరియుండును = ఒప్పియుండును; వ్రేతలు=గోపికలు; కృతులన్=కావ్యములందు; భూరిపుణ్యశీల !=గొప్పపుణ్యస్వభావముగలవాఁడా !

పునరుక్తి...శోభ=పునరుక్తులచేనగు బుజ్జగింపులచేఁ బ్రకటమగు బాల్యవయశ్శోభ గలవాఁడా !

"దండకావనఋషు లితనియందమును మంచితనమును రామావతారమునం గన్గొని భూమి యందుఁ దాము గోపిక లయి కృష్ణావతారకాలమున జన్మించిరి" అనుకథ యిట ననుసంధేయము. దండకావనఋషులు ధాత్రిని వ్రేత లయిరి యని యన్వయము.

ఈపద్యమున "ఇల్లిల్లు" అను వీప్సయందును "వచ్చివచ్చి" అను నాభీక్ష్ణ్యమునందును "నమ్మిమ్మి" అను క్రియాసమభిహారమునందును బునరుక్తి యున్నను దోషము లేదని తెలుపఁబడెను.

౫. సంశయము

ఆ. వె. కడఁగి వానిఁ గదియఁగాఁ గదా నేఁడు నీ
కింతవట్టు గలిగె నిందువదన !
ఊరకున్నఁ గలదొకో యని సంశయా
ర్థముగఁ బలుక సంశయము ముకుంద ! ౧౧

ఇందువదన=ఓ చంద్రముఖీ !; కడఁగి=యత్నించి; వానిన్=అతనిని; కదియఁగాఁగదా=కలియుటచేతఁగదా !; నీ కింతవట్టు కలిగెన్=నీ కింతవఱకు వచ్చినది; ఊరకున్నన్=కలియక యున్నచో; కలదో=ఇది లభించునా ?; సంశయార్థముగన్=సంశయాస్పద మగు నర్థము కలదిగా.

ఆతనికలయికవలనఁ గలిగినది లాభమో నష్టమో స్పష్టముగా నిటఁ దెలియఁబడక సంశయముగా నున్నందున నిది సంశయ మను దోషమున కుదాహరణ మగుచున్నది.

౬. అపక్రమము

కం. పదమున నాభికమలమున
హృదయమునఁ బయోజభవరతీశ్వరదివిష
న్నదు లుదయించెం గమలా
స్పదునకు నను వ్యుత్క్రమం బపక్రమ మయ్యెన్.

పయోజభవరతీశ్వరదివిషన్నదులు=బ్రహ్మ, మన్మథ, గంగానదులు; కమలాస్పదునకు=లక్ష్మికి నివాసమైన విష్ణుదేవునికి; వ్యుత్క్రమము=వరుసఁదప్పుట.

ఇందు విష్ణుని పాద, నాభి, హృదయములందు వరుసగా గంగా చతుర్ముఖమన్మథులు జన్మించి రని చెప్పవలసియుండఁగాఁ గ్రమమును దప్పించి "బ్రహ్మమన్మథగంగ" లని చెప్పుటచే నపక్రమదోష మయ్యెను. నిర్దేశప్రతి నిర్దేశములకుఁ గ్రమము తప్పినచో నన్వయభ్రాంతి కలుగును గాన నిది యొకదోష మయ్యె నని యూహింపనగును. మన్మథుఁడు మనోజుఁ డగుట ప్రసిద్ధము. "శంబరారి ర్మనసిజః" అని యమరము.

౩. వ్యర్థము

కం. మును దాఁ బలికినమాటకు
నను గుణములు గాక వ్యర్థ మగుమాటలతోఁ
బెనఁచిన నది వ్యర్థం బనఁ
జను దోషం బనిరి కావ్యచతురులు కృష్ణా! ౧౩

కావ్యచతురులు=కావ్యనిపుణులు.

మొదటఁ దానుబల్కినమాట కనుగుణముగా నుండక నిష్ప్రయోజనము లగుమాటలం బెంచినచో నది వ్యర్థదోష మని చెప్పఁబడు నని భావము.

ఆ. వె. త్యాగి వగుదు నీవు తారంబు వెట్టవు
చేరి నిన్ను నడుగువారు పెద్ద
లింకఁ గీర్తి ప్రాఁతియే యని యొరుఁ బల్క
వ్యర్థదోష మండ్రు వనజనాభ! ౧౪

నీవు త్యాగి (దాత) వగుదువు. తారంబు=నాల్గుకాసుల చిన్ననాణెము (మూఁడుపైసలు విలువది); పెట్టవు=ఈయవు, ప్రాఁతి =దుర్లభము; నీవు గొప్పదాతవు తారంబునయినను నీయవు. చేరి నిన్ను యాచించువారు పెద్దవారు. కావున నింక నీకుఁ గీర్తికిఁ గొఱత యేమి? అని యొకనింగూర్చి పల్కినవాక్యమున సమర్థ్యసమర్థక భావము లేక యున్నమాత్రవాక్యములవలె నుంటచే వ్యర్థదోషమున కుదాహరణ మగుచున్నది.

"నీవు త్యాగి వగుదువు" అను మొదటిసూక్తికి నడిగినదాని నెల్ల నీ విత్తు వని చెప్పినచోఁ బ్రయోజనము గల్గును. అంతియకాని "నీవు దాతవు, ఏమనఁగా నేదియడిగినను నీయవు" అనియన్నచో సరిపడ్డమగదా! అట్లే యింకఁ గీర్తి ప్రాఁతిదే (ఇఁకఁ గీర్తికిఁ గొఱవ

యేమి ?) అనువాక్యమును ననుగుణము కాదు. ఏదియడిగినను నీయని వానికిఁ గీర్తి వచ్చునా ? కావున నిది వ్యర్థదోష మగును. ఇందు "పెద్ద" అనునేకవచనాంత మనన్విత మగుటచే బహువచనాంతముగా మార్పఁబడెను.

ఆ. వె. ప్రేమ మెఱిఁగి వాఁడు బిగియుచు నున్నాఁడు
వానిఁ గననె యొల్ల వాఁడు నాకుఁ
గూర్పఁ దెఱఁగు లేదొకో, నాఁగ విరహిణి
యందు నిట్లు వ్యర్థ మమరుఁ గృష్ణ ! ౧౩

వాఁడు = ఆ ప్రియుఁడు; ప్రేమము = నాయొక్క ప్రేమను; ఎఱింగి= తెలిసి; బిగియుచునున్నాఁడు=నన్ను పరిగ్రహించుటకు బిగువు చూపుచున్నాఁడు; వానిఁగననె=వానిని చూచుటకైనను; ఒల్లన్=అంగీకరింపను. వాఁడు నాకుఁ గూర్పన్=అతఁడు నాకుఁ బ్రియపడుటకు; తెఱఁగు=మార్గము- ఉపాయము; లేదొకో=లేదాయేమి?; నాఁగన్= ఇట్లనఁగా; విరహిణియందు= ప్రియునితో వియోగముచెందియున్న కాంతవిషయమున; ఇట్లు=ఈవిధముగా; వ్యర్థము=వ్యర్థదోషము; అమరున్=ఒప్పును.

ఇందు "వానిని జూడనేచూడను" అను మొదటిమాటకును "వాఁడు నా కనుకూలుఁ డగుటకు మార్గము లేదా" యను తరువాతి మాటకును నానుగుణ్యాము లేనందున నీవిరహిణివాక్యము వ్యర్థదోషమున కుదాహరణ మగుచున్నది.

౮. అపార్థము

కం. కరిచర్మము గైరికశిల
సురగిరి యని సముదయార్థశూన్యపదంబుల్

బెరసిన నపార్థ మగు నది
జరగు మదోన్మత్త బాలచరితలఁ గృష్ణా! ౧౬

వాక్యమునందలి పదముల కన్యోన్యాకాంక్ష యుండవలయును. ఆ కాంక్ష లేనిపదముల కన్వయము లేక వాక్యార్థజ్ఞానము కలుగదు. అట్టిపదముల కనన్వితమయినపదముల యర్థము లున్నను సముదాయార్థము స్ఫురింపదు. అట్టిసముదాయార్థము లేనిపదములు కల్గియుండుట యపార్థ మనుదోష మగును. "యోగ్యత, ఆకాంక్ష, సన్నిధి" అను మూఁడుధర్మము లుండిననే వాక్యార్థము లభించును. "నిప్పుచేఁ దడుపుచున్నాఁడు" అనుచోట యోగ్యత లేకయు, నేఁ డొకపదమును రే పొకపదము నుచ్చరించినచో సన్నిధి లేకయు వాక్యార్థము స్ఫురింపదు. అట్లే పరస్పరాన్వయయోగ్యత (ఆకాంక్ష) లేని "రాముఁడు, గోవు, వనము" అనుచోట నాకాంక్ష లేక సముదాయార్థము (వాక్యార్థము) స్ఫురింపదు. ఇట్టిది "అపార్థ" మగును. ఇట్టిపదములు సామాన్యముగా సురాపానాదులచే మదించినవారియొక్కయు, పిచ్చివారియొక్కయు, బాలురయొక్కయు సంభాషణములందుఁ గానవచ్చును. బాలాదిప్రసంగవర్ణనములం దిట్టివి దోషములు కావని భావము.

"కరిచర్మము, గైరికశిల, సురగిరి" అనుపదములకుఁ బ్రత్యేకముగా గజచర్మము, ధాతువిశేషము, మేరుపర్వతము అనునర్థము లున్నను నీమూఁడుపదములకుఁ బరస్పరాన్వయముచే నొకసముదాయార్థము లభింపలేదు. కావున నిది యపార్థమున కుదాహరణమగును.

సముదయార్థ=సముదాయార్థముచే; (సముదాయస్సముదయః అని యమరము) మద=మత్తుగలవానియొక్కయు; ఉన్మత్త=పిచ్చివానియొక్కయు; బాల=శిశువులయొక్కయు; చరితలన్=నడువడులందు.

మదశబ్దము ధర్మవాచకమే యైనను లక్షణముచే మదము గలవాఁ డని యర్థము. లేదా మత్వర్థీయాకారప్రత్యయాంతముగాఁ దలంపనగును. బాలు లనఁగా మాటలాడుటలో బాఁగుగా నేర్పు కలుగనిశిశువు లని తాత్పర్యము.

౯. అపశబ్దము

ఆ. వె. కనుఁగొనంగ నాదికవులకావ్యంబుల
లలితమైన లక్ష్యలక్షణములు
రూఢిగాని పెఱవిరోధోక్తు లపశబ్ద
[1]సంజ్ఞకంబు లండ్రు జగతిఁ గృష్ణ! ౧౩

ఆలోచింపఁగాఁ బూర్వకవులకావ్యములందు లలితమయిన లక్ష్యములును, లక్షణములును ప్రసిద్ధముగా లేనట్టి యితరవిరుద్ధోక్తు లన్నియు నపశబ్దము లనఁబడుదోషము లగును. కవిప్రసిద్ధముకాని ప్రయోగములతీరు లన్నియు నపశబ్దము లనఁబడునని భావము. అట్టి కుసంధి, దుస్సంధి మున్నగుదోషముల ననంతరగద్యమున నిర్దేశించు చున్నాఁడు.

వ. "అవ్వి యెయ్యవియనినం గుసంధి, దుస్సంధి, చుట్టుంబ్రావ, వైరివర్గంబు, విడుదలఁకాకుదోషంబు, కుఱుచకాకు, తెనుంగునకుఁ జొరని సంస్కృతక్రియలం బెరయు దుష్ప్రయోగంబులు, మఱియు నిట్టిగ్రామ్యంబు లెన్నిగల వన్నియు నపశబ్దమ్ములు. వాని వివరించెద- ౧౪

సంస్కృతక్రియలన్=సంస్కృతవిభక్త్యంతక్రియలతో, (సులభము).

1 సంజ్ఞికంబులు అను పూర్వపాఠము తప్పు.

కుసంధి

కం. మొదల నికారముపైఁ న
చ్చొదవి యకారముగ దీనియొడయం డిది యి
ట్లొదవె ననక దీనొడయం
డిది ట్లొదవె ననఁ గుసంధు లినశశినయనా! ౧౯

ఇనశశినయనా=సూర్యచంద్రనేత్రా!

ఇకారముమీఁద నచ్చుండఁగా సంధి కాక యకారము చేరును. అట్లు యకారమును జేర్పక పరరూపసంధి గావించినచో నది కుసంధి యగును. దీని+ఒడయఁడు=దీనియొడయండు, సాధుసంధి; దీనొడయఁడు=కుసంధి యగును. అట్లే ఇది+ఎట్లు=ఇదియెట్లు సాధుసంధి; ఇదెట్లు=కుసంధి యగును.

చింతామణ్యాద్యాంధ్రవ్యాకరణములందును నికారమునకు సర్వసామాన్యముగా నంతటను సంధిని విధింపలేదు. కిమాదులు, తదాదులు, ననుత్తమపురుషక్రియేకారములు మున్నగువానికిమాత్రము సంధి విహితము. సంధి రానిచోట యఁశ్రుతియు విధింపఁబడెను. కావున "దీనియొడయఁడు" అనియుండుటయే యుచితము. షష్ఠీసమాసగతేకారసంధి ప్రయోగములు ప్రాచీనమహాకవిప్రయోగవిరుద్ధములగుటచే "దీనొడయఁ" డనుట కుసంధియే! కాని యిందలి ద్వితీయోదాహరణము సంధిగ్ధము. "ఇది" అనునది తదాదులలోనిదిగా ననేకుల యభిప్రాయము. అపుడు దానియికారమునకు సంధి వికల్పము. ఇట్టిస్థితిలో "ఇదియెట్లు" అనునదియు, "ఇదెట్లు" అనునదియుఁగూడ సాధురూపములే! కాని యనంతునికి "ఇది" అనుపదము కిమాదుల లోఁగాని, తదాదులలోఁగాని చేర్చుట సమ్మతము కానందున "ఇదెట్లు" అనునది కుసంధి యని నిరాకరించెను, భారతప్రయోగము

లెట్లున్నవో వెదుకవలయును. ఏమి, అది శబ్దములలోని యికారము నకు సంధివచ్చినరూపములు భారతప్రసిద్ధములే. కాని "ఇది" కి సంధి వచ్చుట సందిగ్ధము.

దుస్సంధి

కం. క్షితి స్వరసంధి నకారం
బతిశయముగ నతఁడు నతఁడు ననుచో నతఁ డు
న్నతఁడు నని యూఁదిపలికిన
సతతము దుఃస్సంధి యండ్రు సత్కవులు హరీ! ౨౦

అతఁడు నతఁడు ననుచోన్=అతఁడును, అతఁడును ననురీతి గలచోట; స్వరసంధిన్=స్వరముతో సంధించునపుడు అతఁడున్నతఁడున్ అని అతిశయముగా, నకారము="అతఁడున్" అనుచోట నకార మును; ఊఁదిపలికినన్=ఒత్తిపలికినచో; సత్కవులు = కవిశ్రేష్ఠులు; దుస్సంధి యండ్రు=దుస్సంధి యనుదోషమని చెప్పుదురు.

పదాంతముననున్న నకారము నచ్చుపరమగునపుడు "అతఁడు న్నతఁడున్" అనురీతిని ద్విరుక్తము గావించినచో నిది దుస్సంధిదోష మగునని భావము.

"అతఁడు" అను కళాపదమునకు సముచ్చయార్థకనుశబ్దము చేరిన రూప మిచట నుదాహరింపఁబడెను. అప్పకవియును ద్రుతద్విత్వ సంధి దుస్సంధి యని నిరసించెను. 'చూచెనింతి' ననెడుచోట 'చూచె న్నింతి' ననిన సంధిదోష మయ్యెనని చెప్పెను. అంతియకాక 'ఏక సంశ్లేషౌ నాచిద్రుతస్య' అను చింతామణిసూత్రమును వివరించుచు 'సంయుతం బయ్యెనేని దుస్సంధి' అని దీనిని దుస్సంధి యని యనంతుని మతమునే యనుసరించెను.

కాని ప్రౌఢవ్యాకరణకర్త్రాదులు 'అన్నిష్టసఖ' నూఁదియున్నదాని (అను+ఇష్ట) అనుభారతప్రయోగమును జూపి క్వాచిత్కముగా ద్రుత ద్విత్వము నన్నయ్యకును సమ్మతమేయని చెప్పిరి. వ॥ చి॥ సీ॥ శాస్త్రుల వారును నన్నయకు ద్రుతద్విత్వము సమ్మతమే యని నిరూపించిరి.

పైవిషయములనుబట్టి యాలోచింపఁగా నన్నయచేత నిషిద్ధ మయి మఱికొందఱచేఁ గ్వాచిత్కముగా నంగీకృత మైనను ద్రుతద్వి త్వము ననంతుఁ డంగీకరింపక దుస్సంధి యని నిరసించెనని నిశ్చయిం పఁదగియున్నది.

అతఁడును+అతఁడును=అతఁడున్నతఁడున్ — దుస్సంధ్యుదాహ రణము.

అనంతామాత్యుఁడు కుసంధిదుస్సంధులకు భేదమును వివక్షిం చెను. అందు 'ఇ'కారమునకుఁ బరరూపసంధి చింతామణ్యాదులందు విహిత మయియున్నను శ్రవణరమ్యము కాదు కావున కుసంధి యని వచించెను. అనఁగా నిది యుత్తమము కాక నీచమయిన (కుత్సిత మయిన) దగుటచే కుసంధి యనియెను. ఇది యుత్తమము కాకపోయి నను దోషయుక్తము కానందున దుస్సంధి యనఁబడలేదు. ద్రుతమున కచ్చు పరమగునపు డెచ్చటను ద్విత్వము విహితము కాలేదు. అంతి యకాక ప్రత్యేకముగా "ఏకసంశ్లేషే నాచిద్రుతస్య" అని ద్విత్వమును నిషేధించియుండుటచే నిది దుష్టమగుటచే దుస్సంధి యనఁబడెను. ఇట్టియల్పభేద మీ రెండుదోషములయెడలను గ్రహింపనగును. కవిజ నాశ్రయమునను వీనిభేదము లిట్లే చెప్పఁబడెను.

చుట్టుఁద్రావ

మొదలాఱు వడ్డి మూఁడనఁ
గదియింపక యెత్తికట్టి కరమున నగువాఁ

డిదె వచ్చెడి నన నెగ్గై
యొదవిన యీచుట్టుఁబ్రావ లొల్లరు కృష్ణా! ౨౧

మొదలు=అసలు; అనఁగా మూలధనము. ఆఱు=ఆఱుసంఖ్య గలది; వడ్డి=వృద్ధి: మూఁడు=మూఁడుసంఖ్యగలది; అనన్=అనునట్లుగా; కదియింపఁగన్=కదియునట్లు చేయఁగా, నెత్తి=అధమర్ణుని శిరమున (సప్తమ్యర్థకప్రథమాంతము); కట్టి=భారమును బంధించి; కరమునన్= కప్పముచే (అనఁగా వడ్డిచేనని గ్రాహ్యము); అగువాఁడు=వర్తించు వాఁడు; ఇదె=ఇదిగో; వచ్చెడిన్=వచ్చుచున్నాఁడు; అనన్=అనఁగా; ఎగ్గై=దోషమై; ఒదవిన=వర్తించిన; ఈచుట్టుఁబ్రావలు=చుట్టుఁబ్రావ యనఁబడుదోషములు; ఒల్లరు=అంగీకరింపరు.

"అస లాఱువందలకు వడ్డి మూఁడువందలు" అనురీతి నన్యాయ్యమగు వడ్డిభారమును బలాత్కారముగా నెత్తిని మోపి యావడ్డితో జీవించునట్టివాఁడు (వార్ధుషికుఁడు) ఇదిగో వచ్చుచున్నాఁడు" అను నర్థముగల యీవాక్యము సంధివశమున భ్రాంతిని కలిగించునదియగు టచేఁ జుట్టుఁబ్రావ యనుదోష మయ్యెను.

కదియింపఁగ+నెత్తి అనుచోట "కదియింపఁగన్+ఎత్తి" అనియు; "కరమునన్+అగువాఁడు" అనుచోట "కరమునన్+నగు వాఁడు" అనియు సంధిలో భ్రాంతికరములై యుండుటచే నీపద్యము దోషోదాహరణ మయ్యెను.

ఇందు "మొద లాఱున్" అనఁగా అసలు నశించుననియు నర్థము పదసమ్మేళనమువలన నేర్పడుచున్నది. ఇదియు దోషతాపాదకము.

శబ్దదోషప్రకరణ మగుటచేతను నందును సంధిదోషప్రసంగ మగుటచేతను గవిజనాశ్రయమునను "సంధి నెగ్గులు నొడమిన" నని

చెప్పఁబడుటచేతను నిట్లు వ్యాఖ్య చేయఁబడెను. ఈపద్యార్థ మింకను సంతృప్తికరముగా లభింపవలసియున్నది.

వైరివర్గము

ఆ. వె. తుదలు తెలుఁగుఁ జేసి యదికి పుష్పపువిల్లు
పరగ భూరుహంపుఁబండ్లు నాక
పుష్పవిల్లు నాఁగ భూరుహపండ్లునా
వైరివర్గ మంద్రు వనజనాభ! ౨౨

నాక=అనక.

సంస్కృతపదము తెనుఁగుపదముతో సమసించునపుడు సంస్కృతపదము నంతభాగమును తెలుఁగుగా నొనర్చి యదుకవలయును. అనఁగాఁ బూర్వపదమును దత్సమపదముఁ గావించియే యదుకవలయును. అట్లుకాక పూర్వపదమున కాంధ్రవిభక్తిచిహ్నములు చేర్పక సంస్కృతప్రాతిపదికమునకే తెలుఁగుపదముతో సమాసము గావించుట వైరివర్గ మనుదోష మగును. ఎట్లనఁగా 'పుష్పపువిల్లు' అనుచోట 'పుష్పవిల్లు' అనుటయు, 'భూరుహంపుఁబండ్లు' అనుచోట 'భూరుహపం' డ్లనియుఁ జెప్పుట దోషము.

సమాసమునందలి పదము లొకవర్గమునకుఁ జెందక యొకటి శుద్ధసంస్కృతప్రాతిపదికమును, వేఱొక్కటి తెలుఁగుప్రాతిపదికమును నగుటచే వైరివర్గమని యీదోషమునకు నామము సంభవించెను.

విరుద్ధవర్గమునకుఁ జెందినపదములయినను గొన్నిపట్టుల లోకప్రసిద్ధము లగుటచే నిర్దోషము లగునని తరువాతిపద్యమునం జూపుచున్నాఁడు.

ఆ. వె. కోమటీంద్రుఁ డనఁగ భూమితీ రనఁ బలు
గ్రహము లనఁగ వానకాల మనఁగ

వైరివర్గ మైన వదల రిట్టివి లోక
రూఢిఁ జెల్లు నని సరోజనాభ ! ౨౩

కోమటేంద్రుఁడు, భూమితీరు, పలుగ్రహములు. వానకాలము అనురీతిగల సమాసములందు 'ఇంద్ర, భూమి, గ్రహ, కాల పదములు సంస్కృతములు. కోమటి, తీరు, పలు, వాన పదములు తెనుఁగుపదములు. ఇట్లీసమాసములందు భిన్నభాషాపదసమావేశ మున్నను గవి లోకప్రసిద్ధము లగుటచే నిర్దోషము లగుచున్నవి.

"కోమటి" అనుపదము తెనుఁగయినను సంజ్ఞావాచక మగుటచే నిర్దోష మగును. మిగిలినసమాసముల మూఁడింటను సంస్కృత పదములకుఁ దెలుఁగువిభక్తిచిహ్నములు కలుగుటచే శుద్ధసంస్కృతత్వము పోయి తత్సమత్వము కలిగి యేకభాషాపదసమావేశ మగుటచే నిర్దోష మయ్యెను. "భూమి" అనుదానికిఁ దెనుఁగున విభక్తి లోపించినది. స్త్రీలింగశబ్దము లన్నియు నిట్టివేయగుటచేఁ దత్పురుషపూర్వావయవములుగా నుండవచ్చును. గ్రహ కాల శబ్దములందు స్పష్టముగా మువర్ణకము చేరి యాంధ్రత్వము గోచరించుటచే నివియును గ్రాహ్యము లయ్యెను. సమగ్రముగ నీవిషయము వ్యాకరణమువలనఁ దెలిసికొనవలయును. సూచనామాత్రముగా నెట్టిసమాసములు గ్రాహ్యములో యెట్టివి యగ్రాహ్యములో కనఁబఱిచెను.

గీ. మొదలి తెలుఁగుపై సంస్కృతపద మొకండు
జరగు లోకరూఢిని, సమాసంబు చొరదు
పూని ముజ్జగంబులు నన(బోలుఁ గాని
యతఁడు ముజ్జగద్వందితుఁ డనఁగఁ జనదు. ౨౪

మొదలితెలుఁగుపై = సమాసమున మొదటిదగు తెలుఁగుపదముపై; ఒకండుసంస్కృతపదము = ఒకానొకసంస్కృతపదము; లోక

రూఢిని=లోకప్రసిద్ధినిబట్టి; జరగుఁ=సమాసముగా నొప్పును. సమాసంబుచొరదు = అట్టితెనుఁగుపదముమీఁది శుద్ధసంస్కృతపదమునకు మరల వేఱొకపదముతో సమాసముమాత్రము వర్తింపదు.

ముజ్జగములు, ముల్లోకములుమున్నగుసమాసములు నిర్దోషము లయినను వానిపైని మరల సమాసముఁ జేయరాదు. ముజ్జగద్వంద్యుఁడు ముల్లోకపూజ్యుఁడు ననురీతి సమాసము లుండరాదని భావము. మూఁ డను తెనుఁగుపద ముత్తరపదములోని కన్వయింప వలసియున్నది. ఆయుత్తరపద మాంధ్రవిభక్తిచిహ్నితము కానిచో నన్వయించుట దుష్ట మగును. ఆయుత్తరపద మాంధ్రవిభక్తియుత మయినచో "ముజ్జగమ్ముతీరు," "ముల్లోకమ్ముసొంపు" అనుతీరునఁ గల సమాసములు సాధువులే యగుచున్నవి. ఈవిషయము వ్యాకరణ శాస్త్రమువలన సంపూర్ణముగాఁ దెలియునది.

**నిడుదలకాకు**

**కం. పొలుపుఁగఁ బొగాడదండలు**
**లలన ముడిచినన్ మకారలాంఛనుఁ డొందెన్**
**జలమునఁ జెఱాకువి ల్లన**
**నలనిడుదలకాకుదోష మండ్రు ముకుందా!** ౨౫

హ్రస్వ ముండవలసినచోట దీర్ఘమును బ్రయోగించినచో నది నిడుదలకాకుదోష మగును.

ఉదా : పొగాడదండలు, మకారలాంఛనుఁడు, చెఱాకువిల్లు.

కాకుదోషమును "కుఱుచకాకు", "నిడుదలకాకు" అని రెండు విధములుగా విభజించెను. అవి వరుసగా కుఱుచయక్షరమునకు నిడుద యక్షరమును, నిడుదయక్షరమునకుఁ గుఱుచయక్షరమును బ్రయోగించిన నేర్పడును.

కాకు వనఁగా శోకభీత్యాదిమనోవికారములవలనఁ గలిగిన ధ్వనివికారము. శోకభీత్యాదిమనోవికారమువలనం గాక సహజముగానైనను గల్గిన ధ్వనివికారము కావున నిదియుఁ గాకు వని చెప్పఁబడెను. హ్రస్వధ్వనికి దీర్ఘధ్వనియు, దీర్ఘధ్వనికి హ్రస్వధ్వనియు నిట సంభవించును గావున నిదియు ధ్వనివికారమ యగును.

"అపి మాషం మషం కుర్యాత్ ఛందోభంగం నకారయేత్" అనున్యాయమునఁ గొందఱు ఛందోనుసారముగా హ్రస్వదీర్ఘములను మార్చుట కనుమతింతురు. కాని యట్టి దనంతుని కసమ్మతము. శక్తిశాలి యగుకవికి ఛందోనుగుణము లగుపదములు సహజముగనే యుపస్థితము లగును. హ్రస్వదీర్ఘవినిమయము కవిశక్తిలోపమునకు సూచకమే యగును. కావున నిట్టి హ్రస్వదీర్ఘవినిమయము నంగీకరించుట యుచితము గాదని యనంతుఁడు దీనిని దోషముగాఁ జెప్పెనని తెలియనగును.

కుఱుచకాకు

కం. ఎలుఁగుపడ నీవు చెపుమా
యెలిక వనుచు నసపడితిమి యెమి నివు నయెడన్
జలుఁజలు నను నిడుపులు గుఱు
చలు సేసినఁ గుఱుచకాకు చను నిది కృష్ణా! ౨౬

ఎలుఁగుపడన్=స్పష్టముగా;

"ఏలిక, ఆస, ఏమి, నీవు, నాయెడన్, చాలుచాలు" అను పదములలో దీర్ఘములు హ్రస్వములు గావించి యిందుఁ బ్రయోగింపఁబడుటచే "కుఱుచకాకు" దోష మగుచున్నది.

ఇందు 'నాయెడన్' అనుటకుబదులు 'నయెడన్' అని యగును గాని 'నయెడ' అని యనుట సరికాదు. అది యపపాఠము. కావున 'నయెడన్' అనుపాఠము గ్రాహ్యము.

దుష్ప్రయోగము

కం. సత్వరము నృపస్యపదం
గత్వా యాతఁడు నిహత్యకంటకుల సఖీ
భూత్వా మెలఁగెడు నన్నఁ గ
విత్వవిదులు దుష్ప్రయోగవిధ మండ్రు హరీ! ౨౭

సంస్కృతవిభక్త్యంతపదములను తెలుఁగువిభక్త్యంతపదములతోఁ గలిపి ప్రయోగించుట దుష్ప్రయోగ మనఁబడుదోష మగును. 'సత్వరము, ఆతఁడు, కంటకులన్, మెలఁగెడు' అను నాంధ్రవిభక్త్యంత పదములనడుమ, 'నృపస్య, పదం, గత్వా, నిహత్య, సఖీభూత్వా' అను సంస్కృతవిభక్త్యంతపదములం జేర్చి వాక్యనిర్మాణము గావించుటచే నిది దుష్ప్రయోగ మయ్యెను.

వ. సంస్కృతవిభక్తు లయ్యును దెనుఁగునకుఁ జెల్లుసుప్రయోగం బెట్టిదనిన:

స్పష్టము.

కం. నిక్క మగు సుప్రయోగము
ధిక్కృతదురితాయ భగవతేఽస్తు నమో యం
చక్కడ నీకును నమరులు
మ్రొక్కుదు రని తిఙ్సుబంతములఁ గూర్ప హరీ!

ఓహరీ! "అని తిఙ్సుబంతములఁగూర్పన్=నిక్కమగు సుప్రయోగము" అని యన్వయము.

సంస్కృతవిభక్తిప్రత్యయాంతము లయినను దెలుఁగుపదములతో మిశ్రణము కావింపక కేవలసంస్కృతపదములతో వాక్యమును నిర్మించి యనుకరణముతోఁ దెనుఁగునఁ బ్రయోగించిన దోషము

కాదు. "ధిక్కృతదురితాయ భగవతే నమోఽస్తు" అను సంస్కృత వాక్యమును "అంగు" అని యనుకరణముతో ప్రయోగించుటచే నిర్దోష మయ్యెను.

## విరోధములు

కం. సమయవిరోధమ్మును నా
గమలోకవిరోధములును గాలవిరోధ
క్రమము కళాదేశవిరో
ధములును జొరకుండఁ జెప్పఁదగుఁ గృతుల హరీ!

౧. సమయవిరోధము ౨. ఆగమవిరోధము ౩. లోకవిరోధము ౪. కాలవిరోధము ౫. కళావిరోధము ౬. దేశవిరోధము ననునాఱు విరోధములును జొరకుండఁ గృతులను రచింపవలయును. ఈ విరోధములలోఁ గొన్నిటిని సోదాహరణముగా వివరింపఁబోవుచున్నాఁడు. ఈ యాఱువిరోధములే కాక యింకను మఱి యెట్టివిరోధములయినను సంభవింపకుండఁ జూచుకొనవలయును. విరోధము లాఱే యని నియమము కాదు.

### సమయవిరోధము

కం. సందులఁ గుండలముల్ గుడి
సందిని శివలింగమును నొసల భూతియుఁ బెం
పొందఁగ నొకదరిబేసి మ
రుం దెగడెడు నన సమయవిరోధము కృష్ణా! ౩౧

సందులన్=బాహువులయందు, దరిబేసి=దీనుఁడు; కుండలములు=కర్ణభూషణములు.

సమయ మనఁగా నాచారము. ఆచారవిరుద్ధము సమయవిరుద్ధమగును.

ఒకదరిఁజేసి బాహువులయందు కుండలములను, కుడిభుజము నందు శివలింగమును, లలాటమున భస్మమును ధరించి మన్మథునివలె నున్నాఁడనుట సమయవిరోధమున కుదాహరణము. కుండలములు చెవులయందు ధరించుట యాచారము. దీనికివిరుద్ధముగా బాహువుల యందు కుండలములను ధరించినట్లు వర్ణించుట సమయవిరోధమగును.

**ఆగమవిరోధము**

కం. ఎక్కుటిధర్మము హింసయ
నిక్కమనుచు వృత్రవధకు నిర్జరపతియుం
ద్రొక్కెఁ దయపేర్మి ననవుఁడు
నక్కడ నాగమవిరోధ మంద్రుడు ముకుందా! 32

హింసయ=ఒరులను బాధించుటయే; ఎక్కుటిధర్మము=ముఖ్య ధర్మము; నిక్కము=అది నిజము; అనుచును=అనిభావించుచు; నిర్జర పతియును=దేవేంద్రుఁడును; వృత్రవధకు=వృత్రాసురసంహారమునకు; దయపేర్మిన్=దయయొక్క గొప్పదనమును; త్రొక్కెన్=విడిచెను. అనవుఁడు = ఇట్లనఁగా; ఆగమవిరోధము = శాస్త్రవిరోధనామక దోషము. (ఆగమము=శాస్త్రము.)

'అహింసాపరమోధర్మః' అని శాస్త్రము చెప్పుచుండఁగా హింసయే ముఖ్యధర్మ మనుట విరుద్ధము కావున నిది శాస్త్రవిరోధ మున కుదాహరణ మయ్యెను.

**కళావిరోధము**

కం. తాళము పట్టక చదువున్
బోలఁగఁ బుస్తకము చేత ముట్టక పాడున్
మేలితనిజాణతన మన
నోలి నిది కళావిరోధ ముదధివిహారా! 33

చదువుటకుఁ బుస్తకమును బాడుటకుఁ దాళమును పరికరములు. దానికివిరుద్ధముగాఁ దాళమును బట్టక చదువుటయుఁ బుస్తకమును గ్రహింపక పాడుటయు జాణతనమునకు నిదర్శనము లని యిందు వచించుట కళావిరోధ మగును. గానాదులు చతుష్షష్టికళలలోనివి కావున తద్విరోధము కళావిరోధ మయ్యెను.

"తాళము పట్టక పాడుఁ బోలఁగఁ బుస్తకము చేత ముట్టక చదువున్, మే లితనిజాణతన మన" అని సవరించిన నీవిరోధము పరిహృత మగును.

## దేశవిరోధము

**కం. బహుకూపతటాకోదక**
**మహితము మరుదేశ మని సమర్థించిన ని**
**మ్మహి నది దేశవిరోధా**
**వహ మంద్రు కవీంద్రు లమృతవారిధిశయనా ! 38**

మరుదేశము = ఎడారినేల; బహు......తము=అనేకములగు నూతులయొక్కయు చెఱువులయొక్కయు జలములచే నిండినది; దేశవిరోధావహము= దేశవిరోధదోషమును గల్గించునది.

మరుదేశమున జలములు దుర్లభము లగుట సుప్రసిద్ధము. దానిని విరుద్ధముగా మరుదేశము బహుజలపూర్ణ మని చెప్పుటవలన దేశవిరోధదోషమున కుదాహరణ మగుచున్నది.

లోకవిరోధమునకును గాలవిరోధమునకును సుప్రసిద్ధ మగుటచే నుదాహరణములను జూపలేదు. లోకవిరోధమును రెండువిధములుగాఁ దలంపవచ్చును. (౧) లోకస్థితికి విరుద్ధముగా నుండుట. సర్పము సాధుజంతువు కావున దాని నెల్లరు రక్షింపవలయును. ఇట సర్పము సాధుజంతు వగుట లోకవిరుద్ధము. (౨) ఇట్లే "స్వర్గమున

పాపజీవులును, నరకమునఁ బుణ్యాత్ములును వసించుచున్నారు." అను చోట స్వర్గనరకలోకవిరుద్ధముగా వచింపఁబడుటచే నిట్టిదియు లోక విరుద్ధ మనఁదగును. కాలవిరోధమునకు వర్షకాలమున మల్లెపూవు లును, వేసవికాలమున మొగలిపూవులును వికసించినట్లు వర్ణించుట యుదాహరణ మగును.

కం. ఇట్టివి దశదోషము లనఁ
బట్టగుఁ గృతులందు నివియె భాసురముగఁ జే
పట్టుదురు ధీరు లొక్కొక
పట్టున డెందంబు లలరఁ బల్కినఁ గృష్ణా ! 3౫

కృతులందు = కావ్యములందు; ఇట్టివి=ఈపూర్వోక్తములతీరు గలవి; దశదోషములు=పదిదోషములు; అనఁబట్టగున్=అనఁబడును.

కొందఱుమహాకవు లీదోషములనే కొన్నిస్థలములందు రమణీయముగా నుండునట్లు కూర్చి దోషములు కాక గుణము లగునట్లు మార్తురు. ఈదోషములు నిత్యములు కావనియుఁ గొన్నితావుల దోషములే గుణము లగుననియు భావము. అపార్థపునరుక్తాదులు కొన్ని తావుల దోషములు కావని యీవఱకే చెప్పియుండెను. అట్లే మిగి లినదోషములును గొన్నితావులందు కవిశక్తి ననుసరించి దోషములు కాక గుణము లగు నని తెలియనగును. "మేలు బాగాయెసేసినాము" అను గ్రామ్యపదప్రయోగము కిరాతవాక్యముగా గూర్చి పొన్నిగంటి తెలగన్న దోషము కాక గుణ మగునట్లు చేసెఁగదా ! అట్లే దోష ములు గుణము లగుటయుఁ గొన్నితావుల సంభవించును.

కం. పదిదోషంబులఁ దెలిపెదు
వదనఁ బ్రయోగించినట్టియవయోగములం

దొదవవు దోషంబులు నీ
సదమలనామములఁగూడఁ జలుపుటఁ గృష్ణా! ౩౭

తెలిపెడునదనన్ = తెలుపునట్టిపట్టున; అవయోగములందు = దుష్ప్రయోగములందు.

సాధుశబ్దోచ్చారణమువలనఁ బుణ్యమును, నసాధుశబ్దోచ్చారణమువలనఁ బాపమును గల్గు నని మహాభాష్యకారులసూక్తి గలదు. అనంతుఁడు దోషములను దెలుపుసందర్భమున దాను దుష్ప్రయోగములఁ బ్రయోగించి చూపవలసివచ్చెను. అట్లు ప్రయోగించుటచేఁ దనకును బాపము సంభవించునేమో యని శంకించుకొని విష్ణుదేవుని నిర్మలనామోచ్చారణము నట్టిపట్టులం దాను గావించుటచే నట్టి పాపము తనకు సంభవింప దని వచించుచుఁ దనకుఁగలభగవద్భక్తిని వెలువరించెను.

కం. క్రమమున పిటు చెప్పినదో
షములం దత్యుత్కటము విసంధిక మని రా
దిమునులు తత్పరిహారా
ర్థము సంధిసమాసములు దిరంబుగఁ జేర్తున్. ౩౮

ఈ వెనుకఁ జెప్పినదోషములలో విసంధిక మత్యధికదోష మని పెద్దలు తలంచుటచే నట్టిదోషమును బరిహరించుటకు సంధికార్యసమాస విశేషములు తెలిసికొనుట యావశ్యకము కావున వానివివరణము నీప్రకరణమునం జేసెద నని దోషప్రకరణమున సంధిసమాసవివరణము నకుఁ గల్గుప్రసంగసంగతి ననంతుఁడు వివరించెను.

విసంధిపరిహారార్థము సంధిప్రకరణ మావశ్యక మయినను సమాసప్రకరణమునకు సంగతి యేమని శంకింపరాదు. సమాసములందు మాత్రమే సంభవించునట్టి కొన్నిసంధివిశేషములు గలవు. "ఛత్సో

ష్ఠయో స్సమాసేవా" అనుసూత్రము సమాసమునందుఁ బరరూపసంధిని వికల్పముగా విధించుచున్నది. అంతియకాక సమాసములు నిత్యసంధికలవి కావున సమాసము లెవ్వియో తెలియుట సంధికార్యజ్ఞానమున కుపయోగించును.

గీ. సంధిఁ దెలిపెడుచో సూత్రసమ్మతముగఁ
దొలుతఁ బలికి చూపెడువర్ణముల విసంధి
నాటుకొనదు శ్లిష్టోచ్చారణంబుఁ జేసి
చూపునదియ నిశ్చయసంధిసూచకంబు. 31

సూత్రసమ్మతముగ=వ్యాకరణసూత్రసమ్మతముగ; సంధిన్=సంధికార్యములను; విసంధి=విసంధిదోషము; నాటుకొనదు= సంభవింపదు.

వ్యాకరణశాస్త్రప్రకారముగా సంధికార్యములను జేసిచూపునపుడు ముందుగా "సుధీ+ఉపాస్య=సుధ్యుపాస్య" అనురీతిన విసంధిపదములను జూపవలసియుండును. అట్లు భిన్నపదములను జూపునపుడు విసంధిదోషము లేదు. విభిన్నపదములను సంధించియుచ్చరించినదే నిశ్చయరూప మనియు భిన్నముగాఁ జూపినపదములు బోధనార్థము జూపఁబడినవేకాని యట్టివిసంధి లేకయునుండెడి రూపాంతరములు కావనియుఁ దలంపనగును. తాను చూపఁబోవుసంధిప్రకరణమున భ్రాంతికలుగకుండుటకు ముందుగనే విశదము చేసెను.

గీ. పరగుఁ దుక్సంధి స్వరసంధి ప్రకృతిభావ
సంధి వ్యంజనసంధి విసర్గసంధి
స్వాదిసంధినా షట్సంధు లందులోనఁ
బ్రకృతిసంధియన్నది యాంధ్రభాషఁ జొరదు. 32

౧. తుక్సంధి ౨. స్వరసంధి, ౩. ప్రకృతిభావసంధి, ౪. వ్యంజనసంధి, ౫. విసర్గసంధి, ౬. స్వాదిసంధి యని సంధు లాఱువిధములు. అందులోఁ బ్రకృతిభావసంధి తెనుఁగుభాషయందుఁ గలుగదు.

ఈ యాఱుసంధులును సంస్కృతపదములకు సంభవించునవి. సంస్కృతపదములు సమాసములుగా మిళితములయినపు డీసంధులు సంభవించుటంజేసి తెనుఁగున కాసమాసములద్వారమున నీసంధు లావశ్యకములగుచున్నవి. కాని యీసంధు లాఱింటిలోఁ బ్రకృతిభావసంధి సమాసములందు వర్తింపదు. కావునఁ బ్రకృతిభావసంధి తెనుఁగుభాషయందుఁ బ్రవేశింపదని భావము. ఇట్లు సమాసములద్వారమున నీసంధులు తెనుఁగునఁ బ్రవేశించుటచేతనే సమాసములంగూడ నీప్రకరణమున విశదము చేయుచున్నాఁడు.

ప్రకృతిభావసంధి సాక్షాత్తుగాఁ దెనుఁగునఁ జేరకున్నను సంస్కృతవాక్యములననుకరణమూలముగాఁ దెనుఁగునఁ జేర్పవచ్చును. కావున నట్టితఱి శుద్ధసంస్కృతవాక్యములందు (హరీ ఏతౌ శరణ్యౌమే ఇత్యాదులందు) ప్రకృతిభావసంధి వ్యస్తపదములందుఁ గానవచ్చుచుఁ దెనుఁగున విరళముగాఁ జేరును. కాని యది తెనుఁగుభాష కాక శుద్ధసంస్కృతమగుటచే "నాంధ్రభాషఁ జొరదు" అనుట సముచితమే యగుచున్నది. ఆంధ్రభాషయందు జొరనిదగుటచేతనే ప్రకృతిభావసంధిని వివరించి యుదాహరింపలేదు. కాని ఋవర్ణము పరమగునపుడు మహాఋషులు మున్నగుచోట్ల వికల్పముగాఁ బ్రకృతిభావసంధియుఁ గలదు. కావున దానినేని వివరించియుండిన నుచితముగా నుండును.

**తుక్సంధి :**

**కం. పదమధ్యదీర్ఘలఘువులు**
**పదాంతలఘువులు ఛకారపరమై యూఁదుఁ**

మది మ్లేచ్ఛుఁడు తుచ్ఛుం డనఁ
త్రిదశచ్ఛత్త్ర మన నీగతినిఁ దుక్సంధిన్. ౪౦

పదమధ్యమున ఛకారము పరముగానున్న దీర్ఘాక్షరము గాని హ్రస్వాక్షరము గాని యూఁదిపలుకఁబడును. ఉదా: మ్లేచ్ఛుఁడు, తుచ్ఛుఁడు. ఇదేవిధముగా పదాంతముననున్నలఘువుకూడఁ దుక్సంధి వలన నొత్తిపలుకఁబడును. ఉదా: త్రిదశచ్ఛత్రము. పదమధ్యమున నున్నఛకారము చకారపూర్వకముగనే యుండుంగాని కేవలఛకార ముండదు. కావునఁ దత్పూర్వా చ్చూఁదియే పలుకఁబడు నని భావము.

మ్లేచ్ఛ, తుచ్ఛ పదము లేకైకపదము లగుటచే వానియందుఁ దుక్సంధికార్యము వర్తింపదు. సహజముగనే యవి యొత్తిపలుకఁబడు నట్లు సంయుక్తవర్ణములు కలిగియున్నవి. త్రిదశచ్ఛత్ర మనుచోట మాత్రము తుగాగమము వచ్చి "త్రిదశ+ఛత్రము=త్రిదశచ్ఛత్రము" అని యయ్యెను.

"పదమధ్యదీర్ఘలఘువులు, పదాంతలఘువులు ఛకారపరమై మ్లేచ్ఛుఁడు తుచ్ఛుం డనఁ ఊఁదున్. ఈగతిని తుక్సంధిని త్రిదశ చ్ఛత్ర మనఁ ఊఁదుఁ" అని పదములయన్వయము. (తుక్సంధి నను నది త్రిదశచ్ఛత్ర మనుదానితోమాత్ర మన్వయింపనగునని గ్రహింప వలయును.)

"తుక్" అనునది యాగమము. ఇందు 'ఉకారకకారము' లిత్సంజ్ఞము లగుటచే లోపించి తకారము మిగులును. ఆ తకారము 'స్తోఃశ్చునాశ్చుః' అను పాణినిసూత్రముచేఁ జవర్గయోగమున చకార మగును. (త్రిదశ+ఛత్ర=త్రిదశత్+ఛత్ర=త్రిదశ+చ్+ఛత్ర=త్రిద శచ్ఛత్ర అని యగును.) ఈ తుగాగమము 'ఛేచ' అను పాణినిసూత్ర

ముచేఁ బ్రాప్తించెను. దీర్ఘాక్షరమున కీ తుగాగమము వైకల్పికము. ఆవిషయము సనంతరపద్యమున విశదీకరించును.

గీ, అలిఁ బదాంతదీర్ఘము వికల్పంబు నొందుఁ
బుత్రికాచ్ఛత్త్రి మాత్మజాఛత్ర మనఁగ
నటఁ బదాంతదీర్ఘం బయ్యు నాఙ్ప్రయుక్తి
నిత్య మాచ్ఛాదనం బని నెఱయ నూఁదు. ౪౧

పదాంతదీర్ఘమగు వికల్పముగా "తు"గాగమము నొందును. ఉదా: పుత్రికాచ్ఛత్రము. ఆత్మజాఛత్రము. ("పదాన్తాద్వా" అను పాణినిసూత్రము దీని కాధారము.) పదాంతదీర్ఘ మయినను "ఆఙ్"ప్రయోగమున "తు"గాగమము నిత్యమే యగును. 'ఆఙ్' అనఁగా మర్యాదాద్యర్థకమగు 'ఆ' అను నవ్యయము. ఇట్టి "ఆ"కారమునకుఁ బదాంత మయినను వికల్పముగాఁ గాక నిత్యముగనే తుగాగమము వచ్చుటచే "ఆచ్ఛాదనము" అని యాకారము నూఁదియే పలుకవలెను. "ఆఙ్మాఙోశ్చ" అను పాణినిసూత్రము దీనికాధారము.

స్వరసంధి :

కం. ధర అ ఇ ఉ ఋలు సవర్ణము
పరమగుచో దీర్ఘ మగు సువర్ణాద్రి యనన్
శరధీంద్రుఁ డన బహూదక
సరసి యనఁ బితౄణములు వెసం దీర్పు మనన్.

అ ఇ ఉ ఋలు=అ, ఇ, ఉ, ఋ వర్ణములు; సవర్ణము=సమానస్థానప్రయత్నములుగలవర్ణము; అ, ఇ, ఉ, ఋ వర్ణములకు అవియే వరుసఁగాఁ బరమయినచో దీర్ఘాక్షరము లగును.

ఉదా:- సువర్ణ+అద్రి=సువర్ణాద్రి; శరధి+ఇంద్రుఁడు=శరధీంద్రుఁడు; బహు+ఉదకము=బహూదకము; పితృ+ఋణము=పితౄ

ణము. పూర్వపరాచ్చుల కేకాదేశ మని గ్రాహ్యము. స్వరసంధు లలో నిది సవర్ణదీర్ఘసంధి యనఁబడును. అ యి యు ఋలు అని యణా గమసంధి చేయుటయే యుచితము. ర. ఆ. ౩౮, ప. దీనికి వర్తింపదు. సంధిలోనిపదములకే యది వర్తించును. ఋకారమునకు సంస్కృతమున సవర్ణదీర్ఘగుణసంధులు విధింపఁబడినవి. కాని యవి విరళములై యప్రసిద్ధము లగుటచే ననావశ్యకము లని తలంచి యితఁడు విడిచెను. "అకస్సవర్ణేదీర్ఘః" అనుసూత్రము దీనికి మూలము.

కం. చెచ్చెర ఇ ఉ ఋలు మూఁటికి
నచ్చు పరంబైన య వ ర లాదేశ మగున్
మెచ్చుగ దధ్యన్నం బనఁ
బెచ్చుగ మృద్వన్న మనఁగఁ బిత్రర్థ మనన్. ౪౩

ఇ, ఉ, ఋ అనువర్ణములకు (అసవర్ణమగు) నచ్చు పరమయినచో వరుసఁగా య, వ, ర వర్ణము లాదేశము లగును. (య్, వ్, ర్ అను హల్లులుమాత్రమే.) ఉదా:- దధి+అన్నము=దధ్యన్నము; మృదు+అన్నము=మృద్వన్నము; పితృ+అర్థము=పిత్రర్థము.

పూర్వపద్యమున సవర్ణములు పరమయినచో దీర్ఘ మగుటను విధించుటచే నిచ్చట తదితరము లయినయచ్చులు పరమగునపుడే యణాదేశ మగుననుట యర్థసిద్ధము కావున వేఱుగాఁ జెప్పనక్కఱ లేదు. (దీనిని యణాదేశసంధి యందురు.) "ఇకోయణచి" అను సూత్రము దీని కాధారము.

కం. తగునే అన మననయనం
బగుఁ బోఅన మనఁగఁ బవన మగు నై ఆకనా
నగు నాయక పౌఅక యన
నగుఁ బావక ఏజవాప్తి నయవాయావల్. ౪౪

"ఏచాంస్థానే అవాప్తిః=ఏజవాప్తిః" అని విగ్రహ మూహ్యము. ఏచ్చులయొక్క-స్థానమున వచ్చుట యని భావము. అయవాయావల్= అ.య్, అవ్, ఆయ్, ఆవ్ అనునవి.

అయవాయావ లేచ్చులస్థానమునఁ బ్రాప్తించుటచే నే+అనము =నయనము మున్నగురూపము లగునని తాత్పర్యము. ఏ, ఓ, ఐ, ఔ ల కచ్చు పరమయినచో వరుసఁగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనునాదేశములు వచ్చును. స్వరసంధిప్రకరణ మగుటచేతఁగాని పూర్వపద్యమున నజ్పరకత్వమునే నిమిత్తముగా శాసించుటచేతఁ గాని యిచటఁగూడ నచ్చు పరమగునప్పుడే యీయాదేశములు వచ్చునని సిద్ధించును. "ఏచోయవాయావః" అనుసూత్రము దీని కాధారము.

ఉదా:- నే+అనము=నయనము; పో+అనము = పవనము; నై+అక=నాయక (ఇది ప్రాతిపదికము), పౌ+అక=పావక (ఇదియుఁ బ్రాతిపదికము); ఇట విసంధి నిర్దోషము. చూ. ౨ ఆ. ౩౮ ప.

ఇట 'అయవాయావ్' అను వకారాంతద్వంద్వసమాసమునకుఁ దెనుఁగువిభక్తులు చేరిన తత్సమరూపము వాకులుమున్నగువానివలెనె 'అయవాయావ్వులు' అని యుండును. అయవాయావలు అనురూప మెట్లును సిద్ధింపదు. అయినను నిదియే శ్రుతిరమ్య మగుటచే ననంతుఁ డీరూపమునే గ్రహించి దానికిఁ బ్రామాణికత్వమును గల్పించెనని తలంపవలయును.

గీ. సరవి సీనాల్గు పదమధ్యసంధు లిందు
నప్రసిద్ధ మేకారాంత మైత్వమునకు
నోత్వమునకు నౌత్వమునకు నొగిఁ బదాంత
సంధి నగుఁ శేషంబులే చంద మనిన. ౪౩

ఈనాల్గు=ఈ వెనుకఁజూపఁబడిన "నయనా"దులు నాల్గును; పదమధ్యసంధులు = పదముయొక్క మధ్యభాగములనున్న సంధులు; ఇందు=ఈనాల్గింటిలో; ఏకారాంతము = ఏకారాంతపదము; అప్రసిద్ధము=ప్రసిద్ధముగా లేదు.

పదముమధ్యభాగమున నీనాల్గాదేశములకును వెనుకపద్యమున నుదాహరణములు చూపఁబడెను. ఇంక నీయాదేశములు పదాంతమునఁ జూపవలసియున్నది. వానిలో నేకారాంతపదములు ప్రసిద్ధములుగా లేవు. ఇంక నైత్వమునకు, ఓత్వమునకు, ఔత్వమునకును పదాంతసంధియందగు విశేషము లేఛందమున నుండునో తర్వాతిపద్యమునఁ జెప్పఁబడును అని పద్యభావము. ఏకారాంతశబ్దము లప్రసిద్ధము లనిమాత్రమే చెప్పెను. లేవని చెప్పినట్లు తలంపరాదు. "సే" శబ్దాదులు కల్పితములుగా నున్నను భాషయందుఁ బ్రసిద్ధములు కానందున నుదాహరింపలేదని భావము.

కం. గోశబ్దముపై నవజా
దేశమున గవాక్ష మనఁగ దీపించు, నవా
దేశము ద్యోశబ్దముపై
నాశక్రుండు ద్యవధీశుఁ డన సత్సంధిన్. ౪౬

గోశబ్దమున కక్షశబ్దము పరమగునప్పుడు "అవ" అనునాదేశము వచ్చి గవాక్ష మగును. ద్యోశబ్దమున కచ్చు పరమగునప్పుడు "అవ్" ఆదేశము వచ్చి "ద్యో+అధీశుఁడు=ద్యవధీశుఁడు" అనురీతి నగును. గోశబ్దము నోకారముతప్ప మిగిలినపదాన్తాకారముల కవాదేశమే వచ్చునని భావము. "గవాక్ష" అనుదానికి "అవఙ్ స్ఫోటాయనస్య" అనునది యాధారము.

పదాంతమునందలి "ఓ"కారమునకు గల విశేషములు నిందు వివరించెను. అందు గో+అక్ష 'అన చోట' 'అవ్' ఆదేశము రా

దనియు 'అవ' అనునాదేశము వచ్చి 'గవాక్ష' అని యగుననియుఁ దెల్పెను. 'అవ్' ఆదేశము వచ్చినచో 'గవక్ష' అని యసాధురూపము కావలసివచ్చును. "ఆ శక్రుండు ద్యవధీశుఁ డన సత్సంధిన్" అనుపాఠమే సాధువగుటచే గృహీతము.

కం. రైశిఖరాచ్చున కాయా
దేశంబగుసంధి రాయధీశ్వరుఁ డనఁగా
గ్లౌశిఖరాచ్చున కావా
దేశంబగుసంధి గ్లావుదీర్ణత యనఁగన్. 46

రైశిఖరాచ్చునకు= రై యనుపదమునంతమున నున్నయచ్చునకు;

రై+అధీశ్వరుఁడు = రాయధీశ్వరుఁడు; గ్లౌ+ఉదీర్ణత = గ్లావుదీర్ణత అని పదాంతమునయున్న "ఐకారౌకారము"ల కాయాదేశము నావాదేశమును వచ్చి యిట్టిరూపము లగునని భావము.

"గ్లావుదీర్ణ" అను ప్రాతిపదికపాఠముకంటెఁ బూర్వార్థమునందలి రాయధీశ్వరుఁ డనుపదసామ్యమునుబట్టి యిదియు గ్లావుదీర్ణత యని విభక్త్యంతముగా నుండుటయే యుచిత మని యది గ్రహింపఁబడెను. "గ్లావుదీర్ణత" యనఁగాఁ జంద్రునియుదయ మని యర్థము.

కం. మొదలి అకారము ఇ ఉ ఋలు
పొదివిన నేత్వమును నోత్వమును రేఫయుఁ బెం
పొదవు సురేంద్రుఁ డనఁగ నీ
రదోత్కరం బనఁగ సంధి బ్రహ్మర్షు లనన్. 47

పూర్వముననున్న 'అ'కారమునకు ఇ, ఉ, ఋ అనువర్ణములు పరమగుచో వరుసగా ఏకారము, ఓకారము, రేఫయును వచ్చును.

ఉదా:- సుర+ఇంద్రుఁడు=సురేంద్రుఁడు, నీరద+ఉత్కరంబు=నీరదోత్కరంబు; బ్రహ్మ+ఋషులు = బ్రహ్మర్షులు. ఈ యాదేశములు వేనికివచ్చునో వివరింపలేదు. ఏ ఓ లు పూర్వపరాచ్చుల కేకాదేశము లనియు, 'ర్' వర్గము ఋకారమున కాదేశ మనియు నుదాహరణములవలన నూహ్యము.

సంస్కృతవైయాకరణులు ఋవర్ణపరత్వమున 'అర్' అను నేకాదేశమును విధించిరి. రేఫమాత్రమును ఋవర్ణమున కాదేశించినను రూపము సిద్ధించుటంజేసి లాఘవమునుబట్టి రేఫాదేశమునే యీతఁడు విధించెను. దీనిని గుణసంధి యని వ్యవహరింతురు.

"మొదలియకారము నియుఋులు" అనుపాఠము సముచితము. స్పష్టతకొఱకు విసంధిగాఁ జూపఁబడెనని తెలియనగును. "ఆద్గుణః" అనునది దీని కాధారము.

గీ ఇత్వ ముత్వ మోత్వం బైత్వ మౌత్వ మైదు
నాదియై ఋకారము పరమైనచోట
మహిత కవ్యృద్ధి మన్వృద్ధి మఱి ద్యవృద్ధి
యద్ది రాయృద్ధి గ్లావృద్ధి యనఁగఁబరగు. ౪౬

ఇ, ఉ, ఓ, ఐ, ఔ అను నయిదచ్చులకును ఋకారము పరమగునపుడు క్రమముగా యకారవకారాదేశములును, అవ్, ఆయ్, ఆవ్, అనునాదేశములును వచ్చును.

ఉదా:- కవి+ఋద్ధి=కవ్యృద్ధి; మను+ఋద్ధి=మన్వృద్ధి; ద్యో+ఋద్ధి=ద్యవృద్ధి; రై+ఋద్ధి=రాయృద్ధి; గ్లౌ+ఋద్ధి=గ్లావృద్ధి;

ఇందలి మొదటిరెండును యణాదేశసంధివిధానముచేతను, తరువాతిమూఁడును నయవాయావాదేశసంధి (౪౪, ౪౭) విధానముచేతను గతార్థము లయ్యెను. అయినను నాసంధివిధానములం "దచ్చు

పరమగునపు" డని సామాన్యముగా నాకార్యములు చెప్పఁబడియెను. ఋకారమునకు హల్ధర్మములుకూడ నుండుటచే నది పరమగునపు డేకార్యమువచ్చునో యని సందేహము కలుగునని శంకించి స్పష్టముగా తెలియుటకు ఋకారము పరమగునప్పుడు యణాదేశాదులే వచ్చునని వివరించెనని తెలియనగును. ఏకారాంతపద మప్రసిద్ధ మగుటచే నేకారమునకు ఋకారపరత్వమున నేమగునో వివరింపలేదు. అకారమునకు ఋవర్ణము పరమగునప్పుడు రేఫము వచ్చునని బ్రహ్మర్షులను నుదాహరణముతో వివరించియేయున్నాఁడు (చూ. ర. ఆ. ౪౮. ప.) ఋకారమునకు ఋవర్ణపరత్వమున సవర్ణదీర్ఘ మగుననియు నీవఱకు చెప్పఁబడెను. (ర. ఆ. ౪౨. ప.) ఇట్లన్నియచ్చులకును ఋవర్ణపరత్వమునం గల్గుకార్యములను కంఠతః వివరించెను.

కం. వశగతి ఋణపదపరకపు
దశఁ బ్రవసనకంబళార్ణదశవత్సతరా
ఖ్యశిఖిభసంఖ్యపదంబులు
రశిరస్కాకార మొంది ప్రార్ణాదు లగున్. ౨౦

(శిఖిభము=కృత్తికానక్షత్రము. ఇది యాఱునక్షత్రము లగుటచే నాఱుసంఖ్యను జెప్పును.) ప్రవసన... ...పదంబులు= ప్ర, వసన మున్నగు నాఱుపదములు; ఋణపదపరకపుదశఁ=ఋణపదము పరముగానుండునపుడు; రశిరస్కాకారము=రేఫ మంతమునఁగల ఆకారము "ఆర్" అను నాదేశమును; ఒంది=పొంది; ప్రార్ణాదు లగున్=ప్రార్ణము మున్నగురూపము లగును. ప్ర, వసన, కంబళ, ఋణ, దశ, వత్సతర శబ్దములకు ఋణశబ్దము పరమగునపుడు 'ఆర్' అనునది యాదేశమగును. అపుడు ప్రార్ణము, వసనార్ణము, కంబళార్ణము, ఋణార్ణము, దశార్ణము, వత్సతరార్ణము అని యగును.

రలావ పద్యముచే ప్రర్ణముమున్నగుతీరున గుణసంధి రావలసి యుండఁగా నీపద్యముచే వృద్ధిసంధిని విధించెను. (ఇందర్థానాగుణముగాఁ బాఠము సరిచేయఁబడెను.) "ప్రవత్సతరకంబలవసనార్ణ దశానామృణే" అనువార్త్తికము దీనికి మూలము.

కం. ఐ లగు నే ఐ లో ఔ
లౌ లగు నాద్యత్వమునకు నఖిలైకవిభుం
డాలలితైశ్వర్యుఁడు స
త్యాలాపౌదనుఁడు భవమహౌషధ మనఁగన్. ౫౧

ఆద్యత్వమునకు=మొదటనున్న అకారమునకు; ఏ ఐ లు, ఓ ఔ లును బరము లగుచో; అకారమునకు 'ఏ ఐ' లు పరము లయినచో నైకారమును 'ఓ, ఔ' లు పరమయినచో నౌకారమును నేకాదేశము లగును.

ఉదా:- అఖిల+ఏకవిభుఁడు=అఖిలైకవిభుఁడు; లలిత+ఐశ్వర్యుఁడు=లలితైశ్వర్యుఁడు; సత్యాలాప+ఓదనుఁడు = సత్యాలాపౌదనుఁడు; భవమహా+ఔషధము=భవమహౌషధము.

ఈపద్యమున నన్వయసారళ్యముకొఱకుఁ బరములయ్యేనేని" అను పదమధ్యాహృతము కావలయును. ఉదాహరణములనుబట్టి యట్లూహింపవచ్చును, అపుడు 'అకారమునకు 'ఏ ఐ' లు పరమయినచో (పూర్వపరస్వరములకు) ఐ లగు. ఓ ఔ లు పరమయినచో (పూర్వపరస్వరములకు) 'ఔ' లగునని యన్వయము లభించును. "వృద్ధిరేచి" యనుసూత్రము దీని కాధారము.

గీ. అత్వమున కోతు వోష్ఠ మంత్యమునఁ గదియఁ
గలుగు నోత్వౌత్వయుగ్మవికల్పసంధి
అడఁ, జెందె ఘనోతు నల్పోతు వనఁగ
నాఁగె బింబోష్ఠి నొక్క-బింబౌష్ఠి యనఁగ. ౫౨

ఓతువు=పిల్లి; ఆఁగెన్=ఆఁగునట్లు చేసెను; ఆఁపె నని యర్థము; ఆడన్=అక్కడ.

అకారమున "ఓతు, ఓష్ఠ" అనుశబ్దములు పరమయినచో నోకారము గాని యౌకారము గాని యేకాదేశముగా వచ్చును.

ఉదా:- ఘన+ఓతువు=ఘనోతువు; అల్ప+ఓతువు=అల్పౌతువు; బింబ+ఓష్ఠి=బింబోష్ఠి, బింబౌష్ఠి; పరరూపము వచ్చునని పాణినీయమునఁ జెప్పఁబడియుండ రూపభేదము లేనందున నోకారాదేశమని యిటఁ జెప్పఁబడెను. "ఓత్వోష్ఠయోస్సమాసేవా" అను వార్త్తికము దీనికి మూలము.

ఆఙ్ప్రయోగచతుష్టయము

కం. అందముగ నీషదర్థము
నం దా తుద నుత్వ మోత్వమై యోష్ణ మగున్
జెంది క్రియాయోగముతుద
యందలియత్వ మది యాత్వమావన మనఁగన్. ౫౩

ఆఙ్ (ఆ) అనునవ్యయము ఈషదర్థమునను క్రియాయోగమునను మర్యాద, అభివిధి అనునర్థముల యందును వర్త్తించును. అట్టి ఆఙ్గున కీషదర్థక్రియాయోగములందుఁ బదాంతరముతో సంధించిన రూపముల నీపద్యమున నుదాహరించును.

ఈషదర్థమునందు=అల్ప మనునర్థమునందు; ఆ తుదన్='ఆ' అనునిపాతమున కంతముననున్న; ఉత్వము=ఉకారము; ఓత్వమయి=ఆకారముతోఁగూడ నోకారముగా మాఱి; ఓష్ణము=ఆ+ఉష్ణము అనునది ఓష్ణము అని యగును. క్రియాయోగము=క్రియాపదముతోఁ గలయికను; చెంది=పొంది; తుదయందలియత్వము=ఆకారమునకు (నిపాతమునకు) పరమునసున్న అకారమును, అది=ఆ 'ఆకార

మును'; ఆవనము=ఆ+అవనము = ఆవనము; అనఁగన్=అనునట్లు; ఆత్వము=ఆకారము (సవర్ణదీర్ఘము); అగున్=అగును.

ఆ+ఉష్ణము=ఓష్ణము—ఇంచుక వేడిగలది.

ఆ+అవనము=ఆవనము—సంరక్షణము.

కం. ఇల మర్యాదాదులయం
దలియత్వం బాత్వమై పొదలు నాద్రి యనన్
లలి నభివిధ్యాదులయం
దలియత్వము నాత్వమై పొదలు నాద్రి యనన్. ౨౪

మర్యా......త్వంబు=మర్యాదావధిశబ్దము నాదియందుఁగల అకారము; ఆత్వమై=ఆజ్ఞుతోఁగూడి సవర్ణదీర్ఘము వచ్చుటచేత 'ఆ'కార మయి; ఆద్రి యనన్=ఆ+అద్రి=ఆద్రియనునట్లు; పొదలున్=ఒప్పును. అభి......యత్వమును=అభివిధ్యవధిశబ్దముయొక్క యాది యందుఁగల 'అ'కారముకూడ; ఆత్వమై=ఆజ్ఞుతోఁగూడి సవర్ణదీర్ఘ మగుటచే ఆకారమయి; ఆద్రియనన్=ఆ+అద్రి= ఆద్రి యనునట్లు; పొదలున్=ఒప్పును.

ఆ+అద్రి=ఆద్రి-కొండవఱకు; ఇది మర్యాదార్థకము కావున కొండను విడిచి కొండవఱకుఁగలభాగమే యర్థమగును.

ఆ+అద్రి=ఆద్రి—కొండవఱకు ఇది యభివిధ్యర్థము కావున కొండతోఁగూడఁగలసినభాగమే యర్థ మగును.

"ఆకొండవఱకును నాదేశము" అనువాక్యమున నాకొండ కూడ తనదేశములోనిదే యయినచో నభివిధి యనియు, నాకొండ తనదేశములోనిది కానిచో మర్యాద యనియుఁ జెప్పఁబడును. అనంతరపద్య మీయర్థములను వివరించును.

'ఆఙ్' అనుదానికిఁగల యర్థములను విశదపఱచుచు దీని కచ్చులు పరమగునపుడు పూర్వోక్తసంధినియమములే వర్తించునని విశదపఱచుటకుమాత్రమే యీపద్యములు రెండును వ్రాయఁబడెను. సంధివిశేషము లెవ్వియు నిట కానరావు.

గీ. ఈషదర్థ మనఁగ నించుకయగుఁ గ్రియా
యోగ మనఁగ సత్క్రియోపయుక్తి
యంతదాఁక యనుటయై చను మర్యాద
యదియు ననుట యర్థ మభివిధికిని. ౫౫

ఆఙర్థచతుష్టయ మిందు వివరింపఁబడెను. స్పష్టము.

కం. ఈ నాల్గిట నుపసర్గయ
కానఁగలిగె సంధి యట్లు గావు ప్రకృతిభా
వానుగతాకారము లవి
జానుగఁ దెలుఁగునకుఁ జొరవు సంధిఁ గలియమిన్.

ఈనాల్గిటన్ = ఈషదర్థము, క్రియాయోగము, మర్యాద, అభివిధి అను నాల్గర్థములందును; ఉపసర్గయకాన = జిత్తగునిపాతమే కావున; సంధికలిగెన్ = గుణసవర్ణదీర్ఘాదిసంధికార్యములు వచ్చెను. ప్రకృతిభావానుగతాకారములు = ప్రకృతిభావమును బొందిన "ఆ" కారములు; అట్లు కావు = అట్టిగుణాదిసంధికార్యములను బొందవు. అవి = అట్టి "ఆ" కారములు; అనఁగాఁ బ్రకృతిభావమునుబొందెడి "ఆ" కారములు; తెనుఁగునకుఁ జొరవు = తెలుఁగుభాషయందుఁ బ్రయోగింపఁబడవు.

"ఆ" అనునవ్యయమునకు ఆఱుస్థలములు ప్రసిద్ధముగా నున్నవి. అందుఁ బూర్వోక్తము లగు నీషదర్థాదులనాల్గింటను "ఆ" అనునవ్యయము ప్రగృహ్యసంజ్ఞం జెందదు. కావున దానికిఁ బరమునను న్న

యచ్చునుబట్టి గుణాదిసంధికార్యములు వచ్చును. పూర్వవాక్యాన్యథాభావము, (ఆ ఏవంనుమన్యసే) స్మరణము (ఆ ఏవంకిలతత్) అను రెండర్థములందును దీనికిఁ బ్రగృహ్యసంజ్ఞ యుండుటచేఁ బ్రకృతిభావము వచ్చును. అట్టివి తత్సమములుగాఁ దెనుఁగునఁ బ్రవేశింపవు. వీనికి "నిపాత ఏకాజనాఙ్, ప్లుతప్రగృహ్యా అచినిత్యమ్" అను పాణిని సూత్రములచే ప్రగృహ్యసంజ్ఞాప్రకృతిభావములు వచ్చును. ఈపదర్థాదులందలి "ఆ"కారము జిత్తుకావున నీవిధులు వర్తింపక గుణాది సంధికార్యములు వచ్చునని జ్ఞేయము.

ఈపద్యమున "ఉపసర్గము" అని క్రియాయోగమున వచ్చెడి సంజ్ఞతో "ఆఙ్" అనునది వ్యవహరింపఁబడెను. లాక్షణికముగా "జిత్తగు 'ఆ' అనునిపాత" మనునర్థము గలదని భావింపవలయును.

కం. ప్రతిషేధాకారోత్తర
గతశబ్దాద్యచ్చు లవి నకారముఁ గూడున్
శ్రితులకుఁ బంకజనేత్రుఁ డ
నతిదూరుం డనఁగ నతఁ డనాద్యంతుఁ డనన్. ౫౭

ప్రతి......ద్యచ్చులవి=నిషేధార్థకమగు "అకారము"నకుఁ బరమునను న్నశబ్దమున కాదియందున్నయచ్చులు; నకారముఁగూడున్=నకారముతోఁగూడును (అ+అశ్వః=అ+న+అశ్వః=అనశ్వః.)

ఉదా:- అ+అతిదూరుఁడు = అనతిదూరుఁడు; అ+ఆద్యంతుఁడు=అనాద్యంతుఁడు.

నకారములగుట అనుపారము సముచితముగా లేనందున 'నకారముఁ గూడున్' అని మార్పఁబడెను. అనతిదూరుఁ డిత్యాదుల నెట్లో సరిచేసికొనినను, అనీశ, అనూరు, అనేక మున్నగుచోట్లఁ బరపదా

ద్యచ్చులు నకారము లగుట కుదురదుగదా! "నలోపోనఞః, తస్మా న్నుడచి" అనుసూత్రము లిట ననుసంధేయములు.

**వ్యంజనసంధి :**

కం. పొడవగు దిగిభ మజంతము
షడంగములు జగదరిష్టశాంతి సుబంతం
బడరె ననఁ దృతీయము లల
వడు వర్గవ్యంజనములపై నచ్ సంధిన్. ౫౮

వర్గవ్యంజనములపైన్=స్పర్శలపైన; అచ్ సంధిన్=అచ్చుపరముగానున్న సంధిస్థలమున; తృతీయములు=సరళములు; అలవడున్=వచ్చును.

వర్గీయాక్షరములకుఁ బరముగా నచ్చు లున్నచో నవి వర్గ తృతీయములుగా మాఱును.

ఉదా:- దిక్+ఇభము=దిగిభము; అచ్+అంతము=అజంతము; షట్+అంగములు = షడంగములు; జగత్ +అరిష్టశాంతి=జగదరిష్ట శాంతి; సుప్+అంతము=సుబంతము. వరుసగా "కచటత"లు వర్గ తృతీయములుగా మాఱుట కుదాహరణము లీయఁబడెను.

గీ. షడృతుధర్మభూషితతరుషండలక్ష్మి
నిర్మలాబ్భృద్ధదీర్ఘిక, నిజవిశిష్ట
వాగృజుత్వంబు, భవదృషిత్వమున కమరె
నాఁగ ఋత్వవర్గవ్యంజనములసంధి. ౫౯

ఋత్వ......సంధి=ఋత్వమునకును వర్గహల్లులకును గల్గు సంధి.

షడృ......లక్ష్మి=ఆఱుఋతువులధర్మములచే నలంకరింపఁ బడిన వృక్షసమూహలక్ష్మియు; నిర్మ......ర్ఘిక=నిర్మలజలములతో

వృద్ధినొందిన బావియు; నిజ......త్వంబు=సీ ్వయోత్కృష్టవాక్సార
శ్యంబును.

వర్గహల్లులకు ఋత్వము పరమగునప్పుడును మీఁదివిధముగనే వర్గతృతీయములుగా నవి మాఱును.

ఉదా:- వాక్+ఋజుత్వము=వాగృజుత్వము; షట్+ఋతువులు=షడృతువులు; భవత్+ఋషిత్వము=భవదృషిత్వము; అప్+ఋద్ధదీర్ఘిక=అబృద్ధదీర్ఘిక.

పూర్వపద్యముచేతనే యిదియు గతార్థ మయినను ఋకారస్థలమున భ్రాంతినివారణార్థము మరలఁ జెప్పెను. ఋకారమునకుఁ గొన్నిహల్ధర్మము లున్నను నది యచ్చేకావున నితరాచ్చులు పరముననున్నయట్లే యిది పరమునున్నను వర్గహల్లులు వర్గతృతీయములుగనే మాఱు నని యిందు స్పష్టపఱిచెను.

గీ. ఆది జఞణనమల పొల్లు లచ్చు లంట
స్వస్వరూపంబ యగు ఋత్వసంధినైన
నడఁగుఁ గుడి ననంతము నాఁ దిజంతమనని
కోయణచినా నన్నృజు వనఁగూడుఁ గాన. ౬౦

ఆది జఞణనమలపొల్లులు=పూర్వపదాంతముననున్న "జ, ఞ, ణ, న, మ" అనుపొల్లుహల్లులు; అచ్చులంటన్ = పరమందున్న యచ్చుతో సంధించునపుడు; ఋత్వసంధినైనన్=పరమందున్న ఋకారముతో సంధించునప్పుడైనను; కుడిన్=కుడినున్న ఋకారములో; అడఁగున్=ఎడమనున్న జ, ఞ, ణ, న, మలు లీనమగును. చివరి యుదాహరణము ఋవర్ణపరకత్వమునను, నితరము లితరాచ్చులు పరమగునప్పుడును నుదాహరణములు.

వర్గవ్యంజనములలో ననునాసికములవిషయ మిందుఁ జెప్పు చున్నాఁడు. "ఙఞణనమ" అనువర్ణముల కచ్చు పరమయినచో నా యక్షరము లట్లే యుండును. అనఁగా నచ్చుతోఁగలిసి యాహల్లులే యుచ్చరింపఁబడును.

ఉదా:- తిఙ్+అంతము=తిఙంతము; ఇకోయణ్+అచి=ఇకో యణచి; న+అంతము=అన్+అంతము=అనంతము.

పై వర్ణములు ఋకారముతోఁ గూడినను నిట్లే స్వస్వరూప ముతో నుండును. కుడినున్న యక్షరముతో నడఁగిపోవును. అనఁగా నీయనునాసికాక్షరము ఋకారముతో లీనమయి కానవచ్చును. న+ ఋజువు=అన్+ఋజువు=అనృజువు.

అచ్చులలో ఋకారము హల్ధర్మములుకూడఁ గలదియగుటచే నచ్చులకుసంబంధించిన యేకార్యములు విధించినను ఋకారమునకుఁ గూడఁ బ్రత్యేకముగా నిట్లగునని వివరించుట యనంతునికిఁ బరిపాటి.

ఇందు "అడఁగుఁగుడి" యనుచోట నెడమనున్నవ్యంజనము కుడినున్నఋకారములో నడంగియుండునని యర్థము వ్రాయఁబడెను. ౬౧వ పద్యమునను నిట్లే 'మృ' అగునని చెప్పెను. ఇది యాతనితీరు. ఈపట్టున నితరరీతులవ్యాఖ్యానము లనంతునిపాండిత్యమునకుఁ దగినవి కానందున ననాదరణీయములు. ఇందలిమూఁడవపాదమునఁ గొన్ని వ్రాఁతతప్పు లున్నవని యంగీకరింపకతప్పదు. ఏమనఁగా నుదాహరణ ములను జూపుచు "హలంతము" అని వ్రాయఁబడినది. ఇది యుదా హరణము కాదుగదా ! వర్గీయానునాసికముల కచ్చు పరముగానుండు పక్షము చూపవలసియుండఁగా లకారమున కచ్చు పరముగానున్నది జూపునా ! లక్షణవిరుద్ధముగా లక్ష్యము నెవ్వరేని జూపుదురా ? కాన నిట 'హలంతము' అనునది తప్పుపడినదనియు 'ననంతము' అని

యుండవలయుననియు నూహింపఁబడెను. అట్లే "అడఁగుఁగుడి" యనుచోట గువర్ణములమధ్య నర్ధబిందువును నుండవలయునని యూహింపఁబడెను.

కం. పన్నుగ మకారహల్లగు
సున్న మకారమగు నచ్చు సోఁక సమగ్రం
బన్న మన ఋకారం బా
సన్నమ్మగ మృత్వ మగు రససమృద్ధి యనన్. ౬౧

మకారహల్లగు సున్న = మకారముయొక్క రూపాంతరమే యయిన బిందువు; అచ్చుసోఁకన్=అచ్చుతో సంధించునప్పుడు, మకారమగున్=మరల వానిపూర్వరూపమయిన మకారమే యగును.

ఉదా:- సం+అగ్రము=సమగ్రము. సంనిధి ఇత్యాదులందు బిందురూపముగా వికల్పముగా మాఱిన యీమకార మచ్చు పరమగుటచే నిట మరల మకారముగా మాఱి 'సమగ్రము' అని యయ్యెనని భావము. ఆసన్నమ్మగన్=పరముకాఁగా; మృత్వము='మృ' అను రూపము. ఈసున్నకు ఋకారము పరమయినచో నీమకారఋకారములు కలిసిపోయి 'మృ' అని యగును.

ఉదా:- రససమ్+ఋద్ధి=రససమృద్ధి.

కం. తమతమవర్ణంబుల ద్వి
త్వములగుఁ దత్తరుణి తత్త్రథము తద్దా
నము తద్ధనంబు తన్నయ
నమునా నిటు వర్గములఁ దనరు వ్యంజనముల్. ౬౨

వర్గవ్యంజనాక్షరములకు వర్గీయహల్లులే పరమయినచోఁ బరమునను న్నయక్షరముల ద్విత్వరూపములుగా నగును.

ఉదా:-తత్+తరుణి=తత్తరుణి; తత్+తదర్థము=తత్తదర్థము; తత్+దానము=తద్దానము; తత్+ధనము=తద్ధనము; తత్+నయనము=తన్నయనము; వీనిలోఁ బూర్వపదాంతమున నున్నతకారము పరపదాద్యక్షరముతోఁ గూడినందున ద్విత్వమయ్యె నని తెలియనగును. ఇట సామాన్యముగా ద్విత్వము విధింపఁబడెను. కాని యుగ్మాక్షరములు (థ, ధ మున్నగునవి) పరమయినచో నాద్విత్వములోని మొదటివర్ణము యుగ్మాక్షరముగా మాఱుననియుఁ దెలియనగును. ఆవిషయమును సూచించుటకే 'తద్ధనము' అనియు నుదాహరించెను. ఇట రెండుధకారములలో మొదటిధకారము దకారముగా మాఱెను గదా !

సీ. వర్గహల్లులచేరువను హకారము చతు
ర్థాక్షరంబై సంధి నడఁగునొండె
మూఁడవవ్రాలతోఁ బోఁడిగ దీపించు
స్రగ్ఘారము లన నజ్ఝు లనఁగ
షడ్ఢలంబులు నాఁగ సకలజగద్ధిత
ప్రౌఢిమ నాఁగ కుబ్భస్త్రు లనఁగ
నవియ స్రగ్‌హారంబు లనఁగ నజ్‌హల్లు ల
నంగ షడ్‌హలములునా జగద్‌హి
గీ. తానువర్తను లనఁ గకుబ్‌హస్తు లనఁగ
శపరమైన వాక్‌శాంతి వాక్ఛాంతియట్ల
చపటహల్లులు మూఁటను జను విభాష
ఛత్వ మగుఁ దకారమునఁ 'దచ్ఛాభ యనఁగ. ౬౩

వర్గహల్లులచేరువను=వర్గీయహల్లుల పక్కను, అనఁగాఁ బర

మున నని భావము. చతుర్థాక్షరంబై=వర్గచతుర్థాక్షరంబై; శ=శవర్ణము; పరమయినన్=పరముగానున్నచో.

వర్గహల్లులకుఁ బరముగానున్న హకార మావర్గమునందలి చతుర్థాక్షరముగా మాఱుటగాని వర్గీయతృతీయాక్షరముతోఁ గూడిన (స్వస్వరూపముతో) హకారముగనే కాని కానవచ్చుట యగును. "ఝయోహోన్యతరస్యా" మనుసూత్రార్థ మిట వివరింపఁబడెను.

ఉదా :—

1. స్రక్+హారములు=స్రగ్ఘారములు-స్రగ్హారములు (పూలదండ, ముత్తెములహారము)
2. అచ్+హల్లులు=అజ్ఝల్లులు—అజ్హల్లులు (అచ్చులు—హల్లులు)
3. షట్+హలములు=షడ్ఢలములు—షడ్హలములు. (ఆఱు నాగళ్ళు)
4. జగత్+హితప్రౌఢిమ=జగద్ధితప్రౌఢిమ—జగద్హితప్రౌఢిమ. (లోకహితప్రౌఢిమ)
5. కకుప్+హస్తులు=కకుబ్భస్తులు—కకుబ్హస్తులు (దిగ్గజములు)

శవర్ణము కచటతపలకుఁ బరమయినచో ఛకారముగా వికల్పముగా మాఱునని భావము.

ఉదా:- వాక్+శాంతి=వాక్ఛాంతి—వాక్శాంతి.
తత్+శాఖ=తచ్ఛాఖ—తచ్శాఖ.

ఇట్లే మిగిలినవి యూహ్యాము లగుట నుదాహరింపలేదు.

"శ పరమయిన హాక్శాంతి, వాక్ఛాంతి యగును. అట్లు చపటహల్లులు మూఁటను విభాషన్ ఛత్వము చనున్. తకారమున "తచ్ఛాఖ" యనఁగ నగు" నని యన్వయము.

ఇందు ప్రస్థార మనఁగ ననుచోట నాల్గవపాదమునందుఁ బ్రతి నిర్దేశము ననుసరించి 'ప్రస్థారము లన' నని బహువచనాంతపాఠ మూహింపఁబడెను.

గీ. లలిత తవ్యంజనంబుపై లత్వమునకు
ద్విగతి తల్లీల యనఁగఁ దద్లీల యనఁగ
సంచితసకార మడఁగును నడఁగకుండు
నుత్థితం బుత్ద్ధితం బన నుభడుఁ గాన. ౭౪

తవ్యంజనంబుపైన్=తకారముపై; లత్వమునకు=లకారమునకు; ద్విగతి=ద్వివిధత్వము.

తకారమునకు లకారము పరమగునపు డాలకారమునకు వికల్పముగా ద్విత్వము వచ్చును. అనఁగాఁ దకారము లకారముగా మాఱు నని భావము. ద్విత్వము రానియపుడు పూర్వపదాంత్యహల్లుతో సంయుక్త మగునని తెలియనగును. అపుడు పూర్వపదాంత్యతకారము జస్త్వముచే దకారముగా మాఱుననియు నూహింపనగును. "తోర్లి" అని పాణినిసూత్ర మిట ననుసన్థేయము.

ఉదా:- తత్+లీల=తల్లీల—తద్లీల.

ఇట్లే 'ఉత్' అనుదానిలోని తకారమునకు స్థాధాతుస్తంభధాతువులవలన నిష్పన్నమగు శబ్దములు పరమగునపుడు వానియాద్య సకారమునకు వికల్పముగా లోపము వచ్చును. అనఁగా సకారము పూర్వ సవర్ణముగా మాఱిపిమ్మట "ఝరోఝరిసవర్ణే" అనుసూత్రముచే లోపించునని భావము.

ఉత్+స్థితము=ఉత్థితము—ఉత్ద్ధితము; ఇట్లే ఉత్థాన, ఉత్తంభనాదులందును గ్రహింపఁదగును.

ఇచటఁ "దల్లీల, తద్లీల" యని ద్వివిధముగా నుండుట పాణినీయవ్యాకరణసమ్మతము కాదు. ఇట్టిచోట "తోర్లి" అను పాణిని సూత్రము నిత్యముగాఁ బరసవర్ణమును విధించుటచే "దల్లీల" యను రూపమే సమ్మతము కాని "తద్లీల" యనురూప మసమ్మతము. ముగ్ధబోధసారస్వతవ్యాకరణాదులును నిటఁ బరసవర్ణమును నిత్యముగనే విధించినవి. అయినను ననంతామాత్యుని కిట్టిద్వివిధరూపములు మహాకవులగ్రంథములందుఁ గానవచ్చుటచేఁగాఁబోలు నిట్లు విధించెను. "తోర్లి" అను పాణినిసూత్రమున కవ్యవహితపూర్వమగు "వాపదాన్తస్య" అనుసూత్రమునుండి "వా" అనుపదము నీసూత్రములోని కనువర్తింపఁజేసి యనంతామాత్యుఁ డిట్టిరూపములను శాసించియుండును. పాణినిసూత్రవ్యాఖ్యాత లెవ్వరో యట్టివ్యాఖ్యానము చేయఁగా నది యనంతునికి లభించియుండెనేమో. అట్టివ్యాఖ్యాన మున్నచో నీద్వివిధరూపములును బాణినీయసమ్మతములే యగును.

ఉత్+స్థితము—అనుచోట "ఉదఃస్థాస్తంభోఃపూర్వస్య" అను సూత్రముచే నిత్యముగా సకారమునకుఁ బూర్వసవర్ణము విధింపఁబడెను. అపుడు సకారము థకార మగును. ఆ థకారమునకు "ఝరో ఝరిసవర్ణే" అనుసూత్రముచే వికల్పముగా లోపము వచ్చి "ఉత్థితము– ఉత్థ్థితము" అని రెండురూపము లగును. ఈపద్యమున సకారము వికల్పముగా లోపించు ననిచెప్పుటకు సకారము పూర్వసవర్ణముగా మాఱి వైకల్పికలోపము నొందుననియే తాత్పర్యము గ్రాహ్యము. సకారము పూర్వసవర్ణ మగుటమాత్రము నిత్యమే. ఇటఁ బూర్వసవర్ణ మనఁగా థకారముగా సకారము మాఱును. అట్టి థకారము లోపించినచో నొక్కథకారమును లోపింపనిచో రెండుథకారములును నుత్థ్థిత మనుచోట వినఁబడును.

కం. అనునాసిక, వర్గవ్యం
జనముల నిజరూప మొండె జరగుఁ దృతీయం
బును బ్రాఙ్ముఖంబు ప్రాగ్ముఖ
మన వాఙ్నియమంబు వాగ్నియమ మన నొలిన్.

వర్గవ్యంజనములన్=వర్గీయాక్షరములయందు; అనునాసికన్=పరమగు ననునాసికాక్షరముచే; నిజరూపము జరగున్=అనునాసికరూపము వచ్చును. ఒండె=లేదా; తృతీయంబును=వర్గతృతీయాక్షరమును; అగును,

ఉదా:- ప్రాక్+ముఖము=ప్రాఙ్ముఖము, ప్రాగ్ముఖము.
వాక్+నియమము=వాఙ్నియమము, వాగ్నియమము.

ఇట వర్గవ్యంజనమగు కకారము పరముననున్న మ, న అనెడి యనునాసికాక్షరముల యోగమున ననునాసికముగా మాఱినది మొదటి రూపము. వర్గతృతీయాక్షరమయిన రూపము రెండవది. "యరోను నాసి కేనునాసికోవా" అనుసూత్రార్థ మిచట వివరింపఁబడెను.

గీ. కచటతపహల్లు పంచవర్గ ద్వివర్ణ
సల నిజాకృతి, మీఁదియక్షరయుగముల
యరలవలఁ, దృతీయంబు, వాక్తరుణివాక్స
రంబు లనఁగ దృగ్దీప్తి దృగ్వ్రాత మనఁగ. 22

కచటతపహల్లు=కచటతప అనుహల్లులు, పంచవర్గద్వివర్ణసలన్=అయిదువర్గములందలి మొదటి రెండువర్ణములను సకారమునను, అనఁగా నవి పరమగునపుడు; నిజాకృతి=స్వస్వరూపముగలది. మీఁదియక్షరయుగములన్ = వర్గములందలి తృతీయచతుర్థాక్షరములయందును; యరలవలన్=య, ర, ల, వ అనునవి పరముగనున్నపుడును; తృతీయంబు=వర్గీయతృతీయాక్షర మగును,

"కచటతప" అనువర్ణములు కఖ, చఛ, టఠ, తథ, పఫ, స అనునవి పరమగునపుడు మార్పుచెందవు. గఘ, జఝ, డఢ, దధ, బభ, య, ర, ల, వ అనువర్ణములు పరమగునపుడు గజడదబలుగా మాఱును.

ఉదా:- వాక్+తరుణి=వాక్తరుణి; వాక్+సరము=వాక్సరము;
దృక్+దీప్తి=దృగ్దీప్తి; దృక్+వ్రాతము=దృగ్వ్రాతము;

ఇఁకఁ దకారమునకు విశేషముఁ జెప్పుచున్నాఁడు.

గీ. కపల ప్రథమయుగ్మసకారగతులఁ దాన
యపరయుగయరలవఁ దృతీయంబు, తత్కృ
తంబు తత్ప్రతి తత్సతి తద్గతియు జ
గద్గురుఁడు సద్యశమునాఁ దకారహల్లు. ౬౭

తకారహల్లు=తకారము; కపల=కపవర్గలయొక్క; ప్రథమయుగ్మసకారగతులన్ = ప్రథమద్వితీయాంక్షరసకారసాంగత్యమునందు; తాన=తకారమే యగును. అపరయుగయరలవన్=వర్గీయ తృతీయ చతుర్థాక్షరములందును యరలవలయందును; తృతీయంబు=దకారము అగును.

ఉదా:- తత్+కృతము=తత్కృతము; తత్+ప్రతి=తత్ప్రతి; తత్+సతి=తత్సతి; తత్+గతి=తద్గతి; జగత్+గురుఁడు=జగద్గురుఁడు; సత్+యశము=సద్యశము.

ఇందు "కపలప్రథమయుగ్మ" అనుపాఠము సరియైనది కాదు. సంస్కృతసమాసపూర్వభాగ మగు 'ప్రథమయుగ్మ' 'అనుపదముతో 'కపల' అను తెనుఁగుపదమునకు సాధ్యసమాసము ప్రామాణికము కాదు. కావున నిట పాఠాంతర మనంతునికి సమ్మతమగునది యొకటి యూహింపనగును. ఇచట మఱియొక న్యూనత్వమును గలదు. కప

వర్గప్రథమయుగ్మముతోపాటు తవర్గప్రథమయుగ్మమునను "త"కార మునకు నిజాకృతి యుండును. (చూ-తత్ +తపము=తత్తపము) అయిదువర్గములలో 'చ, ట' వర్గాక్షరములు పరముగానున్నపుడు రాఁదగుకార్యమును దరువాతిపద్యమునం జెప్పుచున్నాఁడు. మిగిలిన' క త ప వర్గాక్షరములు మూఁడును బరముగానుండునపుడు రాఁదగుకార్యము నిందుఁ జెప్పెననుటయె యుచితము. కావున "కపల" అనుటకుబదులు "కతప" అనికాని, 'కపత' అనికాని యుండనగును. అపుడు 'కతప......గతుల' అంతయు నిర్దోషసమాస మగును. ఇట నొకవిశేషము. 'ప్ర' అను రేఫసంయోగమువలనఁ బూర్వాక్షరము గురువు కాలేదనియు గుఱుతింపవలయును. "శతతాళదఘ్నప్రహదంబునన్" ఇత్యాదులం దిట్టిది గలదు. కావునఁ బ్రామాణికమే యన నగును. ఇట్లే "అపరయుగయరలవఁ" అను చోటఁ 'దృతీయంబు' అని యుండవలయును. కానిచో 'నపరయుగయరలవ' అనుమాట కన్వయము లేకపోవును. కాన నిట తృతీయం బనుపదములోని "తృ" అనునక్షరమును 'దృ' అని దిద్దకతప్పదు.

ఉదాహరణములు సూచనాప్రాయముగాఁ గొన్నింటికే యిచ్చుట పరిపాటి కావున "త"కారము పరముగానున్నయుదాహరణము నీయకుండుట దోషము కాదు. కాని యనావశ్యకమయినను నేకరీతి రెండుదాహరణముల నిందు "తద్గతి, జగద్గురుఁడు" అని చూపియున్నాఁడు. ఇదికూడ "తత్తతి, తత్సతియు" నని యుండెడిదేమో యని సంశయము కలుగును. అపుడు తవర్గోదాహరణమును జూపుటయు నగును. సహృదయులహృదయములే యిటఁ బ్రమాణములు.

గీ. తచ్ఛమత్కృతి తచ్ఛాయ తజ్జలంబు
తజ్ఝషము తట్టణాంకృతి తట్ఠకార

ఘనత, తడ్డోల తడ్ఢక్క యనఁగ రెండు
వర్గములు ద్విత్వ మొందుఁ దద్వ్యంజనమున. ఉ॥

తద్వ్యంజనమునన్=ఆ తకారముచే; రెండువర్గములు=చవర్గ టవర్గములు రెండును; ద్విత్వమొందున్=ద్విత్వమును బొందును.

ఉదా:- తత్+చమత్కృతి=తచ్చమత్కృతి; తత్+ఛాయ=తచ్ఛాయ;
తత్+జలము=తజ్జలము; తత్+ఝషము=తజ్ఝషము;
తత్+టణాంకృతి=తట్టణాంకృతి; తత్+ఠకారము=
తట్ఠకారము;
తత్+డోల=తడ్డోల; తత్+ఢక్క=తడ్ఢక్క.

"స్తోఃశ్చునాశ్చుః" "ష్టునాష్టుః" అను పాణినిసూత్రముల కార్యము లిం దనుసంధేయములు.

**విసర్గసంధి :**

కం. కపముఖయుగ్మములు విస
ర్గపయిం బొడసూపి నిర్వికార మగు, మనః
కపట మనఃఖేదము లనఁ
దపఃఫలం బనఁ దపఃప్రతాపం బనఁగన్. ఉ॥

కపముఖయుగ్మములు=కపవర్గముల ప్రథమద్వితీయాక్షరములు; విసర్గపయిన్=విసర్గమునకుఁ బరమందు; పొడసూపి=కానవచ్చి, నిర్వికారమగున్=మార్పు జెందకయుండును.

ఉదా:- మనః+కపటము=మనఃకపటము; మనః+ఖేదము=
మనఃఖేదము;
తపః+ప్రతాపము=తపఃప్రతాపము; తపః+ఫలము=తపః
ఫలము.

సంస్కృతమున "కఖ" లకు పూర్వమునను న్నవిసర్గమును జిహ్వామూలీయ మనియు, "పఫ" లకుఁ బూర్వముననున్న విసర్గము నుపధ్మానీయ మనియు వ్యవహరింతురు. తెనుఁగున నట్టిభేదమువలనఁ గార్యభేదము లేనందునను నుచ్చారణమున భేదము వ్యవహరింపఁబడనందునను నా భేదము పాటింపక యంతటను విసర్గముగనే వ్యవహరింతురు.

గీ. కపల మొదలిరెండ్లగు దుర్నిరుపరిసంధి
షత్వమగు దుష్పదంబు నిష్ఫల మనంగ
జరగు దుష్కర్మ మనఁగ నిష్కర్మ మనఁగఁ
జెల్లు దుష్పీత మనఁగ నిష్పీత మనఁగ. ౭౦

కపలమొదలిరెండ్లగు=కపవర్గముల మొదలిరెండక్షరములుగల; దుర్నిరుపరిసంధిన్= "దుర్, నిర్," అనువానిపరమునఁగల సంధియందు; షత్వమగును=రేఫము విసర్గమయి యావిసర్గము షకారమగును.

ఉదా :- దుః+పదము=దుష్పదము; నిః+ఫలము=నిష్ఫలము;
దుః+కర్మము=దుష్కర్మము; నిః+కర్మము=నిష్కర్మము;
దుః+పీతము=దుష్పీతము; నిః+పీతము=నిష్పీతము.

దుర్, నిర్ అనువానిలోని రేఫము "ఖరవసానయో ర్విసర్జనీయః" అనుదానిచే విసర్గమయి "ఇదుదుపధస్యచా ప్రత్యయస్య" అనుసూత్రముచే షకారమయ్యె నని తెలియనగును.

కం. పొలుపుగఁ జటతాదియుగం
బుల శషస లెనయ విసర్గ పొందు నవన్ వా
శ్ఛలనము ఛందశ్శికలు
లలితయశస్తతి మితశ్ఛలంబు లనంగన్ ౭౧

విసర్గ=విసర్గము, చటతాదియుగంబులన్=చ, ట, త వర్గముల మొదటిరెండక్షరములను; ఎనయన్=కూడఁగా; శషసలు="శషస" అను నక్షరములను వరుసగాఁ బొందును.

విసర్గమునకుఁ బరమున "చఛ" లున్నచో శకారముగను, "టఠ" లున్నచో షకారముగను "తథ" లున్నచో సకారముగను మాఱునని భావము.

ఉదా:- వాః+చలనము=వాశ్చలనము (జలచలనము)
మిథః+ఛలంబు=మిథశ్ఛలంబు (అన్యోన్యకపటములు)
ఛందః+టీకలు=ఛందష్టీకలు (ఛందోవ్యాఖ్యలు)
యశః+తతి=యశస్తతి (కీర్తిసమూహము)

పద్యమున "చటత"లకు వరుసగా నుదాహరణములు చూపవలసియుండఁగా నుదాహరణము కానిరీతిగల "యశఃస్థితి" యనునది సరికాదని "యశస్తతి" యనుపాఠ మూహింపఁబడెను. "మిథః+ఛలంబు" అనుదానిలో ఛకారమున కధోరేఖ పోయియుండును. కాన నదియు "మిథశ్ఛలంబు" అని మార్పఁబడెను.

ఇందలియుదాహరణము లన్నియు నకారపూర్వకవిసర్గములకే యయినను నికారాదిపూర్వకవిసర్గములకును నిందలికార్యము వర్తించును.

ఉదా:- నిః+చలము=నిశ్చలము; దుః+టీకలు = దుష్టీకలు; నిః+తరణము=నిస్తరణము.

**కం. అలరు నికారాదివిస**
**ర్గలపై వర్గాపరాక్షరద్వయగణముల్**
**యలహవలు గదియ రేఫల్**
**గలియు హవిర్భుజథమ్మర్పలంబు లనంగన్.** ౭౨

ఇకారాది=ఇకారాద్యచ్చులతోఁగూడిన; విసర్గలపై=విసర్గముల మీఁద; వర్గా.....గణముల్=వర్గములందలి తృతీయచతుర్థాక్షరముల (గుంపు)లును; యలహవల్=“య, ల, హ, వ” యనునవియును; కదియన్=కూడినచో; రేఫల్=రవర్ణములు; కలియున్=ప్రాప్తించును.

ఉదా:- హవిః+భుజుఁడు=హవిర్భుజుఁడు. (అగ్ని)

ధనుః+బలంబులు=ధనుర్బలంబులు.

కం. మొదలివిసర్గలమీఁదన్
బొదలిన శ ష స లవి యూఁదు భూరియశస్సం
పద యనఁగా సుమనష్ష
ట్పదము లనఁగ నధిక మగు తపశ్శక్తి యనన్.

మొదలివిసర్గలమీఁదన్=పూర్వముననున్న విసర్గలమీఁదను; పొదలిన=పొందియున్న; శషస లవి=ఆ “శ ష స” లు; ఊఁదున్=ఒత్తిపలుకఁబడును. “అనఁగా విసర్గము పరముగానున్న యక్షరముగా మాఱి ద్విత్వ మగుటచే నూఁదిపలుకఁబడును” అని భావము.

శ ష స లకుఁ బూర్వముననున్న విసర్గ శ ష స లుగా మాఱి పోవు నని భావము.

ఉదా:- యశః+సంపద=యశస్సంపద.

సుమనః+షట్పదములు=సుమనష్షట్పదములు.

తపః+శక్తి=తపశ్శక్తి.

గీ. అవ్యయాంతవిసర్గవర్గాక్షరముల
రెంట ఙనమయలవహలరేఫ, రేఫ
గాక పెఱవర్ణములఁ గారకంబు నట్లఁ
గదియు, స్వర్గజం బనఁగ న్వఃకాంతి యనఁగ,

రేఫకాక = రేఫముకాక; పెఱవర్ణముల=ఇతరహల్లులు పరమగునపుడు; కారకంబునట్ల = సుబంతపదమునందలి విసర్గమువలె; కదియున్ =సంధించును.

అవ్యయాంతముననున్న విసర్గము వర్గాక్షరములలోఁ దృతీయ చతుర్థాక్షరములు రెండిటను "ఙ న మ య ల వ హ" యనునక్షరములు పరముగానున్నపుడును రేఫ యగును. ఉదా=స్వః+గజము=స్వర్గజము. రేఫము కాక యితరవర్ణములు పరమగుచో (కారక) సుబంతపదమునందలి విసర్గమువలె కార్యములం జెందును. అనఁగా 'కప'లు పరమగునపుడు విసర్గముగనే యుండుటయు, చ ట త లు పరమగునపుడు శ ష స లగుటయు నని భావము. రామః+కాంతః=రామఃకాంతః అనునట్లే స్వః + కాంత=స్వఃకాంత యని యగునని భావము. రేఫము పరమగునపుడు స్వః+రాట్=స్వారాట్ అనురీతిగాఁ నుండును కావున 'రేఫగాక' అని దానిని తప్పించెను.

కం. ప్రకటవిసర్గాదిస్వర
మకారమునఁ గలిసి యోత్వ మగు సంధిఁ దపో
ధికుఁ డన, విసర్గ చెడి వా
క్ప్రకార మాప్రభృతిఁ గదిసి రజఆప్తి యగున్.

సంధిన్=సంధిని ప్రకట విసర్గాదిస్వరము=విసర్గతోఁగూడిన ఆదిస్వరము-(అకారము.) అకారమునన్=పరమందున్న అకారముతోఁ గూడి; ఆప్రభృతిన్ = ఆకారముమున్నగునచ్చులను, కదిసి=కూడి; విసర్గ చెడి=విసర్గము లోపించి, వాక్ప్రకారము=వాక్కులయొక్క ప్రకృతిగా (అనఁగాఁ బూర్వోత్తరాచ్చులట్లే కలయిక కానవచ్చుచుండుట); రజఆప్తియగున్=రజఃఆప్తి మున్నగునవి 'రజఆప్తి' అనురీతి నగును. విసర్గము లోపించినపిమ్మటఁ బూర్వాపరాచ్చులకు సంధి కాక ప్రకృతి

భావముతో నుండునని యర్థము. ప్రకటమయిన, విసర్గగల=విసర్గతోఁ గూడిన; ఆదిస్వరము=అకారము; అకారమునకేగాని యితరస్వరములకు ఓకారము రాదు.

విసర్గతోఁగూడిన పూర్వముననున్న యచ్చు (అకారము) పరమందున్నఅకారముతోఁ గూడి ఓకారముగా మాఱును. అనఁగాఁ బూర్వపరాచ్చులును విసర్గమును బోయి "ఓ"కార మొక్కటియె వినవచ్చునని భావము.

ఉదా:- తపః+అధికుఁడు=తపోధికుఁడు.

ఆకారమున్నగునచ్చులు పరమయినచో విసర్గ చెడి యా పూర్వోత్తరపదము లట్లేయుండును. అనఁగాఁ బ్రకృతిభావమును బొందునని భావము.

ఉదా:- రజఃఆప్తి=రజఆప్తి. (సరః+ఉదకము = సరఉదకము మొదలగునవియు నిట్లే.)

**కం. కలితేకారాదివిస**
**ర్గలు స్వరములమీఁదఁ గదియఁగా రేఫలు సం**
**ధిలి యర్చిరగ్ర మనఁగా**
**నలవడు మఱి చక్షురింద్రియం బనఁగ మహిన్. ౩౭**

కలితే......విసర్గలు = పొందఁబడిన యికారమున్నగునవిగల విసర్గలు (ఇకారాద్యచ్చులకుఁ బరముగానున్న విసర్గ లని భావము) మీఁదన్=పరమునందు; స్వరములన్=అచ్చులను; కదియఁగాన్=కూడఁగా; రేఫలు=రవర్ణములు; సంధిలి=వచ్చి.

ఉదా:- అర్చిః+అగ్రము=అర్చిరగ్రము (జ్వాలాశిఖ.)

చక్షుః+ఇంద్రియము=చక్షురింద్రియము.

"ఇకారాది" యనుచోట "నికారపూర్వకమగు" అని యర్థము చేసినచో నుకారాద్యచ్పూర్వకవిసర్గలు సంగ్రహింపఁబడవు. కాన నట్టివ్యాఖ్యానము కుదురదు.

గీ. వర్గములఁ దృతీయ చతుర్థ వర్ణములును
ణనమలును యర లవహాలును నొనరఁ గదియ
వామపదసవిసర్గాంతవర్ణ మోత్వ
మగు రజోగుణ మన మనోహర మనంగ. ౭౭

వామ......వర్ణము=ఎడమ (పూర్వ) నున్నపదముయొక్క విసర్గముతోఁగూడిన యంతవర్ణము; లేదా వామపదగ=వామపదము ననున్న; విసర్గాంత=విసర్గ మంతమునఁగల; వర్ణము=అచ్చు (అకారము); ఒనరన్=ఒప్పునట్లుగా; కదియన్=పరమున నుండెనేని.

వర్గతృతీయ చతుర్థవర్ణములును, ణ, న, మ, య, ర, ల, వ, హాలును బర మయినచోఁ బూర్వపదముననున్న "అ"కారపూర్వక విసర్గము "ఓ"కార మగును.

ఉదా:- రజః+గుణము=రజోగుణము; మనః+హారము=మనోహరము; ఇట విసర్గ మకారపూర్వకము కావలయునని లక్షణమున లేకున్నను గ్రాహ్యము. లేదా సవిసర్గ+అ+అంత—పదచ్ఛేదము కావించి "అ" కార మనెడి యంత వర్ణ మను నర్థమును సంపాదింపవచ్చును.

కం. వెలయ నివర్ణాదివిస
ర్గలమీఁదను రేఫ గదియఁగా దీర్ఘము వ
ర్త్రిలి యర్చీరాజి యనఁగ
నలిఁ జక్షూరాగ మనఁ దనర్చును సంధిన్. ౭౮

ఇవర్ణాదివిసర్గలమీఁదను=ఇకారాదిపూర్వకవిసర్గములమీఁద; రేఫగదియఁగాన్=రవర్ణముకూడినచో ననఁగా బరముగా నున్నచో;

దీర్ఘము=దీర్ఘవర్ణము; వ్రటిలి = వెనుకయక్షరమునకు (అచ్చునకు) వచ్చి.

ఇకారాద్యచ్పూర్వకవిసర్గమునకు రేఫము పరముగానున్నచో నావిసర్గము పూర్వాచ్చునకు దీర్ఘముగా పరిణమించును. విసర్గము పోయి పూర్వమునయున్నయికారాదులకు దీర్ఘము వచ్చునని భావము.

ఉదా.- అర్చిః+రాజి=అర్చీరాజి; చక్షుః+రాగము = చక్షూరాగము.

కం. ధర నవ్యయపువిసర్గకుఁ
బరమున నచ్చున్నఁ గుఱుచపై రేఫ యగున్
పరరేఫ గదియ దీర్ఘ
స్వర మగుస్వరధీశుఁ డనఁగ స్వారాజ్య మనన్. ౭౫

అవ్యయపదమునకుఁ జెందినవిసర్గమునకుఁ బరమున నచ్చున్నచో హ్రస్వమునకుఁ బరమున రేఫ యగును. ఉ:- స్వః+అధీశుఁడు=స్వరధీశుఁడు. విసర్గమునకు: బరమున రేఫ మున్నచోఁ బూర్వస్వరము దీర్ఘముగా మాఱును. స్వః+రాజ్యము=స్వారాజ్యము.

గీ. ప్రథమశబ్దాంతదీర్ఘవర్ణములమీఁద
జతనమైన రేఫాంతవిసర్గ యుండి
రేఫ యగుఁ దుదినచ్చున్న, రేఫ యున్నఁ
గ్రాఁగు, వారాకరంబు వారాశి యనఁగ. ౭౬

జతనమయిన=పదిలమయిన; రేఫాంతవిసర్గ=రేఫాంతశబ్దముల విసర్గము, ప్రథమశబ్దాంత=సంధిస్థలమునఁ బూర్వపదముయొక్క యంతమునయున్న; దీర్ఘవర్ణములమీఁదన్=దీర్ఘాచ్చులమీఁద; ఉండి= ఉండి; తుదిన్=పరమున, అచ్చున్నన్=అచ్చున్నచో; రేఫ యగున్= రవర్ణమగును. రేఫయున్నన్=పరమందు రేఫయున్నచో; గ్రాఁగున్= విసర్గము) లోపించును.

సంధిస్థలమునఁ బూర్వపదము దీర్ఘపూర్వక రేఫాంత మయి నచో దానియంతమునను న్న విసర్గమున కచ్చు పరమయినచో రేఫము వచ్చును. వాః+ఆకరము=వారాకరము. అట్లుకాక రేఫము పరముగానున్నచో నావిసర్గము లోపించును.

ఉదా:- వాః+రాశి=వారాశి.

పూర్వపద్య మవ్యయాంతవిసర్గమునుగూర్చి చెప్పెను. ఈపద్య మవ్యయముకాని సుబంతమునుగూర్చి చెప్పెను. ఇదియే భేదము.

కం. అత్త్వాంతవిసర్గ యుడుగు
నిత్త్వాదుల రత్వ మొందు ఋత్వము తుదరాఁ
దత్త్వము తపఋద్ధి యనఁగ
సత్త్వయుతా నిర్ఋతి యనఁ బ్రశస్తం బగుటన్. ౮

అత్త్వాంతవిసర్గ=అకారపూర్వకవిసర్గము; ఋత్వముతుదరాన్= ఋకారము పరమందున్నచో; ఉడుగున్=లోపించును. ఇత్త్వాదు లన్=ఇకారాద్యచ్చులు పూర్వమున నున్నచో, రత్వ మొందున్ = రేఫమగును. తత్త్వము=సత్యము.

ఉదా:- తపః+ఋద్ధి=తపఋద్ధి. (తపఋద్ధియనునది యత్వ పూర్వకవిసర్గస్థలము.)

నిః+ఋతి=నిర్ఋతి (ఇది యికారపూర్వకవిసర్గస్థలము.)

ఈపద్యమునఁ దృతీయపాదారంభమున "అత్వము" అనునది సరళముగా నన్వయింపలేదు. కావున వ్రాఁతప్రతిలోని "తత్త్వము" అనుపాఠము గ్రహింపఁబడెను. తత్త్వము=అనఁగా వెనుకచెప్పినదం తయు సత్యము అని యర్థము. ప్రాససాదృశ్యమునకై తకారద్వయము లేనిస్థలములందు "అచ చిచ" అనుసూత్రముచే ద్విత్వమును సంపా దింపనగును.

కం. దళమగు రేఫాంతవిస
ర్గలమీఁద ఋవర్ణ మొనరఁగా సంధి విస
ర్గ లుడిగి రేఫయు ఋత్వము
గలియును ఋసర్తుసమేతకమలాక్షి యనన్. ౮౨

సంధిన్=సంధియందు; దళమగు=తెలియగు; రేఫాంతవిసర్గల మీఁదన్=రేఫాంతశబ్దముల విసర్గమీఁదను; ఋవర్ణ మొనరగాన్= ఋకారము ఒప్పఁగా; విసర్గ లుడిగి=ఆవిసర్గములు పోయి; రేఫము= విసర్గస్థానియగు రేఫమును; ఋత్వము=పరపదాదినున్న ఋవర్ణమును; కలియును = కలసి యుచ్చరింపఁబడును; కమలాక్షి = పద్మనయన యగుస్త్రీ; ఋతుసమేత=ఋతుకాలము గలది.

రేఫాంతపదములయంతముననున్న విసర్గమునకు ఋకారము పరమగుచో నావిసర్గము మరల రేఫముగా మాఱి ఋవర్ణముతోఁ గలసి పలుకఁబడును.

ఉదా.- పునః+ఋతుసమేత=పునర్తుసమేత.

గీ. స్వాదిసంధిలోపలి విసర్గాంతవర్ణ
సంధు లెన్ని యన్నియును విసర్గసంధి
యందె కలిసి వచ్చుటఁజేసి స్వాదిసంధి
వేఱ యొనరింపఁబడదు వివేకరూఢ ! ౮౩

స్వాదు లనఁగా 'సు' మొదలగువిభక్తులు. అట్టివానిసంధులు స్వాదిసంధు లనఁబడును. అట్టిస్వాదిసంధిలో వచ్చెడి విసర్గాంతపదములయొక్క సంధులన్నియును విసర్గసంధియందే చేరిపోవును. కనుక మరల స్వాదిసంధి యను నొకభేదము వివరింపఁ బనిలేక వివరింపలేదు.

రామః+అయమ్ = రామోయమ్. ఇది స్వాదిసంధిస్థలము. ఇది ౭౫వ పద్యమునఁ జెప్పఁబడిన "తపోధికుఁడు" అనుదానివంటిదే

యగునుకావున వేఱుగాఁ జెప్పనక్కఱలేదుగదా! ఇట్లే మిగిలినవి యూహ్యములు.

వ. మఱియు నొక్కవిశేషసంధి— ౧౪

కం. ఉపరిని హల్సంయుత మై
నపు డూఁదును స్వరసమన్వితాక్షర మగునే
నపు డూఁద దాదివర్ణము
ప్రపాద్వయము పరిక్కృతంబు పరిక్ష్ప్తి యనన్. ౧౫

ఆదివర్ణము = మొదలియక్షరము; ఉపరిని = అనంతరమున; హల్సంయుతమైనపుడు = హల్లుతోఁగూడియున్నపుడు; ఊఁదును = ఒత్తిపలుకఁబడును. స్వర......నేని = పరమందు నచ్చుతోఁగూడి యుండెనేని; ఊఁదదు=ఒత్తిపలుకఁబడదు.

ఉదా:- ప్రపా+ద్వయము = ప్రపాద్వయము. ఇందు దకార వకారసంయోగమువలనఁ బూర్వాక్షర మూఁది పలుకఁబడెను.

పరి+క్కృతము=పరిక్కృతము; పరి+క్ష్ప్తి=పరిక్ష్ప్తి.

ఇట "క్కృ, క్ష్ప" అనునవి యచ్చులతోఁ గూడిన వగుటచేఁ బూర్వాక్షరములు (రి) తేల్చి పలుకఁబడుచున్నవి.

సంధిస్థలములందలి యుచ్చారణవిశేషము నీపద్యమునం జెప్పి సంధిప్రకరణము నుపసంహరించెను.

మఱియు సమాసంబులు :

కం. లలితద్వంద్వబహువ్రీ
హులు తత్పురుషము నలుకుక నుద్యద్ద్విగువున్
నలిఁ గర్మధారయము ని
ర్మలావ్యయీభావమును సమాసము లరయన్. ౧౬

ద్వంద్వము, బహువ్రీహి, తత్పురుషము, అలుక్సమాసము, ద్విగుసమాసము, కర్మధారయము, అవ్యయీభావము అనునవి సమాస భేదములు.

ఇందు ద్విగుకర్మధారయసమాసములు తత్పురుషవిశేషముల యగును. సమాసములు లుక్సమాసములు, నలుక్సమాసములు నని ముందుగా రెండువిధములు. అందు లుక్సమాసములలో ద్వంద్వాది భేదము లన్నియు నుండును. అలుక్సమాసమునఁ దత్పురుషాదులు కొన్ని భేదముల కలుగును.

వ. అందుఁ బూర్వపదార్థప్రధానం బవ్యయీభావంబు, నుత్తర పదార్థప్రధానంబు తత్పురుషంబు, నుభయపదార్థప్రధానంబు ద్వంద్వంబు, నన్యపదార్థప్రధానంబు బహువ్రీహియు నగును.

వెనుకఁ జెప్పిన లుక్ సమాసములలో ద్విగుకర్మధారయములు తత్పురుషభేదములే యగుటచే ముఖ్యభేదము లవ్యయీభావతత్పురుషద్వంద్వబహువ్రీహులు అను నాల్గుమాత్రమే! వానిలో నవ్యయీభావమునఁ బూర్వపదార్థమునకుఁ బ్రాధాన్యముండును. ఉదా:-యథాశక్తి.

తత్పురుషమున నుత్తరపదార్థమునకుఁ బ్రాధాన్య ముండును. ఉదా:- రామదాసుఁడు.

ద్వంద్వమున సమాసమునందలి రెండుపదముల యర్థమునకును బ్రాధాన్యము గలదు. ఉదా:- రామలక్ష్మణులు.

బహువ్రీహియందు సమాసపదముల రెండిటియర్థమును గాక వేఱొకపదముయొక్క యర్థము ప్రధానమగును. ఉదా:- పీతాంబరుఁడు.

సమాసపదములలో నప్రధానపదము ప్రధానపదముతో నన్వ

యించును. ప్రధానపదము వాక్యమునందలి యితరపదముతో నన్వ యించును. కావున సమాసపదార్థముల యన్వయమునుబట్టి వాని ప్రాధాన్యాప్రాధాన్యములు తెలిసికొనవచ్చును. 'యథాశక్తి' యను చోట "శక్తి ననుసరించి" యని యర్థము. శక్తిపదార్థము యథా శబ్దార్థమగు ననుసరణములోనికిఁ గర్మగా నన్వయించుచున్నది. ఆ య నుసరణము "యథాశక్తి పఠతి" ఇత్యాదివాక్యమునందలి 'పఠతి' యనుక్రియలోని కన్వయించును. కావున నిటఁ బూర్వపదమగు యథా శబ్దమునర్థము ప్రధానమును నుత్తరపదమగు శక్తి యనుపదమునర్థ మప్రధానము నగుచున్నవి. ఇట్లే 'రామదాసుఁడు' మున్నగుతత్పు రుషసమాసములందు 'రామునియొక్క' యను పూర్వపదార్థము 'దాసుఁ' డనుత్తరపదార్థములోని కన్వయించుచున్నది. ప్రధానపదా ర్థమగు దాసునికే "రామదాసుఁడు నమస్కరించుచున్నాఁడు" మున్నగువాక్యములలోఁ గ్రియతో నన్వయము. కావుననే క్రియకును దత్పురుషోత్తరపదార్థమునకును వచనసాదృశ్యమును సంభవించెను.

ఇట్లే "రామలక్ష్మణులు" ఇత్యాదిద్వంద్వమున నొకదానితో నొకదాని కన్వయము లేదు. రామలక్ష్మణుల కిరువురకును "వచ్చు చున్నారు" మున్నగుక్రియలతో నన్వయము కల్గుచున్నది. రెండుపద ములకును ప్రాధాన్యము కలదు కావుననే బహువచనప్రత్యయ మీ సమాసమునకు సంభవించెను.

బహువ్రీహియందుఁ బూర్వపదార్థసహిత మయి యుత్తర పదార్థము వేఱొకవిశేష్యముతో నన్వయించును. "పీతాంబరుఁడు" అనుచోటఁ బచ్చనివస్త్రము గలవాఁడు అని యర్థము, 'పచ్చనివస్త్ర ముగల' యనునర్థము "విష్ణువు" అను వేఱొకపదార్థముతో నన్వ యించును. కావుననే విశేష్యము ననుసరించి దీనికి లింగవిభక్తివచ నములు కల్గును.

ఇ స్త్రీసమాసములందు సాధారణముగా సంభవించు నర్థప్రాధాన్యములు చెప్పఁబడెను. క్వాచిత్కముగా వీనికిభిన్నముగా నర్థప్రాధాన్యము కలిగియుండుటయుఁ గలదు. శాస్త్రాంతరమువలన నావిశేషములు తెలియనగును.

వ. అందు ద్వంద్వంబు

కం. పెక్కైనను రెండైనను
జొక్కపుశబ్దములు గదియుచో ద్వంద్వ మగున్
బ్రొక్కెద బలకృష్ణుల కన
నక్కిటికమహాద్రు లుర్వి కాధార మనన్. ౨౨

అనేకపదములు గాని, రెండుపదములు గాని (సమానప్రాధాన్యముతో) సమసించినచో ద్వంద్వమగును.

ఉదా:- బలకృష్ణులు. కిటికమహాద్రులు. (ఆదికూర్మవరాహ కులపర్వతములు.)

"కిటికమహాద్రు" లనుపాఠము ప్రామాదికము. ఇది యనేకపదద్వంద్వము కానేకాదు. ఇది రెండుపదములద్వంద్వముతోఁ గూడిన బహువ్రీహిసమాసము. సందర్భమునుబట్టి యనేకపదద్వంద్వమిట నుండవలయును. అందుచే "కిటికమహాద్రు" లని రేఫమును జేర్చి పఠింపఁబడెను. ఇదియు కవిహృదయమని సహృదయులు గ్రహింతురు. లేదా "కమఠాహులు" అనుట మఱియు బాగు. అహి యనఁగా శేషుఁడు.

గీ. వ్యస్తపద మయ్యెనేని సమస్తమైన
ద్వంద్వమున కంత్యపదముచందము విభక్తి
యంబువులు గోవు ద్విజుఁడు శుద్ధాత్మ లనఁగ
నంబు గో ద్విజుల్ శుద్ధాత్ము లనఁగ నిట్లు. ౨౩

ద్వంద్వముగానుండు సమాసమునంగాని, యాయార్థముగల వ్యస్తపదములకుఁగాని సంబంధించువిశేషణపదమ నకంత్యపదము ననుసరించియే విభక్తిప్రత్యయము లుండును. ఇచట విభక్తిప్రత్యయము లనఁగా వానివలన బోధింపఁబడు మహత్త్వామహత్త్వాదికము లని భావింపవలయును.

ఉదా:- అంబుగోద్విజులు శుద్ధాత్ములు. ఇట ద్వంద్వాంతమునందలి ద్విజశబ్దము ననుసరించి సమాసమునకు మహత్త్వప్రత్యయములు వచ్చెను. దానివిశేషణశబ్ద మగు శుద్ధాత్ము లనుచోటను మహత్ప్రత్యయమే వచ్చెను. అట్లే వ్యస్తముగా నంబువులు, గోవు, ద్విజుఁడు ననియున్నను వానివిశేషణ మగు శుద్ధాత్ములనుపదమునకు మహద్బహువచనప్రత్యయమే వచ్చెను.

గీ. చేయవలయు మాతాపితృసేవ యనఁగ
మహితరుచులు సూర్యాచంద్రమసు లనంగ
నాదిమునులు మిత్రావరుణాఖ్యు లనఁగ
ద్వంద్వమున సంధిదీర్ఘము ల్వచ్చు నిట్లు. ౯౦

ద్వంద్వసమాసమునఁ గొన్నిచోడలఁ బూర్వపదమునకు దీర్ఘము వచ్చునవి గలవు. మాతాపితృసేవ. ఇట సంధిలో దీర్ఘము వచ్చునని చెప్పఁబడియున్నది. కాని మాతృశబ్దమున కిచట దీర్ఘము రాలేదు. ఋకారమునకుబదులు 'ఆ'కారము వచ్చెను. ఇట్టి "ఆ"కారములు ఋకారాంతద్వంద్వములలో మఱికొన్నింటను వచ్చును. హోతాపోతానేష్టోద్గాతలుమున్నగునవి యట్టివే! యోనసంబంధముగాని యజ్ఞసంబంధముగాని యాఋకారాంతపదముల వాచ్యములకున్నచో నాకారము వచ్చును.

మాతాపితృద్వంద్వము. మాతరపితరులు, మాతాపితరుల

వనియు నుండును. ఋకారాంతములు కాకున్నను పితాపుత్రు లను చోట నాకారము వచ్చును. ఇటఁ బుత్రశబ్దము ఋకారాంతము కాదుగదా.

సూర్యాచంద్రమసులు, మిత్రావరుణులు ననుచోటను బద్య మునందుఁ జెప్పఁబడిన యాకారమే వచ్చినను దీర్ఘమేయయ్యెను. 'ఆన ఙృతోర్ద్వంద్వే, దేవతాద్వంద్వేచ' అనుసూత్రములచే నానఙ్ వచ్చినవాని నిందు వివరించెను.

కం. అల సంస్కృతమునఁ బోలెన్
వల దల్పాచ్చునకు నిచట ద్వంద్వపునియతుల్
తెలుఁగు లనుగ్రహనిగ్రహ
ములు నాఁగ నపుణ్యపుణ్యములునాఁ జనుటన్. ౯౧

ద్వంద్వసమాసమున నల్పాచ్చులు గలపదము పూర్వపదముగా నుండవలయుననునియమము సంస్కృతమున సామాన్యముగా నున్నది. కాని తెనుఁగున నట్టినియమ మక్కరలేదనియుఁ గావుననే యనుగ్రహ నిగ్రహము లనియు నపుణ్యపుణ్యము లనియుఁ దెలుఁగునఁ బ్రయో గింపఁబడు చున్నవని యనంతునియభిప్రాయము.

నిగ్రహపద మల్పాచ్చులుగలదయినను బూర్వపదము కాలే దని యాశయము. అట్లే పుణ్యపదము పూర్వపదము కాలేదు. పుణ్య పాపము లనుపాఠము సరికాదు. కనుక సరియగు పాఠము గ్రహింపఁ బడెను.

సంస్కృతమునఁ బూర్వనిపాతవిధాయకశాస్త్రము లనేకము లున్నవి. తుదకు సంస్కృతమునను నీనియమ మనిత్యమనియే యంగీ కరించిరి.

**బహువ్రీహి :**

కం. ఏవస్తు వెవ్వనికిఁ గల
దావస్తువు కలిమి యతని కలవడఁ బలుకం
గావలయు బహువ్రీహి శి
రోవిలసద్బర్హిబర్హ ! రూఢవివేకా ! ౯—౨

ఎవని కేవస్తువుకలదో యది యాతనికిఁ గల దనునర్థముతోఁ జెప్పినది బహువ్రీహి యగును.

ఉదా:- శిరోవిలసద్బర్హిబర్హా = శిరసునఁ బ్రకాశించు నెమిలి పింఛముగలవాఁడా ! అని యర్థము. కావున నిది బహువ్రీహి.

రూఢవివేకా != స్థిరమగు వివేకము గలవాఁడా ! ఇదియు బహువ్రీహియే !

**తత్పురుషము :**

గీ. ప్రథమపదమున కెద్ది విభక్తి దాని
చే విశేషింపఁబడినది యావిభక్తి
సంజ్ఞఁ బరఁగును దత్పురుషంబు కృతుల
నదియు నఞ్పూర్వసహిత మెన్మిదివిధములు, ౯—౩

తత్పురుషసమాసమునఁ బూర్వపదమున కేవిభక్తి యుండునో యావిభక్తితో విశేషింపఁబడిన తత్పురుషసమాససంజ్ఞ వచ్చును. అనఁగాఁ బ్రథమాతత్పురుషము, ద్వితీయాతత్పురుషము అనుతీరున నేడువిభక్తులవలనను నేడుతత్పురుషములును నఞ్తోఁ బూర్వభాగమునఁ గూడిన నఞ్తత్పురుషసంజ్ఞకముతో నెన్మిదివిధము లగును.

కం. తగఁ బ్రథమాతత్పురుషం
బగుఁ గాయముయొక్క పూర్వ మపరము దెల్లం

బుగఁ బూర్వకాయ మనఁగా
నగణితముగ నపరకాయ మనఁగా వరుసన్. ౯౪

కాయముయొక్క-పూర్వము = పూర్వకాయము; కాయము యొక్క-యపర (భాగ)ము=అపరకాయము. ఇవిరెండును ప్రథమాతత్పురుషసమాసము లగును.

కం. కమలాశ్రితుండు ధనకృ
త్యము కుండలకాంచనంబు ధామాగతుఁ డ
ర్యమసుతుఁడు పటస్థితచి
త్ర మన ద్వితీయాదు లాఱు తత్పురుషంబుల్, ౯౫

కమలాశ్రితుండు— ద్వితీయాతత్పురుషము— కమలనాశ్రయించిన వాఁడు.

ధనకృత్యము—తృతీయాతత్పురుషము—ధనముచే జేఁ యఁదగినది.

కుండలకాంచనము— చతుర్థీతత్పురుషము— కుండలములకొఱకగు బంగారము.

ధామాగతుఁడు— పంచమీతత్పురుషము— ధామమునుండి వచ్చినవాఁడు.

అర్యమసుతుఁడు— షష్ఠీతత్పురుషము— సూర్యునియొక్క- పుత్రుఁడు.

పటస్థితచిత్రము— సప్తమీతత్పురుషము— వస్త్రమునందున్న చిత్రము.

కం. క్షితి నఞ్ తత్పురుషం బగుఁ
బ్రతిషేధనకారమునకుఁ బ్రతియై మొదలన్
వితతాకారము చొప్పడి
యతఁ డబ్రాహ్మణుఁ డనంగ నవృషలి యనఁగన్,

ప్రతిషేధార్థనకారమునకు బదులు "అ"కారము పూర్వభాగమున నున్నసమాసము నఞ్ తత్పురుషసమాస మగును.

ఉదా:- అబ్రాహ్మణుఁడు—(బ్రాహ్మణుఁడు కానివాఁడు)

అవృషలి—(శూద్రస్త్రీ కానిది)

కం. ద్విగు వగు సంఖ్యాపూర్వక
మగుచు సమానాధికరణ మగుచుఁ బ్రసిద్ధం
బుగఁ గర్మధారయాహ్వయ
మగుఁ దత్పురుషంబ యీప్రకియన్ భిన్నగతిన్. ౯౭

సమానాధికరణతత్పురుషము కర్మధారయ మగును.

సంఖ్యాపూర్వకమగు సమానాధికరణ తత్పురుషసమాసము ద్విగుసమాస మగును.

సమానాధికరణ మనఁగా స్థూలముగాఁ జెప్పవలసినలక్షణ మేమనఁగా సమానవిభక్త్యంతము లయిన విశేషణవిశేష్యముల సమాస మని యర్థము.

తత్పురుషంబ=తత్పురుషసమాసమే; ఈప్రకియన్ = ఈతీరున; భిన్నగతిన్=తత్పురుషముకంటె భిన్న మగుతీరున; తత్పురుషమే సంఖ్యాపూర్వక మగుచు ద్విగు వగును. సమానాధికరణ మగుచుఁ బ్రసిద్ధంబుగఁ గర్మధారయాహ్వయ మగును.

కం. ఏయది సంఖ్యాపూర్వక
మై యలవడుఁ బలుక ద్విగుసమాసం బది, దా
నీయదుపతికీర్తిం దెలు
పాయెఁ ద్రిలోకి యనఁ నీ సమాహారోక్తిన్. ౯౮

సంఖ్యాపూర్వకతత్పురుషసమాసము ద్విగు వగును.

ఉదా:- త్రిలోకి=ముల్లోకములు.

ఇది సమాహారము ననఁగా ముల్లోకముల సమూహమును జెప్పును గావున నేకవచనాంత మగును. సంస్కృతమున సంఖ్యాపూర్వక మయినంతమాత్రమున ద్విగుసమాసము కాదు. సంఖ్యాపూర్వక మయి సమాహారమును జెప్పవలయును. అనఁగా ద్విగు వేకవచనాంతమే కావలయునని భావము. కనుకనే సప్తర్షులుమున్నగునవి ద్విగువులు కాక కర్మధారయసమాసములే యని పెద్దలయాశయము. ఈవిషయమునకు నా ప్రౌ॥ వ్యా॥ త॥ బోధిని చూడఁదగును.

**కర్మధారయము :**

కం. ఏమిటి కెయ్యది గుణమై
తా మెఱయుచు నుండు నది మొదల నిడి పలుకన్
భూమి నది కర్మధారయ
మౌ మధురోదకము మేచకాంభ్రం బనఁగన్. ౯౯

దేని కేది గుణమో (రూపగమును) బూర్వముగూర్చి యాగుణముగలదానినిఁ దర్వాతిపదముతోఁ జెప్పిన నది కర్మధారయ మగును. (ఇచట గుణ మనఁగా విశేషణ మనియుఁ జెప్పవచ్చును. అప్పుడు దేని కేది విశేషణ మగునో దాని కది పూర్వముననుండునట్లు కూర్పఁబడినచోఁ గర్మధారయ మగునని భావము.

ఉదా:- మధురోదకము = తీయనినీరు. ఉదకమునకుఁగల మాధుర్యగుణమును జెప్పెడిమధురపదము పూర్వమును నాగుణము గల యుదకవాచకపదము తర్వాతను నిలుపఁ గూర్పఁబడినందున నిది కర్మధారయ మయ్యెను.

మేచకాభ్రము = నల్లనిమేఘము. ఇందును మేఘమునందలి గుణమగు నలుపును జెప్పెడిమేచకశబ్దము పూర్వపదముగా నున్నది.

కం. అందముగఁ గర్మధారయ
మందు మహత్తునకు నమరు నాయోగము గో
విందుఁడు మహాత్ముఁ డనఁ జే
యందు ఫలితకల్పలత మహాలక్ష్మి యనన్. ౧౦౦

అందముగన్=రమ్యముగా; కర్మధారయమందు=కర్మధారయ సమాసమునందు, మహత్తునకు = మహచ్ఛబ్దమునకు; ఆయోగము= ఆకారముతోడికూడిక; అమరున్=ఒప్పును. (చే+అందు=చేయందు) ఇట హస్తార్థకమగు "చే" శబ్దప్రయోగము. చూ "చేఁ జఱచి నవ్వుచున్, చే యెత్తి మొఱవెట్టుట" మున్నగునవి.

కర్మధారయసమాసమున విశేషణముగా నున్నమహచ్ఛబ్దమునకు "త"కారమునకుబదులు "ఆ"కారము వచ్చును.

ఉదా:- మహాత్ముఁడు, మహాలక్ష్మి. ఇట మహదాత్ముఁడు మహల్లక్ష్మి యని కావలసియుండఁగా నీ "ఆ"కారమును విధించి సాధురూపములను జూపించెను. పాణినీయమున "ఆన్మహతస్సమానాధికరణ..." అనుసూత్రము దీనికి మూలము.

ఇట "త్ము" అనునది "త్తు" అనియు, "అభి" అనునది "ఆ" అనియు దిద్దఁబడెను. సందర్భమునుబట్టి యిదియే గ్రంథకృత్సమ్మతమని యూహింపఁబడెను.

**అలుక్సమాసము :**

కం. ఏక్రియ యెవ్వనికిం దగు
నాక్రియఁ దేరఁ బదమధ్యమందు విభక్తి
ప్రక్రియఁ గూర్ప నలుక్కగు
నీక్రియ ఖేచరవనేచరేశ్వరు లనఁగన్. ౧౦౧

ప్రక్రియ=ఏపని; ఎవ్వనికిన్=ఎవనికి; తగున్=తగియుండెనో; ఆక్రియన్ = ఆపనినిఁ జెప్పుశబ్దమును; తేరన్ = ఉత్తరపదముగాఁ దెచ్చునపుడు.

ఎవని కేపని సంబంధించియుండునో యాపనినిఁ జెప్పెడిక్రియా పదమును గూర్చునపుడు సమాసపదమధ్యమునందు విభక్తిప్రత్యయ ములను గూర్చిన (లోపింపకయున్నచో) నది యలుక్సమాస మగును.

ఉదా:- ఖేచరుఁడు=ఆకాశమునందు చరించువాఁడు. ఇట ఖశబ్దమునకు సప్తమీప్రత్యయము సమాసమునందుఁ గానవచ్చుటచే నిది యలుక్సమాస మగును.

వనేచరుఁడు=అడవియందుఁ జరించువాఁడు. ఇదియు నట్లే సప్త మిలోపింపని యలుక్సమాసము.

ఇట్టి వింకను పశ్యతోహరుఁడు, జనుషాంధుఁడు మున్నగు పలువిభక్తులుగల సమాసము లున్నవి.

"ప్రక్రియ యెవ్వనికిం దగు నాక్రియ దేరన్" అని క్రియను జెప్పుశబ్ద ముత్తరపదముగానుండునని యిందు సూచించినను నితర శబ్దములుగూడ సమాసోత్తరపదములుగా నుండవచ్చును. కంఠేకా లుఁడు. జనుషాంధుఁడు మున్నగునవి యట్టివే! కావున వ్యాకరణశా స్త్రమువలన సమగ్రజ్ఞానమును సంపాదించుకొనవలయును. ఆయావిష యములను ఛందస్సునకు సంబంధించినవికాకున్నను ఛందస్సున నుపయోగముకలదని సూచనాప్రాయముగా ననంతుఁడు సమాసముల నుపదేశించెనని గ్రహింపనగును.

**అవ్యయీభావసమాసము :**

**కం. ఎక్కడ నెయ్యవి లేవవి**
**యిక్కడ లేవనిన నవ్యయీభావము దా**

నెక్కొను నిర్మక్షిక మని
యక్కజమగు దీర్థమహిమ నభినుతి సేయన్. ౧౦౨

ఎక్కడ నేవియుండవో యవి యక్కడ లేవనుట కవ్యయీభావము వర్తించును.

ఉదా:- నిర్మక్షికము. (ఈఁగలులేకుండుట.) మక్షికలయొక్క యభావము. అభావార్థమున "నిర్" అనునవ్యయము మక్షికాశబ్దముతో సమసించినది. ఈసమాసమును నవ్యయమే!

అభావార్థకావ్యయీభావమే కాక విభక్తిసమీపాద్యనేకార్థములందు నవ్యయీభావములు గలవు. అధిహరి "హరియందు" అని యర్థమున నిది యవ్యయీభావము. ఉపగిరీత్యాదులు సమీపార్థకావ్యయీభావములు. మిగిలిన వన్యత్ర జ్ఞేయములు.

వ. మఱియు నుత్తరపదోపమానసమాసం బెట్టి దనిన ౧౦౩

ఉత్తరపదోపమానసమాసంబు=ఉపమానోత్తరపదసమాస మని యర్థము. ఏసమాసమున రెండవపద ముపమానమును జెప్పునో యట్టి సమాస మని భావము.

గీ. ఓలిఁ బురుషసింహో యని యుగ్గడించు
చోటఁ దా సింహఇవపురుషో యనంగ
దనరు విగ్రహ మగుట నుత్తరపదోప
మానసమాస మం డ్రిది శాస్త్రమహిమవిదులు. ౧౦౪

"పురుషసింహః" అనుసమాసమునకు "సింహఇవపురుషః" అని విగ్రహ మగుటచే నిందు రెండవపద ముపమానవాచక మయ్యెనుగాన నిది యట్టిసమాస మగునని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఇట్టి సమాసము లితరములు నూహ్యములు.

ఇందు 'ఉత్తరపదోపమా సమాస, మని వాడఁబడియున్నది. సామాన్యముగా నుపమానోత్తరపదసమాస మని వాడుక చేయుదురు. ఇతఁడు తద్భిన్నముగా వ్యవహరించెను. ఉత్తరపదే ఉపమా యస్య' అని బహువ్రీహి చెప్పినచో విశేష్యమగు సమాసశబ్దము నుబట్టి యిదియుఁ బుంలింగ మయి యుత్తరపదోపమాసమాస మని యుండవలసివచ్చును. ఉత్తరపదోపమానసమాస మన్నప్పుడుకూడ విశేషణమగు నుపమానశబ్దము పూర్వపదముగా నుండవలసియున్నది. కాని యిప్పుడు ప్రాగ్వనిపాతశాస్త్ర మనిత్య మనుమతము నాశ్రయించియో విశేషణత్వవిశేష్యత్వములు వైవక్షికము లనియో సాధుత్వమును సంపాదింతుము. ఇందట్లు గాక "ఉపమా" శబ్దము వాడఁబడెను. అందుచే నిట సమాసమును క్లేశముతో సాధింపవలసియున్నది. "ఉత్తరపదే ఉపమా=ఉత్తరపదోపమా; తత్సంబంధీ సమాసః = ఉత్తరపదోపమాసమాసః" అని విగ్రహము చెప్పవలయును. ఈపద్ధతిగా నిది సాధుపదప్రయోగ మని గ్రహింపవలయునేకాని యనంతుని నాక్షేపింపనక్కఱలేదని సహృదయులు తెలియంగలరు.

ఈపద్యమున "సింహో యని, ఘురుఘో యనంగ" అని ప్రయోగింపఁబడెను. సంస్కృతపదముల ననుకరణముతోఁ బ్రయోగింపవచ్చును. కాని యీయనుకరణము పరంబగునప్పుడు విసర్గమునకు లోపము వచ్చును. నమశ్శబ్దమునకుమాత్రము విసర్గలోపము వచ్చి "తుభ్యం నమ యనెఁ" ఇత్యాదిగా నుండుటయేకాక నమశ్శబ్దము తుదియత్తున కోత్వము వైభాషికముగావచ్చి "తుభ్యం నమో యనె" నిత్యాదిరూపముతోడను నుండును. అథర్వణాచార్యులును "నమశ్శబ్దవిసర్గస్య లోపఓత్వమపీష్యతే" యని నమశ్శబ్దమున కోత్వమును విధించిరి. "జీవస్థాయ నమో యనంగ". ఉ. హరి ౨. ౧౩౦. "నిశాచరహారాయ నమో యనుఁగాసి" (వరాహ.) మున్నగుప్రయోగములును

గలవు. ఇట్లు నమశ్శబ్దమునంతమున కోత్వము భారతమున లేకున్నను నితరగ్రంథములందు గలదు. సముద్రగసాహసాయ నమో యంచు. 3 ఆ. ౭౮ ప. అని యితఁడే నమో యని ప్రయోగించెను. కాని యిట్టివిసర్గలోపస్థలమునఁ బతూర్వాత్తున కోత్వము వచ్చుట నమశ్శబ్దేతరములందు విరళముగాఁ గానవచ్చుచున్నది. బాలవ్యాకరణమున నమశ్శబ్దముతుదియత్తున కోత్వము విధించి యీకార్యంబు లాతిచోసహితము గానంబడియెడి నని చెప్పి "గతానుగతికో లోకో యటంచుఁ" అనిచూపఁబడెను. కావున నిస్లే సింహో యని, పురుషో యనంగ ననురూపములు సాధువు లగునని తెలిసికొనఁ దగును.

ఇట్లు సమాసములను సంగ్రహముగాఁ జెప్పి సుబంతములను దిజంతములను విశదీకరింపఁబోవుచుఁ దెనుఁగుశబ్దముల చాతుర్విధ్యమును నిరూపించుచున్నాఁడు—

**మఱియుఁ గారకశబ్దంబులు :**

గీ. సంస్కృతము తెనుఁ గైనఁ దత్సమపదంబు
దానఁ బుట్టి తెనుం గైనఁ దద్భవంబు
దేశితెనుఁగు దేశజ మచ్చతెనుఁగు తెనుఁగు
నిర్మలుఁడు, సిరి, యొడయఁడు, నిక్క మనఁగ

సంస్కృతప్రాతిపదికము తెనుఁగువిభక్తులు చేరి తెనుఁగు పద మయినచో నది తత్సమ మనఁబడును. ఆ సంస్కృతప్రాతిపదికమునం బుట్టి తెనుఁగువిభక్తిప్రత్యయములు చేరి తెనుఁ గయినపదములు తద్భవము లనఁబడును. సంస్కృతసంబంధము లేక యాయా దేశములం బుట్టినపదము దేశితెలుఁ గనఁబడును. ఇదియే యన్యదేశ్య మనఁబడును. కేవలము తెనుఁగుదేశమునం బుట్టిన యచ్చ తెనుఁగుపదము నిరుపపదముగాఁ దెనుం గనఁబడును. ప్రాకృత

సమము నీతఁడు తత్సమమని వ్యవహరింపలేదు. వాని నీతఁడు తద్భవము లలోఁ బరిగణించెను.

ఉదా.- నిర్మలుఁడు :-ఇది కేవలసంస్కృతప్రాతిపదికమునకుఁ దెనుఁగు ప్రత్యయము చేరినదగుటఁ దత్సమ మయ్యెను. ఇందుఁ బ్రాతిపదికమునందు సంస్కృతమునకంటె భేద మేమియు నుండదు.

సిరి :- ఇది "శ్రీ" అను సంస్కృతప్రాతిపదికమునుండి పుట్టినదగుటచేఁ దద్భవ మయ్యెను. ఇందుఁ బ్రాతిపదికమునందే యక్షరములు మార్పుఁ జెందెను. దీనిని చిన్నయసూరిమున్నగువారు తత్సమమనియే వ్యవహరించిరి.

ఒడయఁడు :- ఇది ద్రావిడదేశసంబంధముగల పదము. "ఉడయర్" ఇత్యాదికము దీనికి మూలము. అందుచే నిది దేశితెనుఁ గయ్యెను. కన్నడభాష యందును దీనికి సరూపపదము "ఒడెయ" అని కానవచ్చుచున్నది.

ఆంధ్రు లితరదేశమునఁ జరించి తద్భాషా పదములను దెనుఁగునఁ జొనిపినపద మని యప్పకవి వివరించెను.

నిక్కము :- ఇది యచ్చతెనుఁగుపదము. దీని కేయితర భాషతోడను సంబంధము లేదు. ఇది తెనుఁగు వారి వాడుకలోనిది.

ఇతఁడు పదములను నాల్గురకములుగా విభజించినను 3, 4 భేదముల కవాంతరభేదము లేక యేకజాతీయపదములుగనే నేఁడు వ్యవ

హరింపఁబడుచున్నవి. ఆంధ్రదేశ్యము లెవ్వియో యన్యదేశ్యము లెవ్వియో గుఱుతించుటకును క్రమముగా నశక్యమగుటచేఁగూడ నిట్లు జరిగియుండును. కావుననే యనాంధ్రవర్ణములుగల 'రవరు, శేవ' మున్నగువానిని మాత్రము నన్యదేశ్యము లనుచు నితరములగువానిని దేశ్యములనియే వ్యవహరించిరి.

అప్పకవి యెట్లు భేదమును గుఱుతించెనో యూహింపలేము గాని 'ఆలంబు, చివ్వ' మున్నగు ననేకపదముల నన్యదేశజాంధ్రము లని చెప్పెను.

చింతామణి గ్రామ్యమునుగూడ నొకభాషాభేదముగాఁ జెప్పెను. బాలవ్యాకరణాదులును సప్తభేదములనే చెప్పెను. అనంతుఁ డట్టిగ్రామ్యము నొకభేదముగాఁ బరిగణించుట మానెను. దోషవాచకమగు గ్రామ్యశబ్దముచే నొకపదజాతమును వ్యవహరించుట యితనికి సమ్మతముకాక మానియుండును.

గ్రామ్యము లనఁబడువానిఁ జింతామణియందయినను పరిగ్రాహ్యములుగాఁ జెప్పలేదు. భాషలోనిపదజాతము నాల్గువిధములుగా నుండుననియు నందు మూఁడువిధములు (తత్సమ తద్భవ దేశ్యములు) నియమము గలవికావునఁ బరిగ్రాహ్యము లనియు గ్రామ్యము వ్యాకరణసంస్కారములేని యపభ్రంశ మనియు నిరూపించి యది యగ్రాహ్యమనియే సూచించెను.

ఇఁక బాలవ్యాకరణాదులు చూపిన కలిగింపుఁడు, ప్రాణగొడ్డము మున్నగునవి పరిత్యాజ్యములు కానక్కఱలేదు. అవి గ్రామ్యములే యనఁదగవు. "గ్రామ్యం తత్త్వద్విశః సాధు కలికంఠముఖాహితాః" అని యథర్వణుఁడును, కలికంఠాదిశబ్దములు గ్రామ్యము లనక సాధుశబ్దములే కావున హితములే యనియు, గ్రామ్యములు

కిరాతాదిసంభాషణాదిస్థానములందుమాత్రము గ్రామ్యము లనియుఁ జెప్పెను. అవి శిష్టజనస్వీకృతములు గనుటచే గ్రామ్యము లగును. వచ్చాఁడు, తెచ్చాఁడు మున్నగునవిమాత్రమే గ్రామ్యములు. అవి యెట్టియు బ్రయోగార్హంబులు కావు. కావున భాషాభేదములలో ననం తుఁడు గ్రామ్యమును జెప్పినంతయు నిమ్యముగనే యున్నది. “మొక్కెము సామి” మున్నగు ప్రయోగములు భాషయందుఁ గాన వచ్చుచున్నవి సంయుక్తాక్షరములోఁ జేసే ప్రయుక్తము లగుచున్నవి. (అని వనదరులు నిస్నవింపఁగా నిత్యాదిపీఠిని) కావున “దేవదేవాయ నమ యనె” యిత్యాదులవంటివే కావున దోషము లేదు.

గీ. సర్వనామముల్, యుష్మదస్మత్పదంబు
లావిభక్తులక్రియ, లవ్యయములు, మానుఁ
దెలుఁగు లగుచోటఁ గారకాదిని వసించి
సర్వనామాశ్రయంబులు జరగుఁ గొన్ని. ౧౦౬

సర్వనామములు = సంస్కృతపదములలో “ఇదమ్, ఏతద్” మున్నగుకొన్ని సర్వనామములు, యుష్మదస్మత్పదంబులు = అహం, త్వం మున్నగునవి; ఆ (సంస్కృతభాష) విభక్తులక్రియలు=విభక్త్యంత ములగు క్రియలు (భవతి, ఏధతే) అవ్యయములు=స్మారంస్మారం, గత్వా మున్నగునవ్యయములు; తెలుఁగులగుచోటన్ = తత్సమము లుగాఁ దెలుఁగులోనికి రావలపినవో; మానున్=రావు. కొన్ని సర్వ నామాశ్రయంబులు=సర్వనామసంజ్ఞగలపదములు; కారకాదిని=కారక పదములపూర్వమున; వసించి=ఉండి; జరగున్=తెనుఁగున వర్తిం చును.

యుష్మదస్మచ్ఛబ్దములును, గొన్నిసర్వనామములును, దిజం తములు, ననేకావ్యయములును తెనుఁగుభాషలోనికిఁ దత్సమములుగా

రావు. సర్వనామము లితరపదములతో నాదిభాగమునఁ గూడి యేతద్గ్రహము, తద్భవనము మున్నగుతీరునఁ గొన్ని ప్రయోగింపఁ బడును.

సర్వనామములలో తదేతదిదమదసాదిశబ్దములు దెనుఁగునకు రాకున్నను సర్వ, అన్య, పూర్వ, పరాదిశబ్దములు తెనుఁగునఁ బ్రయోగింపఁబడును. కనుకనే యుష్మదస్మత్పదములను బ్రత్యేకముగా నిషేధించెను.

సీ. ఏ నన్న నీ వన్న నితఁ డన్నఁ బ్రథమాఖ్య;
నను నిన్ను నాతని నన ద్వితీయ;
యతనిచే నతనితో ననఁగఁ దృతీయ; యీ
తనికొఱ కతనికై యనఁ జతుర్థి;
పంచమి యగు వీనిఁబట్టి యతనినుండి
వానికంటెను వానివలన ననఁగ;
వానియొక్కకులంబు వానికిఁ బ్రియ మది
జనులలో నితఁడు మే లనఁగ షష్ఠి;
ఆ వె. జలధియందు, లక్ష్మిగలుగుచుండఁగఁ, దన్ని
మిత్త మనఁగ సప్తమీవిభక్తి;
జలజనాభ యనఁగ సంబుద్ధి యిట్లు వి
భక్తు లలరుఁ గారకోక్తిగతిని. ౧౦౩

కారకోక్తిగతిని=సుబంతపదముతీరును బట్టి; పద్యార్థము సులభము.

ఇందు విభక్తులను సంబోధనముతోఁ గూడ నెనిమిదింటిని దెనుఁగునఁ జూపుచున్నాఁడు. సీసపద్యపాదములు నాల్గింట సర్వనామము

లగు నీ, నా, ఆ, ఈ మున్నగు శబ్దములను విభక్త్యంతములుగాఁ జూపెను. ఇందు విభక్తిప్రత్యయములను వరుసగాఁ జూపుట యుద్దిష్టము. కాని "ము, కూర్చి, న" యనునవి చూపఁబడలేదు. "కూర్చి" పదాంతరమనుకొనినను 'ము, న' లట్టివి కావు. నిమిత్తార్థమునఁ బ్రథమాంత నిమిత్తశబ్దప్రయోగము చేయనగునని సూచించెను. "లక్ష్మి గలుగుచుండఁగ" ననునది సత్యర్థసప్తమీసూచకము.

ఇందు "దీనఁ బట్టుండి యందుండి" అను పూర్వపాఠము పద్యమునందలితీరున కనుగుణముగా లేదు. విభక్త్యంతములగు తదేతదాదిశబ్దములద్వారమున విభక్తులు చూపుట యిందలి తీరు. పట్టి, ఉండి అని యిందుఁ బూర్వపాఠమున విడిగాఁ జూపఁబడెను. 'పట్టుండి' అని సంధిచేయఁబడెను. 'దీనన్' అనునది పంచమియందు మాత్రమే చూపఁబడెను. ఇది తృతీయాసప్తములయందును వర్తించును. పట్టి యనునది యొకప్రాతిపదికముతోఁగూర్చి చూపలేదు. కావున నిచట "వీనిఁబట్టి యతనినుండి" యనియుండిన ననుగుణముగ నుండునని తలంపఁబడెను.

**కం. స్త్రీపుంనపుంసకము లన**
**నేపగులింగములమీఁద నెపఁగువిభక్తుల్**
**దీపించు నవియు వచన**
**వ్యాపారనిరూఢి నక్షరాంతరములతోన్. ౧౦౭**

స్త్రీపుంనపుంసకము లని లింగములు ముప్విధములు. ఆ మూఁడువిధములలింగములుగల శబ్దములపై నీవిభక్తులు చేరును. అవియు వచనమునుబట్టి మఱికొన్నియక్షరములతోఁ గలిసియుండును. 'ల' మున్నగునక్షరాంతరములతోఁ గూడియుండు నని భావము.

కం. తనరఁగ అ ఆ ఇ ఈ
లనఁగా ఉ ఊలు నాఁగ నంబుజదళలో
చన ఋ ఐ లన ఓ ఔ లనఁగ
నజంతాహ్వయంబు లగు నీపనియున్. ౧౦౯

సంస్కృతశబ్దముల కేయేవర్ణము లంతమునఁ బ్రసిద్ధముగా నుండునో యిటఁ దెల్పుచున్నాఁడు. అజంతములు పదివిధము లని యిందుఁ జెప్పెను. "ఏ" అంతమునను౦డుశబ్దములలో 'సే' శబ్దముదాహరణార్థముగా వైయాకరణులు చూపినను వాడుకలో నతివిరళము లగుటచేతఁగాఁబోలు నవి చూపఁబడలేదు. అప్రసిద్ధమేకారాంతము (ర ఆ. రశ్మి ప.) అని యీావళి కితఁడు చెప్పియేయుండెను. ౠకారాంతమును నప్రసిద్ధమనియే విడిచెను.

రామ, రమా, హరి, గౌరీ, గురు, వధూ, పితృ, రై, గో, గ్లౌ శబ్దములు వరుసగా నజంతములు.

ఈపద్యమున హ్రస్వాచ్చులంగూడ గురువులుగా నొనరించెను. (వ్యవహారానుగుణముగా) అచ్చులకు సంధియుఁ బాటింపలేదు. స్పష్టతకొఱ కట్లు గావించెనని తెలియనగును.

కం. చజలు తవర్గము పభమలు
స్వజనప్రియ ! రవలు శషలు సహలు పదాళిన్
నిజమగు హలంతములు హరి !
యజంతములు గూడ నిరువదా ఱంతంబుల్. ౧౧౦

శబ్దములకు హల్లులలో నేవేవి యంతమున నుండునో యిందుఁ జూపుచున్నాఁడు. పదునాఱుహల్లు లంతమునఁగలశబ్దములు గలవని యాహల్లులను వరుసగాఁ జూపెను.

జలముచ్, భిషజ్, మరుత్, అగ్నిమథ్, దివిషద్, బుధ్, రాజన్, అప్, కకుభ్, ఇదమ్, గిర్, దివ్, దిశ్, దోష్, మనస్, పిస్ అనునవి వరుసగా హలంతములకుదాహరణములు.

అజంతములు పదియు హలంతములు పదునాలును గూడ నిరువదాఱంతము లగును. సుగణ్ మున్నగు ణకారాంతములు మొదలయిన యితరహలంతశబ్దములు నామమాత్రముగా నున్నను ప్రసిద్ధములివియే యనుతలంపుతో "నిజమగుహలంతము" లని నుడివెను.

కం. అంతము తెలుఁ గగునెడ నే
యంతము తలఁపూప దైన నచట సమాసా
భ్యంతరములందు సంధ్యుచి
తాంతములగుఁ గాన ధీవియద్విష్ణు లనన్. ౧౧౧

కానన్=చూడఁగా; అచటన్ సమాసాభ్యంతరములందు = ఆ సమాసమధ్యభాగములందు; ధీవియద్విష్ణు లనన్ సంధ్యుచితాంతము లగునని యన్వయము.

సంస్కృతశబ్దములు తెనుఁగువిభక్తులు చేరి తత్సమము లగునపుడు వెనుకఁ జెప్పినవర్ణము లెవ్వియుఁ గానరావు, అనఁగాఁ జాలశబ్దముల కంతవర్ణము తెలుఁగువిభక్తిసంబంధమున మాఱిపోవును. (ఇకారాంతములు మున్నగునవి కొన్ని మాత్రము మాఱవు.)

అయినను సమాసములమధ్యభాగమున నావర్ణములు సంధికిఁ దగినతీరున మార్పుఁ జెంది కానవచ్చుచుండును. (రామ+ఉదన్తము=రామోదన్తము.) ధీవియద్విష్ణులు—ఇట నీకారాంత మట్లే మాఱక కానవచ్చుచున్నది. వియత్ అనుచోటఁగల తకారము సంధివశమున దకారముగను మాఱినది. సమాసమధ్యభాగమునుబట్టియే యీశబ్దములయొక్క యంతమును దెలిసికొననగును.

కం. యత్తత్ప్రభృతు లొకటితోఁ
జొత్తెంచును యద్గుణంబు చూచి మహాత్ముల్
మెత్తురు తత్పురుషుఁడు లో
కోత్తరుఁ డన నీదృశప్రయోగబలమునన్. ౧౧౨

సంస్కృతశబ్దముల ప్రసంగమున యత్తదాదిశబ్దములస్వభావమును నిరూపించుచున్నాఁడు.

తెనుఁగున యత్తదాదిశబ్దము లింకొకశబ్దముతో సమసించియే ప్రయోగింపఁబడును. వ్యస్తముగా నీశబ్దములు ప్రయోగింపఁబడవు. ఆవిషయమే "ఒకటితోఁ జొత్తెంచు" నని చెప్పఁబడెను. పద్యమున నుదాహరింపఁబడిన యత్తచ్ఛబ్దములు "యద్గుణంబు తత్పురుషుఁడు" అని సమాసపూర్వావయవములుగా నున్నవి. వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడలేదు. యత్తత్ప్రభృతు లనుటచే నేతదాదిశబ్దములును గ్రాహ్యములు. "ఇయద్గుణంబు తత్పురుషుఁడు" అన్నట్లే యేతత్పురుషుఁడు మున్నగునవియు సమస్తము లయియే ప్రయోగింపఁబడును. ఇట్లే కిమిదమదో యుష్మదస్మద్భవదాదిశబ్దములును, శతృతంతములును దెనుఁగునఁ బ్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడవు. ౧౦౬వ పద్యము నుత్తరార్థమునం జెప్పినవిషయము నిట సోదాహరణముగా వివరించెను.

**మఱి క్రియాపదంబులు :**

కం. పరుఁ బలుకు ప్రథమపురుష మె
దిరి మధ్యమపురుష పలుకు ధృతి దనుఁ బలుకున్
ధర నుత్తమపురుష క్రియ
వరుస నలింగకములై నవచనము లెసఁగున్. ౧౧౩

క్రియాపదములు ప్రథమపురుషప్రత్యయాంతము లయినచో నితరునిఁ జెప్పును.

మధ్యమపురుషక్రియ యెదుటివారినిఁ బల్కును. ఉత్తమపురుషక్రియలు తన్నుఁ జెప్పును.

ఉదా :- భవతి — ప్రథమపురుష.

భవసి — మధ్యమపురుష.

భవామి — ఉత్తమపురుష.

వీని వచనప్రత్యయములకు లింగభేదము లేదు. అనఁగా మూఁడులింగములందును నొక్కవిధముగనే యుండునని భావము. కనుకనే "రామఃపఠతి" అనుచోట నున్నయట్లే "కాంతాపఠతి" అనియు నుండును. ఇట స్త్రీకర్తృక మయినను క్రియాపదమునఁ బ్రత్యయభేదము లేదు. తెనుఁగునమాత్రము ప్రథమపురుషమున మాత్రము కొన్నింట లింగభేదము గలదు. రాముఁడు చదువుచున్నాఁడు. కాంత చదువుచున్నది.

కం. కారకపదములు తెనుఁగై
నారి నరుఁడు రత్న మనఁ దనర్చుగతి క్రియా
కారవిశేషము లలరవు
వారలు వచ్చెదరు దండు వచ్చెద రనుచోన్. ౧౧౪

కారకపదములు = సుబంతములు; క్రియాకారవిశేషములు = క్రియాపదములరూపభేదములు; దండు=సైన్యము; అలరవు=ఒప్పవు.

నారీ, నరః, రత్నమ్ మున్నగు స్త్రీపుంనపుంసకలింగసంస్కృత సుబంతపదములు తెనుఁగున నారి, నరుఁడు, రత్నము అనుతీరునఁ దత్సమపదము లయి వ్యవహరింపఁబడునట్లు "ఆగచ్ఛంతి, ఆజగ్ముః, ఆగమిష్యంతి" మున్నగు క్రియాపదములు తత్సమరూపములుగాఁ

దెనుఁగునఁ బ్రవేశింపవు. వారలు వచ్చెదరు అనియే వాడుకచేయ వలయునుగాని వానియర్థములుఁగల సంస్కృతపదములు (ఆగమిష్యంతీత్యాదులు) తత్సమము లయి తెనుఁగునఁ బ్రవేశింప వని భావము.

“దండు” అనఁగా సైన్యము లేదా సమూహము- అని యర్థము. ఇది యమహత్పద మయినను వచ్చెద రనుక్రియ మహత్కార్యముతో నుండుట విరుద్ధము కాదు. “మహత్సమూహార్థక శబ్దం బమహత్కార్యయుక్తం బయ్యెఁ దద్విశేషణక్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాష నగు” ప్రౌ. వ్యా. శబ్ద. ౧౭ సూ. అనుసూత్రముచే సాధువే యగును. “మునినికాయమెల్ల... ...నతనిఁ బూజించిరి” మున్నగువానివంటిది.

మూలధాతువును దత్సమముగాఁ గొన్నిచోట్లఁ బ్రయోగించినను వానిరూపవిశేషములను సాక్షాత్తుగాఁ దత్సమములను గావింప వలనుపడదని తాత్పర్యము.

**కం.** ద్వివచనము లేదు తెలుఁగునఁ
బ్రవిమలగతి నేకవచన బహువచనము లోఁ
దివిచెద ననఁ దివిచెద మనఁ
గవి యనఁ గవు లనఁగఁ గ్రియలు కారకఫణితుల్.

సంస్కృతమున మూఁడువచనము లుండును. తెనుఁగునమాత్రము ద్వివచనము లేదు. ఏకవచనబహువచనములుమాత్రమే యుండును.

ఉదా:- తివిచెదను తివిచెదము- క్రియల కుదాహరణము.
కవి కవులు — కారకముల కుదాహరణము.

వరుసగా నీరెండును గ్రియాకారకపదముల యేకవచనబహువచనరూపముల కుదాహరణములు.

ప్రకాశించుచు లింగ, వచన, విభక్తిప్రత్యయములు లేకయే సముచితము లగునర్థములతో విలసిల్లుచుండు నని తాత్పర్యము. "సకలము" అనునది మువర్ణకాంతవిశేషణము కావున నేకవచనాంతముగా నున్నది. (చూ. బా. వ్యా. కార. ౨౦ సూ.)

గీ. నెఱయ నవ్యయపదము లన్నియు సమాస
రూపమున నాంధ్రకవితకు రుచి యొనర్చు
స్వర్వధూమణి యన వృథాశంక యనఁ బు
నఃప్రణతి నాఁగ నుచ్చైర్ధ్వనాద మనఁగ. ౧౧౪

రుచియొనర్చున్=శోభ కలిగించును.

సంస్కృతావ్యయపదము లన్నియు సమాసములలోఁ బూర్వావయవములుగాఁ జేరి తెనుఁగున సంక్రమించును.

ఉదా:- స్వర్వధూమణి (అప్సరఃశ్రేష్ఠురాలు) వృథాశంక (నిరర్థకమగు సంశయము); పునఃప్రణతి (మరల నమస్కారము); ఉచ్చైర్ధ్వనాదము (పెద్దధ్వని).

వీనిలోఁ బూర్వావయవములగు "స్వర్, వృథా, పునః, ఉచ్చైః" అనునవి యవ్యయములు. ఇవి యీతీరునఁ దెనుఁగున సమాసముల ద్వారముననే ప్రవేశించును.

కం. వృథ యనునవ్యయ మొక్కఁడు
ప్రథితంబై చెల్లుఁ గృతులఁ బ్రత్యేకము తా
వృథ సేయక యెపుడు మనో
రథములు మా కిచ్చు నీమురద్విషుఁ డనఁగన్. ౧౧౫

అవ్యయముల నేకములు సమాసరూపముననే గాని తెనుఁగున ప్రవేశింప వని పూర్వపద్యమునఁ జెప్పఁబడెను, కాని "వృథా"

యనునవ్యయముమాత్రము ప్రత్యేకముగనే యనఁగా వ్యస్తముగనే తెనుఁగునఁ దత్సమముగాఁ బ్రవేశించి సుప్రసిద్ధముగాఁ జెల్లుచున్నది.

ఉదా:- ఈమురద్విషుఁడు తా నెప్పుడును వృథసేయక మనో రథములు మా కిచ్చుఁ- "వృథా" యని దీర్ఘాంతముగను జూపట్టు చున్నది. "ఏమనన్ వృథా యిత్తుటిన్" కళా. ౪. ఆ. ౧౨ ప.

కం. కారకజనితక్రియయును
నారఁగ ల్యప్ప్రత్యయాదికావ్యయము దెనుం
గై రంజిలుఁ బూజించె వి
చారించి యుదాహరించి సంధించి యనన్. ౧౧౯

కారకజనితక్రియయును=సుబంతములనుండి యుత్పన్నములగు క్రియలును, ల్యప్ప్రత్యయాదికావ్యయము = ల్యప్ప్రత్యయార్థకమగు "ఇ" ప్రత్యయము మున్నగునవి యంతమునఁగల క్రియలును, తెనుం గై=తత్సమములయి, రంజిలుఁ=ఒప్పును.

ప్రాతిపదికముల కించుగాగమముచేరి ధాతుత్వము నొందిన పూజించెన్ మున్నగుక్రియలును, ల్యబర్థకమగు "ఇ" ప్రత్యయము చేరిన విచారించి, యుదాహరించి మున్నగునవ్యయములును దత్సమ ములుగాఁ దెలుఁగునఁ బ్రవేశించును.

ఉదా:- పూజించెన్; విచారించి, ఉదాహరించి, సంధించి.

ఇందు లక్షణానుసారముగా కారకజనితక్రియకును, ల్యబంతా వ్యయమునకును నుదాహరణములు చూపవలసియున్నది. కాని యుదాహరణము లన్నియు ల్యబంతములుగనే యున్నవి. అందుచేఁ "బూజించెన్" అనుపాఠ మూహింపఁబడెను.

**మఱి విశేష్యవిశేషణంబులు :**

కం. హరి కరుణాకరుఁ డనఁగా
హరి యనుశబ్దము విశేష్య మగు మఱి కరుణా

కరుఁ డనుట విశేషణ మె
ట్లురుతరగతిఁ గారకప్రయోగము లమరున్. ౧౨౦

"హరి, కరుణాకరుఁడు" అనుపదములలో "హరి" యనునది విశేష్యము. "కరుణాకరుఁ" డనునది విశేషణము. ఇట్లు కారకపదముల ప్రయోగములు చూపట్టును.

ఇందలివిశేషణము విశేష్యమున కనంతరమునఁ బలుకఁబడెను. ఇట్టిది విధేయవిశేషణ మనఁబడును. విశేషణము విశేష్యమునకుఁ బూర్వమున సాధారణముగాఁ బ్రయోగింపఁబడుటయుఁ గలదు. "కరుణాకరుఁ డగుహరి" అని యట్టిరూపము. అగుధాతు సాహిత్యము లేకయు "కరుణాకరుఁడు హరి నన్ను రక్షించుఁగాత" అనురీతిఁగూడ విశేషణవిశేష్యము లుండును.

కరుణాకరత్వ మనువిశేషము హరియందుఁ గలదని చెప్పఁబడుటచే నిది విశేషణ మయ్యెను. ఇట్లే విశేషణముచే నెద్ది విశేషిత మగునో యది విశేష్య మనఁబడును.

ఈ విశేషణము లోకసుబంతమునకు సంబంధించియున్నవి. క్రియలోని కన్వయించువిశేషణములును గొన్ని యుండును. వాని ననంతరపద్యమునఁ జూపుచున్నాఁడు.

**మఱి క్రియావిశేషములు:**

కం. పగతునితమ్మని శాశ్వత
మగ నిల్పెను దశరథేంద్రపుత్త్రుం డనుచో
జగమునఁ గ్రియావిశేషణ
మగు నీయెడ శాశ్వతముగ నని పల్కుట దాన్. ౧౨౧

విశేషణములు సుబంతముతో నన్వయించునట్లే క్రియతోడను నన్వయించి క్రియయందలిగుణమును జెప్పుచు క్రియావిశేషణము లనఁబడును.

ఉదా : దశరథేంద్రపుత్రుఁడు పగతునితమ్ముని శాశ్వతముగ నిల్పెను. ఇందు 'నిల్పె' నను క్రియయందలి విశేషమగు శాశ్వతత్వమును "శాశ్వతముగన్" అనువిశేషణము బోధించుటచే నిది క్రియా విశేషణ మయ్యెను.

క్రియావిశేషణము సంస్కృతమున నపుంసకద్వితీయైకవచనాంతముగా నుండును. "సః ద్రుతం గచ్ఛతి". ఇందు 'ద్రుతం' అనునది క్రియావిశేషణము. తెనుగునఁ గ్రియావిశేషణములు సాధారణముగా "కన్" అను నగుధాతురూపముతోఁ జేర్చి ప్రయోగింపఁబడును. "వేగముగా వచ్చెను"; "వేగము రమ్ము" అనియు నుండును.

దశరథేంద్రపుత్రుఁడు=రాముఁడు; పగతునితమ్మునిన్=విభీషణుని.

ఆ. వె. శబ్దసిద్ధికొఱకు సంధిసమాసరూ
పఁబు లిట్లు కొంత పలుకఁబడియె
మఱియు నుచితరీతి నెఱుఁగంగవలయు ర
హస్యలక్షణంబు లాంధ్రకవులు. ౧౨౨

సాధుశబ్దములసిద్ధికొఱకు సంధిరూపములును, సమాసరూపములును నిట్లు కొంతభాగము చెప్పఁబడెను. ఇంకను గూఢము లయిన లక్షణముల నుచితరీతిగా నాంధ్రకవులు తెలిసికొనవలయును.

స్థూలమార్గమునఁ గొన్నిసంధిసమాసరూపములు చెప్పఁబడినవి. ఇంకను సూక్ష్మములగు ననేకవిశేషములు గలవు. అట్టివాని నాంధ్రకవులు సంస్కృతవ్యాకరణాద్యుచితమార్గముల నాశ్రయించి తెలిసికొననగునని తాత్పర్యము.

మఱియుఁ బంచాశద్వర్ణంబులు :

కం. భూమిఁ బదా అచ్చులు నాఁ
గా మెఱసి యకార మాదిగా స్వరము లగుణ

కా మొదలు క్షకారముతుద
యై ముప్పదినాల్గు హల్లు లగు వ్యంజనముల్. ౧-౨౩

సంస్కృతమున నకారముమొదలు పదునాఱువర్ణము లచ్చు లనియు, స్వరము లనియుఁ జెప్పఁబడును. కకారముమొదలు క్షకారముపఱకును గల ముప్పదినాల్గుహల్లులును వ్యంజనము లనఁబడును. మొత్తమేఁబదివర్ణము లని యర్థము.

కం. తగు హ్రస్వంబులు దీర్ఘము
లగు అ ఇ ఉ ఋ ౡయును, వెండి హ్రస్వాభావం
బగు ఏ ఐ ఓ ఔ లు నె
సఁగు అం అః అనఁగ షోడశస్వరము లగున్.

హ్రస్వదీర్ఘభేదముచే ద్వివిధము లగు "అ, ఇ, ఉ, ఋ, ౡ" అనువర్ణములును, హ్రస్వత్వము లేక కేవలదీర్ఘము లగు "ఏ, ఐ, ఓ, ఔ" లును, ననుస్వారవిసర్గములును గలిసి పదునాఱువర్ణములు స్వరము లగును. అ ఇ ఉ ఋ ౡ ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ అం అః అను పదునాఱును స్వరము లనఁబడును.

కం. కచటతపవర్గవర్ణము
లిచటన్ స్పర్శ లగు నిరువదేనై మఱి యం
దుచితగతిన్ ఙ ఞ ణ న మ
ప్రచయం బనునాసికాఖ్యఁ బ్రస్తుతి నొందున్.

ఇచటన్ = ఈపంచాశద్వర్ణములలో; కచటతపవర్గవర్ణములు= కవర్ణము మున్నగు నయిదువర్గములయక్షరములును; ఇరువదేనై = ఇరువదియయి దక్షరములై; స్పర్శ లగున్=స్పర్శము లనఁబడును.

కకారాదిపంచవర్గము లిరువదేనును స్పర్శము లనఁబడును. ఆ స్పర్శాక్షరములందలి "ఙ, ఞ, ణ, న, మ" అనునక్షరము లయిదును ననునాసికము లనఁబడును.

కం. యరలవ లంతస్థలు నాఁ
బరగును శషసహలు తేటపడు నూష్మ లనన్
బొరిది క్షకారముఁ గూడఁగ
సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. ౧౨౬

'య ర ల వ' యనునవి యంతస్థ లనఁబడును. 'శ ష స హ' యనునాల్గును నూష్మ లనఁబడును. ఈవర్ణములు నలునదితో మిమ్మిదిలో క్షకారము గూడఁగ నేఁబదియక్షరము లగును.

కం. ళ ల లకు భేదము లేదను
పలుకున ళాఁ దొలఁగి యైదుపదు లగువర్ణం
బులు సంస్కృతభాషకు, మఱి
తెలుఁగున ఱ ళ లనఁగ రెం డధిక మంద్రు హరీ!

ళకార మీ యేఁబదియక్షరములలోఁ జేర్పనందుకుఁ గారణ మిందుఁ జెప్పఁబడుచున్నది. సంస్కృతభాషలో ళకారలకారములకు భేదము లే దనునుక్తింబట్టి (లళయో రభేదః) వర్ణములలో ళకారము విడువఁగా నేఁబదియక్షరము లయ్యెను. తెలుఁగునమాత్రము "ఱ, ళ" అనునక్షరములు రెండు నధికములు. "ల ళ లకు భేదము లే" దనుపాఠమును గలదు. అది ప్రసిద్ధ్యనుసారి. అయినను నీపాఠము నిర్దోషమే యగుటచే మార్పఁబడ లేదు.

తెనుఁగున నింకను సంస్కృతభాషయందు లేనివర్ణములు "ఎ, ఒ, ఁ, చే, జే" అనునవి యధికముగా నున్నను వానివిషయముఁ దడవక 'ఱ, ళ' లుమాత్రమే యిటఁ జెప్పఁబడెను. ౧౨౬వ పద్యమునఁ జెప్పఁబడిన యంతస్థోష్మములలోఁ జేరక వానిచేరువను వర్ణములలో నుచ్చరింపఁబడునవి యగుటచే నిట నివి సూచింపఁబడెను. అంతియ కాక ఱవర్ణము రేఫముతో సాదృశ్యములేని భిన్నవర్ణము. అట్లే ళకా

రమును లఘ్వలఘులకారములకంటె భిన్నమగు నొకయక్షరము. ఆహేతువుచే నీరెండును దెనుఁగున నధికము లని ప్రత్యేకముగాఁ జెప్పఁబడెను. అర్ధానుస్వార మనుస్వారభేద మగుటచేతను, 'ఎ, ఒ' అనునవి 'ఏ, ఓ' వర్ణములవిశేషము లగుటచేతను, చె జె లు చ జ ల రూపాంతరము లగుటచేతను వానిని ప్రత్యేకముగా వివరింపలేదు.

సంస్కృతవర్ణమాలలో క్షకారము నొకవర్ణవిశేషముగాఁ బరిగణించి ళకారము ను దొలఁగించిన యనంతామాత్యుని నప్పకవి పరిహసించెను. క్షకారమునకు సంయుక్తవర్ణధర్మములును, ప్రత్యేకవర్ణధర్మములునుగూడఁ గలవు. ఆకారణముచే నీయక్షరమువిషయమున భిన్నాభిప్రాయములు వెలువడినవి. ఇందలికకారమునకు సరళాదేశాదులు రాకుండుటచేతను "రిక్షా" మొదలగుశబ్దములందువలెనే కషసంయోగోచ్చారణము కాక "క్షత్రియుఁడు" మున్నగురీతిని విభిన్నోచ్చారణము కానవచ్చుటచేతను ప్రత్యేకవర్ణముగా భాసించును. కాని భిక్షాదిధాతువులను షాంతములలోనే ధాతుమాలయందుఁ బరిగణించుటయుఁ, బాణినీయవర్ణసమామ్నాయమున దీనిని ప్రత్యేకముగఁ జేర్గొనకపోవుటయు దీనిసంయుక్తాక్షరత్వమునకు సూచకములు.

ఈవిషయ మితరత్ర విపులముగాఁ దెలిసికొననగును.

గీ. రా దొలంగి సమస్తాక్షరములమీఁదఁ
గార మగుఁ గకారంబు క్షకార మనఁగ
నట రవర్ణంబుపై నిఫ యనఁగఁ బరగుఁ
గాన నిది రేఫ యని పలుకంగవలయు. ౧౨౭

వర్ణములను నిర్దేశించునపుడు రవర్ణము తప్ప మిగిలినవర్ణములకు "కార" ప్రత్యయ మగును, రవర్ణమునకుమాత్రము "ఇఫ" అను ప్రత్యయ మగును.

ఉదా:- కకారము, రేఫము.

కం. వర్ణం బన నక్షర మన
వర్ణం బన మాతృక యన నక్కర మనఁగా
నిర్ణీతసమాహ్వయములు
వర్ణితములు కృతులయందు వ్రాలకునెల్లన్. ౧౨౯

అక్షరపర్యాయపదముల నిందుఁ దెలియఁజేయుచున్నాఁడు. వర్ణము, అక్షరము, మాతృక, అక్కరము, వ్రాయి అనునవి పర్యాయపదములు.

వ్రాలకు=అక్షరములకు; నిర్ణీతసమాహ్వయములు=నిర్ణీతములగు నామధేయములు.

బ్రాహ్మణాదివర్ణచతుష్టయనిర్ణయము :

కం. ఆదులు వర్గత్రయమును
భూదేవతలు, తపవర్గములు రవలును ధా
త్రీదయితులు, యల శషసహ
లాదట నూరుజులు, శక్షళాఖ్యలు శూద్రుల్. ౧౩౦

వర్ణములకు బ్రాహ్మణాదివర్ణములను తెలియఁబఱచుచున్నాఁడు.

ఆదులు=అకారాదులగు నచ్చులు; వర్గత్రయము=క, చ, ట వర్గములు; భూదేవతలు=బ్రాహ్మణులు; ధాత్రీదయితులు = క్షత్రియులు; ఊరుజులు=వైశ్యులు.

అచ్చులును, క చ ట వర్గములును బ్రాహ్మణజాతులు. త ప వర్గములును, ర వ యనువర్ణములును క్షత్రియజాతులు. య ల శ ష స హ యనువర్ణములు వైశ్యజాతులు; శ క్ష ళ అనునవి శూద్రజాతులు.

ఈపద్యమున "శషరాఖ్యలు శూద్రుల్" అను ముద్రిత పాఠము సరికాదు. రవర్ణమును క్షత్రియజాతిగాఁ జెప్పియుండుటచే దాని నిట మరల గ్రహించి శూద్రజాతి యనుట పొసఁగదు. ఆ పాఠము ప్రామాదికము. కావున "శషఅాఖ్యలు" అనుపాఠము వ్రాఁతప్రతిలోనిది గ్రహింపఁబడెను. ఇతరలక్షణగ్రంథములనుబట్టియు నిదియే సమంజస మని నిశ్చితము. ఆనందరంగరాట్ఛందమున నీయనంతునిపద్యమునే "శషఅాఖ్యలు శూద్రుల్" అను పాఠముతోడనే యుదాహరించెను. చిత్రకవి పెద్దనార్యుఁడు తన లక్షణసారసంగ్రహమున "స్వరకచటవర్గములు భూసురు లగుఁ దపవర్గరవలు క్షోణీపతులు విడ్వరులు యలోష్మలు పాదజు లరయఁగ శషఅలు" అని "శషఅ" అనువానిని శూద్రజాతు లనియే చెప్పెను. అప్పకవియు "దంత్యౌ చజౌ గురుఅళౌ జఘన్యభవమాతృకాః" అని శారదాదర్పణశ్లోకమును దాహరించి "అ"వర్ణము శూద్రజాతి యనియే వివరించెను. కావున "శషఅాఖ్యలు" అనుపాఠమే సరియయినదని తెలియనగును.

**మఱి షడ్వర్గంబులు :**

**కం. ఏకాది షడంతముగన్**
**బ్రాకటపాదములు గలుగు మంజరిమొదలా**
**లోకితషడ్వర్గం బగు**
**శ్రీకలితచ్ఛంద మవధరింపుము కృష్ణా! ౧౩౧**

ఓ కృష్ణా! ఒకటిమొదలాఱువఱకును పాదములు గలదియు మంజరీద్విపద మున్నగుపద్యవిశేషములు గలదియుఁ బాదసంఖ్యను బట్టి యాఱువర్గములు గలదియు నగు నీఛందశ్శాస్త్రమును గ్రహింపుము.

మంజరిమొదలు = మంజరీద్విపదమొదలుగాయున; ఆలోకితషడ్వర్గ

మ్మగు=ప్రశస్తమగు షడ్వర్గముగలదగు; శ్రీకలితచ్ఛందము=శోభాయుక్తమగు నీఛందశ్శాస్త్రమును; అవధరింపుము=గ్రహింపుము.

ఇట "నాలోకితషడ్వర్గములు, ఆలోకితషడ్వర్గములగు" అను పాఠములు వేర్వేఱుపుస్తకములందుఁ గానవచ్చుచున్నవి. ఇందు రెండవపాఠమును బహువచనాంతముగా నుండ నేకవచనాంతముగా సంస్కరించి వ్యాఖ్యానించితిని. సహృదయులు మన్నింతురుగాత !

ఓ కృష్ణా ! ఏకపాదముగల దండకము మొదలాఱుపాదములు గల షట్పదివఱకును పాదసంఖ్యనుబట్టి యాఱువర్గములు గలదగు నీఛందశ్శాస్త్రమును గ్రహింపుము అని తాత్పర్యము. ఏకపాదము దండకము. ద్విపద, త్రిపద, చతుష్పద, పంచపాది, షట్పది యనునవి యీ షడ్భేదముల కుదాహరణములు. మంజరికి నేకాదిషడంత పాదము లుండునని తలంపరాదు. షడ్వర్గములలో మంజరియు నొకభేద మనిమాత్రమే తెలియనగును.

**ఉ. శ్రీనిధి చక్రవర్తి గురుశేఖరపుణ్యకటాక్షలబ్ధసు**
**జ్ఞానుఁ డనంతధీమణి లసన్మతి భోజచరిత్ర చెప్పి ల**
**క్ష్మీనరసింహుఁ గూర్చినప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛం**
**దోనుతియోగిహృద్విమలతోయజవర్తి కనంతమూర్తికిన్.**

శ్రీనిధి......జ్ఞానుఁడు=జ్ఞానలక్ష్మికి నిధియగు గోవింద 'చక్రవర్తి' యను నాచార్యశ్రేష్ఠుని పవిత్రకటాక్షమువలన పొందఁబడిన మోక్షశాస్త్రజ్ఞానము కలవాఁడును, అనంత=అనంతుఁ డనంబడు; ధీమణి=పండితుఁడును; లసన్మతిన్=మంచిబుద్ధితో; యోగి...వర్తికి=యోగిజనులహృదయ మను విమలపద్మమునందు నివసించువానికి; అనంతమూర్తికిన్=అంతరహితుఁ డగు శ్రీమన్నారాయణునికి; ఛందోనుతిన్=ఛందశ్శాస్త్రరూపమగు స్తుతిని; ఒనర్చెన్=రచించెను.

గోవిందచక్రవర్తి నామకగురువర్యునిశిష్యుఁడును. భోజరాజీయ మనుగ్రంథమును రచించి యహోబిలక్షేత్రమునందలి లక్ష్మీనరసింహస్వామికి సమర్పించినవాఁడును నగు ననంతామాత్యుఁడు ఛందశ్శాస్త్రరూపమగు స్తుతిని విష్ణుదేవునికిఁగా నొనర్చెను.

ఇందలిపద్యము లన్నియు ఛందశ్శాస్త్రవిషయములను నిరూపించుచున్నను విష్ణుస్తుతిపరములుగా నుండుటచే "ఛందోనుతి" యనుట పొసఁగినది.

"ధీమణి" అనుపద మమాత్యుఁ డనునర్థముంగూడ సూచించుచున్నది. భోజచరిత్ర మనంబడిన భోజరాజీయము ననంతామాత్యుఁడు రచించినట్లును దీనివలనఁ దెలియఁబడుచున్నది. "ధీమణి" అనుపదము భోజరాజీయమునను ఇట్టియర్థమునం బ్రయోగించెను. చూ. "తిక్కధీమణియు నెన్నిక కెక్కిరి బంధుకోటిలోన్" ౧ ఆ. ౨౨ ప.

**ఉ. రాజులు పాడిఁ దప్పక ధరావలయం బఖిలంబు నేలెడిన్**
**భూజనరాజి సంపదలఁ బొంపిరివోయి సుఖానుభూతిచే**
**నోజఁ జరింపుచుండెడిఁ బయోజసముద్భవకల్పశాశ్వతం**
**బై జలజోదరాంకితమహాకృతి సన్నుతి నొందుచుండెడున్.**

పాడి=ధర్మము; పొంపిరివోయి=అతిశయించి; ఓజన్=ఉత్సాహముతో; సుఖానుభూతిచేన్=సుఖానుభవముచే; పయోజసముద్భవకల్పశాశ్వతంబై=బ్రహ్మకల్పాంతమువఱకును సుస్థిరమై; జలజోదరాంకితమహాకృతి=విష్ణుదేవుని కంకితమగు మహాగ్రంథము.

ఇట శాస్త్రము నాశీర్వచనరూపమగు మంగళముతో సమాప్తినొందించుచు "మంగళాంతాని శాస్త్రాణి" యనునియమము ననుసరించెను.

రాజులు ధర్మమును విడువక పాలింతురుగాక! సర్వజనులును సుఖసంపదలతోఁ జరింతురుగాక! విష్ణుని కంకితమగు మహాగ్రంథము కల్పాంతమువఱకును శాశ్వతమై స్తోత్రపాత్ర మగుఁగాక!

ఈకృతి యనక మహాకృతి యని సామాన్యముగాఁ జెప్పుటయుఁ జమత్కారియే! విష్ణుని కంకితము లగు గ్రంథములు మహాగ్రంథము లనఁబడు ననియు నట్టి గ్రంథము లన్నియు రామాయణభారతాదుల వలె శాశ్వతము లయి వర్ధిల్లుఁగాత యనియు విష్ణుపరము లగు గ్రంథములందుఁ దనకుఁగల భక్త్యతిశయమును వెల్లడించెను. ఈగ్రంథమున నాద్యంతపద్యములం దనంతనామముతోడనే విష్ణుని నుతించుట గమనార్హము.

### గద్యము :

ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యతనూభవ
సుకవిజనవిధేయానంతనామధేయప్రణీతం బైన ఛందోద
ర్పణమునందు వర్జనీయంబు లగుదశదోషముల నేర్పఱ
చుటయు నందు దోషరహితంబులై యాదరణీ
యంబు లగుపట్లు దేర్చుటయు సంధిసమా
సంబులు పంచాశద్వర్ణంబుల లేర్పఱచు
టయు నన్నది
చతుర్థాశ్వాసము
సమాప్తము.

"సుకవిజనవిధేయానంత" యని సమాసమున సవర్ణదీర్ఘముతో నుండవలయును గాని "యనంత" యని యడాగమముతో నిట నుండరాదు. సిద్ధసమాసమధ్యభాగమున యడాగమము సంభవింపదు.

వాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవపదము తిక్కనామాత్యునకు విశేషణము కావచ్చును. చమత్కారముగా నీవిశేషణ ముభయులకు నన్విత మగునట్లు గూర్చెను.

శ్రీః శ్రీః శ్రీః.

# ముఖ్యములగు తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 27 | దీర్ఘో౭యుక్త | దీర్ఘోయుక్త |
| 16 | 21 | ౦౦ | । ౦ |
| 21 | 20 | కుభయై | కథయై |
| 25 | 21 | యొందు | వొందు |
| 31 | 2 | వైసాదృశ్య | వైసాదృశ్య |
| 95 | 5 | చంద | ఛంద |
| 117 | 5 | కదవయతి | కభేదవర్గయతి |
| 135 | 6 | యింద్ర | ఇంద్ర |
| 147 | 2 | యాయుల్ | యాయుక్ |
| 157 | 22 | సమ్మోత | సమ్మత |
| 160 | 19 | జాలు | జాలం |
| 198 | 17 | ప్రావల్లన్ | ఁబ్రావల్లున్ |
| 180 | 18 | పడ్వంశ | సడ్వింశతి |
| 188 | 14 | సపలఁజొచ్చి | నవలఁజొచ్చి |
| 193 | 18 | యానంగం | యనంగఁ |
| 206 | 20 | గదిసి | గీది |
| 209 | 2 | ఘూఁడు | మూఁడు |
| ,, | 6 | వేర్చి | పేర్చి |
| 212 | 7 | నాభ్యశం | నాభశ్యం |
| 278 | 12 | కీధక | పీఠక |
| 293 | 2 | న్యకుము | వ్యర్థము |
| 296 | 11 | ఎట్లు | ఇట్లు |
| | | ఇద యెట్లు | ఇది యిట్లు |
| ,, | 12 | ఇదెట్లు | ఇదిట్లు |
| ,, | 21 | ఇదియెట్లు | ఇదియిట్లు |
| ,, | 23 | ఇదెట్లు | ఇదిట్లు |
| 297 | 19 | ఎక్ | లుక్ |
| 298 | 19 | ఎక్ | లుక్ |
| 318 | 5 | ఋవర్గ | ఋవర్ణ |
| 329 | 15 | నజ్లులసఁగ | నత్తుల్లులనఁగ |
| 332 | 23 | ఉత్ద్థితము | ఉత్థితము |
| ,, | 19 | ఉద్థితము | ఉత్థితము |
| 374 | 2 | పిశేషణమె | విశేషణము |
| ,, | 19 | పిశేషములు | విశేషణములు |